

చెన్నపట్టణము, ఆగష్టు ౧౯౩౦
1930

సంపుటము ౭ ప్రమోదూత సంవత్సరము శ్రావణమాసము సంఖ్య ౮

# హంపీక్షేత్రము

కొడాలి వెంకటసుబ్బారావు, బి. ఏ., కామరాజుగడ్డ శివయోగానందరావు గార్లు

## ఆనెగొందెరావు

"రామరాజు తల్లికోటయుద్ధానికి వెళ్లేముందు తిరుమలరాయుడిని ఆనెగొందె సంరక్షణకు ఆపి కావలాగా వుంచి వెళ్లినాడు. తల్లికోటలో రాజు మృతి విని తిరుమలరాయుడు పారిపోయినాడు. ఇతను పారిపోక నిల్చినట్లయితే ఆంధ్రసామ్రాజ్యం శాశ్వతము. ఆఅదృష్టం మనకు లేదు. అందుకనే తిరుమలరాజుకీబుద్ధి పుట్టింది."

"చుట్టుఁ గొండలుకాచు, నీబలము కాచుఁ దీని, దోశ్శక్తి చూ
పెట్టఁ వచ్చును శత్రువుల్ గదియ, రేపే మేము కృష్ణానదీ
ఘట్టంబందున తల్లికోట కడ సంగ్రామ ప్రయత్నంబులన్
నెట్టఁ జూతుము దుర్గరక్షణకు నిన్నే నిల్పి సేనాపతీ!

అనికాదా వచియించె భూమిపతి సైన్యంబంత నీచేతి కి
చ్చెను కాదా నిను పెద్దచేసి తరివచ్చెర్ పారిపోబోరు నిం
దను పొందర్ వలదయ్య తెల్గుభువి రక్తంబందు వ్రాయింతె మ్లే
చ్ఛుని దౌర్జన్యము నీదు కుందతనముర్ శుద్ధాంధ్ర చారిత్రముర్.

తిరుమలరాయుడా తెలుగుధిక్కృత నిర్జర సార్వభౌమ భో
గరతులముం దొకౌక్కలగా నగుపింపగ జేయనెంచి యా
పరువులు వెట్టుచుంటివి త్రపర్ విడి నిర్ స్మరియించి నిత్యము
స్పురనుచు నేడు త్తాంధ్రులు సుషుప్తులయందును తిట్టిపోయుచుర్.

సకల వరూధినీపతివి శాత్రవమర్దన కాలమందు నీ
వికలతఁ జూపుచో కడమవీరులు గ్రామణి పారె నంచు ని
ల్చి కలను మానుకొందురు వశీకృతు లౌదురు మ్లేచ్ఛరాజసై
నికులకు నేటినుండియె గుణింతురు తెల్గుపరాక్రమచ్యుతిర్.

పరుగిడి పోదువేల పొరపాటున చూచిన శత్రుసేన భీ
కరమయితోచెనా నిలిచి ఖడ్గము త్రిప్పుము చాలు జోదులే
నరుకుదు రాంధ్రఖడ్గ చలనంబులలో లయరుద్రతాండవ
స్ఫురణము నిల్చునోయి, యిటుచూడుము భగ్నమొనర్చ కౌశలర్.

తెలుగువిభుండు నీవయి గుదించిన నమ్మకమంత దుమ్ముగా
దులిపెదవేల శాత్రవవిధుంతుదు డల్లదె యానెగొందె త్రో
వల గ్రసియించుచుండె విడవచ్చునె కాపును తీయరాని దా
స్థల మొకటే అదే నగరిసంధి రిపుల్ దుముకంగ త్రోవయా.

తల్లి కోటలో చచ్చె భూధవుడటంచు-వినినమాత్రనె శత్రుల గనినతోనె
పిరికితనమేల నీసేన బిలుకుమాన్చు-గొందెలో మ్లేచ్ఛవీరులు ఘోషవెట్ట.

వేయికిచాలుపో తెలుగువీరు డొకండిది కొండగొందె పెర్
లోయ మహాహవంబున వరూధిని నిల్వగ వీలుకల్గ దీ
చాయల గొందెలోపడిన శత్రుల వేటల గొట్టవచ్చు బ్ర
హ్మయువు తెల్గురాజ్యనిలయంబునకో తలపోసి చూడుమా!

రాజ్యరక్షణ కాదు; సంగ్రామమందు-కలబడుట కాదు; గొందెను కాచుకొనుట
యింతమాత్రము చేయలేవేని మొదట-రేనితో నేల చెప్పగాలేవశక్తి.

ద్రోణులు లేరు భీష్ములును తోచరు మ్లేచ్ఛులయందు మత్స్యరా
ట్సూనునిపోలికన్ తలచుచున్ పరుగెత్తెదో పేడివాడు రా
బూనకు నిన్ మరల్చుటకు పోయిన వాదినముల్ పరాత్పరా
ధీనములౌచు పౌరుషముదేపస నేడు జగత్ప్రసిద్ధికిన్.

అఱువదివేలు కాల్బలమునందలి మ్లేచ్ఛభటుల్ కృతఘ్నులై
తిరిగిరి శత్రుపక్షము కధీనముగానని వారి మీరు తి
ట్టిరిగద నాడు ఇప్పుడు పఠింతె పలాయనమంత్ర మీవు సం
గర మొనరింపకే భటులు చావక యే క్షతమైన లేకయే.

నిలుపు మొక శాశ్వతంబు పునీతమైన-మూర్తిగా తెల్గునాటి సంకీర్తనముల
పేరు నిలబెట్టుకొందువు పృథివినేత-చచ్చినను గెల్చితన్న యశస్సుతోడ.

శాపంబుచేత నాశనమైన దనరోయి అటువంటిశక్తి నే డరుదుగాన
దైవానుకూలవర్తన విరోధంబుగా తలపోయ రది నేడు తగదుగాన
గ్రహచారవశముసంగతి నమ్మజాలరు కలికాలమందు రిక్తమదిగాన
కర్మమహత్తు వక్రతగా తలంపరు రాజ్యాల కేకర్మ రాదుగాన
తురకబంటులు తిరిగిపో దూరబోరు-రామరాయలతప్పు నేరంబుగాదు
విజయనగరవినాశనవిధికి నీవె-హేతువనునింద చిరము వహింతువయ్యా.

రిపులపదాతిసైన్యము హరించెను ఆశ్వికవర్గ మొక్కటే
యిపు డిట వచ్చుచున్న దది యెక్కువసంఖ్యయు లేదు ఆనగొం
దె పడినచో తెగున్ తెలుగుదేవుల కుత్తుక లాడువారి మా
నపుపస దూలు పాడగు ననంతమహాంధ్రపురీ జయోన్నతుల్.

రెండువందలగజముల కొండగొందె-విపులసామ్రాజ్యచక్రము విరిగిపడును
ఒకపిరికిపంద చేతలో నొరగిపోవు-బహుళ మహదాంధ్రజనవైభవముల రథము.

నీమూలంబున బౌనిసత్వములు రాణించఁగ మతావేశదీ
ప్తౌమార్గంబులు కంటకావృతములై సాంకర్యముల్ హెచ్చి కాం
తా మాలిన్యములంటి తెల్గుమహి నిత్యం బెండలో గ్రాగి దు
ర్ధామంబైన విరాగికూటమయిపోదా బిచ్చపుంజోలులన్.

గౌతమీగర్భపంకం బెండబెట్టిన చాళుక్యశౌర్యవర్చస్సు వెలుగు
శ్రీకాకుళపుదిబ్బ చెక్కుచూచిన ఆంధ్రవిష్ణుతేజము శౌర్యవిధులదెలుపు
పల్నాటిగుట్టల పగిలించి వెతకిన బాలచంద్రునిశక్తి బాహిరిల్లు
ఓరుగల్లున రాళ్లనూడబీకిన కాకతీయప్రతాపు పొందికను నేర్పు
ననుచుతొల్లింటి రాజులగుణము లెంచు-ప్రజల కిఁకొక్క పాడైన పట్టణంబు
చూపదలచితె శ్రీకృష్ణభూపశౌర్య-మునకు సాక్షిగ చారిత్రమున లిఖింప.

ఎటనున్న తురకలొక్కటెయున్న గుణపాఠమును నేర్వగోరి సేనను త్యజించె
తానెంత గొప్పతంత్రజ్ఞుడైనను గర్వ మమితమై చెడెను యుద్ధమున చచ్చి
అన్యోన్యకలహంబు లపకార మొనరించు ననుచు ఏకీభావమున జయించె
అంత్యప్రయత్నమందైన గెల్వగవచ్చు పురుషయత్నంబని బుద్ధిగరపె
తురకసైన్యము తెల్గుభూవరుడు పంచ-బహ్మనీరాజ్యవర్గము పందయైన
తిరుమలార్యుడు సని నిన్ను తిట్టిపోసి-తలచుకొందురు ఘోషిల్లి తెలుగువారు.

---

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'

---

# ప్రాచీనాంధ్రభాష—రేఫము

కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

౧

ఆంధ్రభాషయందు రేఫము ద్వివిధము. అందొకటి అంతఃస్థమును, లఘువు నగు రకారము. రెండవది అలఘువు. దీనినే గురురేఫమనియు, బండి ఱ లేక శకట రేఫమనియుఁ బల్కుదురు. రెండును మూర్ధన్యములే. ఱకారము సంస్కృత తత్సమములందు లేదు. తద్భవదేశ్యములందు కలదు. రకారము తత్సమ తద్భవ, దేశ్య, అన్యదేశ్యాత్మకమైన ఆంధ్రభాషయందు కలదు.

ఆంధ్రభాషయందే కాక, దాక్షిణాత్యభాష లగు అరవము, మళయాళము, కన్నడములలో రేఫము ద్వివిధము.* భాషలో నేదైన నొక యక్షరమున్నచో, నయ్యది యొకధ్వనికి చిహ్నమనియు, దాని కొక యుచ్చారణ కలదనియు, అట్టి ప్రత్యేకోచ్చారణ గల పదములు భాషయం దుండవలె ననియు భాషోత్పత్తిశాస్త్రవిదులకు దెలిసియున్నదే.

ఆంధ్రభాష వాగ్రూపమును, లిఖితరూపమును గావున ప్రాచీనాంధ్రభాషలో రకార, ఱకారము లెట్లు లిఖింపబడెనో తెలిసికొనుట ప్రధానకర్తవ్యము. ఆవిధ మంతయు శాసనపరిశోధకులకు గరతలామలకమైనను, సంక్షిప్తముగ నిచ్చట తదక్షరరూపములను దెలిపెదను.

### రకారము

ఇప్పు డచ్చులో నున్న రకారమునకు బూర్వసన్నిహితరూపము పూర్వచాళుక్యలిపిలో గాన్పించుచున్నది. సంధికాలపులిపిలో నక్షరమునకు దలకట్టేర్పడి క్రమక్రమముగా నీరూపమును దాల్చినది. పూర్వచాళుక్యలిపికి పూర్వమున నున్న వేంగీ, పశ్చిమచాళుక్య లిపులలోనున్న రకారము ఆంగ్లమున వ్రాయు (టి), U (యు) వలెనుండును. ఈ 'యు' రూపమున కడ్డుగీటు నైన నిచ్చినచో రకారమయ్యెను. సంయుక్తాక్షరములలో వేంగీ పశ్చిమచాళుక్య లిపులలో రకారమును పరహల్లుమీద వ్రాయునాచార ముండెను. 'హస్తివర్మ' అని వ్రాయుచో మకారము నెత్తిపై రేఫచిహ్నమగు నొక నిలువైన వంకరగీతను వ్రాయుచుండిరి. అదియే విధమున 'శర్మ' మొదలగు పదములు వ్రాయునెడల నా పద్ధతియె కలదు.

'పుత్రి', 'గ్రామ' మొదలగు పదములలోని రకారపొల్లు తకారము క్రిందను, గకారము క్రిందను కుడివైపు నుండి యెడమవైపునకు వ్రాయుచుండిరి. వేంగీలిపిలో వ్రాయబడిన సాలంకాయన నందివర్మ శాసనమును జూడుఁడు.*

పై శాసనములోనే శకటరేఫమునుగూడ చూడవచ్చును. అయ్యది మన మిప్పుడు వ్రాయు 'ద'కారమునకు దలకట్టు లేక, దానిలో మధ్య నిలువుగీత నొకదానిని, అడ్డుగీత నొకదానిని గీచినచో నెట్లుండునో యట్లుండెను. అది క్రమక్రమముగా పశ్చిమపూర్వచాళుక్య లిపులలో మనకు ఇప్పుడు వ్రాయురూపమును దాల్చినది. యుద్ధమల్లుని బెజవాడశాసనమును జూడుఁడు.*

---

* The hard rough 'r' of the Dravidian Languages is not found in Sanskrit and is not employed in pronouncing Sanskrit derivatives. It is found in Telugu poetry and elegant prose. In Canarese, the use of this letter is confined to the poets and the ancient dialects. It is evident that it was originally contained in all dialects.

Caldwell: Comparative Grammar, page 145.

* భారతి ఆగష్టు ౧౯౨౮ లేక Quarterly Journal of the Andhra Historical Research Society, October, 1926.

* Bezwada Stone Inscription of Yuddhamalla: Edited by J. Ramiah Pantulu garu, B. A., B. L.

ఈ శాసనములో 'త్రినేత్ర' అని వ్రాయునెడల రకారవొల్లు తకారమునకు కుడివైపునుండి, క్రిందినుంచి నిండుగా నెడమవైపునకు అక్షరము నెత్తిమీదనుంచు వ్రాయబడెను. 'కార్త్తికేయః', 'ధర్మ' అనుపదములలో రేఫమును, తకార మకారములపై వ్రాసిరి. ఈ శాసనములోనే అకారము కలదు (చూడుడు ౧౯, ౨౫ పంక్తులు.) 'చేబ్రోలు' అని వ్రాయునెడల అకారము పూర్త్తిగా బకారము క్రింద మన మిప్పుడు వ్రాయువిధముననే వ్రాసిరి. పూర్వచాళుక్యలిపిలో వ్రాయబడిన రాజరాజునందంపూడి శాసనములో 1 రకారమునకు తలకట్టు గాన్పించుచున్నది. ఇందు శకటరేఫమును కూడ చూడనగును. 'వర్ష సహస్రాణి' అనుపదములో 'ష'కారముపై రకార చిహ్నమగు నొక చిన్న నిలువుగీటును, సకారము క్రింద పూర్త్తిగ కుడివైపు నుండి యెడమప్రక్కకు రకారవొల్లు వ్రాయు నాచారమును జూడనగును. ద్విత్వశకటరేఫమును వ్రాయునెడల మన మిప్పుడు (చూడు: మట్టితోడి తాటియొద్ద) వ్రాయు నాచారమె యప్పుడును గలదు. ఇంకొకవిశేషము కలదు. 'నెగిదీర్చె', 'ధర్మ' అనుపదములు వ్రాయుచో పరహల్లునకు ద్విత్వ మిచ్చు నాచారము కలదు. అనగా 'నెగిదీర్చ్చె, ధర్మ్మ' అని వ్రాయుచుండిరి. ఇది యుద్ధమల్లుని బెజవాడ శాసనములో నున్నది. దక్షిణ హిందూదేశశాసనములు సంపుటములు నాల్గు, అయిదు కూడ చూడనగును. కొన్ని శాసనములందు, అనగా పది పదునొకండవ శతాబ్దములనాటి వానిలో 'సర్వ', 'వర్జిత', 'పూర్వతః', 'గండాచార్యః' అను పదములు వ్రాయునెడల పరహల్లునకు ద్విత్వ మిచ్చి యూరకుండుట కలదు. ఈ విధము నందంపూడి శాసనములోను, రెండవ అమ్మరాజ విజయాదిత్యుని పాములవాక శాసనములోను జూడనగును. 2

నందంపూడి శాసనకాలపులిపిలోనే వ్రాయబడిన ఏడవ విజయాదిత్యుని పాములవాక శాసనములో కూడ 'కీర్త్తివర్మ', 'గౌకాచార్యః' అను పదములు వ్రాయుచో 'కీర్త్తివర్మ్మ' గౌకాచార్య్యః' అనియె లిఖింపంబడెను. 3

హళెకన్నడలిపిలో 'సర్వగత్వమ్', 'విష్ణోర్నాభి', 'పార్వతీపాల' మొదలగు పదములు, 'సవ్వగత్వమ్', 'విష్ణోర్నాభి', 'పార్వ్వతీపాల' అని వ్రాయబడుచుండెను. ఈలిపిలో రకారవొల్లు ఇప్పు డచ్చులో నున్న ( ౕ ) రకారవొల్లు ఆకారమును జూడనగును. 4

## అకారము

ఈ యక్షరవికాసము రేఫాక్షర వికాసమును జర్చించునపుడు వ్రాసియున్నాను. ఈ యక్షరమును మనము పూర్వశాసనములలో సులభముగా గుర్తింపగలము. ఇయ్యది ప్రాచీనశాసనములలో బెక్కుచోట్ల నుపయోగింపబడినది. మహత్తులగు పురుషవాచకములందును, స్త్రీ వాచకము లందును, అమహత్తులగు దేశ్యమృగవాచకములందును, సంఖ్యావాచకములందును ముఖ్యముగా నుపయోగింప బడినది. ఉ: చేబ్రోలు, పెనుంబర్త్తి, చాంగలమఱ్ఱి, వాడ్లఱేవు, ఎఱియ, తెఱెయ మొదలగునవి. సామాన్యపదములను మఱుతురు, గొఱియలు, చెఱువు, నూఱు, ఱేవు. (South Indian Inscriptions, Vols. IV and V.)

ఔపవిభక్తిక ప్రత్యయమును జేర్చిన పిదప వచ్చు గ్రామనామములో బెక్కుచోట్ల లఘురేఫము గాక గురురేఫమె వాడబడినది: ప్రాంబర్త్తి (South Indian Inscriptions, 674, Vols. IV), పెను (ం) బర్త్తినాఢో (SouthIndian Inscriptions, Vol. IV, No. 1032,

---

1. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, సంపుటము ౧, సంచిక ౫.

2. Pamulavaka Copper plate Grant of Vijayaditya II: The Quarterly Journal of the Andhra Historical Research Society, Vol. II, Parts 3 and 4.

3. Ibid.

4. అన్నవేముని వనపల్లి శాసనము, ఆంధ్రవిజ్ఞానసర్వస్వము, నాల్గవసంచిక.

సంస్కృతశాసనము). సంస్కృతశాసనములో మధ్యగ్రామ నామములు వ్రాయునపుడు ఆంధ్రాక్షరమగు గురురేఫమె వ్రాయబడినది. శకటరేఫ మింకొక హల్లుతో గలిసి నపుడు లఘురేఫమును వ్రాయుట ప్రాచీనాంధ్రభాషా సంప్రదాయము కాదని తోచెడిని. 'చెఱ్ఱు', 'తూఱ్ఱు', 'చెఱ్ఱు' అను పదములు దక్షిణహిందూదేశపు శాసనములు నాల్గవ సంపుటము నందలి శాసనావళిలో గానవచ్చు చున్నవి. అయినను ఆశాసనములలోనే మఱుతురు (కొలవి శేషము) మర్దురు అని లిఖింపబడెను.

శకటరేఫముతో వ్రాయబడిన కొన్ని సామాన్యపదములు శాసనములలోనే సాధురేఫముతో వ్రాయబడెను: మంఱఱ—ముందర; నూఱు—నూరు; కూతుఱు—కూతురు * ; చెఱువు—చెరువు; మఱుతురు-మరుతురు.

ఇట్టివ్యత్యస్తమగు ప్రయోగబాహుళ్య ముండుటచే వినుర్శకునకు నీశకటరేఫ మేపదములలో గలదో నిర్ణయించుటకు కష్టసాధ్య మయ్యెడిని.

బాల వ్యాకరణమునందు సంధిపరిచ్ఛేదములోని ముప్పదియవ సూత్రము ననుసరించి కర్మధారయమునందు దన్నుమశబ్దముల కాలశబ్దము పరమగునపుడు అత్వమున కుత్వమును, రుగాగమము నగును. కాని యిట్టి యనుశాసనమునకు విరుద్ధముగా ప్రాచీన శాసనములలో గొన్నిటియందు ఉగాగము గాన్పించుచున్నది. ఉదా: 'నాయకుకాలు' * అనుపదము.

## ప్రాచీనాంధ్రభాషయందలి కొన్ని తమిళభాషాసంప్రదాయములు

### అకారము

ప్రాచీనాంధ్ర శాసనములలో 'పాపంబు గొన్టు, గోత్రున్టు, మూన్టు, శత్యదితున్టు' అనుపదములు గాన్పించుచున్నవి. పదాంతములనున్న 'న్టు' ప్రథమావిభక్తియగు 'డు' కాని మఱి యన్యము గాదు. అనగా మూండు, గోత్రుడు, శత్యదితుండు అనురూపములు. తమిళభాషలో నిట్టి పదములనే 'మూన్టు'. 'గోత్రున్టు'అని యుచ్చరింతురు.* ఎనిమిది తొమ్మిదిశతాబ్దములలో నాంధ్రభాషకు తమిళభాషాసంపర్కమువల్ల నిట్టిరూపము లేర్పడియుండెను.

రాజరాజు నందంపూడి శాసనములో 'మూయ్యెలి కుట్రు' అను పదము కలదు. దీని కర్థము మూడుఎల్లల గుట్ట యని. కుట్రు అనునది గుట్ట యనుదానికి పూర్వరూప మైనట్లు తోచెడిని. 'ట్రు' 'ట్ట'గమారుట తమిళభాషా సంప్రదాయమె యని తోచుచున్నది. శబ్దశాస్త్రజ్ఞులు దీనిని గమనింతురుగాక. కాల్డువెల్ పండితు డేమి వక్కా—

---

* (కూంత్తుఱు, No. 674, Vol. IV, South Indian Inscriptions. కాంతుఱు, No.797, South Indian Inscriptions, Vol. IV.

* South Indian Inscriptions, Nos. 1073, 1074, 1100, 1094, 1129, Vol.V.

*The letter 'n' (not the 'dental 'n' but the final 'n' of Tamil, a letter which is not found in Telugu) is often prefixed in Tamil to the ఱ for the sake of euphony' when the compound న్ట acquires the sound of న్డ్రి a sound of which Tamil, like the language of Madagascar, is exceedingly fond.

In another class of words the 'n' which is prefixed to ఱ is radical and should be followed by 'డ' accordingly to rule; but ఱ is suffixed to 'n' instead of 'd' in consequence of which న్డ్రి is substituted for that of న్డ. మూన్టు-మూన్డ్రి; ఒన్టు-ఒన్డ్రి; ఎన్టు-ఎన్డ్రి; సెన్టి - సెన్డ్రి - Caldwell: Comparative Grammar, P. 145.

ణించెనో యీక్రింద బొందుపఱుచుచున్నాను. ఈకుఱ్ఱు పదము కుట్టు, కుఱ్ఱు, కుట్ట అని మారియుండవలెను. గుట్ట సాధురూపము. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో ప్రాచీనాంధ్రభాషాస్వరూపమును గూర్చి వ్రాయుచు, అస్మన్మిత్రులగు సోమశేఖరశర్మగారు ముఱ్ఱ్యెల్లగుట్ట సాధురూపమనియు, ముయ్యాలికుఱ్ఱు అసాధురూపమనియు * శాసించియున్నారు. ఆయనుశాసనమే నేను గ్రహించితిని.

## ఆంధ్రకావ్యములందలి గురురేఫముగల

## ప ద ము లు

శాసనములలోనే శకటరేఫములుగల పదములు లఘురేఫముతోను, లఘురేఫముగల పదములు శకటరేఫముతోను గాన్పించుటచేతను, ప్రాచీనాంధ్రభాషతో వ్రాయబడిన కావ్యములు మనకు లభింపకపోవుటచేతను మన కేపదము కవి లఘురేఫముతో నుపయోగించెనో, గురురేఫముతో నుపయోగించెనో తెలియదు. వ్రాతప్రతులు సంస్కరించి ముద్రింపబడిన గ్రంథములు మనకీపరిశోధనకు దోడ్పడజాలవు. పండితులు ఆధునికవ్యాకరణకర్తల అనుశాసనము ననుసరించి యాగ్రంథముల దిద్దుటచే బూర్వకవి 'ర' వ్రాసెనో, 'ఱ' వ్రాసెనో యిదమిత్థమని చెప్పలేము. ముద్రాక్షరశాలలో బత్తెమునకు గుదిరిన పండితులు నిరంకుశులై పదములనే మార్చి తమసొంతకవనమునే ప్రాచీనకావ్యముల కెక్కించుటచేత నిక అక్షరప్రయోగముమాటదేవుని కెఱుక. ప్రాచీనకవులు 'ఱ' కారముగల పదములు రకారముతోను, 'ర' కారముగల పదములు 'ఱ' కారముతోను నుపయోగించిరి. నేటి కీగోలయంతయు గంగకలిసెను. అయినను దచ్చిత్రమును బాఠకులకు సంక్షిప్తముగ నెఱింగించెదను.

| శాసనములలోని ప్రయోగములు | | కవి ప్రయోగములు | |
|---|---|---|---|
| 1. ఱేపు | South Indian Inscriptions Vol.IV, No. 659. | రేపు | నన్నయ తిక్కనాదులు |
| 2. కూతుఱు | ,, 674. | కూతురు | ,, |
| 3. తివుఱు | యుద్ధమల్లుని బెజవాడశాసనము | తివురు | |
| 4. తూఱుపు | Vol. V, No. 1178. | తూరుపు | ,, |

* Page 145, Comparative Grammar of Dravidian Languages.

ఱ when doubled is pronounced as 'ttr' though written ఱ్ఱ The 't' of the compound differs both from the soft dental 't' of the fourth varga and from the cerebra 't' and corresponds very nearly to the emphatic final 't' of our English interrolgation *what* ?. This sound of 't' is not expressed in writing but in pronounciation it is never omitted. It is one of those peculiar Dravidian sounds which are not derived from Sanskrit and are not fonud in it. The double 'ttr' or 'tt' of Tamil ఱ is sometimes softened in Telugu to a single 't' and in Canarese still further into 't'; *eg*. మాట్టు, (మాఱ్ఱు). in Tamil of, which one of the meanings is an answer, a word, is in Telugu మాట and in Canarese మాటు The 't' is also sometimes doubled in Telugu. *eg*: Tamil పఱ్ఱు (పట్టు) a laying hold; Telugu పట్టు, Canarese both పట్టు, and పత్తు or హత్తు and even in old Canarese a similar change often takes place.

* రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, పుట ౬౫: ప్రాచీనాంధ్రభాషాస్వరూపము,

| | | | | |
|---|---|---|---|---|
| 5. పఱువఱించు | యుద్ధమల్లుని బెజవాడ శాసనము | పఱువరించు | నన్నయభట్టు: సభాపర్వము, ప్రథమాశ్వాసము | |
| 6. వెల్వఱించు | ,, | వెల్వరించు | | |

నన్నయభట్టు పదములను గొన్ని చోట్ల 'ఱ'కారముతోను, గొన్ని చోట్ల 'ర'కారముతోను బ్రయోగించెను:

| | | | | |
|---|---|---|---|---|
| 1. ఱాలు | రాయి | ఆదిపర్వము, | ౬ | 281 |
| | | సభాపర్వము | | 119 |
| 2. ముందఱ | ముందర | ఆదిపర్వము, | ౭ | 287 |
| 3. ఒఱు | ఒరు | ఆదిపర్వము, | ౫ | 211 |

తిక్కనయు నట్లే ప్రయోగించెను:

| | | | | |
|---|---|---|---|---|
| 1. ఇరువది | ఇఱువది | శాంతిపర్వము, | ౫ | 47 |
| 2. నీరు | నీఱు | ,, | ౧ | 370 |
| 3. వేర్వేర | వేర్వేఱ (?) | ,, | ౨ | 219 |
| 4. తేఱు (రథము) | తేరు | ,, | ౧ | 349 |
| 5. ముందఱ | ముందర | ,, | ౧ | 255 |
| 6. మఱి | మరి | —(అను శా. ౨) | | 38 |

పాల్కురికి సోమనాథకవి బసవపురాణములో నట్లే ప్రయోగించెను:

౧. గమరొంపిగాలు జారుడుఁ జల్లకడప* – ద్వితీయాశ్వాసము.
ఱొంపియఁజూపి యెఱుంగరె యితని– ,,

౨. నీనింద విని గౌరి నీఱైననాఁడు– ద్వితీయాశ్వాసము.
నీరుగాఁఱఁగ నేద్వ నీకేమి వలసె– ,,

3. మఱియట్లుగాక యచ్చిఱుతొండఁడరయ– చతుర్థాశ్వాసము.
చిరుతొండఁడును బెట్టె సీరాలుబాలు– ,,

శివతత్వసారములో మల్లికార్జునకవియు నట్లే ప్రయోగించెను:

| | | |
|---|---|---|
| ౧. కఱకంఠుఁడు | కరకంఠుఁడు | (ప్రాసలో.) |
| ౨. మఱి | మరి | ,, |

౨

'ముయ్యాలికుట్రు' పదమునుగూర్చి కొంత వ్రాసియుంటిని. ఈపదము మనుచరిత్రమునం దొకచోట బ్రయోగింపబడెను:

చ. ఉడుపతి బారికి న్వెఱచి
యూరట యానని పేరుటామనిన్
మడిపడు కంతుసేనలకు
ముయ్యాలగుట్టయినట్టి యిందు రా
నడఁగక తాపవహ్ని ఘన
మై హరిణేక్షణ ముల్లు వుచ్చి కొ
ల్లడఁచిన చంద మాయెఁ బద
మా యెలదోఁటఁ జరింప కింటికిన్.

తృతీయాశ్వాసము.

ఈపద్యమునందలి ముయ్యాలగుట్ట పదమునకు బొలిమేరయని యర్థము వ్రాసినారు. శబ్దరత్నాకరములో

* పైని వివరింపబడిన ప్రయోగములు ఇప్పటి ముద్రితగ్రంథములనుండి గైకొనబడినవి.

నీపదమునకు మూడు ఎల్లలగుట్టయనియు, దీనిసాధురూపము ముయ్యెల్లగుట్టయనియు నర్థము వ్రాయబడెను. నాదగ్గఱనున్న మనుచరిత్ర ప్రతిలో 'ముయ్యేలగుట్ట' యని యేయున్నది. 'ముయ్యెల' యని యకారమున కెత్వము లేదు. కొన్ని ప్రతులలో యకారమున కెత్వ మున్నది. ఉయ్యెల, పయ్యెద యనుపదములకు ఉయ్యాల, పయ్యాద యను రూపములున్నట్లె 'ముయ్యెల' కు 'ముయ్యాల' యను ప్రయోగమునుగూడ మనము సాధింపవచ్చును. బాలవ్యాకరణ ప్రకీర్ణకపరిచ్ఛేదమునందలి మూడు, నాలుగు, ఐదు, సూత్రముల ననుసరించి ముయ్యాలగుట్ట యనుపదముకూడ సాధువై యుండనోపు. శాసనములో 'ముయ్యాలి' కుట్టు అని యుండుటచేత ముయ్యాలికుట్ట సాధువా, ముయ్యాలకుట్టు సాధువా యని విచారింపవలెను.

ప్రాచీనకవు లెట్లు గురురేఫ, లఘురేఫ నిర్ణయమును బాటింపక విచ్చలవిడిగ తమకిచ్చవచ్చినట్లు తమ తమ గ్రంథములందు బ్రయోగించిరో తెలిపియున్నాను. మఱి కొన్ని యిచ్చట జూపెదను. తిక్కనసోమయాజి ఆనుశాసనికపర్వము పంచమాశ్వాసములో:

క. పాఱిన నాతనివెనుకన
పాఱితి సంప్రార్థనాప్రభాషణములతోఁ
దేఱె మరలి యమ్మునిముఖుఁ
గాఱియ వెట్టితిఁగదె యకట యనుచదకుఁ.

మౌసల పర్వములో:

క. కవ్వడి యొక్కడ కంటిరె
జివ్వనఁ జేరుద మితండు నేడ్పడఁగా నిం
దెవ్వరుఁ గడంగ లేరిది
ద్రెవ్విపడినధనము లెత్తెఁగిలిమి లోఁ దెల్లన్. (?)

నన్నెచోడుఁడు కుమారసంభవములో సప్తమాశ్వాసమునందు:

క. చెఱకునఁ బుచ్చరికమ్ములఁ
గఱచిన రస మాననిగతిఁ దరుణుల నెఱచే
నెఱ వాపక సంగతి కే
డ్తెఱనేసి మనోరథములు ధీరుని బడయన్. (?)

నాచనసోముఁడు ఉత్తరహరివంశములో:

తే. సాగరమునీరు పేరుట శైలకులము
తెరువు లిచ్చుట చీఁకటి నఱుకువడుట
దివ్యతేజంబు దోఁచు టద్దీప్తి నీవు
సొచ్చుట కుమారులం గొని వచ్చు టేమి.

నందిమల్లయ ఘంటసింగయ్యకవులు తమ వరాహపురాణకావ్యమునందలి అష్టమాశ్వాసమునందు:

" రాజబింబనిభాస్య గారాపుఁబట్టిఁ
దిట్టి తిట్టించుకొని ప్రమోదించువారు
శ్రీవధూటీకళత్రు గుఱించి పూర్వ
జన్మమున నేమితపములు సలిపినారొ.

పిల్లలమఱ్ఱి పినవీరన్న జైమినీభారతమునందు ద్వితీయాశ్వాసములో:

ఉ. తూరుపు తెల్లవాఱుటయుఁ
దోడనె మంగళపాఠకస్తుతుల్
మీఱఁ దదీయరాగముల
మేలొకని కాల్యసముచితక్రియల్
దీఱిచి పాండుపుత్త్రి వసు
దేవసుతుల్ ప్రముదంబు మోములం
దేరఁగ నేడ్కతో నరుగు
దెంచి సభాస్థలి నిల్చి రయ్యెడన్.

కూచిమంచితిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమునందు జూపిన మహాకవులప్రయోగములనుగూడ నిచ్చట నుదాహరించెదను. అల్లసానిపెద్దన మనుచరిత్రమునందు:

శా. శ్రేణు ల్గట్టి నభోంతరాళమునఁ బా
ఱెం బక్షు లుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణ మయ్యె మృగతృ
ష్ణావార్ధు లింకెం జపా
శోణం బయ్యెఁ బతంగ బింబము దిశా
స్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె సరోజషండములు ని
ద్రాణంబు లయ్యెం గడున్.

శ్రీకృష్ణరాయల ఆముక్తమాల్యదలో:

మ. ఇలకు న్వేఁగుగఁ బండు తీరవనపుం
　　డ్రేక్షుచ్ఛటల్ తీపుల
గ్గలమై ప్రాల నురుస్రవంబు లెసఁగం
　　గాఁ ద్రిప్పురాట్నంపుగుం
ఱ్ఱిలుగాఁ దేనెకొలంకులం బొరలి పా
　　ఱ న్విచ్చుపంకేరుహం
బుల నాఁడెం దొలుసంజఁ దేఁటివల యం
　　బుల్తారఝుంకారముల్.

పింగళిసూరన తనప్రభావతీ ప్రద్యుమ్న కావ్యములో:

క. ఱెక్కలఁ జని ప్రాలుమునో
ఱెక్కలు గట్టుకొని దివిజరిపు మేడలపై
నక్కొమ్మఁ జూచు టెపుడో
డొక్క యనునంత తమక మున్నది మదిలోన్.

అయ్యలరాజు రామభద్రకవి, రామాభ్యుదయ కావ్యములో:

ఉ. సైరిభ వారిభ ద్విరద
　　శాసన ఖడ్గ ఖరాధిరూఢులై
తారలు బూరగొమ్ములును
　　దప్పెటలుం బటహంబులుం బదు
ల్వాలులు కేలఁ ద్రోయఁగ వ
　　ను ల్వడి వెల్వడి హత్తి యుత్తర
ద్వారమువంకఁ దాఱి కిరా
　　సంకలఁ బోఁజులు దీర్చి రయ్యెడన్.

మఱికొన్ని ప్రయోగములు తదితరకవులనుండి చూపెదను.

చేమకూర వేంకటకవి తనవిజయవిలాసకావ్యములో గురురేఫ లఘురేఫమైత్రి నంగీకరించినట్లు ఈక్రింది పద్యము లవలన దేటపడగలదు:

ఉ. కోప మొకింత లేదు బుధ
　　కోటికిఁ గొంగుపసిండి సత్య మా
రూపము తారతమ్యము లె
　　ఱుంగు స్వతంత్రుఁడు నూతనప్రియా
టోపము లేని నిశ్చలుఁడి
　　టుల్ కృతలక్షణుఁడై చెలంగఁగా
ద్వాపరలక్షణం బనఁగ
　　వచ్చునొకో యలధర్మనందనున్.

గీ. అరుగఁగొంకెడు కన్నియ తెఱఁగుఁ గాంచి.

మఱియు దనచే విరచింపబడిన సారంగధరచరిత్రమునందు:

మ. ఖరభానుప్రియసూనుఁ డెప్పుడు నిజం
　　గారించునేకా విభుం
డఱ చేలోపలి నిమ్మపండువలెన
　　త్యాసక్తి మన్నింప సా
ఖ్యరసైకస్థితి నుండి కావరమునం
　　గన్గాన కాపత్పరం
పర రాఁ ద్రెళ్లెవవేల యీవిధిఁ దఱిం
　　ప న్నేరంబె మహిన్.

పైవిధమున మహాకవుల ప్రయోగము లనేకములను చూపవచ్చును.

కాని ప్రాచీనవ్యాకరణకర్తలీ గురురేఫ లఘురేఫ మైత్రివిషయమున భిన్నాభిప్రాయములను గలిగియున్నారు. 'అనిష్పన్నే పదే లేవ ప్రయోగాశ్రయణం హితమ్' అనియు, 'నార్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యం' బనియు వ్యాకరణకర్తలే చెప్పెదరు. వ్యాకరణమునకుఁ బ్రయోగమే శరణ మయినప్పుడు వ్యాకరణకర్తల కీదిగువ నుదాహరించిన రీతిని వివిధాభిప్రాయము లెందుకు సంభవించెనో తెలియదు.

'నాస్త్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్' అని ఆంధ్ర శబ్దచింతామణి సూత్రము. ఈసూత్రము రేఫద్వయమైత్రి నంగీకరింపదు.

'కశ్చి ద్వదతి సాంగత్యం యతౌ వా నయో స్తథా;
అవద చ్చాత్ర సాంగత్యం ప్రాసేప్యపిన కశ్చన.

'అనయో స్సంగతిం యస్తు కరోతి కవితాకృతౌ,
అస్యా అత్యంతదోషత్వాద్దుష్కవి స్సహి కథ్యతే.

అని అధర్వణ కారికలు వాకొనుచున్నవి. ఒకడు ప్రాస ములందును, మఱియొకడు యతులందును రేఫమైత్రి యంగీకరించెననియు, గాని యట్టిమైత్రిని గూర్చిన కవి దుష్కవియనియు నధర్వణుని వచనము. ఈ పాటనే కాకునూరి అప్పకవియు నాంధ్రశబ్దచింతామణియందును బాడెను.

గీ. రేఫము ఱకారమును నన రెండుదెఱఁగు
లగుచు వికృతిపదంబుల నమరి యుండు
వాని సంస్కార పూర్వ కార్యప్రయోగ
సరణుల నెఱుంగవలయు సజ్జనవిధేయ!

..............................

గీ చెల్లు నని మును భీమన చెప్పె ననుచుఁ
గలుపుదురు రేఫములును ఱకారములును
దుష్టకవు లవి యొకటైనఁ దొంటిపెద్ద
లందఱును నేల విభజింతురని తెలియరు.

అంతటితో నాపక యితడుపోతనామాత్యునిదుష్ట కవి గణములో ద్రోసివేసి యపహాసపాత్రు డయ్యెను.

ఉ. బమ్మెర పోతరాజకృత
భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మది నేమిటం గొదువ
యెంతయు నారసి చూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలసి
ప్రాసములైన కతంబునం గదా
యిమ్మగ నాది లాక్షణికు
లెల్లను మాని రుదాహరింపఁగన్.

అప్పకవికి బుట్టిన బుద్ధిజాడ్య జనితోన్మాదము గాక, పోతనామాత్యుని యొక్కనినే ప్రత్యేకించి దుష్టకవివ్రాతములో జేర్చ నేల? అప్పకవికి జనించిన రోగమే అహోబలపండితునకును బుట్టెను. తిక్కనాది మహాకవు లందఱును సత్కవులు గాక దుష్కవులు గారా? వారుమాత్రము రేఫ ఱకారమైత్రి యంగీకరింప లేదా? ఈమైత్రి నంగీకరింపని అప్పకవియు నట్టిమైత్రి యంగీకరించుచు బద్యములు రచింపలేదా? ద్విరేఫ దర్పణకారుడు అప్పకవి పద్యముల నెత్తి చూపలేదా?

ఈ క్రింది అప్పకవి ప్రయోగముల జూడుడు:

1. ఱేని నామము నాకు గ్రిందిసంకను మీఁది

2. కేరుచు నొయ్యన డగ్గఱఁ
జేరుచు నురుముష్టిహతికిఁ జిక్కక వేగం
దారు చహంకృతిఁ గ్రన్నన
దూఱు చధోక్షజుఁడు మల్లుఁ ద్రుంచె ననంగన్.

మ. పురుటింటం బసిబిడ్డచందమున వా
పోవంగ నాఁ డాత్మలో
మఱు వొప్ప న్విపదుగ్ర యుక్తకుపస్త్రీ
ముద్దాడు రాకాసి గు
త్తైఁజేఁ గిట్టంబుగఁ బాలుద్రావుమిమచే
నిర్దైవకాలంబునం
ధరణిం గూల్చిన నంచపుత్త్రిసలఃం
దారాక్షణ ధర్మస్థితుల్.

ఆవిధముగ అప్పకవియే పప్పులో నడుగు వేసెను. కాని తొంటికవులు రేఫ ఱకారమైత్రి యంగీకరింపక పోలేదు

కవిజనాశ్రయములో:

క. నణ లనురెండక్కరముల
కును వడిఁ బ్రాసంబుఁ బెట్టుకొనవచ్చుఁ గృతిన్
విను రఱల కట్టె పెట్టం
జను ళళల కభేద మరయ సర్వజ్ఞనిధీ

కూచిమంచి తిమ్మకవి రేఫ ఱకారమైత్రి నన్నివిధ ముల నంగీకరించి, అప్పకవి పోతనామాత్యుని కీర్తిచం ద్రికకుగూర్చిన మాలిన్యమునుబోగొట్టి, 'సకలాంధ్రలక్షణ చక్రవర్తి'యని యాతని బ్రస్తుతించెను. ఈ కథయంత యు సర్వలక్షణ సారసంగ్రహమునందు గనుగొననగును.

## ద్వ్యర్థికవితలో రేఫ ఱకారనిర్ణయము

శ్లేషయందు రేఫ శకటరేఫ నిర్ణయము గ్రాహ్యము కాదని చూపుట కొక యుదాహరణమును జూపెదను. ఆంధ్రద్వ్యర్థికావ్యములైన రాఘవపాండవీయము, హరి శ్చంద్ర నలోపాఖ్యానము, లంకావిజయము మొదలగు కావ్యములందు నా కుదాహరణములు గనబడకున్నను,

వసుచరిత్రలో నొకచోటమాత్ర మొకయుదాహరణమును జూపవచ్చును.

వసుచరిత్ర రెండవ యాశ్వాసములో:

మ. నిలువెల్లన్ నిరపాయశంబరమయ
స్నేహంబునం బొంగు రాఁ
గల కూలంకషగాఢగర్వనిధులం
గాంతానుకూల్యంబుచేఁ
దలమే నిల్వఁగఁ బ్రాతికూల్యపరుషో
ద్యత్ప్రౌఢిఁ గా కంచు న
య్యలఘుం డాస్యము జేవురింప నిజరూ
పాటోపసంరంభి యై.

‘పొంగు రాగల’ అనుపదములకు ‘వెల్లువరాజాలిన’, ‘కేరుచుండెడు’ అను అర్థమును, ‘ధూర్తస్త్రీలు’ అను అర్థమును వ్రాయబడెను. ఒక్కయెడ నదీ పరమైన యర్థమును, వేఱొక్కయెడ ధూర్తస్త్రీపరమైన యర్థమును గవి శ్లేషించి యుండుటచేత ‘రాగల’ పదమునందు గురురేఫతోఁగల యర్థ మొకసారియు, లఘురేఫతోఁగల యర్థ మొకసారియు జెప్పుకొనిన గాని వీలు లేదు.

కాబట్టి శ్లేషలోఁ గూడ రేఫద్వయము మైత్రిని బొంది యభేదమును బడయును. బాలవ్యాకరణము ప్రకీర్ణక పరిచ్ఛేదమునందలి ౨౮ వ సూత్రము ‘యవలలు ఱస్వలఘువులు మైత్రింబొరయు; రేఫంబులు పొరయవు’ అను సూత్రమునందలి ‘రేఫంబులు పొరయవు’ అను దానికి ప్రమాణము లేదు. ప్రయోగములకు విరుద్ధము.

ఆంధ్రమునందు పదములలోఁ రేఫభేద మున్నపుడు అర్థమును మాఱుచుండు ననుట కుదాహరణములు చూపవచ్చును. పైని ‘రాగల’ అను పదమును జర్చించునపుడు, రేఫభేదముతోఁ నర్థభేదమును గలిగెనని తెల్లమయ్యెను గదా. ‘ఱోయు–రోయు’; తేఱు–తేరు; ఏఱు–ఏరు; ఱాలు–రాలు’ అను పదములకు పరుషరేఫ గలిగినపు డొక యర్థమును, లఘురేఫ యున్నపు డొక యర్థమును గలదు.

ఇప్పుడు కావ్యములలోఁ గురురేఫము లొక హల్లుతోఁ జేరినపుడు లఘురేఫముగా మన వారు వ్రాయుచున్నారు. ప్రాచీనాంధ్రభాషయందు గురురేఫ పరహల్లుతోఁ జేరినపుడు గురురేఫముగానే యుండెను. అదియును గాక కొన్ని గ్రామనామములందు హల్లు గురురేఫముతోఁ గలసినపుడు గురురేఫమే సంయోగమునందు వ్రాయబడెను. *గ్రామనామములందును, పురుషనామములందును శకటరేఫము బహుళముగా బ్రయోగింప బడుచుండెను. ఇందు కాధారము ప్రాచీనాంధ్రశాసనములే. † ఇప్పుడు మనము అనపర్తి, పెనుమర్తి, చేబ్రోలు అనియే, గురురేఫమును విసర్జించి, సాధురేఫమునే వాడుచున్నాము. ఉచ్చారణభేదమునుబట్టి మనము భాషలోఁ రేఫమును రెండక్షరములుగా పరిగణించి, లఘుత్వ గురుత్వములతోఁ వాడుచుండగా, గురురేఫము

*కనుపఱ్తి: Nellore Inscriptions, Vol. II, P. 992.
చెఱ్వు: „ Vol. III, Ongole, 138.
గంగఱ్తం Nellore Inscriptions, Vol. III, Ongole, 70.
ప్రాంబఱ్తి South Indian Inscriptions, Vol. IV, No. 674.
పెను (౦) ఱ్తినాథో: „ 1032.
చేబ్ఱోలు: యుద్ధమల్లుని బెజవాడ శాసనము, పంక్తులు ౧౯, ౨౫.
ఇట్టిప్రమాణములు చాల చూపవచ్చును.

† గుండ్డిపఱ్ఱు: Nellore Inscriptions, Vol. IV, Ongole (70).
చాంగలమఱ్ఱు South Indian Inscriptions, Vol. IV, No. 789.

మా మిత్రులు సోమశేఖర శర్మగారు తమచే వ్రాయబడిన ‘ప్రాచీనాంధ్రభాషా స్వరూపము’ అను వ్యాసమునందు నీవిషయమై వ్రాసియుండిరి.—రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక, పుట ౫౭ చూడుడు.

పరహల్లుతో జేరినప్పుడు లఘురేఫ మెట్లగునో తెలియకున్నది. వర్ణము పరుషముగా బరిగణింపబడినపుడు సంయోగమున దానికి సరళత్వ మెట్లు సిద్ధించును? ప్రాచీన కావ్యములందు గురురేఫ హల్లుతో గలసినపుడు గురురేఫముగానే యుండి, ప్రాసస్థానమునందును, యతిస్థానమునందును రేఫతో మైత్రి గలిగియుండునని తిమ్మకవి తన సర్వలక్షణసారసంగ్రహములో లక్షణము వ్రాసి, కొన్ని లక్ష్యములను జూపినాడు.* కావున గురురేఫ హల్లుతో జేరినపుడు లఘురేఫముగా వ్రాయగూడదనియు, నయ్యది లక్షణవిరుద్ధమనియు స్పష్టము.

## అధర్వణుని శాసనము

శకటరేఫము వర్ణాంతరములతో గలసి యుండుననియు, గ్రామ మనుష్య నామములలో శకటరేఫ బహుళముగా నుపయోగింపబడుచుండె ననియు, అట్టి రేఫనిర్ణయము అధర్వణుని కాలము నాటికే యున్నదనియు పై యుదాహరణములబట్టి చదువరులెఱుంగనగును. కాని దానికి విరుద్ధముగా, శకటరేఫము వర్ణాంతరములతో గూడదని కొందఱు చెప్పిరనియు, గ్రామ మనుష్య నామములలో రేఫ అకార నిర్ణయము లేనిచో రేఫ ఱ గానే యెఱుంగునది యనియు నధర్వణాచార్యులు శాసించెను.§

రేఫము ద్వివిధ మని చెప్పుకొన్నను, ఏగణిత శాస్త్రప్రకారమో చెప్పలేము గాని, ప్రాచీన వ్యాకరణ కర్తలు తెనుగునకు వర్ణములు ముప్పదియా అని లెక్కపెట్టిరి. తక్కిన యక్షరములతో దీనినిగూడ నొక వర్ణముగా భావించి, తెనుగున కక్షరములు ముప్పదియేడని తెల్పుటయే న్యాయ్యము. దాక్షిణాత్యభాషలలో గురురేఫము గల భాషలైన అరవము, కర్ణాటకములలో నేయేపదములం దీవర్ణము నుంచి భాషయందుపయోగించిరో యాపట్టిక నొకదానిని వ్రాసి, ఆంధ్రభాష యాపదములనే యెట్లు పరిగ్రహించెనో చూపెదను. అప్పుడేపదములందు 'ఱ' కార ముండవలయునో మన మొకరీతిగ నిర్ణయింపవచ్చును.

---

* గీ. అరయ గురురేఫ హల్లుతో జెరసినపుడు
ప్రాసముల విశ్రమముల రేఫములతోడఁ
గలసి యుండును సుకవిపుంగవుల కృతుల
జగదవనసూత్ర, గిరితనూజాకళత్ర.
సర్వలక్షణసారసంగ్రహము, తిమ్మకవి.

ఉ. నూఱ్వురు నొక్కచందము మ
నోగతి సైరణచేసి నన్ను నా
సర్వకులంబు నుత్తమయ
శంబున నుంచితిరమ్మలార...
ఎఱ్ఱాప్రెగడ: రామాయణము.

క. చెలఁగి పటు సింహనాదం
బులు అంకెలు గాఁగ వారు పోలిచిరి వృషభం
బుల క్రియ నొండొరులకు మా
ర్మలయుచుఁ దాఁకుచు నుదాత్తరభసోజ్వలులై.
భారతము—ద్రోణపర్వము, తిక్కనసోమయాజి.

§ అధర్వణకారికలు: సూత్రములు ౧౭, ౧౮:
'అన్యేఽన్తరిక్షుఖద్యోశోఽన్యేన యుక్తాః కదాఽపిచ.
అనిశ్చయో భవే ద్యత్ర గ్రామమానుష నామసు;
రేఫయో ర్నిశ్చయ స్తత్ర రేఫమాత్రైక గోచరః.'

# అహింసా ప్రశంస

మండలేముల వెంకటశాస్త్రి గారు, బి. ఏ., యల్. టి.

'ఆత్మవత్సర్వభూతాని' యనుట మొదటి-న్యాయమైయుండ నకట! యన్యాయముగను
తోడి జీవుల హింసింపఁ దొడరుచుందు-రల్పమానవు; లిది యేటియాగడంబు?

బ్రహ్మ మొదలు పిపీలికవఱకునున్న-ప్రాణికోటులలో పరబ్రహ్మ మరయ
విమల చైతన్యరూపియై వెలయుననఁగఁ-బరుల హింసింప నెడమున్నె నరుల కకట?

మానవుఁ డిలఁగల ప్రాణుల-లో నధికుఁడటంచుఁ దలఁపనొప్పును విమల
జ్ఞానంబున నేకద? తత్-జ్ఞాన మహింస నెగడా ప్రచారము సేయున్.

చదువఁగ నేర్చి విద్దెలను, శాస్త్రములన్ గర మభ్యసించి, యొ
ప్పిదముగ వాదముల్ సలుపు వీలు నెఱింగి, మతార్థ మర్మ మి
య్యదె, యిదె బ్రహ్మమంచు చదువంతయుఁ దేటపడంగఁ బల్కి భూ
తదయ వహింపకుండిన, వృథా యగు మానవుజ్ఞానమంతయున్.

ధన కనక వస్తు వాహన-వనితా సుత పౌత్ర ముఖ్య వైభవములకై
పనిబూని యేల పరహిం-సన మొనరించెదరు? తారు శాశ్వతమె భువిన్?

వ్రతము లొనర్చినన్ భువన పావన జీవన మజ్జనంబు సం
తతము ఘటించినన్ గ్రతువిధానములన్ బచరించినన్ దపో
న్నతిని దనర్చినన్ నిజధనమ్మును దానము సేసియైన స
ద్గతి నరు డొందఁజాలునె వ్రతమ్ముగ భూతహితమ్ముఁ బూనకన్.

తనకులమున్ వధించుచు సదా దురితంబు లొనర్చుచున్ మరిన్
గనికర మింతఁ బూనని యకర్మకరుం డల బోయ వచ్చి, సీ
తున ఘనతాపమొందు నెడఁ దొయ్యలి పల్కిన మాటలూని యా
తనికయి మేను బాసి సుకృతంబుఁ గపోతము మున్ను బొందదే?

మంచి దిది చెడ్డ దిది యని మనసులోన-నెఱుఁగజాలని పులుఁగు లహీనమగు న
హింస నిట్లూచుచుండఁగ నెఱుకగలుగు-మానవుని కేల యీ వెఱ్ఱిమతము దలఁప?

తమజాతి వదలి మృగములు-విమతమృగావళి నెనొంచు, విహంగంబులు నీ
క్రమమును మించవు, నరుడే-స్వమతులనైనను వధింప సమకొను నకటా!

కామ రోషాది దుర్గుణగణము విడువఁ-జాలక స్వలాభమునకయి చంపఁజూచు
నో రెఱుంగని పశువులఁ గీరములను-మానవుం; డత డెటు జగన్మాన్యుఁడగును?

జ్ఞానములేని జంతువులు సైతము భూతదయాపరత్వశీ
లానఁ జరించుచుండఁ జపలత్వమువీడని బుద్ధిశోడ తాఁ
జ్ఞాని నటంచుఁ బల్కుచు విచారమునూలి తదన్యహింసఁ జేఁ
బూనిన మానవుం డెటులఁ బూజ్యతనొందును ప్రాణికోటిలోన్?

మనసునకు భూతదయయ భూషణము తలఁప-కరుణచే మది యెంతయుఁ గరుగఁజాలు
దాన మోక్షముఁ గనఁజాలు మానవుండు-కరుణ యెఱుఁగని మది శిల కాదె యరయ?

వ్రతముగ నహింసఁబూనిన పరమమతుల-కెందును నసాధ్యములు గల్గ వెందునందు;
ప్రకృతి వారల కెపుడు తోడ్పడును మిగుల-దైవబలమునుగల్గు సతంబు నిజము.

తత యహింసా తనుత్రాణధారియైన-సత్త్వవీరున కెదురాడఁజాల రెవరు?
దైవ మాతనిఁ గాచు నిత్యమును నిజము-గానిచో ధర్మ మెటునిల్వఁగలదు ధరణి?

అస్త్రశస్త్రాదు లాతనియందు నణగు-మందుమాకులు వ్యర్థయగు; మంత్ర తంత్ర
జాలములు నిష్ఫలములగు; సత్త్వశక్తి-ప్రబలి యతనికి విజయలాభంబుఁ గూర్చు.

శాంత మొదవక సౌఖ్య లేశంబులేదు-సౌఖ్య మొదవక యాత్మరక్షణము లేదు
ఆత్మరక్షణ లేకున్న వ్యర్థమగును, మనుజ జీవన; మటుగాన మాన్యులార!

మనమున గామ లోభ మద మత్సర వృత్తులఁ బోనడంచి
చక్కని కరుణారసంబును వికాసముబొందుచు సత్త్వమూర్తులై
యనయ మహింసఁబూనుఁ; డిదె యార్యులధర్మము; హింసఁజేసి గాం
చిన సురరాజవైభవముచే నయినన్ సుఖమొందవచ్చునే?

ఒరులు పచ్చగనుండిన నోర్వలేక-మత్సరంబున నదియేల మ్రగ్గుచుందు?
రఖిలలోకకల్యాణమె యాశయముగ-మెలఁగఁజనదొకో? మఱి దాన మేలులేదో?

సామరస్యము నేర్వఁ డో జ్ఞానులార!-శాంతమే భూషణము సుండు దాంతులార!
మనమున నహింసఁబూను డో యనఘులార! అదియ కడ కుద్ధరించు నో యన్నలార!

---

# విశేష యతి

వడ్లమూడి వేంకటరత్నముగారు

అప్పకవి చెప్పిన యతివిశేషములలో నీవిశేష యతి యొకటి. దీని నితరలాక్షణికు లెవ్వరును జెప్పినట్లగపడదు. అయినను తిక్కనసోమయాజియుఁ గొందఱు ప్రౌఢకవులును నీ యతి నుపయోగించినారనుచు నప్పకవి యిట్లు చెప్పియున్నాఁడు:

తే. ప్రౌఢకవులు కొందఱు జ్ఞ కారంబునకును
ప్రథమవర్గంబు తొలియక్కరములు నాల్గు
నిడుదురు ప్రబంధముల నొక్కయెడ విశేష
వళులనుచు సోమయాజులు వాడుకతన.
(అప్పక. 3-౫౬)

ఇందులకు లక్ష్యముగా

క. జ్ఞానము కేవల కృపన
జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము సేయం
గా నది సకలధరిత్రీ
దానంబునకంటె నధికతరఫలద మగున్.
(శాంతి ౪-౨౫౫)

అను పద్యము నిచ్చియున్నాఁడు. 'జ్ఞ' కారము కొన్ని తద్భవపదములందు గకారముగ మాఱుచున్నది. ఉదా. సంజ్ఞ—సైగ, ప్రజ్ఞ-పగ్గె, పగ్గియ. ఈ గకారము సామాన్యముగ సానునాసికముగ నుచ్చరింపఁబడుచుండును. మఱియుఁ దఱచుగా యతినియమము పాటింపఁబడుచుండు సామెతలయందును (జ్ఞాతికి కళ్లను, పాముకు పళ్లను), వ్యావహారికపదములందును (జ్ఞానవంతులరమ్మ గపరమ్మ మీరు) ఈ జ్ఞకార గకార సంబంధము గనబడుచుండుటచే నీయతికల్పింపఁబడియుండు'నని విమర్శకులయభిప్రాయము. కొన్ని గ్రామ్యములయందు ఈ గకారము నకారముతోఁగూడియుఁ గూడకయుఁ గానఁబడుచుండును. జ్ఞానము - గ్నానము, గానము; యజ్ఞము- యగ్నెము, యెగ్గెము దీనినిబట్టి జ్ఞకారమునకు గకారముతోడ సంబంధమేగాక జకారమునకును గకారమునకును కొంత ఉచ్చారణసామ్య మున్నట్లు కన్పట్టుచున్నది. ఈసామ్యము చవర్గ పంచమముతోఁ గూడిన జకారమునకే యున్నట్లుతోఁచుచున్నది. అయినచో ఞకార సాహచర్యమువలననే దీని కీశక్తి గలిగియుండును. కనుకనే జ్ఞకారమునకు ప్రథమవర్గంబు తొలి యక్కరములు నాల్గుతోడి మైత్రి చెప్పబడియున్నది.

ఈయతి మఱియెక్కడను వాడఁబడియుండినట్లు కనఁబడుట లేదని కొందఱును, ఉత్తరాంధ్రకవులలో నధునాతనులు కొంద ఉపయోగించినారు గాని పూర్వకవు లెవ్వరును ప్రయోగింపలేదని మఱి కొందఱును విమర్శకు లనుచున్నారు.

పై సోమయాజి పద్యములో రెండవ చరణమునకు "జ్ఞానికి నుపదేశవిధి ప్రజనితము చేయన్" అని యొకపాఠాంతర మున్నది. ఈపాఠమే ముద్రితప్రతులు పెక్కింటి యం

దును, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందలి పెక్కు ప్రతులయందును గలదఁట. కనుక నప్పకవియే యుచ్చారణ సామ్యమును బట్టి యీ యతిని కల్పించి యందుల కుపబలముగానుండవలయునని సోమయాజిపద్యమును తన చెప్పినదాని కనుకూలముగా మార్చుకొని యుండునా? లేక యట్టి ప్రతి యేదే నప్పకవికి లభించియుండునా? ఈయొక్క పద్యము నే లక్ష్యముగా నొసఁగియుండెను గాన మఱి యెవ్వరును ఈయతి నుపయోగింపలేదా? లేక యప్పకవి పరిశీలనలోపమా? అని యెన్నియో సంశయములు విద్వాంసులకుఁ గలుగుచున్నవి.

ఈవిషయమునం దప్పకవికిఁ గూటకరణము నంటఁగట్టుట న్యాయ్యముగఁ దోఁపదు. విశాలవాఙ్మయ సముద్రము నంత జాగరూకతతోఁ జూచుట సామాన్యమా!

ఈయతిని కృష్ణదేవరాయ లొకచోట నుపయోగించియున్నాఁడు. చూడుఁడు:

మ. ఇది సింహాచలదంభ కేసరిపదాభీష్టార్చనాపుణ్యు ల
బ్ధమురుట్టంకణపొట్టునూరి విజయస్తంభోపలోట్టంకితాం
కదృఢేష్టాంకురకృష్ణరాయనృపసంజ్ఞాస్మత్కృతాముక్తమా
ల్యద నాశ్వాసవరంబు నాలవది హృద్యంబై మహిం బొల్పగున్.

(ఆముక్త. ౪-౨౮౯.)

వేంకటరాయశాస్త్రిగారి ప్రతియందును, పూర్వప్రతులయందును నీపద్య మీపాఠము ననే యున్నది.

ఇందలి విశేషమేమనఁగా నిశ్శల్యీకృతమగు వేంకటరాయశాస్త్రిగారి ముద్రణమునందును నీయతి పేర్కొనఁబడలేదు. ప్రమాదమున జాఱియుండును. కానిచో వారు వివరించిన "కవియొక్క ఛందోజ్ఞానము (యతిజ్ఞానము) (ఉదా ౫౬)" నందు నయిత ముట్టంకింపక విడచెదరా? (చూడుఁడు: పీఠిక పుట ౧౫)

ఈ పద్యమునందలి మూఁడవపాదము నందలిది బిందుయతిగాదు; ఏమన సంజ్ఞాశబ్దమున కవర్గపంచమము లేదుగదా! కాన విశేషయతియే యనవలయును.

ఈయతి నప్పకవికి పూర్వులు నయిత మెందఱు వాడినారో తెలియదు.

జ్ఞానము నుపదేశవిధిచేతఁ బ్రజనితము సేయుటకంటెఁ బ్రకాశము సేయుట యను పాఠమే సరసమయినదనుటచే నప్పకవి యుదహరించిన పాఠమే కవ్యుద్దిష్టమనియుఁ, ఈయతికి వెఱచియే కొందఱు పాఠాంతరమును గల్పించి ప్రతులు వెలయించిరనియు, నప్పకవి వాడిన 'ప్రౌఢకవులు కొందఱు' అనుపదము నిరర్థకము గాదనియుఁ దేలుచున్నది.

# వజ్రములను కొనుటకు



సంవత్సరములకొలది యోపికతో పరీక్షించగలిగి, విలువైన మణులయందు లోహములందు గొప్ప ప్రావీణ్యము కలిగియుండుట మొదలైనవి, మీరు యిచ్చు ధరకు సరియైన వజ్రముల నివ్వని నగలవర్తకుల కుండవలసిన గుణములై యున్నవి.

ఇచ్చటనే, మనము కొను నగలయందు గమనించదగిన మార్పు లుండగలవు. సంవత్సరములకొలది యనుభవముగలవారినే యెన్నుకొనబడియున్నారు. మీరు కొనునపుడు మాయందు సంపూర్ణమైననమ్మకముంచి, మీరు యిచ్చు ధనమునకు యితర చోట్ల దొరకనట్టి నగలుకంటె శ్రేష్ఠమైనవియు, ధరలకుతగిన నగలును దొరకును.

## సురాజ్‌మల్ లల్లూభాయి అండు కో.,

పురాతనపు యొకేధర గలిగిన వజ్రపు దుకాణము.

**313, ఎస్ప్లనేడ్, మద్రాసు.**



౧. దామర్ల వెంకటాద్రినాయకుడు యఫ్. డేవొరగారికి చెన్నపట్నము నగరమును స్థాపించుకొనుటకై అనుమతిపత్రమునొసగుట



౧. మహిషాసురమర్దని

# సాలీఁడు

జి. జాషువ గారు

నీలో నూలు తయారుచేయు మరగానీ, ప్రత్తి రాట్నంబుగా
నీ, లే దీశ్వరశక్తి నీ కడుపులోనే లీనమైయుండునో
యే లీలన్ రచియింతు వీ జిలుఁగు నూ లీ పట్టుపుట్టంబులో
సాలీఁడా! నిను మోసగాఁడ వని విశ్వం బెల్ల దూషించెడిన్.

ఢక్కా మల్లు పసందునేతపనివాండ్రా నీ యుపాధ్యాయు? లి
ష్టాక్కాడన్ గనరాఁడు, దాగుకొనినారో నీదు గర్భంబునం
దిక్కాలంబున నిన్ను మించు పనివాఁడే లేఁడు దుర్వృత్తికిన్
దిక్కై నీ యసమానకౌశలము వ్యర్థీభూతమై పోయెడిన్.

పురుషుం గుంపును మోసపుచ్చుటకుఁగాఁబోల్దొంగమగ్గాలపై
మురిపెంపుం బని యుల్లి పట్టువలిపంబుల్ నేసి నీ మందిరాం
తర దేశంబుల నారగట్టి యొకపొంతం బొంచినా వోరి ట
క్కరి సాలీఁడవు గావు దొంగవని వక్కాణింపవే లోకముల్.

తలఁపం బున్నమనాటి వెన్నెలను దిద్దంజాలు నీ నూలుపో
గుల సింగారముఁ జూడవచ్చి, యసువుల్గోల్పోయెడిం బ్రాణులో
తులువా! నెత్తురు ద్రావు నేతపను లెందున్ జూడ మోరంతప్రా
ద్దులు నీ కీ యుదరం భరిత్వ మనుకొందున్ బెండ్లముం బిడ్డలున్.

ఒకపర్యాయము కాందిశీకుఁ డగు వీరోత్తంసుఁ డొక్కండు కొం
డకు నీ వల్లిన గూటియం దొదిగియుండన్ దాయ లేతెంచి నీ
మొకమోటంబున నమ్మి నీదు నిలయంబున్ దొంగియుం జూడ రిం
దుకు నిన్నున్ గొనియాడి యీశ్వరుని వైదుష్యంబు నూహించెదన్.

---

# వేదములు

దర్భ యజ్ఞేశ్వర సోమయాజి గారు, బి. ఏ., యల్. టి.

౧

సప్తాంభోధివేలావలయితంబగు నీధరాతలంబునంగల మతగ్రంథంబు లన్నిట వేదంబులు ప్రాచీనంబులును, బవిత్రంబులును, బ్రమాణంబులునునగుట నిర్వివాదాంశము. వేదమనుపదము, "విద్ = తెలిసికొను" అను సంస్కృతప్రకృతినుండి యుత్పన్నమై, "జ్ఞాన" మనునర్థమును బ్రబోధించుచున్నది. ప్రత్యక్షప్రమాణయుక్తంబగు జ్ఞానముకూడ వేదమను పేరబరగుచున్నది. ఈవ్యుత్పత్తులవలన వేదమనుపదము హైందవులవిజ్ఞాన సారస్వతమంతకును సాధారణ నామమైనట్లు తెలియవచ్చుచున్నను, నిది ఋగ్యజుస్సామాథర్వంబులను నాల్గు శ్రుతులకును రూఢనామమై వెలయుచున్నది. ఋషిసత్తములచే నార్జింపబడిన బ్రహ్మజ్ఞానసమన్వితంబులగు నీవేదంబులయందలి శ్రుతివాక్యంబు లాయామునిపుంగవులకు గల బ్రహ్మస్వరూపవిభావనలను వ్యక్తీకరించుచున్నవి.

౨. ఈశ్వరప్రతిపాదకములై, యనంతములైన యీ వేదంబులు బ్రహ్మాధీనంబులై యుండగా, సోమకాసురు డానదువులవేలుపు నిద్రించు సమయంబున నానిగమంబుల నపహరించికొనిపోయి సముద్రంబున డాచికొనగా, విష్ణువు మత్స్యావతారమెత్తి, తోయధిజొచ్చి, సోమకాసురుభంజించి, తొలిచదువులను గ్రహించి, వానిని మరల బద్మగర్భున కొసగెను. అటు పిమ్మట రెండవయుగంబునందు విష్ణువు కృష్ణద్వైపాయనుండై యవతరించి యేకీభూతంబులై యేర్పడకున్న వేదంబులను ఋగ్యజుస్సామాథర్వంబులుగా విభాగించి తనశిష్యులగు పైలవైశంపాయనసుమంతు జైమినులంబంచి క్రమంబున జతుర్వేదసూత్రంబులఁ జేయించి వేదవ్యాసుండయ్యె.

"ఉ. సంచితపుణ్యుఁ డంబురుహ
సంభవునంశముఁ దాల్చి పుట్టి లో
కాంచితుఁడైనవాఁడు నిఖి
లాగమపుంజము నేర్పడ విభా
గించి జగంబులందు వెలిఁ
గించి సమస్తజగద్ధితంబుగాఁ
బంచమవేదమైపరఁగు
భారతసంహితఁ జేసె నున్నతిన్"

[భార ఆది]

3. సృష్టితోపాటు వేదము లుద్భవములైన వని కొందఱును, బ్రహ్మనాల్గుముఖంబులనుండి నాల్గువేదంబులు నుత్పన్నములైనవని కొందఱును జెప్పుచున్నారు. లోకమాన్యతిలక్ మహాశయుండు వేదములు క్రీ. పూ. ౪౦౦౦ వ సంవత్సరమునకును బౌద్ధావతార కాలమగు క్రీ. పూ. ౫౦౦ వ సంవత్సరమునకును మధ్యకాలావధిలో నున్న ఋషులచే విరచితములైనట్లు ఖగోళసిద్ధాంత పురస్సరంబుగ నిర్దేశించి యున్నాడు; కాని మోక్షమూలరుగారు క్రీ. పూ. ౧౦౦౦ క్రీ. పూ. ౫౦౦ మధ్యకాలావధిలో నివి రచితములైనట్లూహించుచున్నారు.

౪. త్రయీసంజ్ఞంబరగు ఋగ్యజుస్సామంబులే యాదివేదంబులనియు, నథర్వంబీమూడిటికంటె నర్వాచీనంబనియు, నది కొంతకాలమువఱకు బ్రత్యేకవేదముగ బరిగణింపబడనే లేదనియు నీపేరువలన వ్యక్తమగుచున్నది. ప్రతివేదమునందును మంత్రభాగమనియు, బ్రాహ్మణమనియు రెండేసిభాగములుండును. మంత్రభాగము సంహితయనియు, ఖిలయనియు ద్వివిధము. నియతక్రమమున సంతరించి కూర్చిన మంత్రములన్నియు గూడి సంహితగను, చెదరిపోయి భ్రష్టములైన మంత్రములన్నియుగూడి ఖిలగను నేర్పడుచున్నవి. సూక్తములును, స్తోత్రములును, వీనికి సంబంధించిన యావాహనలును సంహితలందుండును. వర్ణాశ్రమోచితకర్మలును, వానినాచరించెడి విధులనుబోధించెడి సూత్రములును బ్రాహ్మణములందుండును. ఈ కర్మలన్నియు నగ్నీంద్రాది దేవతల పూజారూపకములై సర్వాంతర్యామి యగు నీశ్వరునికి పరంపరగా బ్రీతిజనకములగుచున్నవి. వేదాంత

మట్కంబును, నుపవేదచతుష్కంబును, నష్టోత్తరశతో పనిషత్తులను నీ వేదముల సారమును గ్రహించుటకు పకరించు సాధనములు. ఇందు ఋగ్వేదమున, [ఋక్=స్తోత్రముచేయు] విధ్యుక్తకర్మల నిర్వర్తించుకేతి సూక్తాలు పదువు స్తోత్ర మంత్రములుండును. యజుర్వేదము [యజ్=పూజించు] క్రతువులకు సంబంధించిన విధులను బోధింపునదియై, బలివిధానములయు, పిండసత్కృత్యలయు, రీతులగూర్చి ముచ్చటించను. సామవేదము శ్రావ్యతరంబులగు స్తోత్ర శ్లోకాత్మకములను మంత్రములతో నలరారుచున్నది అరివర్గంబుల నాశనముచేయుటకును, శపించుటకును నలయు మంత్రములతోడను, వానివాని శాంత్యాదులతోడను నధర్వవేదము దీటుకొని యున్నది.

## ఋ గ్వే ద ము

౫. ఋగ్వేద సంహితయందు ౧౦౨౮ సూక్తము లున్నవి. వీనిలో బదునేడు సూక్తములుమాత్రము వాల ఖిల్యము లనబడుచున్నవి. ఈ వేదము నెనిమిది యష్టకములుగను, నొక్కొక యష్టకము నెనిమిదేసి ఖండములుగను, నొక్కొకఖండము నెనిమిదేసి యధ్యాయములుగను విభజించియున్నారు. ఈ వేదమునందలి ౨౦౦౬ వర్గములలోనున్న ౧౦౪౧౭ ఋక్కులలోను,౧౫౩౮౨౬ పదములున్నవి. పై విభజనములతోపాటు వేఱొండు విభజనవిధానంబుకూడ నీవేదంబున బొడకట్టుచున్నది. దీనిని పదిమండలములుగను, నొక్కొక మండలమును | ౮౫ అనువాకములుగను గూడ విభజించియున్నారు. ఈ పదిమండలములలో ద్వితీయమండలము మొదలు సప్తమమండలాంతము వఱకునున్న మండలములొకేరీతిగనుండి, యొకే తెగఋషులచే విరచితములై యొకేతీరుగ సంతరింపబడి యున్నవి. ఈయాఱుమండలములలో నాయాదైవతముల నుద్దేశించిన ఋక్కుల నొక్కొకతావుననే ప్రకటించియున్నారు. ప్రథమాష్టమదశమ మండలంబులు పలువురచే విరచితములైనవైనను నేకత్వాభినివేశము గలవియై విరాజిల్లుచున్నవి. తొమ్మిదియవ మండలమునందలి ఋక్కులన్నియు ప్రత్యేకముగా సోమదేవు నుద్దేశించినవే.

౬. ఈవేదమును సావధానముగ బరిశోధించి చూచినచో నిది యీదిగువవిధముగ బెంపొందినట్లు వ్యక్తమగును. ద్వితీయమండలముమొద లష్టమమండలములోని పూర్వార్థాంశము తొలుదొల్తనే విరచితమైనది. ప్రథమమండల ద్వితీయభాగమును, నష్టమమండలముయొక్క యుత్తరార్థమును దరువాత రచించి, తదనంతరము, ప్రథమమండలముయొక్క ప్రథమభాగమును రచించిరి రెండవమండలమునుండి యేడవమండలాంతమునున్న మండలంబులలోని సోమారాధన యోగ్యంబులగు సూక్తములనేర్చి తొమ్మిదవ మండలముగ గూర్చిరి. ప్రథమాష్టమమండలములలోని సూక్తములొక్క మూడుమాత్రమీ నవమమండలంబున గానవచ్చెడి. పదియవ మండలము వీనియన్నిటికి నర్వాచీనంబని దీనియందలి విషయము వలనను, భాషవలననుగూడ వ్యక్తమగుచున్నది.

౭. ఋగ్వేదమునందలి పదియవమండలములోని సూక్తములును దక్కినభాగములలోని యొకకొన్ని సూక్తములును, వేదఋషులకైన దైవవిభావనను జూచాయగ బ్రకటించుచున్నవి. కాని ఋగ్వేదకాలము నాటి ఋషులు ప్రకృతియందంతర్హితములై యున్న శక్తుల నాయానామములతో బిలుచుచు నారాధించువారు. ఆయాశక్తులు తమ యాయాజీవనోపాధులకు గారణభూతములగుచున్నవనియు, నాయాశక్తుల నారాధనపూర్వకముగ వశపఱచికొనినచో దామనాయాసముగ జీవయాత్ర సలుపవచ్చుననియు, దృఢముగు నమ్మకముగల్గి తమ పురోభివృద్ధికై వాని నారాధించువారు. ఋగ్వేదమునందలి పెక్కుసూక్తములన్నిని బ్రబోధించుచున్నవి. పర్జన్యునివర్షాధిదేవతగ భావించువారు. సూర్యు డగ్నివలెనే ఉష్ణము నొసంగుచుండుటచే నాతని దివ్యాగ్నిగ భావించి యారాధించువారు. అగ్నీంద్రాదిత్యులకు గ్రమముగా భూమ్యంతరాళదివంబులునికిపట్లనియు, నీమూగురకు నధిదేవతయగు బరమాత్మయొక్కడేయనియు, నాపరమాత్మయే ప్రజాపతి నామంబున బరగుచున్నాడనియు, ఋగ్వేదఋషుల విభావన, ఈ వేదమునందు అదితి,వరుణుడు,ఉషస్సులు,ఇద్దఱశ్వినులు, పృథ్వి, మరుత్తులు, త్వష్ట్రుడు, యముడు, సోముడుమున్నగు

వారి పేరు లున్నవి. వీరినిగూడ వా రారాధించువారు. ఈవేదమున గృహస్థులు, యతులు, ఋషులు నిర్వర్తింప వలసిన కర్మలయందాయాఘట్టముల నుపయోగించు స్తోత్ర మంత్రములనుగూడ గలవు. ఇందలి ఋక్కులుసాధార ణముగా నింద్రుని, అగ్నిని, సూర్యుని, చంద్రుని, ఉదక ములను, వాయువున్ను, భూతములను, నంతరిక్షమును, భూమిని, సాధారణముగ నామంత్రణముచేయు వారు. అగ్నిహోత్రములు చేయుట, సోమపానము చేయుట, యనుకర్మలయొక్క ప్రతియంశమునకు సంబంధించిన యనేక స్తోత్రమంత్రము లిందున్నవి.

౮. ప్రతిసూక్తమునకును మొదట నొక ఋషి నామముండును. ఆయాఋషిని సూక్తమునకు ఋషి యందురు. బ్రహ్మచేనాయాసూక్తము లాయాసంయ మీంద్రులకు బ్రప్రథమమున వినిపింపబడినవని భావిం చుచున్నారు. ఆయాసూక్తము లేయేదేవతల యారాధ నకై యుపయోగపడుచున్నవో యాదేవత లాయాసూ క్తముల కధిదేవతలని వ్యవహరించుచున్నారు.

౯. ఋక్కులన్నియు ఛందోబద్ధములై నాల్గేసి పాదములు గలవిగానున్నవి. మూడు పాదములవియు, నైదుపాదములవియుగూడ నిందు జూపట్టెడి. ఋక్కుల పాదములు సమానముగానుండి స్వరప్రధానములై విరా జిల్లుచున్నవి. చాలవఱకు ఋక్కులు * త్రిష్టుప్పు, గాయత్రి, జగతి యనుఛందంబులలో విరచితములైనవి.

౧౦. ఋగ్వేదముయొక్క ద్వితీయభాగమైతరేయ బ్రాహ్మణము. ఇది యెనిమిదిపంచికలుగను, నొక్కొక్క పంచికయైదేసి యధ్యాయములుగను బ్రతియధ్యాయమును గొన్ని కొన్ని ఖండములుగను భాగింపంబడి మొత్తము మీద రెండువందల యెనుబదియైదు ఖండములుగ విభ జింపబడియున్నది. ఇయ్యది కొంతగద్యాత్మకముగ నున్నది. దీనియందుఁ బలుతెఱగుల క్రతువులనువర్ణించి యున్నారు.

౧౧. ఋగ్వేదముయొక్క మూడవభాగ మైత రేయారణ్యకము. ఇయ్యది యయనంబులుగ విభజింప బడిన పదునెనిమిదియధ్యాయముల గ్రంథము. దీనియందలి రెండవ యారణ్యకమందలి యేడధ్యాయములను తృతీయా రణ్యకమును గలిసి యైతరేయోపనిషత్తనంబరగుచున్నది. రెండవ యారణ్యకములోని చివర నాలుగధ్యాయములును వేదాంతతత్త్వనిరూపణంబులుగ నుండుటచే వీనినే యైత రేయోపనిషత్తుగ వేదాంతులు భావించుచున్నారు.

## యజుర్వేదము

౧౨. యజుర్వేదము వాజసనేయమనియు, తైత్తి రీయమనియు ద్వివిధము. వాజసనేయమునకు శుక్లయా జుషమనియు, తైత్తిరీయమునకు కృష్ణయాజుషమని యు గూడ పేళ్లున్నవి. ఈవేదము రెండు తెఱగులగు టకు గల కారణమును సూచించెడి యీకథ విష్ణుపురా ణమునం గలదు. "తొల్లి యొకప్పుడు మునులందఱును మేరుపర్వతము మీద సభచేయ నిశ్చయించుకొనిరి. నియమితకాలమున నా సభాస్థలినిలేనివా రేడుదినముల లోపల బ్రహ్మహత్యచేయునవలెనను నియమముచేసికొనిరి. వైశంపాయను డొక్కరుడుమాత్ర మానిర్దిష్టసమయం బున కచ్చటికి రాజాలకపోయెను. దాన నియమోల్లం ఘనమాయెను. ఆత డకస్మాత్తుగ దనమేనల్లుని గాల దన్నెను. ఆబాలు డప్పుడసురుల బాసెను. అంత వైశంపాయనుడు తన శిష్యుల జేరజీరి, వారిని దనకు మాఱుగ బ్రహ్మహత్యాదోషమును బాపుకర్మలజేయ నాజ్ఞాపించెను. అంత యాజ్ఞవల్క్యమహాముని లేచి, "తుచ్ఛులగు వీయనలంకర్మీణుల బాధించుటవలన నేమి ప్రయోజనము? నేనేకతంబ యిద్దాని నిర్వర్తింతు"నని ను. వైశంపాయను డీమాటల కలికి యాజ్ఞవల్క్యునితో, "నోయీ! నీవీబ్రాహ్మణులనందఱిని వంచించితివి; కావున నీవు నాకడగ్రహించినవిద్యను వెడల గ్రక్కిపొమ్మనెను. దీని కాతడు గురుపుంగవునితో, "గురూత్తమా! మీ యెడ గలభక్తివిశ్వాసములకు బాసగ నేనిట్లంటినేకాని,

* పదునొకం డక్షరములు గల నాల్గుపాదములు కూడిన త్రిష్టిప్పును; నెనిమిది యక్షరములు గల మూడు పాదములుకూడిన గాయత్రియుఁ; బండ్రెం డక్షరములు గల నాలుగు పాదములుకూడిన జగతియు నగు.

యా బ్రాహ్మణోత్తములయెడ నాకట్టి తిరస్కారభావం బును లేదు. మీరు ప్రసాదించినవిద్యను మరల గ్రహించు టే తమయభిమతంబైనచో దానిని వెడల గ్రక్కెద", ననుచు రక్తపంకిలమైన యజుర్వేద సంహితనా యాజ్ఞ వల్క్యమహాముని వెడల గ్రక్కి యచ్చోటు వాసిపోయెను. వైశంపాయనుని శిష్యులు తిత్తిరిరూపములను దాల్చి యా సంహితలను గ్రహించిరి. తదనంతరము యాజ్ఞవల్క్య మహాముని సూర్యునారాధించి వానికరుణకు బాత్రు డాయెను. అప్పుడు సూర్యుడు డశ్వరూపంబున నాఋషి సత్తముకడ కరుదెంచి, "వత్సా! నీకేమి కావలె?"నని యడిగెను. దీని కాసంయమీంద్రుడు, "మిత్రుడా! మద్గురువర్యుండగు వైశంపాయనుండుగూడ నెఱుంగని యజుర్వేదంబును నాకనుగ్రహింపగదే?" యనెను. అంత నాతరణి యయ్యోగిపుంగవునికి వైశంపాయను డెఱుగని, "అయాతయామ" యజుర్వేదమును బ్రసా దించెను.

## వాజసనేయము

౧౩. ఆదిత్యుండు వాజిరూపంబున యాజ్ఞవల్క్య మహర్షి కుపదేశించిన స్వచ్ఛమగు నీయజుర్వేదము వాజ సనేయము లేక శుక్లయాజుష మనంబరగుచున్నది. వేద ముల మంత్రభాగములన్నిట నీశుక్లయాజుష మంత్ర భాగమే చిన్నది. ఈవేదసంహితను నలువ దధ్యాయ ములుగ విభజించి యొక్కొక యధ్యాయమును గొన్ని కొన్ని ఖండికలుగ విభాగించిరి. ఒక్కొక మంత్ర మొక్కొక ఖండికగా నేర్పడుచున్నది. ఋగ్వేదములోని కొన్ని భాగము లీవేదమున గాన్పించుచున్నవి. ఇవి తక్కతక్కిన యజుర్వేదభాగములు ఛందోబద్ధములగు గద్య ములతో గూడియున్నది.

౧౪. బలులను గూర్చియు, గ్రతువులనుగూ ర్చియు, యజుర్వేదము ముచ్చటించునని పైన జెప్పి యున్నాడను. పూర్ణిమామావాస్యలయందు జేయబడు క్రతువులకు సంబంధించిన మంత్రములు మొదటియధ్యా యమున నున్నవి. రెండవ యధ్యాయములోని చివరి యాఱు ఖండికలలోను బైతృక కర్మలకు సంబంధించిన మంత్రములున్నవి. అగ్నిప్రతిష్ఠాపన సంస్కారాదులకు సంబంధించిన మంత్రములు నాలుగైదాఱేడెనిమిదవ యధ్యాయముల యందున్నవి. ఇందే సోమపానవిధి కూడ నున్నది. వాజపేయ, రాజసూయములకు సంబం ధించిన మంత్రములు తొమ్మిది పది యధ్యాయములం దును; హోమాగ్నిని బవిత్రీకరించుటకైన మంత్రములు తరువాతి యెనిమిది యధ్యాయములందు నున్నవి. పందొ మ్మిది, యిరువది, యిరువదియొకటి యధ్యాయములందు సౌత్రామణికి సంబంధించినవియు, ఇరువదిరెం, డిరువది మూ, డిరువదినా, లిరువదియై దధ్యాయములం దశ్వమేధ మునకు సంబంధించినవియు, నిరువదియా, ఱిరువదియే డధ్యాయములందు వివిధవిషయములకు సంబంధించిన వియు; నిరువదియెనిమిది యిరువదితొమ్మిది యధ్యా యములందు సౌత్రామణ్యశ్వమేధములకు సంబంధించిన వియు, వానిని బూర్తిచేయునవియు నగు మంత్రము లున్నవి. ముప్పది ముప్పదియొకటి యధ్యాయములందు బురుషమేధమునకు సంబంధించిన మంత్రము లున్నవి. ముప్పదిరెండు ముప్పదిమూడు ముప్పదినాల్గధ్యాయ ములు సర్వమేధమును గూర్చియు, ముప్పదియైదవ యధ్యాయము పితృమేధమును గూర్చియు జెప్పు చున్నది. ఈ వేదముయొక్క కడపటి యైదధ్యాయము లును నథర్వణపుత్రుడు దధిచేత జేయబడిన వంట్రు. ముప్పది యాఱు మొదలు ముప్పదితొమ్మిదవ యధ్యాయాం తమువఱకు నున్న మంత్రములందు సంస్కారములు, శుద్ధులు, తపమున్నగు వివిధధర్మకార్యముల విధానము లున్నవి. కట్టకడపటిదియగు నలువదియవ యధ్యాయము కేవల మధ్యాత్మతత్త్వమును గూర్చి చెప్పు మంత్రములతో నలరారుచున్నది.

౧౫. ఈవేదముయొక్క ద్వితీయభాగమును శత పథ బ్రాహ్మణమందురు. ఇది మంత్రభాగముకంటె చాల పెద్దది. ఈబ్రాహ్మణమును రెండు భాగములుగ విభజించి యున్నారు. ఇందలి ప్రథమభాగమున నాలుగు కాండలును, రెండవభాగమున బదికాండలును, రెండవ భాగమున నాలుగు కాండములును నున్నవి. మంత్ర భాగమునందలి క్రమమునే యవలంబించి యీబ్రాహ్మణ

మునుగూడ విభాగించి యున్నారు ఇందలి మొదటి రెండుకాండలలో పూర్ణిమామావాస్యలయందు జల్పు కర్మలకును, నగ్నిని బవిత్రీకరించుట లోనగు నితరకర్మలకును సంబంధించిన ధర్మానుశాసనము లున్నవి. మూడు నాలుగు కాండలయందు సోమరసమును జేయువిధానములయు, జ్యోతిష్టోమాది క్రతువులకు సంబంధించిన కర్మలయు ననుశాసనము లున్నవి. వాజపేయరాజసూయములకు సంబంధించిన కర్మల యనుశాసనము లైదవకాండమున నున్నవి. ఆఱుమొదలు పదిపర్యంతము నున్న యధ్యాయములలో నగ్నిని బవిత్రీకరించువిధుల యనుశాసనమున్నది. పదియవ యధ్యాయ మీకర్మ లాచరించుటవలనగల్గు ప్రయోజనంబులను బేర్కొనుచున్నది. ఈ బ్రాహ్మణముయొక్క ద్వితీయభాగములోని మొదటి మూడధ్యాయములలో సౌత్రామణ్యశ్వమేధములకు సంబంధించిన కర్మల యనుశాసనములు గలవు. నాల్గన యధ్యాయము ప్రత్యేకముగా నాధ్యాత్మిక విషయానుశాసనమయని చెప్పనొప్పు.

## తైత్తిరీయము

౧౬. యాజ్ఞవల్క్యమహర్షిచే వెళ్ళగింపబడి రక్తముచే మాలిన్యము జెందిన యజుర్వేదము తిత్తిరిరూపములం దాల్చిన వైశంపాయనశిష్యులచే గ్రహింపబడినకతంబున నియ్యది తైత్తిరీయము, కృష్ణయాజుషము నను పేళ్లంబరగుచున్నది. శుక్లయాజుషమునందుకంటె దీనియం దెక్కుడు మంత్రములున్నవి. తైత్తిరీయసంహితనైదు మొదలెనిమిదివఱకు నధ్యాయములుగల యేడష్టకములుగ విభాగించియున్నారు. ప్రతియధ్యాయమును గొన్ని కొన్ని యనువాకములుగ గూడ విభజించిరి. ఈసంహితలోని మొదటి యనువాకము వాజసనేయమునందలి మొదటి ఖండికతో సరిపోలుచున్నది. కాని తక్కినవన్నియు నిట్లు సరిపోలుటలేదు. రెండు తెఱగుల యాజుషంబులయందలి విషయములు నొక్కటియేకాని వానిక్రమములను, నిరూపణవిధానములును వ్యత్యస్తములుగనున్నవి. తైత్తిరీయమునందు గూడ రాజసూయ, వాజపేయ, జ్యోతిష్టో, మాశ్వమేధాది విధ్యుక్తకర్మంబులకు సంబంధించిన మంత్రములున్నవి.

౧౭. ఈవేదముయొక్క ద్వితీయభాగము నరణ్యబ్రాహ్మణమందురు. ఈవేదసంహితవలెనే దీని బ్రాహ్మణముగూడ నధ్యాయములుగను, నష్టకములుగను విభజించి యున్నారు. ప్రతి యధ్యాయమును గొన్ని యనువాకములుగ విభజించి యాయా యనువాకములందలి యక్షరములసంఖ్యలనుగూడ నందందే పొందుపఱచి యున్నారు. దీనియందలి మొదటి యాఱుకాండములలో విధివిహితంబులగు వ్రతాదులకు సంబంధించిన మంత్రములున్నవి.

౧౮. తైత్తిరీయయాజుషంబునకు సంబంధించిన తైత్తిరీయకోపనిషత్తు, నారాయణోపనిషత్తు, కఠోపనిషత్తు, వరుణోపనిషత్తు, మున్నగునుపనిషత్తులు గూడ నిందుగలవు.

## సామవేదము

౧౯. సామవేదమునందలి మంత్రముల ఛందము వానికి బ్రత్యేక నైసర్గిక గుణమును గల్పించి, వానిని శ్రావ్యతరంబులుగ నొనర్చి, వానిని గానయోగ్యములుగను, బవిత్రములుగను నొనర్చినది. ఈ వేదముయొక్క ముఖ్యభాగ మార్చికమను పేర బరగుచున్నది. సామగులధ్యయనము చేయు స్తోత్రమంత్రము నీయార్చికమను భాగంబుననుండును. ఈసామవేదభాగము నాఱుప్రపాఠకములుగను, నొక్కొక ప్రపాఠకమును బదేసి దశకములుగను విభజించియున్నారు. ఒక్కొక దశకమునం బదేసి సామములుండును. గానముచేయుటకనువగు స్తోత్రసామముల నన్నిటిని పదునేడు ప్రకరణములుగ సంకలించిపూర్చి దీనిని గ్రామేగేయగానము నుపేర బిలుచుచున్నారు.

౨౦. గానయోగ్యమగు మఱియొక సామవేదభాగమారణ్యకగానమను పేర బరగుచున్నది. ఇదియూడ నర్చికవలె బదేసిభాగములుగల మూడు ప్రకరణములుగ విభక్తమైయున్నది.

౨౧. ఈవేదములోనిసామముల "నార్చికగానము, అనిరుక్తగానము, ఉహాగానము"నను మూడురీతుల నధ్యయనవిధానముల నవలంబించి చదువుచుందురు.

౨౨. ఈ వేదముయొక్క ద్వితీయభాగము నార్షేయ బ్రాహ్మణమందురు. ఇది సామవేదభాగములు రెండింటికి ననుక్రమణికయై యలరారుచున్నది. తక్కిన వేదముల యనుక్రమణికలయందువలె దీనియందు సామముల ఛందస్సులుగాని, వానిచే నావాహనచేయబడు దేవతలనామములుగాని, వాని నేయేసమయములం దధ్యయనముచేయవలెనో యాకాలముల వివరణములు గాని లేవు. దీనియం దాయాసామముల రచయితలగు ఋషిసత్తములపేళ్లుమాత్ర మున్నవి. ఇంతియగాక యీ వేదము యొక్క యుత్తరఖండమునకు సంబంధించిన "షడ్వింశ, అద్భుత, పంచవింశ, తాండ్య" బ్రాహ్మణములుగూడ నిందున్నవి ఈ వేదమునకు సంబంధించిన యుపనిషత్తు ఛాందోగ్యోపనిషత్తు.

అధర్వణవేదము

౨౩. అథర్వణవేదసంహిత నిరువది కాండములు గను, నొక్కొక్క కాండమును గొన్ని యనువాకములు గను, నొక్కొక్క యనువాకము నొక కొన్ని సూక్తములుగను, నొక్కొక సూక్తమును గొన్ని ఋక్కులుగను విభజించియున్నారు. పగతురను నాశనము చేయుటకు నలయు బలు తెఱగుల శాపమంత్రము లీవేదమున నున్నవి. ఇంతియకాక క్షేమాభివృద్ధికైన స్తోత్రమంత్రములును, విపత్తులకు బరిహారమంత్రములును గూడ నిందు గలవు, యజనములందుదక్క తదితర శాస్త్రోక్తకర్మలయందును, ధర్మానుష్ఠానములందును నుపయోగించెడి స్తోత్రములును, దేవతల యారాధనలకైన పెక్కుసూక్తములును నిందుఁ గలవు.

౨౪. ఈవేదముయొక్క ద్వితీయభాగము గోపథ బ్రాహ్మణ మన బరగుచున్నది. ఈవేదమునకు సంబంధించిన యుపనిషత్తులలో మాండూకోపనిషత్తు ప్రధానమైనది. ఈవేదమునకు సంబంధించిన యితరోపనిషత్తులలో కేనోపనిషత్తే ముఖ్యమైనది. ఆయా వేదవిహిత కర్మలనాచరించు కాలములను నిర్ణయించుటకు నలయు సూత్రములుగల జ్యోతిషమను భాగముకూడ నిందు గలదు. దీనియందు జాంద్రసౌరమానముల నే ముఖముగ నొనరించు సూత్రములున్నవి. ఈవేదముయొక్క పందొమ్మిదవ కాండములోని నలువదియొమ్మిదియవ సూక్తమున కృత్తికతో మొదలిడి యిరువది యెనిమిది నక్షత్రములను పేర్కొనియున్నారు. ఇయ్యది యాశ్లేషాంతాయనమును సూచించు నీవేదకాలమును నిర్ణయించుట కుపకరించుచున్నది.

---

## నా స ఖా !

పురిపండా అప్పలస్వామిగారు, కవితాసమితి

నా సఖా నీ కరమ్ములం దొనరిలిన
ఈ పురాణ వీణాతంత్రు లిపుడు రేగి
పాడునేమొ కల్పోదయ ప్రణయగీతి
తరుణ భువనాల లే ప్రభాతాలె వెలుగ.

శిశిర యామినీ మిహికాశ్రుసేచనమున
హ్లాదమే విస్మరిలిన కళ్యాణ విటపి
చివురు చేలాంచలాల వాసించు పరిమ
ళమ్ము త్రిభువనమ్ముల విరజిమ్మునేమొ
తొలి వసంతవాసరమె సంధిలగ నేడు.

# విస్మృత సంస్కృత కావ్యావళి

యీయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు

౨

### 3. భట్టబాణుని "పద్యకాదంబరి"

౧

భట్టబాణుని 'ముకుటతాడితకముం' గూర్చి పూర్వవ్యాసమున నొండు రెండువిషయములు చెప్ప మఱచితిని. వాని నిట విన్నవించుకొనియెద. బాణుని 'ముకుటతాడితకము' భోజదేవుని 'శృంగారప్రకాశము'లో నుద్ధరింపఁబడియున్నది, [చూ. ముద్రిత 'శృంగారప్రకాశ' భాగపుఁ బీఠిక] 'శృంగారప్రకాశము' నేఁటిదనుక సంపూర్ణముగా ముద్రింపఁబడకపోవుటచే నం దుల్లేఖింపఁబడిన 'ముకుటతాడితక' శ్లోకములు నాకు సముపలబ్ధములుగాలేదు. ఒకవేళ 'నలచంపూ' వ్యాఖ్యాతలు పూర్వోల్లిఖిత 'ముకుటతాడితక' శ్లోకమును భోజుని గ్రంథరాజమునుండియే స్వీకరించిరేమో! ఏదియుఁ బ్రకృత మిదమిత్థమని నిశ్చయింపఁజాలము. 'శృంగారప్రకాశము' సంపూర్ణముగా ముద్రింపఁబడినపిమ్మట నీ విషయ మాలోచనీయము.

౨

మహామహోపాధ్యాయ బిరుదముచే నలంకరింపఁబడిన మూఁడునెలలకే స్వర్గము నధిరోహించిన యప్రతిమప్రతిభాభాసురులు, నిరంకుశకవికోవిదులు, హిందీ సంస్కృత సారస్వతముల కఖండసేవకులు, పాట్నా విశ్వకలాపరిషద్గీర్వాణపీఠాధిపతులు నగు సాహిత్యాచార్య శ్రీమత్పండిత రామావతారశర్మ [యం. ఏ.,] మహోదయులు "సుధ" యను హిందీ మాసపత్రికయొక్క 'సాహిత్యాంకము'లో* 'శృంగారరస' మను వ్యాసమున భోజుని 'శృంగారప్రకాశముం' గూర్చి వ్రాయుచు "బాణుని 'ముకుటతాడితకము' నందలి యితివృత్తము మహాభారతములోనిదనియుఁ, బ్రకృత మా నాటకము లుప్త" మనియు వ్రాసియున్నారు.

3

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తమ 'సంస్కృతకవి జీవితము' ౨౨ పుటలో

"శ్లో. ప్రభావతీముకుటతాడితకాద్యానిభూరిశః;
రూపకాణివిచిత్రాణి భాసేనరచితానివై.

అను శ్లోకంబున నున్న ప్రభావతి, ముకుటతాడితకము మొదలుగాఁగలవికూడ భాసనాటక చతుర్వింశతిసంఖ్యను బూర్తిచేయఁ దోడ్పడుచున్నవి" అని వ్రాసియున్నారు. కాని యీశ్లోక మెక్కడిదో, యెంతవఱకుఁ బ్రమాణమో వారు వ్రాయరైరి.

---

* "సుధ"—'సాహిత్యాంకము,' ౨ సం. ౧ భా. ౧ సంచిక., ౧౭౫ పు. (ఆగస్టు ౧౯౨౮.)

పుష్పిక పుష్పిక

తలనూనెలో రాణివంటిది

## పుష్పిక

పుష్పికవలన కలుగు మనోహరమైన సువాసనవలన మీరు నూతనవికాసమును బొంది సువాసనలతో గూడిన ఫుద్యానవనమందు విహరించుచున్నటుల తలంచగలరు.

పుష్పిక మెదడుకు చల్లదనమునిచ్చి జ్ఞాపకశక్తిని వృద్ధిపరచి, వెండ్రుకలు నెరయుటను మాన్పి, పొడు గెదుగునటుల చేయును. ఒకపర్యాయము వాడిన మీకే తెలియగలదు.




వెల సీసా 1-కి 0-12-0 అణాలు.

పోస్టేజి ప్యాకింగ్ ప్రత్యేకము.

నూతన, స్వచ్ఛమైన వనమూలికలు, పేటెంట్ యౌషధములు, అన్ని విధములైన వైద్యపరికరములు సర్వకాలములందును దొరకును. వైద్యశాలలకు, వైద్యులకు ఆసుపత్రులకు ప్రత్యేక తగ్గింపుధరల కివ్వబడును.

ఫోటో కెమిరాయున్ను దానికి వలయు సామగ్రిన్ని మావద్ద దొరకును.

**SHIVA SHANKAR & Co.,**

161/1, Harrison Road, Calcutta.

---

# 11 దినములలో పునర్జన్మము

## హిందూదేశమం దంతటను ప్రఖ్యాతి గాంచిన (పుంసత్త్వపు ఖర్జూరకాయలు)

నపుంసకత్వముచే ప్రాణహత్యకు పూనిన ,అనేకులు ఈకాయలవలన పునర్జన్మము పొంది తనివిదీర సంసార సౌఖ్యము ననుభవించుచున్నారు. చెడిన వీర్యమును శుద్ధపరచి, గట్టిపరచి సరి అయిన స్ఖలనమును కలిగించి యెండి పోయిన పచ్చిక వర్షముపడిన యేవిధముగా మొలచునో అదే విధముగ నూతనముగ వీర్యవృద్ధి, ధాతువృద్ధి, రక్తవృద్ధి కలిగించు బలవర్ధక ఔషధము. నిష్ప్రయోజనమైన అన్ని మందులున్ను వాడి, వారి కోరికలు తీరకయుండు వారలు యీకాయలను తిని మాకు యినాములు యిచ్చియున్నారు. కాయలు 22 కి 11 దినములకు రు 5.

యినాందార్ యూనాని మెడికల్ ఫార్మసి, కార్వేటినగరం (చిత్తూర్ జిల్లా.)

# చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును శగ (గనేరియా) వ్యాధికిని క్రొత్తగాకనిపెట్టబడిన దివ్యౌషధము.




## గనోకిల్లర్ (రిజిష్టర్డు)

ఈయౌషధము శ్రేష్ఠతమము. ఇంగ్లీషుమందులను దేశీయములగు నౌషధములను పుచ్చుకొనినను గుణము కలుగనియెడలను, యింజక్షనులవలనను వాక్సినులవలననుగూడ లాభము లేకపోయినయెడలను కడపటిప్రయత్నముగా మా గనోకిల్లరునుగూడ పుచ్చుకొనిచూడుడు. పెక్కుయేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శగసంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులనైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ఝూరీగా వెడలును. మూత్రముపోవుచున్నపుడును కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళము నందలి వాపు తీసిపోవును. శగవ్యాధి (గనోకోకసు) వలన మూత్రము బొట్లుగా పడుట, మేహరోగమువలన మూత్ర ద్వారమునుండిపోవు తెలుపు, యూరెత్రిటెసు, ప్రొస్టాటిటిసు, సిస్టిటిసు, లుకోరియా, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (సెమను) పోవుట, స్త్రీలు గర్భవతులుగా నున్నపుడు కలుగు మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. 50 మాత్రలుగల సీసా ఖరీదు రు. 3-0-0 వీ. పీ. చార్జీ ప్రత్యేకము. ఒక్కసారి 3 సీసాలు తెప్పించుకొనిన వీ. పీ. చార్జి మేమే భరించెదము.

అడ్రసు:—డాక్టర్ డి. యన్. జసాని, 137 కికావీధి, గులాల్‌వాడి, బొంబాయి 4.

Tel. Add. "GONOKILLER" Dr. D. N. JASANI, 137 Kika Street, Gulalvadi, Bomday, 4.

మద్రాసు సిటి ఏజెంట్లు దాదా అండు కంపెనీ, 260 చైనాబజారురోడ్డు, మదరాసు.

---

ALWAYS USE

**LEVER WRIST WATCH**

Cylinder Watches, though low-priced and highly praised, are unreliable.

**The 'DAWSON' LEVER**

Guaranteed **FIVE** Years.



The 'Dawson' is the only most perfect, low-priced Lever Wrist Watch, which will give you long, continuous and accurate service. Strong bright nickel Silver case and beautiful shape.

Every Watch Thoroughly Tested and Regulated Before Despatch.

**Price Rs. 6-4-0 Only.**

Packing and Postage FREE.

*Available only from the Sole Agents:*

THE UNION TRADING Co.,

166. Harrison Road (c/4) Calcutta.

---



పండిత డి. గోపాలాచార్యులుగారి

**జీవామృతము**

కండపుష్టికి, వీర్యవృద్ధికి, జవసత్వములకు

ఆయుర్వేదాశ్రమము,

మదరాసు.

ఈశ్లోక ప్రామాణ్యముంబట్టి భాసుఁడు కూడ 'ముకుటతాడితకమ'ను రూపకమును రచించె ననఁగూడునా? లేక 'బాణేన' యనుటకు 'భాసేన' యనునది తప్పుపాఠమా? ఈ విషయములు విమర్శింపఁ బ్రాచ్య సాహిత్య వేత్తలు దక్షులు. 'సాహిత్యదర్పణ' ప్రణేత యగు విశ్వనాథకవిరాజు 'ప్రభావతీ పరిణయమ'ను నాటికను రచించినట్టుల 'సాహిత్యదర్పణము'నందలి యాకరములవలనఁ దెలియుచున్నది.

౪

బాణుని 'ముకుటతాడితకముం'జూచియే శ్యామిలకుఁడు తన భాణమునకుఁ "బాదతాడితక"మని పేరిడియుండెనని తోఁచెడిని.

ఇక ప్రకృత మనుసరింతము. పూర్వ వ్యాసమున బాణుని గద్యపద్యరచనాప్రావీణ్యముంగూర్చి యించుక విన్నవించితిని. బాణుని కవితాసుందరీ చరణ యుగళమునకు ఛందస్సు నిగళయుగళము గాని యాభరణము కాదని కొందఱు కోవిదుల యభిప్రాయము. ఆతని గద్యపద్యములఁ దులనాత్మకముగఁ బరిశీలించినచో నాతఁడు గద్యరచనమున నందెవేసిన చేయి యని కంఠోక్తిగాఁ జెప్పఁ గూడినను, పద్యరచనమునం గూడ నాతఁడు సామాన్యుఁడుగాఁడని తన్నిర్మితశ్లోకము లుద్ఘోషించుచున్నవి. పద్యగద్యరచనములు కొంతవఱకుఁ గళలని చెప్పనగును. పద్యకావ్యరచనా విదగ్ధులు కొందఱు గద్యకావ్యరచనమనిన వెనుకంజ వేయుదురు. నిరంకుశముగ, నిర్దుష్టముగ గద్యకావ్యము రచింపఁగల సమర్థులు గొందఱు పద్యములు వ్రాయలేరు సరి, పద్యపాదమునైన నిర్మింపఁజాలరు. కొందఱు సవ్యసాచివలె గద్యపద్యములు రెండును సమానప్రజ్ఞతో రచింపఁగలరు. ఆంగ్లగ్రంథ నిర్మాతలలో నగ్రగణ్యులలో నొకఁడగు గోల్డ్‌స్మిత్ (Gold Smith) వంటివాఁడు నాలుగు ముక్కలు కలిపి మాటలాడలేకపోయెడివాఁడఁట. నాల్గుపంక్తులైనను వ్రాయఁజాలని మహావక్తలున్నారు. రచనావక్తృత్వములఁ దుల్యప్రజ్ఞగలవారు కొంద ఉన్నారు. బాణుఁడు పాక్షిక ప్రజ్ఞాసంపన్నుఁడు కాఁడు. ఇతఁడు కాదంబరిని బద్యకావ్యముగాఁ గూడ రచించి యున్నాఁడు. ఈతని గద్యకాదంబరీ రచనా పటుత్వమున కాగలేక తన్నిర్మిత 'పద్యకాదంబరి' లోపించియుండును. సంస్కృత సారస్వతమునఁ బద్యకావ్యమును గద్యకావ్యముగాఁ గాని, నాటకముగాఁగాని పరివర్తించుట, నాటకమును బద్యకావ్యముగాఁగాని, గద్యకావ్యముగాఁగాని రచించుట, గద్యకావ్యమునుబద్యకావ్యముగాఁగాని నాటకముగాఁగాని యనువదించుట యాచారముగాఁ జూపట్టెడిని. విస్తరభీతిచే విరమించితిఁగాని, యన్నిటికిలక్ష్యములం జూపఁగలను. ప్రకృతమగు 'కాదంబరీ' విషయమాలోచింతము. 'కాదంబరీ' యాంధ్రగీర్వాణజ్ఞులలో ననేకులచేఁ బద్యకావ్యముగను, నాటకముగను, గద్యకావ్యముగను క్షుణ్ణము

చేయఁబడియున్నది. తత్తత్కావ్యనామమాత్రస్మరణ మిట నప్రస్తుతము కాదని యెంచెద:

౧. సంస్కృతము:—

౧. బాణుని 'పద్యకాదంబరి'[౧]

౨. అభినందుని 'కాదంబరీకథాసారము'[౨] [౯-వ శతాబ్ది]

3. క్షేమేన్ద్రుని 'పద్యకాదంబరి'[3] [౧౧-వ శతాబ్ది]

౪. త్రివిక్రముని 'కాదంబరీసారసంగ్రహము'[౪]

౫. ఢుంఢిరాజకృతమగు 'అభినవకాదంబరి'[౫] [౧౭-వ శతాబ్ది]

౬. బాంథకరత్ర్యంబకశర్మకృత 'కాదంబరీ కథాసారము'[౬]

౭. నరసింహకవి: 'కాదంబరీనాటకము'[౭] [౧౪-వ శతాబ్ది]

౮. కృష్ణమాచార్యుని 'కాదంబరీసంగ్రహము' ఇది బాణునిభాషలోనే సంగ్రహింపఁబడినది.[౮]

౨. ఆంధ్రము:—

౯. భాస్కరుని కేతనప్రగడ: 'కాదంబరి'[౯] (పద్యకావ్యము)

౧౦. చింతలపాటి నరసింహశాస్త్రి: 'శృంగార కాదంబరి' (పద్య.)[౧౦]

౧౧. ముదిగొండ నాగలింగశాస్త్రి: 'ఆంధ్ర కాదంబరి' (గద్యము.)

౧౨. సత్యవోలు సోమసుందరకవి: 'ఆంధ్రకాదంబరి' (గద్య)[౧౧]

౧౩. సత్యవోలు కామేశ్వరకవి: 'కాదంబరి నాటకము'

౧౪. కురుగంటి సూర్యనారాయణ శాస్త్రి: 'కాదంబరి' (పద్య.)

౧౫. చేవలి సుబ్రహ్మణ్యశాస్త్రి: 'కాదంబరీ కథాసారము' (గద్య.)

౧౬. ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ: 'కాదంబరీకథాసారము' (గద్య)

---

౧. క్షేమేన్ద్రుని 'ఔచిత్యవిచారచర్చ'లో నుద్ధృతము. ['కావ్యమాల' ౧ గు. ౧౨౧ పు.]

౨. కావ్యమాల ౧౧-వ సంఖ్య నిర్ణయసాగరయన్త్రాలయము, బొంబాయి.

3. క్షేమేన్ద్రుని 'కవికంఠాభరణము'లో నుద్ధృతము.

౪. 'A Triennial Catalogue of Mss.— 1919 to 1922; Vol- IV. part i. Skt. A. Page 4293, R. No 2960.

౫. బొంబాయిలో ముద్రితము (?)

౬. 'శారద'—(సంస్కృత మాసపత్త్రిక) ౨ సం. ౪-౮ సంచికలు; ఏప్రిల్-ఆగస్టు ౧౯౧౬.—ప్రయాగ.

౭. 'Triennial Cat. Mss. Vol. III, part i, Skt. B; Page 3489; R. No. 2484.

౮. 'శ్రీ వాణీవిలాస ముద్రణాలయము'—శ్రీరంగము, ౧౯౦౬.

౯. వీరేశలింగముపంతులుగారి 'ఆంధ్రకవులచరిత్ర' ౧ భా. ద్వితీయసంస్కరణము. ౨౩౭ పు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి సంపాదిత 'ప్రబన్ధరత్నావళి', ౩౧ పు.

౧౦. వావిళ్ల ముద్రణాలయము, చెన్నపురి.

౧౧. సత్యవోలు రాధామాధవరాయ ప్రకటితము; క్రొత్తపల్లి, పిఠాపురము డివిజన్.

ఇంకను మదీయ ధారణాతీతము లగు కొన్ని పరివర్తనములు, భాషాంతరీకృతులును గలవనియే నా నమ్మిక. బాణుని 'హర్షచరితము' గూర్చి కూడఁ బ్రాసంగికముగ నొండు రెండు మాటలు మనవిచేసెద.

బాణుని 'హర్షచరితము'ను వాత్స్య రాజగోపాలచక్రవర్తి యనుకవి సంస్కృతపద్య కావ్యముగాఁ బరివర్తించెను. [శ్రీవాణీవిలాస గ్రంథావళి, శ్రీరంగము]. తిరుపతి వేంకటకవి కోవిదులు 'హర్షచరితము' నాంధ్రగద్యకావ్య ముగా రచించిరి; కాని యందు మొదటి మూఁడుచ్ఛ్వాసములుమాత్రమే కొన్ని సంవత్సరములక్రిందట, స్వర్గీయు లగు పోలవరము జమీందారువారి "సరస్వతి"లోఁ బ్రకటింపఁ బడినవి. ఈభాగమే మఱల, స్వర్గత చెలికాని లచ్చారావుగారిచే 'రామవిలాస గ్రంథమాల' లోఁ బ్రకటింపఁబడెను. వీరి గద్యకావ్యము ననుసరించియే కావలయు, గుంటూరు ఆంధ్ర క్రిస్టియన్ కాలేజిలో నాంధ్రగీర్వాణోపన్యాస కులగు శ్రీమల్లోక్కమాండూరి కృష్ణమాచార్యులుగారు 'హర్షచరితము'నందలి కొన్ని భాగములఁ బద్యరూపముగా రచించి యానడుమ 'భారతి'లోఁ బ్రచురించుచుండిరి. బహుభాషా నదీష్ణులును, గవికోవిద కుంజరులును, మద్గురువర్యులు నగు, ఉ. వే. శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులవారు 'హర్షచరితము' ను సంపూర్ణముగా నాంధ్రీకరించి ప్రకటించి యున్నారు. [శ్రీవేదవ్యాస ముద్రాక్షరశాల, విజయనగరము, ౧౯౨౯.]

రస భావ భాషా సమావేశకౌశలముచే నుత్కృష్ట మైనప్పటికి గద్యకావ్యముకంటె, ఛందోబంధవైలక్షణ్యము పద్యకావ్యమునకు విశేష చిరస్థాయితాపాదనక్షమ మని కొందఱ యభిప్రాయము. పరంపరాగతమును,విపరీతము నగు నీ పద్యకావ్య రచనావ్యామోహము సంస్కృతాంధ్రసారస్వత సరోవరమును గద్య కావ్యక్షామముచేఁ గొంతవఱకు శోషింపఁ జేసినదని చెప్పకతప్పదు. ఆంధ్రగీర్వాణ గద్య కావ్యవైరళ్యమున కింక ననేక కారణములు గలవు. గద్యకావ్య రచనము క్షుద్రమనియుఁ దన్నిర్మాత ప్రశంసార్హుఁడుకాఁడనియు, ఛందోబద్ధరచనము నేర్చి కవుల మనుకొనెడి కొందఱ యాధునికుల దురూహము. ఆధునిక కవిరాజు లలో నొకరు గద్యకావ్యరచనము తమగౌరవమునకు భంజకమనియు నందుచేదమకట్టిరచన మెంతమాత్రము నిష్టము లేదనియు,నైనప్పటికిఁ గొన్ని కారణములచే నట్టి యకార్యకరణమును కొడిగట్టవలసివచ్చెననియుఁ జెప్పికొనియున్నారు. ఔర! ఏమి విపరీతజ్ఞానము' ఛందస్సునకుఁ గవితకు నెంతవఱకు సంబంధముగలదో తెలియ నక్కఱలేదా? గణబద్ధమైనదంతయుఁ గవిత యేనా? గద్యరచన మిట్టి విపరీత జ్ఞానసంపన్నులనుకొనునంతటి సులభము కాదే! సుప్రసిద్ధాంగ్ల కవీశ్వరుఁడును, ఛందోబంధుర కవితా రచనా విదగ్ధుఁడు నగు కోలెరిడ్జి (Samuel Taylor Coleridge) కి గద్య కావ్యనిర్మాణమున నేమియుఁ బ్రావీణ్యము లేదఁట. టెయిలర్ (Rev. Hedley V. Taylor, M. A.) అను పండి

తుఁడు "Letters of Great Writers" అను గ్రంథము యొక్క పీఠికలో నీతనిం గూర్చి యిట్టులు వ్రాయుచున్నాఁడు:—

"Coleridge, consummate master of narrative in verse, could fail dismally in prose."

భోజరాజు కాలమునఁ గూడ నిట్టి ఛందో వ్యామోహము ప్రబలియున్నట్టులు తెలియుచున్నది.

ఒకసారి వేదవేత్తలు భోజుని దర్శనము కొఱకురాఁగా ద్వారపాలకుఁడు 'శ్లో. రాజ మాష నిభై ర్దంతైః కటి విన్యస్తపాణయః, ద్వారి తిష్ఠన్తి రాజేన్ద్ర! ఛాందసాః శ్లోకశత్రవః' అని రాజుతో నివేదించెనఁట. ఔర! వేద వేత్తలు శ్లోకశత్రువు లని నిరసింపఁబడిరే! పిమ్మట రాజాజ్ఞానుసారము వారు తత్సమక్షమున కేగి తాము ప్రాణములు బిగఁబట్టి, బుద్ధిని క్లేశపెట్టి యల్లిన యీశ్లోకార్థమును జదివిరఁట.

"భోజనం దేహి రాజేన్ద్ర! ఘృతసూప సమన్వితమ్" ఇందు ఛందోవైలక్షణ్యముతప్ప, కవితాగంధ మావంతయైనం గలదా? పిమ్మటఁ గాళిదాసున కారోపింపఁబడియెడి యుత్తరార్ధము నిట్టులు చదివిరఁట,

"మాహిషంచ శరచ్చంద్ర చంద్రికా ధవళం దధి".

ఆహా! ఇది యెంత చమత్కారముగా నున్నది!

వేఱొకకవి భోజు నుద్దేశించి యిట్టులు శ్లోకముం జదివెనఁట:—

"శ్లో. భోజరాజ! మహారాజ! ప్రభాత సమయేఽపి టః, త్వాం ప్రబోధయతే కుక్కు, చవైతుహి, చవైతుహి."

ఇందాతఁడు తన యజ్ఞానమునంతను బ్రకాశింపఁజేసెను. ఆహా! ఏమి భావసంపద! ఏమిశబ్దసౌష్ఠవము! కుక్కుటశబ్దము పూర్వార్ధమున నిముడకపోఁగా "టః" అని పూర్వార్ధమునం జేర్చి, "కుక్కు." అని యుత్తరార్ధ పూర్వభాగమునఁ జేర్చెను! ఇంత కొట్టుకొనినను శ్లోకము పూర్తికాలేదు; అందుచేఁ బాద పూరణమునకుఁ జేర్చు 'చ, వై, తు, హి'అను నాలుగక్షరములఁ జేర్చినను శ్లోకము పూర్తిగాదయ్యె. అందుచే నా యక్షరముల రెట్టించి శ్లోకము పూర్తిచేసెను. ఛందోవ్యామోహము గలిగి గద్యకావ్యమును నిరసించువారికొఱకై యింతవఱకు శాఖాచంక్రమణము చేయవలసెను. మహాకావ్యమును రచించినఁగాని మహాకవి కానేరఁడని కొందఱ యభిమతము. అధమపక్షము లఘుపద్యకావ్యమునైనరచించినఁగాని కవి యనఁబడఁడని వారి తలంపు. ఇందుచేతనో లేక విలక్షణేతివృత్తాభిరుచిచేతనో 'మాలతీమాధవ*' నాటకమున కాంధ్రమున గీర్వాణ

*వెలగపూడి కృష్ణకవి: "మాలతీమాధవీయ" మను శృంగారకావ్యము. చూ: వీరేశలింగము పంతులుగారి 'ఆంధ్రకవులచరిత్ర'. భా. ౩ పు. ౨౧, సం. ౧౯౧౧

మునఁ[1] బద్యకావ్యములు నిర్మింపఁబడినవి. సుబంధుని 'వాసవదత్త'కుఁగూడ నాంధ్రగీర్వాణములఁ బద్యబంధప్రతిబింబములు వెలసినవి.[2]

'కాదంబరి'కి నాంధ్రగీర్వాణముల నిన్ని ప్రతిబింబములు పుట్టుటకు నందలి యద్భుత కథాసంవిధానము, లలితపదగుంఫము, పరిస్ఫుటమగు రసము మొదలగు గుణములే కారణము లని తోఁచెడి. నరసింహకవి 'కాదంబరీ నాటక[3]ము'లోని సూత్రధారుఁ డిట్టులు పలికి యున్నాఁడు.

"శ్లో. రసికః కవి రద్భుతా కథా
పదగుంఫో లలితః స్ఫుటో రసః,
పరిష ద్గుణదర్శినీ వయం
నిపుణా స్తత్కి మితో౽పి నః ప్రియమ్."

క్షేమేన్ద్రకవీన్ద్రుఁడు తన "ఔచిత్యవిచారచర్చ" ['కావ్యమాల, ౧ గుచ్ఛకము. ౧౬౧ పు.] లో బాణుని 'పద్యకాదంబరి'నుండి యొకశ్లోకము నుదాహరించియున్నాఁడు. క్షేమేన్ద్రుని కాలమునకే [౧౧ శతాబ్ది] బాణుని 'పద్యకాదంబరి' కాలగర్భమున నంతరించియుండును. ఆ కారణముచేఁ గావలయు క్షేమేన్ద్రుఁడు 'కాదంబరి'ని బద్యకావ్యముగా నిర్మించియున్నాఁడు.

ప్రకృతావసరము లగు భాగము "ఔచిత్యవిచారచర్చ"నుండి యుదాహరించెద:—

గుణౌచిత్యం దర్శయితు మాహ :—

'శ్లో. ప్రస్తుతార్థో చితః కావ్యే
భవ్యః సౌభాగ్యవా న్గుణః,
స్యన్ద స్తీ ర్దురివానన్దం
సంభోగావసరోదితః.'                    ౧౪

*          *          *

యథావా భట్టబాణస్య :—

"శ్లో. హారో జలార్ద్రవసనం నలినీదలాని
ప్రాలేయశీకరముచ స్తుహినాంశుభాసః,
యస్యేన్ధనాని సరసానిచ చన్దనాని
నిర్వాణ మేష్యతి కథం సమనోభవాగ్నిః.'

అత్ర విప్రలంభ భరభగ్న ధైర్యాయాః కాదంబర్యావిరహవ్యథావర్ణనా మాధుర్యసౌకుమార్యాది గుణయోగేన పూర్ణేన్దువదనేవ ప్రియంవదత్వేనహృదయానన్దదాయినీందయితతమతామాతనోతి."

కావ్యమాలా సంపాదకు లథోజ్ఞాపికలో "ఏతత్కృతా త్వియం శ్లోకబద్ధా కాదంబరీ కథానాద్యాప్యుపలబ్ధా" అని వ్రాసియున్నారు.

---

౧. పూర్ణసరస్వతి నిర్మిత "ఋజులఘ్వీ." ఇందలి వస్తువు "మాలతీమాధవీయ" కథ ['Tr. Cat. Mss.' Vol. IV., part i, Skt A.]

౨. పక్కలంక వీరభద్రకవి: "వాసవదత్తాపరిణయము"—చూ. 'ఆంధ్రకవులచరిత్ర' 3 భాగ., 3౯ పుట. రొద్దము హనుమంతరావుగారి యాంధ్ర 'వాసవదత్త', వైజయన్తీ ముద్రణాలయము, చెన్నపురి.—౧౯౫౯. కీ. శే. వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రిగారి 'అభినవ వాసవదత్తా' పరనామ 'కార్యవాసవదత్త.' చూ. 'భారతి' నవంబర్ ౧౯౨౯; ౭౮౫. పు.

3. 'Tr. Cat. Mss.' Vol., III., part i, Skt. B. Page 3489; R. No. 2484,

బాణుని "పద్యకాదంబరి" యొక్క లుప్తశేష మీశ్లోక మొకటియే. కాని పీటర్సన్ పండితుండు Dr. Peter Peterson, M. A., D. Sc., స్వప్రకటిత మగు వల్లభదేవుని "సుభాషితావళి" యను గ్రంథముయొక్క పీఠికలో నిట్టులు వ్రాసియున్నాఁడు:—

"In his 'Auchityavicharacharcha' Kshemendra quotes under Bana, the vers- "హారో........." No. 1087 above, and tells us further that it is a part of a description of the state to which Kadambari was reduced by the absence of Chandrapida. It would seem from this that Bana wrote the story of 'Kadambari' in verse as well as in prose. The following verses quoted under Bana by Kshmendra in his 'Kavikanthabharana' are perhaps to be referred to this lost book."

సుప్రసిద్ధ పండితు లగు పీటర్సన్ మహాశయు లిట్టులు వ్రాయుట విచార్యము. ఏలన క్షేమేన్ద్రుఁడు పూర్వోల్లిఖిత మగు నొక్క శ్లోకమునే బాణునిదని యుదాహరించియున్నాఁడు. పీటర్సన్ పండితులు బాణుని 'పద్యకాదంబరి'లోనివేమో యని భ్రమపడి సూచించిన యెనిమిదిశ్లోకములును క్షేమేన్ద్రుని 'పద్యకాదంబరి'లోనివి. పీటర్సన్ పండితు లట్టులు భ్రమపడుట కవకాశము కానరాదు. ఏలనఁ బ్రకృతము లుప్తప్రాయ మగు క్షేమేన్ద్రుని 'పద్యకాదంబరి'నుండి యాతఁడే తన 'కవికంఠాభరణము'లో నెనిమిది శ్లోకము లుదాహరించుకొని ప్రతిశ్లోకముముందును "యథా మమ పద్యకాదంబర్యాం" అని చెప్పియున్నాఁడు. కావున స్పష్టముగాఁ దన 'పద్యకాదంబరి'లోనివని క్షేమేన్ద్రుఁడు వ్రాసికొని యున్న శ్లోకముల స్థూలదృష్టిచే నైనను భట్టబాణున కారోపించుట విచార్యము. బాణుని 'పద్యకాదంబరి' యలభ్యయోగముగా విబుధలోకమున కెన్నటికైన లభించునా!

సమయమునకు స్ఫురింపనివియు, నీవ్యాసమున నప్రస్తుతములు గానివియు నగు నొండు రెండు విషయములు మనవిచేసికొని విరమించెదఁ గాక!

గద్యరచనమునకు విషయ ముండితీరవలెననియుఁ, జెప్పవలసిన దేమియు లేనప్పటికి ఛందోబద్ధరచనమున కవకాశము గలదనియు, శార్మణ్యదేశకవిసార్వభౌముఁడు 'గథీ' [Goethe] నుడివియున్నాఁడు.

"To write prose, one must have something to say, but he who has nothing to say can still make verses."—Goethe.

గంగాదేవి తన 'మధురావిజయము'లోఁ జేసిన భట్టబాణకవితాస్తుతి నుదాహరించి యింతటితో ముగించెదను:—

"శ్లో. వాణీపాణిపరామృష్ట
వీణానిక్వాణహారిణీమ్;
భావయన్తి కథం వాన్యే
భట్టబాణస్య భారతీమ్."

# తద్భావభావన

విద్వాన్ డి. రామమూర్తి శాస్త్రి గారు

సదమలాకాశ నీలంపుసరణులందు
వికచ నీలోత్పలావళి విభలయందు
నిర్మలోదధివీచికా నిచయమందు
నభినవోదిత జలధరప్రభలయందుఁ
దరుణతాపింఛతతి విభాతతులయందు
ఘన వనశ్యామ పర్వత కాంతులందు
నింద్రనీలోపలప్రభాబృందమందు
నీదు మేన్కాంతియే తోఁచు నీరజాక్ష!

* * * *

కోమలామల తారకాగుచ్ఛములను
దార హారేందు చంద్రికాహారములను
గుంద గంధ సితాంభోజబృందములను
దార శీతాగ విమలకర్పూరములను
నచ్ఛ ముకుర ధుకూల నీహారములను
గాంగ నీరాబ్ధిఫేనప్రకాండములను
క్షీరవారాశి భూరివాఃపూరములను
దేటపడు నీదు కలరూపు, దేవదేవ!

* * * *

భూసంఘు శరణ్యంబు భూతధాత్రి
సకల జలగమ్య మర్యాద సారజలధి
నఖిలజన సుఖదుఁ డగు స్వాహాప్రియుండు,
నఖిలభూత జీవన హేతు వగు ననిలుఁడు
శబ్దగుణభాస్వ దాకాశ సారసరణి
రమ్యవనరాజి భయద మారణ్యవితతి
శైలతతి రేయిఁ బవళులుఁ జంద్రుఁడు రవిఁ
దెల్పుఁ ద్వత్సృష్టిమహిమల దేవదేవ!

* * * *

కలివశోద్భూత నిస్సారకార్యగతులు
కల్లఁ బొకలు మనుజుల కపటగతులు
నర్థ సాధననిరతుల స్వార్థపరత
పంది, నంది మార్చెడి న్యాయవాదివృత్తి
న్యాయగృహముల సంవిధానములు, వేశ్య
వాటికలు నేటిపురుషులు వనితలు మఱి
నేటివిద్యలు వేషము లీనిటుగోట్లుఁ
దేటపఱచును దేవ! నీ దివ్యమాయ.

అదనున జీమూతుఁ డుదయించి జీవన
దానంబుసేయుట తప్పకుంట
తఱిఁ దప్పకయ వృక్షతతి పుష్పఫలముల
దరి తీపుసేయుటఁ దప్పకుంట
సమయంబుఁ దప్పక సస్యములు ఫలించి
ధర గౌరవించుటఁ దప్పకుంట
శశియు సూర్యుఁడుఁ బూని నిశలఁ బగళ్లను
నొప్పుగఁ జేయుటఁ దప్పకుంట
తనదు మర్యాద నీరధి తప్పకుంట
దమతమగతిని గ్రహములు తప్పకుంట
పరఁగ దెల్పును నీ పరిపాలనావి
ధానమును దేవ, దేవేశ, దారితారి!



# వసంతఋతువు

సాహిత్య విద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు

ఆద్యంతములు లేని జగత్సృష్టిలోఁ గాలమునకుఁ గూడ దానిరీతినే యాద్యంతములు లేవు. ఆద్యంతములు లేని యాకాలమును మన వ్యవహారమున కనుకూలముగ మనము విభజించి సూర్యుఁడు కనుపించు సమయము పగలనియు, నతఁడు కనుపింపక చంద్రుఁడును, నక్షత్రములు కనుపించుసమయము రాత్రియనియు, సూర్యుఁ డుత్తరమునకుఁ బ్రయాణముచేయు సమయ ముత్తరాయణ మనియు, దక్షిణమునకుఁ బ్రయాణముసేయు సమయము దక్షిణాయనమనియు వ్యవహారములను గల్పించుకొని యున్నాము. ఇట్లే ఆయాకాలములందు జరుగు భౌతికపరిణామములం బట్టి వత్సరమున కాఱు ఋతువులనియు, వసంతమునఁ జెట్లు చిగిర్చి పుష్పములతో విలసిల్లి విహగ సంతానముల కలకలారావంబుల మనోహరముగ నుండునని యును, గ్రీష్మమున నెండలు మెండనియు, వర్షర్తువున వర్షము కురియుననియు, శరత్తున నేల యాకుచు వెన్నెలలు మనోహరముగ నుండుననియు, హేమంతమునఁ జలి విస్తారముగ నుండుననియు, శిశిరమునఁ బ్రకృతి చల్లనై యుండుననియును నియమములు మానుషకల్పితములు కలవు. కాఁగా నొక్కొకఋతుకాల మాఋతుధర్మములను సువ్యక్తముగ విశదీకరించునదిగ మన కుపయోగించుచున్నది.

మీఁది నియమముంబట్టి యాలోచించినచోఁ జైత్రవైశాఖ మాసములు వసంతర్తుమాసములని మన మనుకొనుచున్నాము. కాని ఫాల్గుణమాసారంభముననే జగమునం దెల్లెడల వసంతోదయమగుచున్నది. చైత్రమాసాంతిమదినములే సహింపఁజాలని మండుటెండల జనముల బాధించి నిదాఘధర్మముల కాలవాలములగుచున్నవి. ఆషాఢమాస మింకను తలసూపక మున్నె, జ్యేష్ఠబహుళం బాదియే, యాకసము మేఘావృతమై చాతకములకుఁ దృప్తి తీర, అవనితాప మడంగ, అమృత మయోదకముల వర్షించుచున్నది. ఇయ్యది సకలజనానుభవమగు విషయమే కాని వేఱొండు కాఁజాలదు.

కాళిదాసమహాకవి రచించిన దనఁబడు ఋతుసంహారకావ్యమునఁ గర్త ఋతుధర్మములను వర్ణించుచుఁ దొలుదొల్త గ్రీష్మర్తువునే ప్రారంభించి వసంతమును జివరఁ జేర్చినాఁడు. మన వాడుకకు విరుద్ధముగ నట్లు చేయుట కే దేని ముఖ్యమగు కారణ ముండితీరవలయును. ఫాల్గునమాసముతోడనే వసంతఋతువు ప్రారంభమగునని యతని యాశయమై యుండవచ్చును. కానఁ జైత్రముతోఁ బ్రారంభించినచో ఋతువుల విషయమునే ముఖ్యముగఁ జెప్పుకవికి వసంతమునందలి సగము భాగమే ప్రస్తుతమగును. కావున నతఁ డా ఋతువును వెనుకఁ బెట్టితొలుదొల్త గ్రీష్మమునే వర్ణించెను; చివర

వసంతముం జేర్చెను. ఆ ఋతుసంహార వ్యాఖ్యాతలుకూడ ఋతువు లన్నిటిలో గ్రీష్మమునే ముందుగ నేల వర్ణింపవలెనని శంకించి సమాధానముగ నా గ్రీష్మమే మొదటిదని "తత్రాదౌ ప్రాథమ్యాత్ గ్రీష్మమేవ వర్ణయతి" అని చెప్పినారు. కావున ఋతుసంహారమును బట్టియుఁ, దద్వ్యాఖ్యానముం బట్టియు వసంతము ఫాల్గునముతోడనే యారంభింపఁబడుట నంగీకరించినట్లు తెలుచున్నది.

మఱియు సర్ శ్రీ రాజా రాధాకాంత దేవ బహదూరువారు రచించిన శబ్దకల్పద్రుమ మను మహానిఘంటువునందుఁ జైత్ర మాసమును, ఫాల్గుణమాసమును గలిసి వసంత ఋతువని కొందఱి సిద్ధాంతమని, "వసన్తః— ఫాల్గుణచైత్రాత్మక ఇతి కేచిత్" అని లిఖింపఁబడి యున్నది.

ఫాల్గున చైత్రమాసములే ప్రస్తుతము సర్వజనానుభవముంబట్టి వసంతఋతు వగుట యుక్తమని శ్రీ లోకమాన్య బాలగంగాధర తిలక్ మహారాజావారు ప్రతిపాదించి యున్నారు. శ్రీ తిలక్ మహారాజావారు రచించిన "మృగశీర్షా" (Orion) అను గ్రంథరాజమున నా విషయమును బొందుపఱచి యున్నారు. వా రందు కంఠతః ఫాల్గున చైత్రములు వసంతఋతువని చెప్పకున్నను వారి సిద్ధాంత మా విషయమునే సువ్యక్తముగ బోధింపఁ గలుగు ననుటకు సందియము లేదు. ఆ విషయమును శ్రీ మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారు కొంత తమ *వేదకాలనిర్ణయమునందుఁ బొందుపఱచి యున్నారు. ఆ విషయమును కొంత క్రింద నెత్తి వ్రాయుదును. అది వేదకాలనిర్ణయమును సంబంధించిన దగుట నా విషయమున విషువత్ విషయము గొంత మదుల్లిఖితభాగమున నుండును.

"ఈ భూగోళ మొక యిరుసుమీద దినమున కొకచుట్టు చొప్పున తిరుగుచుండును. ఈ యిరుసునకు నూటిగ బ్రహ్మాండగోళమందు గాన్పించు నక్షత్రమునకు ధ్రువనక్షత్రమని పేరు. ఈ నక్షత్రమునకు నూటిగ ఖగోళము మధ్యనుండి పోయి దానిని రెండుభాగములుగ జేయు వలయమునకే ఖగోళమధ్యరేఖ యని పేరు. మరియు సూర్యుఁడు సంవత్సరమున కొకసారి ఖగోళమునందొకానొక వలయముమీదుగ పోవును. దీనికి రాశిచక్రమని పేరు. దీనియందు అశ్విన్యాది ౨౭ నక్షత్రములున్నవి. ఇవి సూర్యుని వార్షికమార్గములోని మైలురాళ్లు. ఇప్పుడు చెప్పిన యీ ఖగోళమధ్యరేఖయు, రాశిచక్రమును రెండుతావులలో కలియును. ఈ తావులకే "విషువను" లని పేరు. ఒకటి వసంతవిషువత్, రెండవది శరద్విషువత్. సూర్యుడు వసంతవిషువత్ లోనికి వచ్చినప్పుడు వసంతర్తువు ఆరంభ మగును. రాత్రింబగళ్లు సరిసమానముగ నుండును. ఈ వసంతవిషువత్ చాల ముఖ్యమైనది. * * *

"కొన్ని కారణములచేత విషువత్ స్థానమునకు బహుసూక్ష్మమైన చలనము కలదు. విషువత్ బిందువు (Point) సూర్యుని కభిముఖముగ షుమారు ౨౬ వేల సం.ల కొకచుట్టు (360 డిగ్రీలు) చొ. తిరుగును, అనగా ౭౨ సం.ల కొక డిగ్రీ చొ. రాశిచక్రము వెంట వెనుకకు తిరుగును. ఈ లెక్కప్రకారము ఋతువులు షుమారు ౨ వేల సం.ల కొకనెల చొ. వెనుకబడుచుండును. ఈ ప్రకారము పంచాంగముల నప్పటప్పటికి

* భారతి, సంపు. ౨, సంచి. ౧౨, పే. ౯౬౭-౯౭౭ చూడుడు.—ఋ. వేం. ర.

సంస్కరించుచుండవలెను. ప్రస్తుతము మన పంచాంగములు విషువత్ రేవత్యంతమునం దున్నదను నూహతో వ్రాయబడుచున్నవి. కాని, యీ స్థితి యిప్పటిది కాదు. క్రీస్తుశకావంతరము షుమారు ౪౮౦ సం.ల నాఁడు వరాహమిహిరుని కాలములో విషువత్ రేవత్యంతమునం దుండెను. ఆ కారణము చేతనే వరాహమిహిరుఁడు నక్షత్రమాలను అశ్వినితో ప్రారంభించి నూతన సంవత్సరాదిని వసంతవిషువత్సద్ధ చైత్ర శు. ౧ నాఁడు ప్రారంభించెను. కాని యీస్థితి యిప్పుడు మారిపోయినది. విషువత్ ఇప్పుడు రేవతినికూడ గడిచి షుమారు ౨౦ డిగ్రీలు వెనుకకు నడచినది. అనగ వసంతర్తువు మన కిపుడు ౨౦ రోజులు వెనుకబడినదని చెప్పవచ్చును. అందుచేతనే మనకు ఫాల్గునమాసారంభముననే ప్రకృతియందు వసంతోదయ మగుచున్నది. కాని పంచాంగములు మాత్రము తదనుగుణముగ మార్పు చెందలేదు. కావున సిద్ధాంతులెల్లరును ఈ విషయమును గుర్తించి ౧,౫౦౦ సం.ల నాఁడు వరాహమిహిరుఁడు ఏర్పరచినదానినే పట్టుకొని వ్రేలాడక, విషువత్ బిందువుయొక్క చలనమును, అది ప్రస్తుత మిపుడున్న స్థానమును గుర్తించి తదనుగుణముగ వసంతోదయ కాలమును, నూతన సంవత్సరాదిని మార్పు చేయుదురు గాక !"

ఈయుపరి నిరూపితాంశము నావాదమునకుఁ బరిపూర్ణమగు ప్రామాణ్యము నీయఁగలదని నాదృఢవిశ్వాసము.

ఇఁకఁ గాలమునుగూర్చి పాఠకులకుఁ గల్గు సందేహముల నాశంకించి నా యుత్తరమును నిరూపింతును. వరాహమిహిరుఁడు క్రీ. శ. ౬వ శతాబ్దపువాఁడు. కాళిదాసుకూడ నాశతాబ్దపువాఁడేయని సిద్ధాంతము. "ధన్వంతరి క్షపణకామర......కాళిదాసాః, ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం, రత్నాని......" అను శ్లోకభాగముకూడఁ జ్ఞేయంశమునే నిరూపించును. వరాహమిహిరుఁడు చైత్రమాసముతోడనే వసంతఋతు వారంభమగునని చెప్పినాఁడు. ఇట్టియెడఁ దత్సమకాలికుఁ డగు కాళిదాసమహాకవి రచియించిన ఋతుసంహారమున గ్రీష్మర్తువే మొదట వర్ణింపఁబడి చివర వసంతము వర్ణింపఁబడుటచే సామంజస్యము దుర్లభ మను శంక కలుగవచ్చును. కాని వరాహమిహిరుని సమకాలికుఁ డగు కాళిదాసు వేఱు; ఋతుసంహారకర్త వేఱు. మహాకవియగు కాళిదాసు రచించిన శాకుంతలాది నాటకములను, రఘువంశాది మహాకావ్యములను గమనించినచో నాకవిత్వపు రీతికిని, ఋతుసంహారకవన శక్తికిని జాల వ్యత్యాసము కలదనుట నిర్వివాదాంశము. మఱియుఁ గాళిదాసకృతమని వాడఁబడుచున్న శ్రుతబోధమును ఛందస్సును, ఈ ఋతుసంహారమును ననేకవిషయముల నొకేమాదిరిగనున్నవి. కాన నీగ్రంథములను రచియించినకవి ప్రసిద్ధుఁడగు కాళిదాసమహాకవికంటె భిన్నుఁడని చెప్పవచ్చును.

కవులు కొందఱు గ్రంథముల రచించి వానికిఁ బ్రశస్తియును, వ్యాప్తియును గలుగవలెనను నాశయమున సుప్రసిద్ధులగు మహాకవులపైఁ దత్కృతికర్తృత్వ భారము నిల్పవచ్చును. అట్లే కవి యొకండు స్వగ్రంథవ్యాప్తికై పాటుపడి కాళిదాసుని నామముననే తన ఋతుసంహారమును బ్రకటించి యుండవచ్చును. ఒక నిదర్శనముం గనుఁడు: మీ రెపుడైనఁ గాళిదాసకృత ప్రహసనముం గాంచితిరా? తొలుతనుండి

యుఁ జవరవఱకు నం దసభ్యములే తప్ప వేఱే
మైన నున్నవా? సహృదయులు పఠింపవలసిన
గ్రంథమా యది? అట్టి గ్రంథమును మహాకవి
యగు కాళిదాసు రచించె నని చెప్పుట సాహ
సము కాక మఱి యేమగును? కవన ఫక్కి
యం దెంతటి వ్యత్యాసము కలదో బాగుగఁ
బరిశీలించి చూడుఁడు. గ్రంథకర్త కాళి
దాసే యని భ్రమపడి సహృదయు లా
గ్రంథమును జదువ దొరకొనుచున్నారు కదా!
గ్రంథమునకుఁ బ్రచారముఁ గలుగఁజేయుట
కుఁ గవి కల్పించిన యుక్తియే యది. అట్లే
ఋతుసంహారమున నసభ్యము లెంతమాత్ర
మును లేకున్నను గుంభన మంతటి సొగసుగ
లేమి నది కాళిదాసకృతికాదని చెప్పవచ్చును.

ఒకపు డది కాళిదాసకృతమే యయి
నను, కాళిదాసకవులు ఇర్వురు, మువ్వురు కల
రను వాద ముండుటచేతను, ధారానగర పరి
పాలకుఁ డగు భోజమహారాజు నాస్థానమున
నొక కాళిదాసమహాకవి కలఁడని ప్రసిద్ధి మన
భరతదేశమం దెల్లెడలఁ బ్రబలియుండుటచేత
ను, ఆ కవియే ఋతుసంహారము రచియించె
నని చెప్పుట కాక్షేపణ యుండదు. భోజుని
కాలపు కాళిదాసు ౧౨-వ శతాబ్దపువాఁ
డగుటచే నతనికాలమునకు వసంతవిషువ
త్స్థానము ఇంచుమించు నగమువఱకును వెను
కఁబడును. కాన ఫాల్గుణమాసమునఁ గొంత
భాగముతో వసంతఋతువునకు సంబంధ ముం
డుటచేఁ గవి యా ఋతువును వెనుకఁబెట్టి
యుండును. కాన ఋతుసంహారమునందలి
మార్పు జ్యోతిషసిద్ధాంతమున కెంతమాత్రము
భంజకము కాలేదు.

ఇఁకఁ బ్రసిద్ధిచెందిన కాళిదాసమహాకవి
రచియించిన మేఘసందేశకావ్యమునఁ గల

"తస్మిన్నద్రౌ కతిచి దబలా
విప్రయుక్త స్స కామీ
నీత్వా మాసాన్ కనకవలయ
భ్రంశరిక్త ప్రకోష్ఠః,
ఆషాఢస్య ప్రథమదివసే
మేఘ మాశ్లిష్టసానుం
వప్రక్రీడా పరిణతగజ
ప్రేక్షణీయం దదర్శ."

[మేఘసందేశము, ౧ సర్గ, ౨ శ్లోకము.]

అనుశ్లోకముం బట్టి యాషాఢమాసము నందలి
మొదటిదినముననే మేఘోదయ మగుటచే నది
వర్షాకాలారంభమనియు, దానింబట్టి చూచి
నచో ఫాల్గుణచైత్రములు వసంతఋతువనియు,
వైశాఖ జ్యేష్ఠములు గ్రీష్మఋతు వనియుఁ
దోఁచుటచే వరాహమిహిరుని కాలమునాఁడు
కూడ నిదేరీతి నుండుటచే నతని సిద్ధాంత మప
సిద్ధాంతము కావలసివచ్చునను సందేహము
కలుగవచ్చును. కాని యాకాలమున శ్రావణ
భాద్రపదములే వర్షర్తువనుటకు సందేహము
లేదు. వర్షాకాలము కానినాఁడు మేఘము కను
పించినంతమాత్రమున నది వర్షర్తువు కాఁగలు
గునా! హేమంత, శిశిరాదిఋతువులందును,
గొండొకపుడు వసంత, గ్రీష్మములందును వర్ష
ము పడుచుండును. అంత మాత్రమున నాసమ

యము వర్షాకాలము కాఁగలదా! ప్రస్తుత సమన్వయ మెట్లన: విరహులకు వర్షాకాల ముద్దీపక మగుటచేత, శ్రావణము వర్షాకాల మగుటచేత, ఆ కాలమునఁ బ్రియావిరహము కడుం గడు దుర్భర మగుటచేత,తనసతికిఁ దన ప్రవృత్తిని దెల్పి ధైర్యము నవలంబింపవలెనని కబురు పంపి హెచ్చరింపఁదలఁచి యక్షుఁడా మేఘునిం గని [ఆషాఢమునకు శ్రావణము సమీపమగుటచే] తన సందేశమును బ్రియసతి కెఱిఁగింప వేఁడెను. చూడుఁడు:

"ప్రత్యాసన్నే నభసి దయితాజీవితాలంబనార్థీ
జీమూతేన స్వకుశలమయీం హారయిష్యన్
ప్రవృత్తిమ్."

అని కదా మేఘదూతమునఁ గలదు. కొంచెము వ్యవధి యుండఁగనే సందేశ మంపవలెఁ గాన దూరస్థ యగుసతి కాషాఢముననే యక్షుఁడు సందేశ మంపెను. కాన నంతమాత్రమున నది వర్షాకాలమని భ్రమింప నెంత మాత్రమును వలనుపడదు.

పాశ్చాత్యవాఙ్మయము (English Literature చాల నవీనమైనది కదా! వసంతఋతు వేమాసముల యందు కలదో వారి నిఘంటువుల (Dictionary) నుండి యొకింత యుల్లేఖింతము:

1. Spring—The time when plants begin to spring up and grow, the vernal season, March, April, May. * * *

[Chamber's English Dictionary.]

2. Spring—[A Teutonic word] In Astronomy one of the four seasons of the year. For the Northern hemisphere, the spring season begins when the sun enters Aries, the first of the Northern signs, or about the March 21, and ends at the time of the summer solstice.

[A Dictionary of Science, Literature Art.]

3. Spring—* * * * The months of March, April and May.

[The Library Dictionary of the English Language.]

ఈ పై ప్రమాణములం బట్టి మార్చి, ఏప్రెలు, మే నెలలు వసంతమని పాశ్చాత్యు లంగీకరించినట్లు తెలియుచున్నది. మనవలెఁ గాక వారివత్సరమునకు నాల్గే ఋతువు లయినట్లు మన వ్యవహారముననే గాక ఉపరినిరూపిత (2వ) నిఘంటువచనముం బట్టియుఁ దెలియుచున్నది, మార్చినెల యెల్లపుడు నించుమించుగ ఫాల్గునమాసముతోనే యారంభమగుచున్నట్లు మన మందఱము నెఱుంగుదుము.

సూక్ష్మములగు నీకారణములం బట్టియుఁ దిలకుమహారాజు మొదలగు మహా విద్వాంసులు దారిఁ దీయుటంబట్టియు, వసంతఋతువు ఫాల్గునముతోడనే ప్రారంభమగునని, మనకుఁ గల యనుభవముతోడుపడ—నే నీవ్యాసము వ్రాయ దొరకొంటిని. ఇయ్యది జ్యోతిశ్శాస్త్ర విరుద్ధమని యెవ్వరైన ననుకొనిన ననుకొనవచ్చును. కాని న్యాయ్యముగ విమర్శించినచో ఫాల్గునము నిక్కాలమున వసంతములోనికిఁ దీసికొని పోక యుండుటయే జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతవిరుద్ధమని మన మెఱుఁగకపోము. మనము ప్రాంతపంచాంగములను గ్రొత్తసంవత్సర

మున నుపయోగింపనట్లు శ్రౌతమార్గము లో
కానుభవవిరుద్ధముగ నున్నపుడు కాలానుగుణ
ముగ మార్చుకొనుటయే యుక్తము.

ఋతునామ ముచ్చరించు మాత్రమున
మన కా ఋతువునందలి ధర్మములు తప్పక
దృగ్గోచరము లగుచుండును. అదియే ఋతు
నామములకుఁ గల ఫలము. అట్టిచో ఋతు
కాలనియమము తద్ధర్మములను వ్యక్తీకరింప
నపు డానియమముతో మన కేమి ప్రయోజన
ము? అట్టి యపుడు ఋతుకాలమును మార్చు
కొని అనుగుణముగ వ్యవహరించిన నేమి దోష
మున్నది?

---

# ప్రణయస్మరణ

కె. అన్నమరాజ శర్మగారు

సంధ్య చిగిరించె నపరంజిచాయలందు
సారసాప్తుండు మునుఁగ నాశాముఖంబు
కడలుకొన్నట్టి సంగరాంగణమువోలె
చూడఁ దలపించె మంజులశోణరుచుల.

శ్యామలాంబుదమాలికాచ్ఛాదమైన
సంజ, గాలికి పైయెద జాఱుచుండ
పొలఁతి యొకతె యింద్రావతీ పులినతలినిఁ
జేరఁ జనుచుండె నెమ్మోము చెమ్మగిల్ల.

ఎదురుగా నొక్క యువకుండు విదితశోక
ముఖముతో కాలమా నన్ను మోసగించి
బాల్య సఖిని దాఁచి వియోగభరముపాలు
జేసితే యని నడతెంచెఁ జింతతోడ.

సహజసౌందర్యవతియైన సతినిఁ గాంచి
వెదకఁబోయిన తీగయే యెదురువడిన
చిత్తసంరంభవృత్తిఁ జేరఁబోయి
బాల! గుఱుతించితే నన్ను బాల్యసఖుని?

కడచిపోయిన శైశవకాలగతులు
ముద్రితంబైన పాదాంకములవిధాన
హృదయలేఖిని చిత్రించి యెదుటబెట్ట
ప్రతినిమేషంబు కన్నీరు వరదలగును!

శీతభానుండు నగుచుండె చెట్లనుండి
యలయికలు లేక లీలా విహారవనుల
ప్రేమవాల్లభ్యమున విహరించినట్టి
స్మరణ రమణీయ బాల్యమున్ మఱచినావె?

# ప్రేమ భిక్ష

తిమ్మరాజు సత్యనారాయణ రావుగారు (శ్రీసోదర సమితి)

ఆమె ఆనందముతో స్వేచ్ఛాగానము చేస్తూ కొండమీద ఒక చక్కని రాతిఫలకపై కూర్చుంది. ఆమె చుట్టూ తేజస్సు నాట్యం చేస్తూంది. ఆనందతరంగాలు ఆమెనుండి తేలి వచ్చి చుట్టూ వెదజల్లబడుతున్నాయి. ఆమె కనులలోనుండి మధురమైన శాంతి ప్రవాహం ప్రవహిస్తూంది. హాహా! ఏమి దివ్యమూర్తి?

కష్టపడి కొండంతా ఎక్కాను. ఆమెకు కొంత దూరాన్న క్రింద నిలబడి సగర్వంగా చూస్తూ చేయిచాచి

"ఓమధురమూర్తీ! ఆనందమయీ!

నేను కవి కుమారుణ్ణి. నా మధురగీతాలతో ప్రపంచమంతా నింపివేస్తాను. విశ్వమంతా నాగీతాలు విని పులకించి ఆనందిస్తుంది. ఏశాస్త్రజ్ఞుడికీ వీలుకాని విశ్వరహస్యాలలోకి చొచ్చుకొనిపోయి వాటిని ప్రపంచానికి విస్పష్టంగా చాటగలను నేను..............."

"అయితే ఏమంటావు?" అంది కొంచెం నిర్లక్ష్యంతో.

"నాకు ప్రేమభిక్ష కావాలి."

"అల్లాగా" అన్నట్లుగా కనుబొమలు పైకెత్తి తిరస్కారపూర్వకంగా చిరునవ్వునవ్వింది.

ఏమిటిది? నేనువచ్చి అడగడమూ ఈమె ఏమిటో తిరస్కారంగా తిసిస్కార వేయడమునా? ఇంత అహంకారమా? కనుబొమలు ముడివేసి కొంచెం చిన్నదనంతో ఆమెవైపు చూశాను. ఆమె తిరిగి కొంచెం గట్టిగా నవ్వింది.

"ఏమన్నావు? కవికుమారుడవా? పాటలు పాడుతావా? ఏం పాటలు? ఎందుకు? ఎవరికోసం?"

"నాకోసం—ప్రపంచంకోసం."

"ప్రపంచానికీ నీ పాటలకీ సంబంధము ఏమిటి? ఎల్లా పనికొస్తాయి నీ పాటలు ప్రపంచానికి?"

"ప్రపంచం అవి విని ఆనందిస్తుంది. ప్రపంచంతోపాటు నేనూ ఆనందిస్తాను."

"నీఆనందం సంగతి నా కక్కరలేదు. నీ పాటలు నీకోసమే అయితే వాటికీ నాకూ సంబంధము ఏమిటి?"

"నాకోసమేకాదు? ప్రపంచం కోసమని చెబుతున్నానుగా?"

"ప్రపంచంకోసమా" తిరిగి ఆ తిరస్కారపు నవ్వు.

"ప్రపంచాన్ని సరిగ్గా చూసి పాడుతున్నావు నువ్వు? నీకు ప్రపంచం అంటే ఏమిటో తెలుసునా?"

ఏమిటీ? చిన్నపిల్లలని అడిగినట్టు—
"ప్రపంచం అంటే ఏమిటి?—"

"ఫలపుష్పతరుభరితమైన సుందర వసుంధర—

ప్రేమ గాన తత్పరమైన విశాల నీలసాగరము—

సౌందర్యాకరములైన పర్వతాలు—

విశాలాకాశము, చక్కనిమబ్బులు, చల్లనివెన్నెలలు, మధుర సువాసనలు—"

"చాలు—ఇదా నీప్రపంచం? నీ ప్రపంచానికి జీవకోటితో ఏమీ సంబంధములేదు కాబోలు?"

"లేకపోవడమేమి? నన్ను పూర్తిగా చెప్పనియ్యక—"

"నీకూ మానవకోటికీ సంబంధము ఏమిటో చెప్పు?"

"నేను మానవస్వభావాన్ని శ్రద్ధతో పరిశీలించాను. ప్రేమనుగురించి, ప్రణయాన్ని గురించి, విషాదాన్నిగురించి చక్కని పాటలు పాడాను."

"మహాగొప్ప పనిచేశావు."

"నీపాటలు మానవకోటికి ఎందుకు?"

"ఆనందింపడానికి"

"అల్లాగా! అయితే అల్లాచూడు."

చూశాను: ఒకపొలముగట్టున ఇరువురు పేద దంపతులూ, ఇరువురు పిల్లలూ కూర్చున్నారు. ఒక చిన్నగిన్నెలో కాస్త అన్నం ఆ పిల్లలిరువురూ తింటున్నారు. పెద్దవాళ్లు వాళ్లకేసి సౌమ్యదృష్టులతో చూస్తున్నారు.

"చూశావా?"

ఆ! గ్రామ్యజీవనాన్ని, దానిసౌందర్యాన్ని, గురించి నే నెన్నో పాటలు వ్రాశా—"

"చాలు నీపాటలు నువ్వూను—ఆదృశ్యంలో నీకు సౌందర్యం ఏమి కనబడుతోంది? ఆ హృదయాలలో మండిపోతున్న దారిద్ర్యాగ్ని చూడు! ఆముఖాలలో ప్రకాశిస్తోన్న దుఃఖముచూడు; కృశించిపోయిన ఆశరీరాలు, వాడిపోయిన ముఖాలు—కవివికాదూ? కనపడడంలేదూ? వెళ్లు! అక్కడపాడు నీపాటలు; వాళ్లకు ఆనందం కలుగజేయి. తిరస్కారపూరితమైన సంఘముయొక్క బరువంతా ఆ పేదజీవులలో కనిపించడం లేదూ? నీకు ప్రేమభిక్ష కావాలి? నాకు ఆనందం కలగడానికి ఏమి చేశావు నువ్వు? మలమల మాడిపోయే ఆ పేదలమాట ఏమి ఆలోచించావు?"

"ఏమీలేదు."

"ఇంక నీకు ప్రేమభిక్ష ఎలా వస్తుంది?"

తెల్లబోయి చూశాను; తలవంచుకొన్నాను.

"చూడు! నీకు నేనంటే గౌరవం ప్రేమా ఉన్నది కాదూ?

"ఓ! నువ్వు ఏంచేయమంటే అది చేస్తాను. ఉన్నట్లుగా ప్రాణాలు యిచ్చేయమంటే యిచ్చేస్తాను."

"చాలా గొప్పవిషయమే. నీ ప్రాణాలు యిచ్చేస్తావా? ఏంచేసుకుంటాను అవి? నీ జీవితంలో చేసేది ఏమైనా ప్రపంచకానికి కావాలిగాని, నీవుబతికితే ఎవరికి, చనిపోతే ఎవరికి?

ఇంకోటి అడుగుతాను. నామీద ప్రేమా, గౌరవము ఉంటే, నాజాతికోసం ఏం చేశావు నువ్వు? నిరంతరదాస్యం, దుఃఖము, ఇచ్చావా? తిరిగి తలయెత్తకుండా శాసించేశావా? అల్లాచూడు! ఆ జన్మాంతమూ వైధవ్యము అనుభవిస్తూ బాధఅంతా కన్నులవెంబడి నీటి బిందువులుగా రాలుస్తున్న ఆబాలికకోసం నీవు ఏమిచేశావు? అజ్ఞానంలోనుంచి పైకి రావడానికి ప్రయత్నిస్తుంటే, దాస్యంలోనుంచి స్వేచ్ఛ, స్వాతంత్ర్యమూ తెచ్చుకుంటుంటే ఏమిసహాయం చేశావు? పెద్దగొంతుపెట్టుకుని గోలచేస్తూ అడ్డంవచ్చావు. భాషపేరు చెప్పి, నా గౌరవానికి భంగమైన నీతిలేని వ్రాతలన్నీ వ్రాశావు?"

"నేనా?"

"నువ్వా అంటే నువ్వే. నీవు వీటి నన్నిటిని ప్రతిఘటించి, నిర్మూలముచేసేదాకా వాటితో సానుభూతి చూపిస్తున్నావన్నమాటే."

"ఛా! నా సానుభూతి దుర్మార్గంతో ఎంతమాత్రం లేదు."

"లేకపోతే ఏమిచేశావు.?"

"ఏమీ చెయ్యనిమాట నిజమే."

"ఇక నీకు ప్రేమభిక్ష ఎల్లావస్తుంది?"

తిరిగి తలవంచుకొన్నాను.

"చూడు! మఱి నీకు నేను ప్రణయినిని కావాలి కాదూ? నన్ను నీవు ప్రేమపుష్పాలతో ఆరాధించాలి కాదూ? మఱి నాకు ఆలయ మేదీ?"

"ఇదిగో! నా హృదయం."

"నీహృదయమా? మహా చక్కని ఆలయమే! చూడు, ఎంతమలినంగాఉందో! ఎంత కల్మషమో దానినిండా! ఎల్లాఉండగలను నేను అక్కడ? అక్కడ అంతా దాస్యభావమే. ఏమాత్రం స్వతంత్రవాతావరణం లేదు. నాకు అదా ఆలయం?"

ఇంకేముంది? హతాశుణ్ణి. గర్వమంతా పోయింది. నాపాటలన్నీ మఱిచి పోవడానికి నిశ్చయించుకొన్నాను! ఇక ఈప్రపంచంలో స్థానమేదీ? దీనినివదలివేయడమే గతి.నిరాశుడనై లేచాను.

"ఇలారా!"

వణకుతూ, కంపించిపోతూ, నెమ్మదిగా వెళ్లి దగ్గరగా నిలబడ్డాను. శక్తిలేక వణుకుతూ ఆమె పాదాలుమీద పడ్డాను. అప్రయత్నంగానే అశ్రుబిందువులు రాలి ఆమెపాదాలమీద పడినవి.

ఆమె నాతల ఎత్తింది.

"ఏమిటిది? నిరాశ? నీహృదయంలో ఏముందో నాకుతెలుసు. నిరాశుడవై లాభం ఏముంది? నీలో ప్రజ్వలిస్తున్న జ్యోతిలేదూ? యువకుడవు కాదూ? నీలోని యువకత్వం అంతా ఏమయి పోయింది? నడుముకట్టు-ప్రయత్నించు-నాప్రేమ ఎల్లప్పుడూఉంది. నిజమైన యువకుడవయితే, నాప్రేమకోసం నీవు అర్థించనక్కరలేదు. నీదగ్గిరకే రెక్కలు కట్టుకు వచ్చి వ్రాలుతాను."

ఏమిదయ! ఏమిశాంతం! ఏమిప్రేమ! ధైర్యంవచ్చింది.

నేను యువకుడను కానూ?......

# కతియవారు ట్రేడింగు కంపెనీ

## జగత్ప్రసిద్ధిగల సర్వజనాదరణీయమైన తలనూనెలు, అత్తరులు

### మీరు కోరిన సువాసనలు మీకు లభించగలవు




### మనోహరపరిమళము గల తలనూనెలు

కుసుమాల్ హెయిరాయిలు (రిజిష్టర్డు):– తలనూనెలలో సాటిలేనిది. సంపన్నులు మెచ్చినది.
వెల సీసా 1 కి రు. 1-0-0

వైట్ రోజ్ హెయిరాయిలు నెం. 777 (రిజిష్టర్డు):—గులాబీపుష్పాలనిజసౌరభ మిందుగలదు. రోజాపూవుల కాసక్తి గలవారి కామోద మొసగును.
వెల సీసా 1 కి రు. 0-14-0

కోకోనట్ హెయిరాయిలు నెం. 777 (రిజిష్టర్డు):—టెంకాయనూనె తలనూనె కుపయోగించునని ప్రతివానికిని తెలియును. కాని ఎట్లు సిద్ధముచేసినచో నది ప్రశస్తమో తెలియదు. ఈ 777 నెం॥ రులో (రిజిష్టర్డు) చేసిన ఈ టెంకాయనూనె శుద్ధిచేయబడి దుర్వాసనారహితముగా చేయబడి సూక్ష్మసువాసనాసంకలితముగా జేయబడినది. అందుచే అందరిచే మెప్పునొందినది. వెల సీసా 0-14-0

పుష్పమాలతీ హెయిరాయిలు (రిజిష్టర్డు):—మాలతీ పుష్పసువాసనతో అతిమనోహరమై హృదయరంజకమై యొప్పు తలనూనె యిది.
వెల సీసా 1 కి రు. 0-14-0

సువర్ణమాలా హెయిరాయిలు (రిజిష్టర్డు):—యిది సర్వజనాదరణీయమైన సుకుమార సువాసనగల తలనూనె.
వెల సీసా 1 కి రు. 0-9-0

### సర్వజనాదరణీయమైన పుష్పముల అత్తరులు

ఆటో మధుకర్ నెం. 777:—ఈ అత్తరునందుగల సొగసైన పూలవాసనచే మోహితులై అనేకమంది యీ అత్తరును తమ యభిమానసౌరభముగా భావించుచున్నారు. ఒకసారి యుపయోగించినచో సర్వదా వరించివట్లగును. వెల ½ ఔ. సీసా 1 కి 1-12-0 ¼ ఔ. సీసా 1 కి 1-0-0

ఓటో కుసుమాల్ (రిజిష్టర్డు) పరిమళములం దపూర్వచిత్రములు:—అప్పుడు కోసిన పూవులవాసన యీ అత్తరునందు కలదని సౌరభప్రియు లందరును అంగీకరించిరి. సారా అరఖులతో చేర్చిన యితర అత్తరులను జూచి విసుగుచెందినవారి మనోభీష్టమునకు తగిన అత్తరు. నిది సుకుమారమైన సూక్ష్మసౌరభము వెదజల్లును.

వెల ½ ఔన్సు సీసా రు. 2-0-0 ¼ ఔన్సు సీసా రు. 1-0-0

నెం. 777 ఓటో జాస్మిన్, ఓటో హీనా, ఓటో రోజ్, ఓటో లిలీఫ్లాజం, ఓటో మస్క్, ఓటో నీరోలీ, ఓటో బకూల్, ఓటో సురంగి ప్రతిది వెల ½ ఔన్సు సీసా 1 కి రు. 1-12-0 ¼ ఔ. సీసా 1 కి రు. 1-0-0

పాకింగు పోస్టేజీ ప్రత్యేకము. రెండణాలుచీట్లు పంపినవారికి కోరిన అత్తరులలో ఒకమాదిరి సీసా లేక కోరిన తలనూనెలు ఏ రెంటినైనను మాదిరిసీసాలు ఉచితముగా పంపబడును.

నేడే వ్రాయుడు. దొంగమాదిరులను చూచి మోసపోకుడు. వీనికిబదులుగా వేనినైనను అంగీకరించకుడు. ఘనానాగల ఔషధముల దుకాణములన్నింటియందును దొరకును. లేదా,

## కతియవారు ట్రేడింగు కంపెనీ, బొంబాయి (నెం. 4)

మదురలో ఏజంటు:—

# కామినియా నూనె

## వేనకు వేల కుటుంబములయందు ఉపయోగించబడుచున్నది

## ఎందుకు?




కామినియా నూనె

వెంట్రుకలు ఊడిపోకుండా నాటంకపరచును.

కామినియా నూనె

చుండును పోగొట్టును.

కామినియా నూనె

తలకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

తలకు సంబంధించిన వ్యాధు లన్నిటిని కుదుర్చును. ఉష్ణముగా నున్న పుర్రెకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

యందు వెంట్రుకలు పెరుగుట కవసరమైన వస్తువులు, మెదడుకు కావలసిన అమూల్యవస్తువులు గలవు.

కామినియా నూనె మనోహరమైనట్టియు ఆహ్లాదకరమైన సువాసనగలది.

కామినియా నూనె శిరోజములకు ప్రాణము. ఇట్టి సుగుణము లుండుటవలననే వేలకొలది కుటుంబములందు కామినియా నూనె ఎక్కువగా వాడబడుచున్నది.

కామినియా నూనెను ఉపయోగించునట్టివారు గనుకనే దీనిని "శిరోజములకు ప్రాణ మని" దీనియందు గల లాభకారియైన సుగుణములను బట్టి తెలుపుచున్నారు.

బుడ్డి 1 కి ధర రు. 1. వి. పి. ఖర్చులు అ. 6. ప్రత్యేకము.

బుడ్లు 3 కి ధర రు. 2-10-0. వి. పి. ఖర్చులు 0-12-0. ప్రత్యేకము.

అత్తరులకు రాజైన

## ఓ టో దిల్ బ హా ర్ (రిజిస్టర్డు)

హిందూదేశమం దంతటను యిది విరివిగా అమ్మబడుటనుబట్టియే దీనికి గల అసాధారణమైన శ్రేష్ఠత్వమును ఋజువుచేయుచున్నది. కొన్ని బొట్లు చేతి రుమాలపైన చల్లిన సీమపుష్పములు, మల్లెపుష్పముల వాసనవలె మనోహరమైన దీర్ఘ సువాసనను గలిగించుచున్నది.



$\frac{1}{2}$ ఔ. బుడ్డి 1 కి రు. 2. $\frac{1}{4}$ ఔ. రు. 1-4-0. 1 డ్రా. 0-12-0.

వి. పి. ఖర్చులు అణాలు 6 ప్రత్యేకము.

2 అణాలు తపాలబిళ్ళలు పంపిన శాంపిల్ బుడ్డి పంపబడును.

కామినియానూనె ఓటోదిల్ బహారు సుప్రసిద్ధమైన స్టోరు లన్నిటియందును దొరకును.

## ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ.

తపాలపెట్టె నెం. 2132. బొంబాయి నెం. 2.

# సుభద్ర

ఏ. విష్ణురావు గారు, బి. ఏ., బి. యల్.



## మొదటి అంకము

[నారింజలు, జామలు ఉన్న ఒక తోట. దూరమున బంగాళా పంపిని ఇల్లు కనబడును. క్రిందుగా వ్రాలిన కొమ్మపైన జగన్నాథము, ఇందిర కాళ్లు వ్రేలాడవేసి కూర్చుని పరిహాసములు చేసుకుంటూ వుందురు.]

జగన్నాథము

ఈపండు బాగున్నది. చిలుక కొట్టినది. ఇది తీసుకో. తియ్యగా వుంటుంది. అది పారవేయి.

ఇందిర

మీరు తీసుకోండి.—ఇది బాగానే ఉంది.

జగన్నాథము

ఈరోజులలో మొగుడు చెప్పడమూ, పెండ్లాము వినటమూనా.-తీసుకో మటీ.

ఇందిర

మీరు సగము, నేను సగము తీసుకొందాము.

జగన్నాథము

ఇదిగో.-ఎంగిలి తినవచ్చునా.

ఇందిర

పట్టణములోవారి కేమైన తప్పంటే ఉండవచ్చును.

జగన్నాథము

ఈముక్క ఏమీ బాగులేదు, ఇందూ; ఆ ముక్క యివ్వవూ.

ఇందిర

అక్క వస్తూ ఉన్నది.

(దిగును.)

(జగన్నాథముకూడ దిగి కొంచెముదూరము నడచును.) సుభద్ర వచ్చును.

సుభద్ర

జగన్నాథము, మడీకట్టుకో. నాన్నగారి జపము అయినది. విస్తళ్లు వేస్తారు. పంక్తికి రాకుంటే వారికి కోపము వస్తుంది.

జగన్నాథము

వెళ్లుతున్నాను.

(నిష్క్రమించును.)

సుభద్ర

ఇందూ, నాతో చెప్పవా మీ రహస్యములు.

ఇందిర

ఏమీ లేదూ. సంగీతము బాగా చెప్పకొంటూ థామసమ్మదగ్గిర నీతోపాటిగా ఇంగ్లీషు నేర్చుకోమంటున్నారు.

సుభద్ర

సీతమ్మవాళ్లు వేళాకోళం చేస్తారు. ఇప్పుడు అవన్నీ ఎలావచ్చును.

ఇందిర

మనలని ఏమిచేద్దామని వారి ఉద్దేశ్యమో. నీకంటే తప్పకుండా కావలసినది. మీ ఆయన వస్తే టీపార్టీలకి, వాటికి నీవు పోవద్దా.

సుభద్ర

నీవుకూడా హాస్యము చేస్తావా. వారు వెళ్లిన దగ్గిరనుంచీ మామగారికి చదువురాని మొద్దుకు యిచ్చి కట్టిపెట్టినారని ప్రతి ఉత్తరములోను దెప్పచునే ఉన్నారు...... పెండ్లిఅయిన దగ్గిర నుంచి మే మిద్దఱము మాటలాడుకొననైనా లేదు. నీవు, జగన్నాథము ఆజామచెట్టుకొమ్మపై కూర్చుని గుసగుసలాడుకుంటూ వుంటే మీ యీడు మొగుడు పెండ్లాములు ఏమి మాట లాడుకొంటూవుంటారా అని నాకు ఆలోచన. అదిగో లలిత వస్తూన్నది. ఏమో చిఱునవ్వు నవ్వుకుంటూంది. మనలను చూడలేదు. చప్పుడు చేయకు. ఈప్రక్కరా.

(వెనుకనుండి లలితకన్నులు మూయును.)

లలిత

ఊరుకోండి, ఎవరయినాచూస్తారు. (వదలించుకొనును.)

నీవా, సుభద్రక్కయ్యా,

సుభద్ర

అంత పరాకుగా ఉన్నావేమి లలితా. మమ్ము లను మఱచియే పోయినావు. ప్రొద్దుననుంచి కనబడలేదు.

లలిత

మామగారికి నీళ్లు తోడుటకు వద్దామనుకొన్నాను.

ఇందిర

అవును; వసంతరావు రానివ్వలేదు.

లలిత

, ఈగ్రుడ్డుకూడా వున్నదా ఇక్కడ.

సుభద్ర

ఇంటినిండా పండిన జామపండ్లుండగా ఇందుకు అవి పనికిరాలేదు. జగన్నాథము చెట్టెక్కి కోసి యివ్వవలెను.

లలిత

జగన్నాథము అమాయికుడు. ఇందిర అతనిని బుట్టలో పెట్టుకొని అమ్ముకువస్తుంది.

ఇందిర

అదే అత్తగారూ చెప్పచున్నారు. వసంతరావు ఇంటికివచ్చినప్పటినుండి వారికంటబడలేదట.

సుభద్ర

ఇందిరా, వారిభోజనము కావచ్చుచున్నది. చేతులు కడుగుకొనుటకు నీళ్లు పెట్టుతావు కాదా.

ఇందిర

(పోవుచు) వసంతరావుకు నే నెందుకు పెట్టవలెను.

లలిత

నేను పెట్టివచ్చినానమ్మా, తల్లీ.

(ఇందిర పోవును.)

సుభద్ర

ఏమో నవ్వుకుంటూ వస్తున్నావు.

లలిత

తలలో గులాబిపువ్వు ఇద్దఱము తినివేసినాము. ఇక్కడ వక గులాబి ఇందాక చూచినాను. తలలో పువ్వు లేకపోతే అత్తగారికి చీదర.

సుభద్ర

ఈచీర చాయ బాగున్నది. అప్పుడే నలిగి పోయినదేమి లలితా!

లలిత

వారికి రెండేదినములు సెలవు లున్నవి. కార్యమైనతరువాత ఇదే రావడము కదా.

సుభద్ర

ఈమాటు పట్నం తీసుకువెళ్లుతారా.

లలిత

ఇల్లు కుదురలేదు. వాకిలి కుదురలేదు అంటున్నారు. వారికేమి పగలెల్లా ఆఫీసు; రాత్రి నిద్ర.

సుభద్ర

ఇక్కడ నీకు కష్టమా—అత్తగారు మీచేత పని చేయించుకోరుగా.

లలిత

కష్టంకాదా, అక్కయ్యా,—మఱి.

సుభద్ర

ఈచీరతోటి చీర అమ్మమ్మ నాకూ కొనిపెట్టినది. నే నింకా తీయలేదు.

లలిత

పలచని చీరలు. చప్పున నలిగిపోతవి.— ఇదిగో గులాబిపువ్వు. కొంచెము ఉంచుతావా.

సుభద్ర

నాకు పువ్వంటే భయము. పువ్వు పెట్టుకోగానే రాణిలాగ ఉన్నా ననుకొంటాను. ఎంతో హాయి. వెంటనే మామ జ్ఞాపకము వస్తారు.

లలిత

వారు వెళ్లి రెండు సంవత్సరము లయినవి సుమా.

సుభద్ర

పెండ్లయినప్పటినుండి సరిగా చూడలేదు.— జగన్నాథము అమాయికు డంటివే. ఆతడు, ఇందిర ఆ జామచెట్టుమీద కూర్చుని జామపండ్లు తింటున్నారు.

లలిత

ఆకొమ్మ కాదూ. నే నొకసారి శ్రావణమాసము నోములకు వచ్చినాను. దానికి ఉయ్యాల వుండేది. నేను వారు త్రొక్కుటుయ్యాల ఊగేవారము.

సుభద్ర

నేను కిటికీలోనుండి చూస్తూవుండేదాన్ని. వసంతరావు, కాదు, వెంకడు.

(వెంకడు ప్రవేశము)

ఏమిరా వెంకా, అంతతొందరగా వస్తున్నావు.

వెంకడు

జగన్నాథం బాబుగారు ఈదినం పోష్టు తొందరగా తెమ్మన్నారు. పరీక్షలు వస్తాయట. మీరు చూచి చెప్పండి. ప్యా సన్నట్టయితే రూపాయి ఇస్తా నన్నారు.

సుభద్ర

నాకు ఇంగ్లీషు రాదు.

వెంకడు

మిశమ్మదగ్గిర చదువుకొంటున్నారు కాదటండి.

లలిత

మాకు ఇంగ్లీషుతో పనేమి?

వెంకడు

బాబయ్యగార్లు ఉద్యోగములు చేస్తారు— మీరు డబ్బుతేవలెననా—మాకంటే ఒక్కడి జీతం చాలదు. నా అమ్మి ప్రొద్దున్న గంజి కాచి, నా కింతపోసి తనింత తాగి చంటివాడిని తీసుకొని ఊడ్పుకు పోతుంది. ఈ పెద్దోడిని తీసుకొని నేను ఇక్కడికి వస్తాను. నీరు గట్రా సాయంత్రము యింత త్రాగినా, అది తెచ్చేదికూడ ఆధరువు.

సుభద్ర

నీ పసివాడు ఇప్పుడు ఎలాగ వున్నాడు.

వెంకడు

ఏదో వున్నాడండీ. ఆపెద్దయింట్లో అమ్మాయిగారి బిడ్డకు ప్రొద్దున్న సాయింత్రము మా ఆవిడ పాలిస్తుంది. మాకూనకు పాలు సరిపోవటం లేదు. ఆ అమ్మాయిగారు బిడ్డను చేపనైనా చేపదటండి.

లలిత

చాలులే వూరుకో. ఇదంతా నిన్నడగలేదు.

వెంకడు

నేనేమి తప్పుమాటన్నానండి...

అదిగో చిన్నబాబుగార్లేవస్తున్నారు.

(వసంతరావు ప్రవేశము)

సుభద్ర

మామా, పోస్టుతెచ్చినాడు. వెంకడు.

వసంతరావు

పేపరు యిలాగియ్యి. జగన్నాథం పరీక్షలు దినము వచ్చునట.

[జగన్నాథం ప్రవేశము]

౫౬౭ కాదూ నీనెంబరు ?

జగన్నాథము

ఊఁ.

వసంతరావు

అయినది.-ఏదో సురూరుగాను. పార్టుట్యూటోరియల్ కాలేజి.

లలిత

(సుభద్రతో) మామగారు వస్తున్నారు. అ గారు విస్తళ్లు ఎత్తుకొంటారు కాబోలు. నే వెళ్లుతాను.

(వెళ్లును.)

[పద్మనాభంగారి ప్రవేశము]

పద్మనాభం

వాడిపరీక్ష ఏమయినదిరా?

వసంతరావు

వకటి అయినాడు.

పద్మనాభం

చదువుతేనా. పెండ్లయేదాకానే ఈచదువు

జగన్నాథము

నేను పెండ్లి చేయమని ఏడ్చినానా ఏమిటి. వద్దు వద్దు అంటే మీరే కట్టిపెట్టినారు.

(కొంచెము ఏడ్చు, కోపముతో పోవును)

(వెంకడు తిన్నె దులుపును. పద్మనాభం గారు దానిపైన కూర్చుండును.)

వెంకడు

సగము అయినారు కాదాండి, మరి.

సుభద్రమ్మ

నీకు అర్ధరూపాయి వస్తుంది లే.

వెంకడు

ఏమో తమ దయండి. కష్టకాలం.

వసంతరావు

నాన్నగారు ఇది చూచినారా?

పద్మనాభం

ఏమిటది?

వసంతరావు

పెద్దఅన్నయ్య బొంబాయి చేరినాడుట. ఇంకా ఇద్దతి పేర్లున్నవి. వారంతా డ్యూటీలో జాయిన్ అయినారుట.

వెంకడు

పెద్దబ్బాయిగారాండి. సీమనుంచి వచ్చినారా? రావడంతోనే కలక్టరుపని యిస్తారుట కాదటండీ. మా సుభద్రమ్మతల్లి దయ చల్లగా ఉండాలి. నేను వారిదగ్గర వుంటాను. మావాడికి డఫేదారుపని ఇప్పిస్తారు.

పద్మనాభం

ఏది, ఆ పేపరు ఇలాయియ్యి. వాడు వుత్తరమయినా వ్రాయ లేదు సుమా!

వెంకడు

హూమ్, హూమ్. ఎక్కడ దాపరించినవండీ యీ మేకలు. (కొట్టుటకుపోవును.)

సుభద్రమ్మ

అమ్మమ్మ వస్తావున్నది.

[పార్వతమ్మ ప్రవేశము]

వసంతరావు

అమ్మా, అన్నయ్య బొంబాయి వచ్చినాడట. పేపర్లో వున్నది.

పార్వతమ్మ

నీవు రోజూ అలాగే చెప్పచున్నావు— సుభద్రా మళ్లీ నీవా చీర కట్టుకొన్నావేమి. ఆవంగపండుచాయది తీసికట్టుకో.

(సుభద్ర పోవును)

(పార్వతమ్మ తిన్నె ప్రక్కగా కూర్చుండును)

వసంతరావు

నిజమమ్మా. కావలిస్తే నాన్నగారిని అడుగు.

పార్వతమ్మ

అవునా అండి.

పద్మనాభం

ఏమి సంబ్రంబం. కొడుకూ కలెక్టరీ చేస్తాడని.

పార్వతమ్మ

మీకుమాత్రం లేదా అండి. కలెక్టరీ చేస్తే

చేస్తాడు. లేకపోతే లేదు. రెండేండ్లయినది వాడిని చూచి. కండ్లు కాయలుకాచిపోయినవి.

పద్మనాభం

సుభద్రవిషయమై బెంగగా వున్నది. వాడు దానితో కాపురముచేస్తాడని తోచదు.

పార్వతమ్మ

దాని అదృష్టమునకు తల్లి తండ్రి కూడా పోవలనా.

పద్మనాభం

నువ్వూ, నేనూ వుండిమాత్రము ఏమి చేస్తున్నాము.

పార్వతమ్మ

ఇదంతా మీరు చేసినది. వాడితోకూడా పంక్తిలో కూర్చుని భోజనము చేయకుండా చేసినారు. మనడబ్బు ఏమి ఖర్చు అయినది? గవర్నమెంటువారే పంపుచున్నారని సహేమి సాహారా, నేను వద్దన్నా ఒప్పుకొన్నారు.— ఏమిరా వసంతా, దేనినైనా కట్టుకొని వచ్చినాడా ఏమిటి?

వసంతరావు

లేదు. క్రిందటిమాటు నాన్నగారికి వ్రాసిన ఉత్తరంలో సుభద్రతోమాత్రము కాపురము చేయుట ఉండదని వ్రాసినాడు.

పద్మనాభం

నాతో చదువుకొన్న కామేశ్వరరావు కూతురికిచ్చి పెండ్లిచేస్తానంటే పడనివ్వలేదు. అది ఇప్పుడు మెట్రిక్యులేషను ప్యాసయినదట. మొగుడిదగ్గరవుండే చదువుకొన్నది. సుభద్రకు చదువునం దిష్టములేదు.

పార్వతమ్మ

తల్లి లేనేలేదు. దీనినైనా చూచుకొని ఉందామని పిల్లతోపాటు పెంచి దగ్గర ఉంటుందికదా అని పెండ్లి చేసినాను.

[సుభద్ర ప్రవేశము]

సుభద్ర

తాతగారూ శాస్త్రిలుగారు వచ్చిఉన్నారు. పాఠశాలకు మళ్లీ వెళ్లవలెనట. వస్తారేమో కనుక్కోమన్నారు.

పద్మనాభం

పుస్తకాలన్నీ చెదలుపట్టి పాడయిపోతూన్నవి. పనినుండి విడుదలవగానే అవన్నీ తీసి వెలగపెట్టుదామనుకున్నాను. పిల్లవాళ్లందరూ పెద్దవారయినారు. రామా, కృష్ణా అనుకొంటూ ఉందామనుకుంటే ఏదోఒకటి, ఏదో ఒకటి వస్తూనే వుంటుంది.

పార్వతమ్మ

ఏదీ రాలేదు. ఎప్పుడూ ఏదో ఒక బెంగ, రండి. పోదాము. రెండు అధ్యాయాలన్నా అవుతాయి. (పోతూ) సుభద్రా, చీర కట్టుకున్నావా. కండ్లు వచ్చినట్లున్నవి. క్రొత్త చీరగదా, తాతగారికి నమస్కారములు చెయ్యి.

(ఇద్దరికి సుభద్ర నమస్కారముచేయును)

నాకు కూడానా. మాణిక్యము చూసి సంతో
షించుటకు లేదుగదా. లే, అమ్మా,
(సుభద్రను దగ్గిరకు తీసుకొనును. కంట తడి
పెట్టి పద్మనాభం కేసిచూచును. ఇద్దఱు పోవు
దురు.)

సుభద్ర

వసంతమామా. మౌనంగా కూర్చున్నావేమి?

వసంత రావు

ఏమీలేదు.

సుభద్ర

అమ్మమ్మ, తాత విచారముగా నున్నారేమి?

వసంత రావు

నీవు యిక్కడ వుండక వెళ్లిపోతావని.

సుభద్ర

అంతేనా మీరు మాట్లాడుకొంటూ వున్నది.

వసంత రావు

ఇంకే ముంటుంది.

సుభద్ర

నీవుకూడ దాస్తావేమి?

వసంత రావు

నిన్నుదొరసానిగా చేసి పెద్దన్నయ్య దగ్గిరకు
తీసుకువెళ్లి దిగపెట్టమన్నారు.

సుభద్ర

వారు రారా ఏమి?

వసంత రావు

క్రొత్తగా పని అయిందికదా. వీలుందునో,
లేదో.

సుభద్ర

వసంతా, నిజము చెప్పకూడదా.

వసంత రావు

అంతేనమ్మా. లేనిపోని ఆలోచనలు పెట్టు
కోకు. లలిత గదిలోనికి వచ్చివుంటుంది. తాం
బూళము తీసుకొని. పోకపోతే ఈ దినము
మాట్లాడదు. రెండేరోజులు సెలవు. ఇక్కడ
ఏమి చేస్తావు. ఇంటిలోనికిరా.

(పోవును.)

సుభద్ర

(చీరచూచుకొంటూ పరాకుగానిలుచుండును.
రెండుగోరువంకలు వచ్చి వ్రాలును. దగ్గిరకు
పోయి తీసుకొన బోవును. గోరువంకలు
ఎగిరి పోవును.) అందఱికిని దాంపత్యము; నా
కేనా లేకపోవుట.

(గులాబిచెట్టువద్దకుబోవును. పువ్వునుచూస్తూ
నిలువబడును. భయముతో పువ్వు తాకును.
కోద్దామా, వద్దా అని ఆలోచిస్తూ ఉండును.
నీటిబిందు పువ్వుపై బడును).

[తెఱ]

---

రెండవ అంకము

[వాల్తేరు. బంగాళా పంపినియిల్లు. భోజనము
చేసేహాలు. నాలుగు కుర్చీలు. మధ్య బల్ల.
ఫలహారములతో]

కామేశ్వర రావు

చేతితో ముట్టుకోవద్దని చెప్పలేదా.

సుభద్ర

మఱచిపోయినాను.

కామేశ్వరరావు

నీకు జ్ఞానమువుంటేనా. ఒకసారి చెపుతేకాదు. ...........దానితోటికాదు. ఇవతల. యిది.

(తొందరలో టీ కప్పు క్రింద బడిపోవును.)

సరి. ఇది ఎక్కడ దాపరించినదిరా.

వసంతరావు

కోపంచేస్తే మఱింత కంగారుపడును.

కామేశ్వరరావు

ఆ థామస్‌ముండ ఈ రెండు సంవత్సరములు ఏమి నేర్పినది?

వసంతరావు

సుభద్రా, నీవు లోపలికిపోయి ఇంకొకచీర కట్టుకో.

(సుభద్ర కన్నీళ్లతో లోపలికి పోవును.)

కామేశ్వరరావు

ఇంత ఇడియట్టని (Idiot) నే నెప్పుడు అనుకోలేదు. చఛా!

వసంతరావు

ఇడియట్టు కాదు. దాని స్వభావము నీకు తెలియదు.

కామేశ్వరరావు

ఈ ఏడుదినములుపట్టి అఘోరించుటలేదా?

వసంతరావు

చిన్నపుడు చూచినావు. మళ్లీ యిప్పుడు చూస్తున్నావు. ఈలోగా నీకు చాలా మార్పులు కలిగినాయి. అది యింటిదగ్గిరే నాన్న, అమ్మదగ్గిర ఉన్నది.

కామేశ్వరరావు

పట్టి మొద్దు. వద్దు, వద్దు అంటూంటే వాళ్లు కట్టిపెట్టినారు. ఇపుడు మెడకుకట్టుకొని తిరుగుతారా?

వసంతరావు

తల్లిలేని బిడ్డగదా అని పెరుగు పాలుపోసి గారాబముగా పెంచేవారు. కొంచెము లావుగా ఇదిగా ఉంటూండేది అప్పుడు. ఆ అభిప్రాయమే పెట్టుకొని ఉన్నావు.

కామేశ్వరరావు

చదువు చెప్పిస్తున్నారు కదా. చదువైనా వచ్చిందా?

వసంతరావు

రాకేమి. వస్తూనేఉంది. ఏదో థామస్ ఒకగంట ఉండి చెప్పుతే వచ్చునా? ఆలస్యముగా మొదలుపెట్టినారు. కొంతమందికి ఇంగ్లీషు నేర్చుకొనుటకు ఇష్టముంటుంది; కొంతమందికి ఉండదు.

కామేశ్వరరావు

ఇష్టము-ఇష్టము. అంటావేమి. పట్టుదలఉంటే సరి. నాకు చిన్నప్పటినుండి లెక్కలంటే అనహ్యము. అదే తీసుకొన్నాను. F. A. లో First, B. A. లో First, M. A. లో First.

వసంతరావు

ఏమో మనిషితీరు. అయినా నీవు ౨౦ ఏండ్లు చదువుకొన్నావు. నేను ౧౪ ఏండ్లు చదివి

నాను. దానికి ౧౫ ఏండ్లకు చదువు మొదలు పెట్టి రెండేండ్లలోగా మన కున్నంత పాండిత్యము రావలెనంటే ఎట్లాగ? అదైనా రోజుకు ఒకఘంట. ఒకనరుసు చెప్పడం.

కామేశ్వరరావు

ఏమి పాండిత్యము కావలెనని ఏడ్చినాను. ఏదో నాలుగు ముక్కలు ఇంగ్లీషు మాట్లాడడంవస్తే చాలునుగదా అని అనుకొంటే.

వసంతరావు

రాకపోతే నేమి?

కామేశ్వరరావు

నలుగురు పెద్దమనుష్యులు, వారి ఆడవాళ్లు వస్తే దీనిముఖం ఎలా చూపెట్టెదను.

వసంతరావు

చూపెట్టనేవద్దు. చూపెట్టమని అది అడుగుతూందా ఏమి. వాళ్లు అడుగుతారా?

కామేశ్వరరావు

ఆ, అడుగుతారు. నీకేమి తెలుసును, అమ్మా, నాన్నదగ్గిర కూర్చుండ?

వసంతరావు

అది అలాగు ఉంటూవుంటే పెద్దవాళ్లకు కడుపుమంటగదా.

కామేశ్వరరావు

మాణిక్యంపోతే ఏమిచేశారు. ఇది పుట్టనే లేదనుకొంటారు. శాస్త్రిలుగారి దగ్గిరకూర్చుని ఏదో రామ, కృష్ణా అనుకొంటూ వుండవలెను. ఇంకా ఈతాపత్రయము ఎందుకు?

వసంతరావు

దానిగతి? అది చిన్నదిగదా!

కామేశ్వరరావు

దానిగతి! గంగలో దిగుమను. ఏమిచేసేది?

వసంతరావు

అన్నయ్యా, అన్నయ్యా. మాణిక్యం ఉంటే ఇలా అంటావా?

కామేశ్వరరావు

ఉంటే నేను గంగలో దిగవలెను.

వసంతా! నన్ను కదలపకు. నేను పశువును కాను. నాకూ ఇంకా నిశ్చయము లేదు ఎవరు గంగలో దిగవలెనో. ఆశలు, అనుతాపము (Feeling) చెరియొకవైపున పట్టుకొని పీడించుచున్నవి. అది మాణిక్యముకూతురు; విడిచి పెట్టకూడదు.

(సుభద్ర కొంచెముదూరము వచ్చి వా రిద్దరు మాటలాడుకుంటున్నారని చూచి నెమ్మదిగ వెళ్లిపోవును. కామేశ్వరరావు చూడలేదు. వసంతుడు చూచి చూడనట్టు ఊరుకొనును.)

అంతకుముందు చావంటే ఏమో తెలియదు.

వసంతరావు

అమ్మ చెపుతూవుంటుంది. అప్పుడు నీవేడ్చిన ఏడ్పుకు మితిలేదు. వచ్చినవాళ్లందరు భయపడినారు.

కామేశ్వరరావు

మార్చుకని పట్నం తీసుకువచ్చి హాస్పిటలులో ఉంచారు.

వసంతరావు

తక్కిన యీడుజోడువారితో కలిసి ఆడుకొం టూ మరిచిపోతావని.

కామేశ్వరరావు

వారితో తిరిగెడి వాడినికాను. నాకు స్నేహితులు లేరు. బీచిరోడ్డున మోటారుకార్లుపోతూ వుంటే చూస్తూ కూర్చుండేవాడిని. మోటారెక్కి తిరుగవలెనని సరదా.

వసంతరావు

అన్నట్టు, ఇప్పుడు నీకున్న 'కారు' ఏమిటి?

కామేశ్వరరావు

ఆస్టిన్; బేబీఆస్టిన్! నీవు చూడలేదా. సాయంత్రము పోదాము. చిన్నది. ముద్దువస్తూ వున్నది. ఎంతో నాజూకుగాను; పసుపుపచ్చని రంగు. నల్లని బోర్డర్లు; లేత ఊదారంగు కర్టెనులు; నీవు చూడవలెను. సరళ — ప్రభాకరరావు కూతురు-ఆకర్టెనులన్నీ కుట్టింది.

వసంతరావు

మఱచిపోయినాను. గంటెంత అయినది. బజారుకుపోవలెను. ఏవో తెమ్మని చెప్పినారు. తరువాత టైము ఉండదు. రైలుకు పోవలెను.

కామేశ్వరరావు

రెండుమూడురోజు లుండగూడదా?

వసంతరావు

వారంరోజులే సెలవు. జాస్తిచేయమని వ్రాశాను.

కామేశ్వరరావు

ఇప్పుడు ఇంటికిపోయి చేసే దేమున్నది......

ఓహో! నీకు మొన్ననే కార్యమయినదట గాదా. నీవు హాయిగా ఉన్నావా వసంతా?

వసంతరావు

ఉన్నాను.

కామేశ్వరరావు

లలితా?

వసంతరావు

కూడాను.

కామేశ్వరరావు

జగన్నాథము, ఇందిర.

వసంతరావు

బడిస్నేహితులవలె ఉన్నారు. ఎవరూ చూస్తూండనపుడెల్లా చెట్టెక్కి జామకాయలు కోసుకొని కలిసి తింటూవుంటారు.

కామేశ్వరరావు

నాకేనా ?

వసంతరావు

(కొంతసేపటికి) అన్నయ్యా మనఊరు రాకూడదా ఒకసారి ఈపట్నం విడిచి.

కామేశ్వరరావు

లేదు. వసంతా లేదు. ఆఊరికి (ఆలోచిస్తూ పరాకుగా) దూరమై పోయినాను. ఆ చెట్లు చేమలు, తలుపులు, వాకిళ్లు నన్ను గుర్తుపట్ట లేవు. అమ్మకు అర్థముకాదు; నాన్న తెలుసుకోరు. ఏదోకొన్నిరోజులున్నా మనస్స్థిమితము ఉండదు. నా అదృష్టము నేను పట్టుకొని పోవలెను.

(బయట హార్ను ధ్వని, మోటారుచప్పుడు).

ప్రభాకరరావు, సరళ వచ్చినారు. నేను తిరిగి వస్తాను.

(పోవును.)

వసంతరావు

రామస్వామీ, ఇవన్నీ తీసివెయ్యి.

(రామస్వామి లోపలినుండి వచ్చి బల్ల బాగు చేయుచుండును).

రామస్వామి

అవునా, కాదా, అని ఆలోచిస్తున్నానండి. మీకు జ్ఞాపకం ఉండదండి బహుశా. పెద్దాపురంలో మీనాన్నగారు తాసిల్దారుపని చేస్తున్నప్పుడు నేను అయిదోక్లాసు చదువుతూ ఉండేవాడిని మిషన్‌స్కూలులో.

వసంతరావు

అవును. నేనూ అయిదోక్లాసు చదువుతూ ఉండేవాడిని.

రామస్వామి

మానాన్న అయ్యదగ్గిర డఫేదారు. ఇన్ని రోజులు పట్టీ అడుగుదామా వద్దా అని ఊరుకొన్నాను. అమ్మగారిని అడిగి వాకబుచేసి అప్పుడు చదువుకొంటూ ఉన్న వసంతరావుగారు మీరే అని స్థిరపఱచుకున్నాను.

వసంతరావు

జ్ఞాపకము వచ్చినది. నీకు పుస్తకాలు లేవు. నాదగ్గిరకువచ్చి చదువుకొంటూ ఉండేవాడివి.

రామస్వామి

అప్పుడే సుభద్రమ్మగారు పుట్టినారు. ఈ అమ్మాయిని కని మాణిక్యమ్మగారు కాలము చేసినారు. మా నాన్న ఇంటికివచ్చి అంత మంచివారికి ఎంతవిపత్తు వచ్చిందని పదే పదే అంటూండేవాడు. మా అమ్మ పురుటింటిలో వుండేదట. నాకు బాగా జ్ఞాపకం ఉందండి.

వసంతరావు

(కుర్చీమీదనుండి లేచి కండువా తీసివేసుకొంటూ) తరువాత పెద్దాపురంలో ఉంటానికి ఇష్టములేక మా నాన్నగారు ఇంకోవూరు మార్చుకొన్నారు........అన్నయ్య ఎక్కడ వున్నాడు?

రామస్వామి

(కిటికీలోనుండి చూచి) గారేజికి వెళ్లుచున్నారు. సరళాదేవిగారు క్రొత్తకర్టెనులు తెచ్చినారు. వారు తఱుచు వస్తూవుంటారు. మెడికల్ కాలేజీలో చదువుకొంటున్నారట. కాని బండిమాత్రము చాలా బాగుంటుందండీ. ఇన్నిరోజు లయింది సుభద్రమ్మగారు వచ్చి ఒక్కసారి ఎక్కలే దేమండీ? ఊళ్లోవాళ్లందఱు ఎక్కడానికేనాండి? వారికి భయము కాబోలు! ఎప్పుడూ ఎక్కలేదు. పెద్దవారు ఆడవా ళ్లెవరూ లేరు నచ్చచెప్పడానికి...... పాపము.

[ప్రవేశము థామసమ్మ]

థామసమ్మ

వసంతరావుగారూ, సుభద్రమ్మను చూచి నారా?

రామస్వామి

వారిగదిలో ఉన్నారండీ కిటికీదగ్గిర నిలబడి. నేను గారేజితలుపులు తీసి వస్తూవుండగా చూచినాను.

భామసమ్మ

ఆస్పత్రికి వస్తానంది. నేను వచ్చినానని చెప్పు.

(రామస్వామి పోవును)

వసంతుడు

ఆస్పత్రికేమి?

భామసమ్మ

ఆడవాళ్ల ఆస్పత్రికి. మా అక్క అక్కడ డాక్టరు.

వసంతరావు

అవును. ఏదో అస్వస్థతగా ఉన్నట్టున్నది. ఇంట్లో ఆడవాళ్లెవరూ లేరు. మాతో ఏమీ చెప్పదు.

భామసమ్మ

మరేమీ లేదు. ఆస్పత్రి చూద్దామని. అది క్రైస్తవుల ఆస్పత్రి. గుంటూరులోకూడా అప్పుడప్పుడు నాతో ఆస్పత్రికి వస్తూవుండేది. అక్కడ మేము చేసేపనులు చేయడం అంటే ఎంతో ఆసక్తి. అక్కడ ప్రసవానికి వచ్చిన వాళ్ల నందఱిని ఎంతో ఆదరిస్తుంది. పాపము వాళ్లమ్మ, కని, పోయినదట.

వసంతరావు

ఇంతా ఏమో చెప్పుతావు. ఇంగ్లీషు మాత్రం వచ్చేటట్టు చేయలేదుగదా!

(భామసమ్మ)

ఇదెక్కడిపిచ్చి అయ్యా! నేర్చుకుంటే ౫, ౬ ఏండ్లవయస్సునుండి నేర్చుకోవలెను. బుద్ధి, జ్ఞానం బాగావచ్చి, ప్రపంచసమాచారాలన్నీ తెలిసిన, చిన్నపుడే పెండ్లిఅయిన మనదేశపు అమ్మాయిలకు ౧౫, ౧౬ సంవత్సరాలువచ్చిన తరువాత C-A-T Cat=పిల్లి, M-A-T Mat=చాప అని మొదలుపెట్టితే ఎట్లా ఆసక్తి పుట్టుతుంది? ఎలా చదువవలెనని ఉంటుంది? చెప్పడానికి నాకే ఈదురో మంటూ ఉంటూ ఉంటుందే.

వసంతరావు

ఏమో ఇంగ్లీషువస్తే—మాకు తెలుగు చదవడం సరిగా రాదు. ఇంగ్లీషు వచ్చునుగదా. ఇద్దరూ ఒంటరిగా ఉన్నప్పుడు అప్పుడప్పుడు Byron, Keats, Shelley, Shakespeare కలిసి చదువుకుంటూ ఒకరిభావములను ఒకరికి తెలుపుచు ఆనందించవచ్చునుగదా అని.

భామసమ్మ

ఏమికేటో్స్, ఏమి షెల్లీ యో? కొంతమందికి ఎంత ఇంగ్లీషువచ్చినా అర్థముకాదు. సుభద్ర ప్రతి నిమిషము వాళ్ల పుస్తకాలలో చెప్పినభావములన్నీ అనుభవిస్తూ ఉంటుంది. గులాబిపువ్వుకేసి చూచిచూచి కంట తడిపెట్టుతుంది. దొడ్డిలోని మొక్కలన్నీ ఆమె స్నేహితులే. పేరుపేరుగా పిలుస్తుంది. చేతులార పెంచుతుంది. చిన్నపుడు వాళ్ల అమ్మమ్మ కాళ్లమీదపడుకోపెట్టుకొని రాధాకృష్ణ గీతములు చెప్పేదట. ఎంతమృదువుగా మాధుర్యముగా పాడుతుంది.

ఒడలంతా పులకరించును. ఇద్దరి కండ్లనుండి అశ్రుబిందువులు కారెడివి. నా చిన్ననాటి రోజులు జ్ఞాపకము వచ్చెడివి. యసు అప్పుడు యుద్ధమునకు పోయినాడు.

వసంతరావు

సరే. ఏదిఉంటేనేమి?

[ప్రవేశము: సుభద్ర]

సుభద్ర

ఎంతసేపైనదమ్మా నచ్చి?

భామసమ్మ

ఎంతోసేపుకాలేదు. ఏమిచేస్తున్నావు? గదిలో కూర్చుని.

సుభద్ర

ఏమీలేదు. (పరాకుగా) గదిలో కిటికీఉన్నది. ఎదురుగుండా మోటారుషెడ్డు. (వసంతునివైపు చూస్తూ) గదికి మలుగుతక్కువ. మాలతీతీగ ఎక్కుస్తున్నాను. ఎన్నిసార్లు కిటికీకి నిలబెట్టినా జారిపడిపోతూ వున్నది.

భామసమ్మ

ఆస్పత్రికి వస్తానన్నావు. రావా?

సుభద్ర

పోదాము...వసంతమామా, ఈరాత్రి వెళ్లిపోతావా. వచ్చేటప్పటికి ఆలస్య మవుతుందేమో. ఇక్కడ అస్పత్రిలో పసిపిల్లలను పడుకోపెట్టేతొట్లు బాగా ఉంటాయట. చూడవలెనని ఉన్నది. రేపువెళ్లకూడదా నీవు.

వసంతరావు

ఎందుకమ్మా అంతభయము. నిన్నకూడా ప్రయాణము ఆపివేసినావు. మొన్నకూడా అట్లాగా అయినది.

సుభద్ర

(కష్టముతో) వెళ్లు మామా...నీకు సెలవులు అయిపోవస్తున్నాయి. లలితకు తోచదు.-ఇందుకుమాత్రము రిబ్బన్లు, కుట్టుకట్రైనులుకొని తీసుకొని వెళ్లు...అమ్మమ్మతోటి, తాతగారితోటి నేను కులాసాగానే ఉన్నానని చెప్పు.

(తలవంచుకొనును. కండ్లనుండికన్నీరుకారును.)

వసంతరావు

(పైన చేయివైచి నిమురుచూ) ధైర్యముగా ఉండవమ్మా ఫరవాలేదు. అన్నయ్యకూడా మామేకదా.

భామసమ్మ

రా, సుభద్రా ఇంక, చీకటిపడుతుంది.

(భామసమ్మ, సుభద్ర పోవుదురు.)

వసంతరావు

(కొంతసేపు ద్వారమువైపుచూస్తూ ఊరికే నిలుచుని, తరువాత జేబులువెతకి, రంగు రంగుల రిబ్బనుముక్కలు, పూలు, పట్టుదారము, ఒక్కొక్కటేచూచి, జేబులో తిరిగి వేసి) రామస్వామీ, తలుపులు వేసుకో. నేను బజారుకు వెళ్లుచున్నాను. (పోవును.)

[తెర]

మూడవ అంకము

[ప్రథమాంకములోని ఇల్లు. పెట్టెలు, అవి ఉంచుకొనే గది. సుభద్ర పెద్దట్రంకులోని వస్తువులు చిన్న సూటుకేసులోనికి సర్దుతూ ఉండును. ఇందిర ఇవీ, అవీ, తీస్తూ చూస్తూ ఉండును.]

ఇందిర

ఈచీర లేవీ తీసుకొని—వెళ్లవా అక్కయ్యా!

సుభద్ర

తీసుకొనివెళ్లను. పెట్టె పట్టదు.

ఇందిర

ఈ వంగపండు చాయదో.

సుభద్ర

(కొంచెముసేపు చూచి ఆలోచిస్తూ తీసుకొనును. చేతితో తడుముచు చిన్నపెట్టెలో పెట్టబోవును. హఠాత్తుగాతీసి) ఇది అమ్మమ్మ కొనిపెట్టినది. లలితకు ఒకటి ఇచ్చినది. నా కొకటి ఇచ్చినది. నా కింక అవసరము ఉండదు. కొంచెము మఱకమాత్రము అయినది. నలిగిపోలేదు, పలచనిదైనా. నీవు తీసుకొని కట్టుకో. అమ్మమ్మ ఏమీ అనదు. ఎంతో ఇంపుగా వుంటుంది.

ఇందిర

ఇన్ని ఫోటో లున్నవి పెట్టెలో. ఒక్కసారీ మాకు చూపెట్టలేదే. అన్నీ బావగారివి లాగా ఉన్నవి.

సుభద్ర

(ఒక్కటొక్కటిగ ఫోటోలు frames ఉండవు, తీయును.) చదువుకొంటూన్నపుడు, ఇంగ్లాండులోను ఉన్నపుడు తీయించుకొన్నవి. వసంత మామ ఇస్తూవుండేవాడు.

ఇందిర

నాకు యీ రెండు యిస్తావా. వారిదగ్గిర ఫోటోలు పెట్టుకొనే పుస్తక మున్నది. గొప్ప గొప్పవాళ్ల ఫోటోలు అందులో ఉంచారు. బావగారి ఫోటో లేదు.

సుభద్ర

ఇవన్నీ తీసుకో, ఇందిరా, నీకు కావలసిన ట్టయితే. (ఒక్క చిన్నఫోటోమాత్రము ఉంచుకొనును.)

ఇందిర

అదేమిఫోటో అక్కయ్యా.

(సుభద్ర అనుమానిస్తూ ఇచ్చును.)

ఇందిర

(ఫోటో చూస్తూ) ఇది బావగారు. రెండవది ఎవరో తెలియదు. ఎంత లావుగా ఉన్నదో చూడు. తలలో చెవిలో ఏమేమో వస్తువు లున్నాయి.

సుభద్ర

అప్పుడే పెండ్లి అయినది.

ఇందిర

ఇది నువ్వా?

సుభద్ర

అవును.

ఇందిర

అప్పు డలాగు ఉన్నావే.

సుభద్ర

అలా పుట్టించాడు.

ఇందిర

ఇవన్నీ పెట్టెలో పెట్టుకొని వస్తాను.

(పోవును.)

సుభద్ర

(పెట్టె సర్దుకొని దానిపైన కూర్చుని ముఖము చేతులతో మూసుకొని ఉండును).

(భామసమ్మ ప్రవేశము)

భామసమ్మ

సుభద్రా, అన్నీ సర్దుకొన్నావా.

సుభద్ర

(సుభద్ర చేతులతో కన్నులుతుడుచుకొని ముఖము ప్రక్కగా వంచి) ఊఁ.

భామసమ్మ

(పెద్దపెట్టెమీద కూర్చుని సుభద్రవైపు చూడకుండా) నా సామానంతా స్టేషనుకు పంపించి నే నొక్కదానినే వచ్చినాను.

(సుభద్ర చేతులు నెమ్మదిగా ముఖముమీద నుండి తీసివైచును. సుభద్ర వెక్కి వెక్కి ఏడ్చును).

ఇదేనా నువ్వుచెప్పినది; ఇదేనా నీధైర్యం? ఏడుస్తూ ఆస్పత్రిలో 'నర్సు' పని ఏమిచేయగలవమ్మా? ఎంతో నిబ్బరముగా ఉండాలి. మీ అమ్మమ్మవాళ్లు చూస్తే పంపించరు.

సుభద్ర

(ఏడ్పుమాని) ఒంటరిగా ఉంటే మరీ ఎక్కువగా ఉంటుంది.

భామసమ్మ

నిన్ను ఒక్కక్షణమైనా విడచిపెట్టనమ్మా. నిన్నుచూస్తూ నామణిని మఱచిపోయినాను ఈ రెండేండ్లనుండి.

సుభద్ర

అది అదృష్టవంతురాలు.

భామసమ్మ

ఏమిమాటలు, సుభద్రా!

సుభద్ర

లేదు.-పాపము, పోయింది, అంటారు. మా అమ్మ నన్నుకని కెవ్వున కేకవేసిందట. తరువాత ప్రాణంలేదు. అంతేకదూ.

భామసమ్మ

కొంతమంది అవస్థపడినవాళ్లూ ఉన్నారు. ఆస్పత్రిలో బాలామణిని చూడలేదా. ఎంత బాధ పడిందో రెండునెలలు!

సుభద్ర

అవును. రెండేనెలలు...విశాలమ్మనే పిచ్చిది ఉండేది నీకు జ్ఞాపక మున్నదా?

భామసమ్మ

దానిగోల ఎందు కిప్పుడు? రైలువేళ అయినది. నీవుపోయి ముఖము కడుకొని రా.

సుభద్ర

(లేచిపోతూ) పిచ్చికే మైనా మందున్న దేమో అని.

భామనమ్మ

పిచ్చికి మందేమిటి.

సుభద్ర

పిచ్చి రావడానికి. (పోవును.)

[పార్వతమ్మ ప్రవేశము]

పార్వతమ్మ

బండివచ్చినది. వెళ్లటమేనా. ఏది సుభద్ర?

భామనమ్మ

వస్తూంది. ముఖము కడుగుకొనుటకు వెళ్లినది.

పార్వతమ్మ

భామనమ్మా తల్లి తండ్రి లేనిబిడ్డ. ఎప్పుడూవిడిచి ఉండలేదు. నీమీా దేభారము.

భామనమ్మ

మీరు చెప్పవలెనా? మీాదగ్గిర ఇంకా మనసు విప్పి చెప్పదు. మీారేమీా బెంగపెట్టుకోవద్దు.

[ప్రవేశము-పద్మనాభంగారు]

పద్మనాభం

మళ్లీ ఏడ్పులు మొదలుపెట్టినావూ. నీ వలా చేస్తూఉంటే, అది ఎలాఉంటుంది?

ఆచేసిన వేమో మూటకట్టి వుంచావా?

పార్వతమ్మ

లలితను కట్టమని చెప్పినాను. కట్టి ఉంటుంది.

పద్మనాభం

ఏమి కట్టిందో (గ్రుడ్లనీరు త్రుక్కుకుంటూ పోవును.)

పార్వతమ్మ

ఏమో నేను పైకి ఏడుస్తాను. వారు లోపల లోపలే కుళ్లి ఏడుస్తారు. పెత్తనానికి ఈ కష్టా లేమిటి? కృష్ణా!

[వెంకడు ప్రవేశము]

వెంకడు

పెట్టె బండిలో పెట్టమంటారా.

పార్వతమ్మ

చిన్న పెట్టె తీసుకొని వెళ్లుతుందా ఏమిటి?

వెంకడు

అవునండి. ఆపెట్టెట.

[సుభద్ర, పద్మనాభం ప్రవేశము]

పద్మనాభం

ఉత్తరాలు వ్రాస్తూఉంటావు కాదూ: రోజువిడిచి రోజు వ్రాస్తూఉండాలి. మీా అమ్మమ్మ బెంగ పెట్టుకొంటుంది.

పార్వతమ్మ

ఏమో, సుభద్రా. మేము ఉన్నన్నినాళ్లయినా మాదగ్గిర ఉండకూడదా? లోటు లేకుండా చూస్తాను. (నాలుక కఱచుకొనును.) ఒక్క త్రైవు ఆస్పత్రిలో ఏమిపనిచేసెదవు తల్లీ! నా మాటవిను. నీవక్కడ ఉండజాలవు. (గడ్డము పట్టుకొని కన్నులనీరు నించును.)

సుభద్ర

అమ్మమ్మా, నావిషయమైవిచారపడకు. నన్ను మరింత దుఃఖపెట్టకు. ఈ ప్రకారముగా పర, స్త్రీలను సుఖపెట్టిఅయినను ఆనందించనీ. ఇంక యీజన్మలో చేయదగిన దేమి ఉన్నది నాకు? (పద్మనాభం, పార్వతమ్మలకు నమస్కరించును. వసంతుడు ప్రవేశించును. వసంతునికి నమస్కరించును.)

వసంత రావు

వెళ్లుచున్నావా సుభద్రా!

వెంకడు

(దగ్గఱకు వచ్చి) మాపిల్లవాడి సంగతి మఱచి పోకండి. అబ్బాయిగారితో చెప్పి డఫేదారు పని వేయించాలి.

వసంత రావు

నోరు మూసుకో—అధికప్రసంగం; నీ పనేమో నీవు చూచుకోలేవూ.

వెంకడు

ఎందుకండి అంతకోపం; మిమ్ములను అడిగి నానుకనుకా? అబ్బాయిగారిని, అమ్మాయిగారిని చిన్నప్పటినుండి ఎత్తుకుని ఆడించాను. (గొణక్కుంటూ పెట్టె తీసుకొని పోవును.)

పార్వతమ్మ

కామసమ్మా—మా అమ్మాయిని కిరస్తానం లోమాత్రముకలుపకమ్మా—సుభద్రా, కృష్ణ భగవానులను తలుచుకుంటూ ఉండు. ఆతడే కష్టములన్నీ గట్టెక్కించేవాడు — అయినా ఏమిచేస్తావు? జరిగినవాటికన్ని ఏమి చేస్తూ ఉన్నాము. ఎక్కడో అక్కడ మనవాళ్లు కారని బాగుంటే చాలును—మన పెంపకము ఇలా ఏడ్చింది.

(థామసమ్మ, సుభద్ర పోవుదురు.)

(పార్వతమ్మ ఉస్సు అని నిలుచున్న చోటనే కూలబడును. పద్మనాభం తల వంచుకొని ఇటూ అటూ పచార్లు చేస్తూఉండును.)

(చాలా సేపటికి)

పార్వతమ్మ

ఏమో, దగ్గిర లేదన్నమాటేకాని, ఇక్కడ ఉంటే దాని కేమి హెచ్చరిక, నా కేమి సంతోషము. తక్కిన కోడళ్లందఱు మంచి చీరలు కట్టుకొని, పువ్వులు పెట్టుకొని తిరుగుతూవుంటే, ఇది ఇలా ఉంటే నాకే కడుపులో ఆవేదన వేస్తుంది. దాని మేనత్తలాగున సంవత్సరమైనా కాపురముచేసి వెధవది కాలేదూ!

వసంత రావు

ఏమిమాటలమ్మా? ఎంతైనా వాడు కామేశమన్నయ్య.

పార్వతమ్మ

నా కడుపు దహాదహ మండుతూంది. నా కామేశం ఇలా నాకు చిచ్చు పెడతాడని అనుకోలేదు. మాణిక్యంపోయినపుడు వా డేడ్చిన ఏడుపు ఇంతింత కాదు.

(ప్రవేశము : శాస్త్రులుగారు)

శాస్త్రులు

ఏమండోయి విన్నారా. శారదా ఏక్టుఅయినది. ఇప్పుడు డైవర్సు ఏక్టుట. నీళ్ల పిండాకూడు ఏక్టు ఏమి కాదూ?

పద్మనాభం

(సంతోషముతో) నిజమేనా! మీదయవల్ల మా అమ్మాయికి పిండాకూడే పెట్టటమయింది. పదండి వస్తున్నాను.

శాస్త్రులు

ఏమండీ, అలా సెలవిస్తున్నారు.

పద్మనాభం

ఏమిలేదండి.—ఆ గీతారహస్యమేమో కనబడినదా.

శాస్త్రులు

తక్కినదంతా చెదలు కొట్టేసింది. ౭ (?) వ అధ్యాయము మాత్రము బాగున్నది.

పద్మనాభం

అది చాలును తలకెక్కతేను.—నువ్వూరా. ఏమిచేస్తావు, ఊరికేకూర్చుని. మనచేత నయినది కనుకనా. ఏవో యీకష్టాలు ఎప్పుడూ ఉండనే ఉన్నవి.

పార్వతమ్మ

సరే, ఏమిచేస్తాము? మింగి ఊరుకోవలెను.

(పోవుదురు.)

వసంతరావు

(నిలబడి చూస్తూ-చొక్కా-పరీక్షించి చూచి) అప్పుడే మాసిపోయినది. ఆచీర క్రొత్తది. రంగంటుకుంటూన్నది. ఇంకో చొక్కా ఉందో లేదో.

(ఒకపెట్టె లాగును)

[తెర]

---

# మా చందాదారులకు

---

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుల సంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుపగోరెదము.

మేనేజరు, 'భారతి.'

# పిశాచారాధన యెచ్చటనుండి వచ్చెను?

తేకుమళ్ల రామచంద్రరావు గారు, యం. ఏ., బి. యల్.

3*

షమనులనుగూర్చి చర్చించునప్పుడు మన మొక ముఖ్యవిషయమును గమనింపవలెను. సాధారణముగ మానవజీవితమున ముఖ్యములును, పవిత్రములును నగు విధులను నిర్వర్తించునప్పుడు షమన 'మతస్థు' లీషమనులను పిలుచుటగాని, తలచుటగాని లేదు. జననము, వివాహము, మరణము నను మూడిటను షమనుల కట్టి జోక్యమును లేదు. ఈ సందర్భములం దశుభసూచకము లగు విషయములు జరిగినేని షమను డప్పుడు పిలువబడును. అశుభ పరిహారమునకు దగువిధులను నిర్వర్తించి యాతడు వెడలిపోవును.

ఏ మనుజు డైనను చనిపోయినచో నాతని యాత్మ సాధారణముగ దయ్యమై బ్రతికియున్నవారికి కొలదిగనో గొప్పగనో హానిచేయు ననునూహ అనాగరకజాతులలోనే గాక నేటి భారతీయులలోగూడ కొంతవఱకు నిలిచియున్నది. కావున నొకనిమరణానంతరమున షమనమతస్థులు చాల జాగ్రత్తతీసికొందురు. షమను డిందలి ముఖ్యపాత్రధారియగును. చావు జరిగిన చాల దినములవఱకు తంతు జరుగుచునే యుండును. ఈతంతులో మొదటి మూడుదినములలో జరుగునదియు, నలువదియవ దినమున జరుగునదియు ముఖ్యములు.

మొదటి మూడుదినములలో నొక నల్లటిగుఱ్ఱము బలియొసగబడును. ఈ సందర్భమున 'షమనుడు' డప్పు మోతలతో, తంబురాలతో నాట్యముచేయుచు, పాడుచు, అరచుచు, మూర్ఛపోవుచు, లేచుచు నుండును. 'అశ్వమేధ' మైన తర్వాత 'షమనుడు' చనిపోయినవాని బంధువుల యెదురుగ్రొమ్ములకు తనచేతియందలి డప్పును ఆనించును. డప్పును వాయించుకఱ్ఱను వారివీపులకు తాకించును. ఎవరివీపుదగ్గర (చర్మమునకు క్రింద) వారియాత్మ యుండునని ఆదేశస్థుల నమ్మకము. ఇట్లు డప్పుతోను, కఱ్ఱతోను 'షమనుడు' గావించు తంతువలన అన్ని రకముల భయములనుండియు, అశుభములనుండియు బంధువులు విడివడుదురు. ఆపిమ్మట 'షమనుడు' తంబురాను బంధువులలో మరణించినవాని కెవ్వడు దగ్గరివాడో వాని చెవిప్రక్కన పెట్టి తీగలను 'టింగు టింగు' మనిపించును. ఇట్లు కొంతసేపు జరిగినతర్వాత, నాబంధువునిలోనికి వాని పూర్వులను 'సోమో'ల వంటి మంచివారి యాత్మలు ప్రవేశించును ఈ ఆత్మలు వానియందు నివాసమేర్పరచికొని యెల్లప్పుడును వానిని కనిపెట్టి యుండును.

ఇక నలువదియవనాటి తంతు విశదీకరించెదను. ఈతంతును జరుపుటకు చిన్నచిన్న 'షమనులు' పనికిరారు. చాలగొప్పవాడును, అనుభవజ్ఞుడును, తెలిసినవాడును నగు 'షమనుడే' యీతంతును సరియగు విధమున నిర్వర్తింపగలడు. అల్టాయ్‌వాసులలోను, నింకననేకులగు నితరులలోను నీకార్యసానుకూల ప్రదర్శనము విరివిగ వ్యాప్తమైయున్నది. వారి యభిప్రాయములప్రకారము, మరణించిన వ్యక్తియొక్క యాత్మ అగృహమందే యుండును. అచ్చటనుండి తొలగిపోవుటకు లేశమాత్రము నిచ్చగింపదు. తనతోకూడ తనకుటుంబస్థులలో గొందరియాత్మలుకూడ వచ్చినగాని మరణానంతరమున నివసింపవలసిన లోకమున కాయాత్మపోదు. ఈ కారణముచే మరణించినవాని బంధువులు చావు తప్పించుకొనుటకు పడవలసినపాటే యీ నలువవదియనాటి తంతు.

---

* సవరణ:— భారతి, సంపుటము ౭, సంఖ్య 3, పుట ౭౬౭, మొదటికాలం, ౼వ పంక్తి పిమ్మట ౨ అను అంకెను చేర్చుకొనవలెను.

షమన 'మత్థసు'లలో చనిపోయినవానికిని, అతని కుటుంబమునకునుగల దగ్గరిబంధుత్వమే యీతంత్రమునకును, యీనమ్మకమునకును మూలబీజమై యున్నది. ఆల్టాయ్ ప్రాంతదేశములందు శీతోష్ణస్థితివలనను, వైద్యసాహాయ్యము న్యూనమగుటచేతను, జబ్బులనేకములుపుట్టి లోకమును ప్రబలముగ గంపింప జేయుచుండుటచేతను దయ్యముల విరోధమువలననే యింత మూడుచున్నదని యచ్చటిజనులు తలంచుటలో నాశ్చర్యమేమున్నది?

'షమను' లీతంత్రము నారంభించుట తోడనే దయ్యము కంపించును. ఏదోగొణుగుచు, నుచ్చరించుచు, డప్పుగొట్టుచు 'షమను' నుద్రేకి యగుచుండును. అప్పుడు దయ్యమువచ్చి షమనుని చాలదీనముగ బ్రతిమాలుకొనును. తనకెట్టులైన తనబంధువులతో నుండ నిమ్మని కన్నీటితో ప్రార్థించును. కుమారులను కుమార్తెలను చూచి విడిచిపెట్టలేక మిగుల ఖేదించును కాని, డప్పుమోతతో షమనుడు దయ్యమును కట్టివేయ ప్రయత్నించును. ఆడప్పు సామాన్యమైనదా? కాదు కాదు. అందెన్నియో శక్తిమంతములగు దేవాదిగణము లుండును. తుదకు షమను డా మొండిదయ్యమును డప్పుకును, కఱ్ఱకును మధ్యకు రానిచ్చి ఆరెంటినడుమను కదలకుండునట్లు దయ్యమును నొక్కిపట్టుకొనును. దానినిక నీలోకమునుండి బంగీచేయవలయును గదా? ఇందులకై దాని నధోలోకమునకు షమనుడు పంపును. కాని అచ్చటి పాతదయ్యము లీక్రొత్త దయ్యమును రానీయవు. షమనుడు పానశాలి. కావున పాతకాపులతో కబుర్లు చెప్పి, యింత త్రాగుడు నీరు పోయించి క్రొత్తదయ్యము నచ్చట ప్రవేశపెట్టును. ఒకొక్కప్పుడీక్రొత్తదయ్యమును షమను డధోలోకమున ప్రవేశపెట్టజాలకపోవును. వెంటనే క్రొత్తదయ్యము పరుగు పరుగునవచ్చి గృహమున స్థిరాసనము వైచికొని కూర్చుండును. మరల పైతంతయు జరిగినగాని దయ్యమధోలోకము చేరదు. ఇచ్చటనేయుండి బ్రతికియున్నవారిని పీకుకొని తినుచుండును. పశువులను మనుష్యులను మరణింప జేయును.

కొన్ని కొన్ని సమయములందింట నుంచిన వస్తువులుంచిన ట్లుండవు. చోట్లు మారియుండును. ఆ చలిదేశములో నిండ్లలో మంచు ముక్కలు, మంచు పడియుండును. ఇవన్నియు నెట్లు సంభవించినవి! ఏనుంచిదేవతయో, ఏదయ్యమో యిందులకు కారణమై యుండవలెనని ఆప్రజ లూహించుట సమంజసమే కదా? కాని 'షమనుడు' తక్క అన్యుడట్టిదేవతలను దయ్యములను తనంతటతానే పారద్రోలరాదు.

దుష్ట పిశాచములను గొల్చు 'షమనులను' చూచినచో ప్రజలు గడగడ వణకుదురు. ఏలనగా నెవనిమీదనైనను కోపమువచ్చినచో, వానిమీది కేదుష్టపిశాచమునో ఆత డుసిగొలుపుచు, కొందఱకు పిచ్చిదయ్యములను పెట్టును. కొందఱకు రోగములు కలిగించును. కొందఱను చంపును. పిశాచములు, దయ్యములు వారిచేతి కీలుబొమ్మలైనప్పుడు, వానిని మనుష్యులలోనికి పంపకము చేసి షమనులు చేయజాలని దురాకృతమేదియు లేదు గదా?

పట్టిన దయ్యములను, పిశాచములను పారద్రోలు శక్తియు షమనునకు గలదు. ఈపనికై షమనుడు ముఖ్యముగ నుపయోగించు పద్ధతియేమనగా: బలసమన్వితమగు మఱొకపిశాచమునో, పిశాచనాథునో షమనుడు తనలో ఘట్టించుకొనును; మొదటి పిశాచముతో కలియబడును. తుదకు మొదటిపిశాచము తోకముడుచుకొని వెనుకకు తిరిగి చూడకుండ పారిపోవును. కావున రోగములు కలిగించుటయందును, తొలగించుటయందును పై పిశాచారాధకులకు మంచిశక్తి కలదు.

సోది చెప్పుటలో షమనుడు చాల గట్టివాడు. దేవతలయొక్కయు, దయ్యములయొక్కయు, పిశాచాదులయొక్కయు వాంఛలను కనుగొనుటకును, అభిప్రాయములను సేకరించుటకును షమను డచ్చటి ప్రజలకత్యావశ్యకముగ గావలసినవాడనుట నిస్సందేహము. అందఱు ప్రజలును కొంతవఱకీసంగతులను ఏ స్వప్నాదుల మూలముననో తెలిసికొనగలరు. కాని ముఖ్యములైన విషయములు, గొప్ప గొప్ప దేవతలు, పిశాచాదులు మొదలగు

వ్యక్తులవలన తెలియగవలసిన విషయములు షమనుడు తప్ప నింకెవ్వడు తెలియగజాలడు. పూజా పురస్కారములు, జాతరలు, బలులు, దయ్యములను పిశాచాదులను పారద్రోలుటకు చేయవలసినపని, భవిష్యత్తు, దూర ప్రదేశములందు జరుగుచున్న సంగతులు, రహస్యపు సంగతులు, దొంగసొమ్ము దాచినచోటు, దొంగలు దాగిన తావు, ప్రశ్నలు మొదలగు ననేకములగు సంగతులను షమనుడు చెప్పగలడు. ఈవిషయమై బుర్యాత్ జాతివారిలో నొక కథకలదని మిఖైలోవ్స్కీ అను నతడు వ్రాసెను. దేవుడు మొట్టమొదటి బుర్యాత్ వానికి శాస్త్రములనిచ్చెను. తన ప్రజలైన బుర్యాతులకడ కా పత్రములను తెచ్చుచుండగా త్రోవలో నొక గడ్డివాము కనబడెను. అత డాగడ్డివాము క్రింద నిద్రించుచుండగా నొక గొఱ్ఱె ఆపత్రములను మేసివేసెను. అప్పటినుండియు గొఱ్ఱెల భుజములదగ్గరి యెముకపై నది యంతయు లిఖితమై యుండెను. కావున షమనులు గొఱ్ఱెయెముక నుపయోగించి దాని సాహాయ్యమున సోదె చెప్పుదురు.

దయ్యములు, పిశాచాదులు మొదలగునవి షమనులకు పూనుటనుగూర్చి యిదివఱకే కొలదిగ చెప్పియుంటిని. ఇవి పూనినప్పుడు, అవి పూనినమనుజుల నోటితో ననేక సందర్భములం దనేకవిషయములను చెప్పును. ఇట్టి సమయములందు సోదెలలో సంగతులను తెలిసికొన్నట్లే పూనిన దేవతాదులనుండి సంగతులను ప్రజలు తెలిసికొనుచుందురు. షమన 'మతము'నం దీ పద్ధతికి 'కాంలానీ' యనిపేరు. ఇది షమనమతస్థుల కనుకూల్యమైనదియు, నితరదేశముల కంతగ వ్యాపించ నట్టిదియు నగు విశేషమని క్యాసో నోవిక్జ్ గారు వ్రాయుచున్నారు. ప్రపంచమునం దీపద్ధతివంటి పద్ధతు లొకప్పు డుండినను, ఇదియే అన్నిటికన్న చాల ప్రాచీనమైనదని జార్జ్ ఫుట్ మూర్ గారు ౧౯౨౩ వ సంవత్సరమున వ్రాసిరి.

ఇతరప్రజలవలె గాక షమనునకు వేఱువిధమగు దుస్తులుగలవు. తోళ్లు, ఇనుపముక్కలు, గజ్జెలు, ఉంగరములు, పాముల యాకారము వచ్చునట్లు మెలియబెట్టిన వస్త్రాదులు మున్నగునవి షమనుని యొడలిపై వ్రేలాడుచుండును. కాని యీదుస్తులకంటె నతిముఖ్యమైన దాతని చేతిలోని తుంగుర్. డప్పును వాయించు కఱ్ఱకూడ దీనితో సమానమైన ప్రాముఖ్యము కలదే. ఇవి లేనిదే షమనుడు మహాశక్తిమంతుడు కాజాలడు. డప్పు చప్పుళ్లను దేవతల చెవులలోనికిని, పిశాచముల చెవులలోనికి జొరబడజేసి వారిచే షమనుడు కేపని కావలసియున్నదో ఆపనిని చేయించు నేర్పీడప్పునకు గలదు. ఈ డప్పులు రెండు రకములు: గుండ్రని దొకరకము, కోల (బాదామి) దొక రకము. ఈ రెండవ రకములో, నిడివి ప్రమాణము రెండడుగులకన్న నధికముగ నుండదు. ఈ డప్పును చేతపట్టుకొనుట కొకపిడి కలదు. ఈ పిడి సాధారణముగ మనుష్యాకారముగ నుండును. తలయు, కాళ్లును డప్పుకంటికొని యుండును. మధ్యభాగ మీవలకు వచ్చియుండును. డప్పును నీ మధ్యభాగమునకును నడుమనున్న సందులో వ్రేళ్లను దూర్చినచో డప్పును చేతపట్టుకొనుట కనుకూలముగ నుండును. దీనిని తుంగుర్ అందురు. డప్పు పిడినిండ ఇనుపగజ్జెలును, చిన్న యినుప గంటలును కట్టియుండును. డప్పుమీద షమన 'మత' సంబంధములగు బొమ్మలు గీయబడి యుండును. షమనుని యీదుస్తులు డప్పు—ఈ యాకారమును, జూచినచో నతిభయంకరముగ మనకు గనబడును. ఈ యుద్యోగమున కాతడు నియమితు డగుటకు ముం దెంతో కష్టము నాతడు పడవలెను. బోధనకాలమున నాతడు నేర్చుకొను ముఖ్యవిషయ ముద్దేశము; తన్మయత్వము. వంశపారంపర్యముగ షమను డగు వాని కుగ్గుపాలనాడే యీమనః పరివర్తన మేర్పడును. ఈబోధనతో మనస్సే గాక షమనుని రూపముకూడ మారిపోవును. ముఖము మనస్సున కద్దమువంటి దన్నమాట యీ షమనుల యెడ ముఖ్యముగ చెల్లుచున్నది.

ఈ షమనులకు కొన్ని పక్షులు, జంతువులు ఇష్టము. వీనిలో గమనింపదగు విషయ మేమనగా, నన్నియు నల్లని రంగుగలవే యనునది. నల్లగొఱ్ఱె, పొట్టేలు, నల్లరాబందు, నల్లయెలుగు, నల్లమేక, నల్లపక్షులు—ఇవి వీరికి ప్రీతికరములు.

## ౪

పిశాచారాధనముగూర్చి మనము విశదముగ తెలిసికొనుటకు గాను, ప్రపంచమునందలి యేభాగమునందైనను ఇట్టి యారాధనము కలదా యని మనము నిర్ణయించుకొన్న ప్రశ్నకు సమాధానముగ నీమనమున ‘మతము మనకు గనిపించినది. కాని ఇది కనిపించినంత మాత్రమున నే పిశాచారాధన మెప్పటినుండి వచ్చెనో తెలిసికొనుటకు రాజమార్గ మేర్పడజాలదు కాని, మనమున ‘మతము’ నందలి పిశాచారాధనమువంటి సంప్రదాయములు, నమ్మకములు, అలవాట్లు మనదేశమున కనిపించినచో నీరెండిటికి నేదో సంబంధ మున్నదని మన మనుటకు బలవత్తరములగు కారణము లుండును. కాకున్నచో ప్రపంచమున నతిదూరమున బడియున్న రెండు వేఱువేఱు మానవ సంఘములలో నీ సంప్రదాయములు స్వయంజాతములైనవని కొక్కిరిపాదమునకు దిగవలసివచ్చును.

దయ్యములు, దయ్యములందలి నమ్మకము మన కేశస్థులలో ననేకులకు గలదు. మనమతస్థులలోవలెనే దయ్యముల బాధనుండి తప్పించుకొనుటకు మన ప్రాంతములం దనేకులు కష్టపడుచుందురు. దయ్యము లెవరిని గాటముగ ప్రేమించునో వారిని చంపి తీసికొనిపోవుననియు, అప్పటికిగాని ఆదయ్యములకు హృదయోపశమనము కాదనియు మనవారి నమ్మకము. దీనిని తప్పించుకొనుటకై భూతవైద్యులు ముగ్గులు, మారణహోమములు చేయుచుండుట మన మెఱుగుదుము. ఈ విషయమై నాకు స్వయముగ తెలిసిన దొకకథ కలదు. ఆంధ్రదేశమునందలి యొక యూరిలో నొకడు చనిపోయెను. చనిపోయి అతని భార్యను దయ్యమై పట్టుకొనెను. ఆదయ్యమును తఱుమగొట్టుట కెన్నిప్రయత్నములు చేసినను లాభము లేకపోయెను. గొప్పగొప్ప భూతవైద్యులు, మంత్రవేత్తలు వచ్చి సాంబ్రాణిపొగలు, ముగ్గులువేసి "నీ వేమిచ్చిన పోదు"వని యడుగుచుండిరి. "నే నెందుకు పోతాను? నా పెళ్లాన్ని తీసుకు పోతాను. నా కింకేమి అక్కర్లేదు. ఏమిచ్చినా పోను" అని భార్య నావేశించిన దయ్యము జవాబు చెప్పుచుండెను. ఆభార్య చిక్కిచిక్కి శల్యమై తుదకు మరణించినది.

మఱొకదయ్యము విషయమై నే నొకచిత్రకథ వింటిని. పూర్వము ౫౦ యేండ్ల క్రిందట కృష్ణాగోదావరీతీరవాసులు తిరుపతికి పోవుట చాలకష్టము. ఎంతకష్టమైనను దైవభక్తిచే నొకకుటుంబమువారు బండ్లు చేయించుకొని, ఇంక ననేకులతో గలసి తిరుపతికి ప్రయాణమై పోయిరి. తిరుపతినుండి వచ్చుదారిలో వారొక సత్రములో దిగవలసి వచ్చెను. ఆసత్రమునకు ఎదురుగ నొక చెట్టుమీద నొక బ్రాహ్మణుడు దయ్యమై నివసించుచుండెను. పైకుటుంబమువారికి సంబంధించిన యొకపదిపదునాఱేండ్లబాలిక రాత్రిపూట సత్రము ద్వారములోనుండి యీవలకు వచ్చెను. వెంటనే కెవ్వున కేకవేసెను. అందఱును పరుగెత్తికొని వచ్చిరి. ఆబాలికను లోనికి గొంపోయిరి. అదిమొదలుగ నాబాలిక చిక్కిపోవుచు ననేకవిధములుగ బాధపడుచుండెను. ప్రతిదినమును చాలకాల మాబాలిక యొడలు తెలియక పరుండియుండి, ఏ అర్ధరాత్రమునో లేచి యన్నమడిగి కొంచెము తిని మరల యొడ లెఱుంగకుండ పండుకొనుచుండెను. ఆభోజనకాలమునదప్ప వేఱుసమయములందెవ్వరేమడిగినను ఆబ్రాహ్మణుడే జవాబు చెప్పుచుండెను. ఆపిల్లను స్వగ్రామమునకు దీసికొనివచ్చిరి. ఎన్నిలక్షలమంది వైద్యులో వచ్చి చూచిరి. లాభము లేకపోయెను. అడిగినప్పుడు స్పష్టముగ తనయూరు, పేరు, గోత్రము, శాఖ మొదలగు వివరములన్నియు నాపిల్లయందలి దయ్యము చెప్పుచుండెను. కొన్నిదినములకు పిల్ల రాత్రిభోజనము కూడ మానివైచెను. చూచుటకు పేకదారమువలె సన్నగనుండెను. ఆసమయములందు ప్రశ్నించగా, వేఱొక దయ్యము జవాబు చెప్పుచుండెను. ఈక్రొత్తదయ్యము కోమటి వితంతువు. బ్రదికియున్నప్పు డాబ్రాహ్మణు డీవితంతువుదగ్గర ఉప్పుపప్పు సామాను కొని డబ్బీయకుండ నే మరణించెనట. ఆకారణముచే నాతని వెదకికొనుచు వచ్చి ప్రతిదినము ఆబ్రాహ్మణదయ్యమును పతాయించుచుండగా, నాతడు "నీబాకీ తీరేవఱకూ నువ్వు యిక్కడే వుండు" అనెనట. తుట్టతుద కొకగొప్పమంత్రవేత్త రాగా కోమటి వితంతువు తనబాకీ తీర్చినచో పోదునని చెప్పుటచే ఆబాకీ తీర్చి మాదిగవాండ్ర కిచ్చివేసిరి.

కాని బ్రాహ్మణదయ్యము పోలేదు. చీపురుకట్టతో కొట్టగా బ్రాహ్మణుడు తప్పించుకొనుటచే దెబ్బ బాలికకు తగులుటయు ఆబాలిక తనబంధువుల హృదయము పగులునట్లేడ్చుటయు జరుగుచుండెను. తుదకు 'మారణహోమము' చేయవలెనని యా మంత్రవేత్త చెప్పెను. ఇది జరిగించినవాని కుటుంబము నాశనమై పోవునని యొక నమ్మకముండెను. కాని ఆబాలిక తండ్రి యేమాత్రము జంకక మారణహోమము చేయించెను. దానితో నా బ్రాహ్మణదయ్యము యమపురి కేగెను. ఆబాలిక స్వస్థురాలయ్యెను. ఆ బాలికకు ముగ్గురక్కచెల్లెండ్రు. అన్నదమ్ములు లేరు. వా రందఱును పెండ్లిండ్లు చేసికొని బిడ్డలను పాపలను కనిరి. కాని వీరితండ్రివంశము మాత్రము నిర్వంశమై పోయినది.

చనిపోయినవారు దయ్యము లగుటయు, నితరులను పీడించుటయు మనమ 'మృతస్థు'లందువలెనే మనలోను వ్యాపించియున్న నమ్మకము. ఇదిగాక, ఎవరైన చనిపోయినచో నిల్లు మూసిపెట్టుట, యింటిని శుద్ధిచేయుట మున్నగునవి మనమతములోని భాగములైయున్నవి.

దుష్టపిశాచములను గొల్చు మనుజులు కొందఱు మనలోను కలరు. ఇట్టివారిని చూచినచో మనలో కొందఱు భయపడుచుందురు. పిచ్చిదయ్యములుపెట్టుట, చేతబడులుచేయుట, రోగములు తెప్పించుట మొదలగునవి వీరిపనులు. ఈవిషయమై నాకు తెలిసినవి కొన్నికథలు గలవు. ఒకయూరిలో నిరువురు స్నేహితు లుండిరి. వారిలో నొక డేదో దేవత నారాధించెను. చేతబడితంతును నేర్చుకొనెను. అది నేర్చుకొన్నవెంటనే ఎవరిమీదకో ఆదేవతను పంపవలెను. కానిచో ఆదేవత ఆరాధకుని మ్రింగివేయును. ఆయారాధకున కెవరిమీదను ప్రయోగించుటకు తోచక తన స్నేహితునిపై ప్రయోగించెను. ప్రతిదినముగాని, రెండుదినముల కొకసారిగాని స్నేహితుని చూడబోవుచుండెను. అపరిమితమగు రోగముతో స్నేహితుడు బాధపడుచుండెను. రాజవైద్యులెందఱో మందులిచ్చిరి. చేతబడిప్రకారము మరణకాలము సమీపించుచుండెను. రాజవైద్యులు గుడ్లుతేలవైచిరి. నాటిరాత్రిగడచుట దుర్లభమని చెప్పిరి. చేతబడి చేసిన స్నేహితు డామాట వినెను. ఆతడు సంతోషించుచుండెనో యేడ్చుచుండెనో నాకు తెలియదు. అప్పటికి సాయంత్రము మూడుగంటలైనది. ఆత డింటికి పోవుటతోడనే తనతండ్రితో ప్రస్తావించెను. తండ్రి యాతనియొద్దనుండి సంగతిరాబట్టి,బుద్ధిచెప్పి, త్వరితముగ రోగియింటికిపోయి జరిగినసంగతియు, కపాల మెచ్చట పాతిపెట్టినదియు చెప్పెను. అప్పుడు సాయంకాల మారుగంటలు. ఎవ్వరేమి చేయగలరు? అప్పుడు మాదిగగూడెమున కెవరోపరుగెత్తి చేతబడులు మొదలైనవి తెలిసిన ముసలిమాదిగవాని నొక్కని బిలుచుకొని వచ్చిరి. రెండువందల రూపాయ లాతడు పుచ్చుకొని పాతినపుఱ్ఱెను, అందలి కొబ్బరి, అక్షింతలు, కుంకుమ మొదలైనవానితో పదకొండుగంటలకు తీసివేసి దానికి జరుపవలసిన తంతు జరిపివైచెను. ఆరోగియున్న యింటికి ప్రక్కయింటిలో నొకప్రభుత్వోద్యోగికలడు. నాటిమధ్యాహ్నమాయుద్యోగిభార్య యారోగి బ్రదుకడని విని యిరుగుపొరుగిండ్లవారగుటచేతను, ఎరిగిన వారగుటచేతను మిక్కిలి దుఃఖించుచుండెను. వారింట వంటవానికి జోస్యము బాగుగవచ్చుటచే నామె వాని నీరోగివిషయమై జోస్యమడిగెను. నిజము చెప్పినచో వంటవాని కూతురు పెండ్లికి రెండువందల రూపాయలిచ్చుట కామె యొడంబడెను. రోగి స్వస్థుడగునని యాత డనెను. చేతబడి పుఱ్ఱె విషయమై నిర్వర్తింపవలసిన విధులు నిర్వర్తింపబడగానే రోగి స్వస్థుడుకా నారంభించెను. కొలదిదినములలో రాజవైద్యుల సాహాయ్యమున నాతడు సంపూర్ణముగ నారోగ్యమునుగాంచెను. ఆత డిప్పటికిని బిడ్డలను పాపలను గనుచు జీవించియే యున్నాడు.

పై కథ జరిగి పదునైదు సంవత్సరములు దాటినది. పన్నెండు సంవత్సరముల క్రిందట నొకగొప్ప సంగీతపాఠకుడుండెను. అత్యద్భుతముగ నాతడు గానవిద్యయందు పేరు ప్రఖ్యాతులు గాంచుట కారంభించుటచే ఈర్ష్యచేత నెవరో ఆతనికి పిచ్చిదయ్యములు కొట్టిరి. ఎన్ని మందులిచ్చినను ఆతనికి రోగము పోలేదు. ఈపన్నెండు

సంవత్సరముల నుండియు నాతడు పిచ్చివాడుగనే యున్నాడు. ఆరోగ్యము బాగుగనే యున్నది.

ఒకయూరిలో నొక కరణ ముండెను. ఆ కరణముపై సరిపడనివారు పిచ్చిదయ్యములను పంపకముచేసిరి. అతడు పిచ్చివాడైపోయి అందఱను కొట్టుచుండెను. అతని బంధించియుంచిరి; మందు లిప్పించిరి. నయము కాలేదు. తుదకు చెన్నపురి పిచ్చి ఆసుపత్రిలో ప్రవేశ పెట్టిరి. భోజనము పుచ్చుకొనక పోవుటచే బలవంతముగ పటకారులతో నోరు పగులదీసి పాలుపోయుచుండిరి. ఆసుపత్రిలోనే యాతడు మరణించెను.

ఈ పైరెండు పిచ్చిదయ్యముల కథలలోను దయ్యములను పంపకముచేసిన వారిపేరు మొదలగునవి రోగు లప్పు డప్పుడు తెలుపుచుండుటయు, ఆప్రశ్న యెప్పు డడిగినను ఆపేరులే చెప్పుచుండుటయు, భూతవైద్యులట్లే నిర్ధారణ చేయుటయు గమనార్హమగు విషయము.

కావున మన 'మతస్థు'లలో వలె భారతీయులలోగూడ చేతబడులు, దయ్యములు పెట్టుట, పిచ్చి రెత్తించుట మున్నగనవి వ్యాపించియున్నవని మనకు స్పష్టమగుచున్నది. ఏగొప్పశక్తినో, మహాశక్తినో ఆరాధించి యిట్టిరోగాదులను బాపుటయు, మనములలో వలె మనలోను ప్రబలియున్నది.

సోదె చెప్పుటయు మనలో వాడుకలో నున్నది. ఈపని ముఖ్యముగ నెఱుకలవారిలో స్త్రీలు చేయుచుందురు. మనకు దెలియనివి వారి కెఱుక. కావుననే వారు ఎఱుకలవారైరి. సోదెచెప్పుటయే వారికులవృత్తి. ప్రతి సోదెచెప్పు స్త్రీ దగ్గర నొక 'గద్దె'యుండును. దానికిచుట్టు కొయ్యయు,నడుమ నల్లటితోలునుండును. అందు కొన్ని గవ్వలు తాపియుండును. దానిమీద నింత పసుపు కుంకుమములు చల్లి,దానికి సలాములు చేయుచు సోదెచెప్పువారు సోదె నారంభింతురు. వారిదగ్గర నొక 'సొరకాయబుఱ్ఱ' కాయగాగల తంబురా యుండును. దాని కొకటి రెండు తంత్రులుమాత్రమే యుండును. వారుచేతిలో నొక పుల్ల పెట్టుకొని రెండవకొనను సోదె

కొన్ని భాగములను పాడుచుచు, కొన్నిదిక్కుల కాకత్తిను చూపుచు, గద్దెకు మ్రొక్కుచు సోదె చెప్పుచుందురు.

మన'మతస్థుల'లో వలె మన దేశమునకూడ నింకొకవిధముగ సంగతులను తెలిసికొను మార్గము గలదు. ఏ పిశాచమో, దయ్యమో, క్షుద్రదేవతయో కొందఱకు పూనుచుండును. అంతట వారు నైజనైఖరిని విడనాడి తోచినదంతయు చెప్పుచుందురు. అప్పుడువారి నేవైన ప్రశ్న లడిగినచో జవాబిత్తురు. వర్షములెందుకు కురువలేదు? పోచమ్మ,మారెమ్మల కాగ్రహ మెందుకు వచ్చినది? అదెట్లుపోవును? త్వరలో జరుగవలసిన జాతరలున్నవా? రహస్యపు సంగతులేమున్నవి? అవేవి? దొంగసొమ్మెచ్చట నున్నది? దొంగ యెవరు? ఇట్టి ప్రశ్నలకు పూనినవారు జవాబిత్తురు. ఇట్టిదృశ్యమును నేను సుమారు పదమూడేండ్లక్రిందట చూచితిని. ఆమెయొక స్త్రీ. చేత నొక ఏడాది బాలిక యుండెను. ఏదో మాటలాడుచున్న ఆమె తన శిశువు నచ్చట కూలవైచి గర్జించుచు లేచెను. జుట్టుముడి వీడిపోయి శిరోజములు వీపుపై నడయాడుచుండెను. శిశువు చేయురోదన మామెచెవి నాకర్షింపలేదు కాబోలు! ఆ తాండవమును చూచి అందఱును బెదరుచుండిరి. గుంపులు గుంపులుగ ననేకు లచ్చట మూగిరి. ఇంతలో నింత పసుపుముద్దను గుంపులో నెవరో యామెమీద బారవైచిరి. ఆమె దానినందుకొని గర్జించుచు అడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పుచు, నింక ననేక సంగతులుచెప్పుచు, ఆ పసుపుముద్దను మ్రింగెను. ఆముద్ద పెద్ద నారింజకాయ యంతది. మఱింత పసుపుముద్దల నెవరో పడవైచిరి. ఇంతలో కొందరు పురుషులు బిందెల కుచ్చులుగట్టి నూతులలోని జలమామెపై సహస్రధారలుగ బోసిరి. పసుపుముద్ద నామె ముఖమునిండ రాసికొనెను. కొంతసేపటి కామె మఱల మన ప్రపంచములోనికి వచ్చెను. "ఏమిటమ్మా, నా గుడ్డంతా తడిసింది?" అని ప్రశ్నించెను. అప్పుడు పిల్లను సముదాయింప నారంభించెను.

ఇట్టి 'పూనుట' లతో మైత్రిగలవే గరగలు,

వినువారి కందిత్తురు. ఆకత్తితో వినువారి దేహములో నాట్యములు ఈగరగలు నాట్యముల సందర్భమున



వ సం త రా గి ణి

రితు దేఖ బసంత థజీ(?)మయ మంతుసూ ఆమకే మోర నికుజ బికాసీ,
కామ కలోల హి ఆయే బసంత సేధావన కో సువరాసీ,
చిత్త హులాస ఓలాస హులాస గులాల అబీరకో ఖ్యాల ప్రవ కాసీ,
దీపగంగకే రాగనీ సోదీ(?) బసంత దీ(?)హా సుథనాను సోభాసీ.

తోళ్లు, గజ్జెలు, మున్నగువాని ననేకములను ధరించు యాచారము. ఇంకను గ్రామదేవతలకు, మశూచికాధికారిణి యగు పోతమ్మకు, వాంతి, భేది కలిగించు మారెమ్మకు, టైఫాయిడ్ అను విషవ్యాధికి కారకురాలగు ముత్యాలమ్మకు, దగ్గులమ్మకు, బంగారమ్మకు, మహిషమ్మకు, ఇల్లమ్మకు, చాముండమ్మకు, నూకాలమ్మకు, పైడమ్మ, తట్టమ్మ (తడపర)కు, అంకాలమ్మకు, ఎల్లమ్మకు, గంగానమ్మకు ప్రీతిగ నాట్యములు, జాతరలు జరుగుచుండును. అప్పుడు పసుపు, వేపాకు, తోళ్లు, ఇనుపముక్కలు గజ్జెలు, గవ్వలు, నీరు ముఖ్యములగును. ఆసమయమునందు వారొక డప్పు నుపయోగింతురు. దానికి గజ్జెలుండును. పాటలుపాడుచు నాట్యముచేయుచు ఆడప్పును వారు వాయించుచుందురు. చిన్నపిల్లలాదృశ్యమును చూచినచో తప్పక జడిసికొందురనుట నిశ్చయము.

ఈ అమ్మవార్లకు నల్లని జంతువులే మిక్కుటముగ నిష్టము. చాలకాల మొకనల్లని మేకను పెంచుటయు దానిని బలియిచ్చుటయు నేను చూచితిని. ఆరక్తధారలు, ఆకత్తివ్రేట్లు, ఆమేకకు సంగతి తెలియుగనే అది కదలక మారాముచేయుట వీనినన్నిటిని చూచితిని. ఆనాడే అనూకాలమ్మకే కొన్నినల్లని కోడిపుంజులు బలిపెట్ట బడినవి.

మనుషులకును మనవారికిని యీ యాచారములలో గల సాదృశ్యము పాఠకులకు చక్కగ గోచరించియుండును. ఇందలి నల్లని ముఖ్యవిషయమును గూడ పాఠకులు గుర్తించియుందురు. ఇవన్నియు ఎఱుకలు, యానాదులు, మాలమాదిగలు మొదలగువారిలో మిక్కుటముగ ప్రబలియున్నవనియు, వారినుండియే శూద్రులకు పాకినవనియు, అందుండి కొలదిగ, బహుస్వల్పముగ నితర వర్ణములవారిలోగూడ ప్రాకమాపినవనియు వాని మొగము మీదనే కనబడుచున్నది. ఇది ఆర్యులది కాదనియు, అంతకుపూర్వ మీదేశమున నివసించినవారిదనియు స్పష్టము. వారిలోని కీనమ్మకములు మున్నగునవి ఎట్లువచ్చినవి? మనుషులతో నిట్టి సాదృశ్యము, ఇన్నివిషయములలో సాదృశ్య మెట్లు వచ్చినది?

## పిశాచారాధన మెచ్చటనుండి వచ్చెను?

పురాతనకాలమున ఈజిప్టు, ప్యాలస్టైన్ మొదలగు దేశములతో దక్షిణభారతదేశము వర్తకవ్యాపారములను చేయుచుండెనని నిదర్శనములు గలవు. కావున "అమ్మన్" అను దైవము ఈజిప్టునుండి ఇచ్చటికి వచ్చెనని కొందఱు నమ్ముచున్నారు. అది నిజమేకావచ్చును. ఈ"అమ్మన్" లోనుండి యిన్ని దేవతలు పుట్టినవా? ఈ సందర్భమున మన మొకవిషయము జ్ఞప్తియందుంచుకొనవలెను. ఈజిప్టునకు, మనదేశమునకును వాణిజ్యము జరిగి, నాగరికత గలిగియున్న స్థితిలో పిశాచారాధనము మనదేశములోనికి వచ్చియుండజాలదు; అది అసంభవము. అంతకుముందు చాలప్రయాణములు జరుగుటకు వీలులేదు. దక్షిణ భారతదేశస్థులు నౌకా ప్రసక్తియందుగాని వాణిజ్యమునందుగాని తరిఫీయదు కాకమునుపే, అనగా నాగరికత విజృంభించక మునుపే పిశాచారాధనము వచ్చియుండవలెను. అట్టిసందర్భమున అది సముద్రముపై వచ్చెననుట కాధారములులేవు. అదియునుగాక మాలమాదిగలలో నిది కనిపించుచున్నదిగాని, వారికంటె నగ్రవర్ణములనువారిలో నిది కనబడుటలేదు. కనబడినను నిమ్నజాతులనుండి వారికంటినదిగ గనబడుచున్నదిగాని, తమనుండిపోయినదిపోగా మిగిలినదిగ గనబడుటలేదు. కావున వాణిజ్యాదు లున్నతములై యున్నప్పుడే పిశాచారాధనము మనదేశములో ప్రవేశింపలేదనియు, అది నిమ్నజాతులలోనిదనియు, నేటికిని ఎఱుకలు సోది చెప్పుటయు, మాదిగలు చేతబడులను మాన్పుటయు, నింక నిట్టి వనేకములు నిమ్నజాతులవారి యధీనమై యుండుటయు జూడ "అమ్మన్"మాట ఎట్లున్నను, పిశాచారాధనము నందుండి "అమ్మన్" వఱకుగల తంతు నమ్మకములు మున్నగునవియు ఈజిప్టునుండి రాలేదని ఘంటాపథముగ చెప్పవచ్చును.

ఈజిప్టుమాట నవతలబెట్టిన వెనుక మనమొకటి గమనింతము. ఆక్స్ఫర్డు నగరమున 1914వ సంవత్సరములో యం. ఎ. జ్జాప్లికా గారు 'అబోరిజనల్ సైబీరియా' యను పుస్తకమును ప్రచురించిరి. అందు వారిట్లు చెప్పియున్నారు: "సైబీరియా దేశము మిక్కిలి శీతలదేశము.

అచ్చట గాలి దుమారములు, మంచుదుమారములు విశేషముగ చెలరేగుచుండును. శీతకాల మతిదీర్ఘము. తినుటకు దొరకక ప్రజలు బాధపడుచుందురు. భయముతో వారు కొట్టుకొనుచుందురు. ఈకారణముచే అచ్చటిప్రజల కిది సహజమైన మతము. అచ్చటిప్రజలేగాక అచ్చట నివాస మేర్పరచుకొను యూరోపియనులుకూడ ఆనమ్మకములందు చిక్కుకొందురు." దీనినిబట్టి మనకొకవిషయము బాగుగ తెలియుచున్నది. క్షుధార్తులై, భయాతురులైయున్న ఆప్రాంతస్థులలో సంచరింపవలసిన మతము గాని యితరప్రదేశములం దంచరింపవలసినది కాదిది. సకలసస్య సమృద్ధములగు భూమధ్యరేఖా ప్రాంతభూములందుగాని, దురంతచింతతో బాధపడవలసిన యవసరము లేని సమశీతోష్ణ సమన్వితమగు భూభాగమునగాని యిది యంకురింపజాలదు. అట్టిప్రదేశములలో సంచరించినవి ఆర్యుల మొదటి నమ్మకములు. వానికిని పిశాచారాధనమునకును హస్తిమశకాంతరము కలదు.

ఇంకొక విశేషమేమనగా: షమనమతమునందలి యంశములను తిలకించినచో మానవుని శైశవదశలో నుండదగిన నమ్మకములుగ నవి కనిపించుగాని కొంతవఱకు నాగరకత గలిగినపట్ల వర్తించు నమ్మకములుగ నవి గనిపించవు. దాని పుట్టుపూర్వోత్తరము లట్టివని పండితాగ్రేసరు లందరును నమ్ముదురు.

ఇంతేగాక ఆర్యులయొక్క మతమునకును, ప్రథమమున వారు నమ్మిన యంశములకును, సైబీరియావాసుల యీషమన సృష్టిప్రకారమునను గల కొన్ని పోలికలను, హీబ్రూలు, అరబ్బులు, మొదలగువారి సృష్టిప్రకారాదులకును వీరికథలకును గల కొన్ని పోలికలను చూచినచో [క్రిందటి వ్యాసమును చూడుడు] వీరందఱు నెచ్చటనో కలయిక యుండెనని తోచును. ఆర్యులెచ్చట ప్రప్రథమమున నుండిరను ప్రశ్నకనేకములగు ప్రత్యుత్తరములున్నను ఆర్కిటిక్ సముద్ర ప్రాంతభూములనుండియో మధ్య ఆసియానుండియో యిటకు వచ్చిరనువాదము ప్రబలమైనవాదము. కావున ఆర్యులకును యీషమనులకును ఆర్యుల యాదిమ నివాసస్థానమునందే కలయికయుండి యుండవచ్చును. లేక వారును వీరును అన్నదమ్ములేమో? దక్షిణమునకు వచ్చిన ఆర్యులు క్రొత్తమతములు సృష్టించిరి. క్రొత్తకథ లల్లిరి. అచ్చటివారు మఱొకరకపు కథ లల్లుకొనిరి. ఇది నిజమగుచో వారన్నదమ్ములవారగుదురు గదా?

నీగ్రోలు, ముండాజాతివారు మొదలగు వారిని గూర్చిన వాదము లిదివరకే చల్లారిపోయినవి. పైగా పిశాచారాధనారంభమునకు వారిదేశపు శీతోష్ణస్థితికన్న సైబీరియా వారిదే చక్కగా సరిపోవుచున్నది.

కాబట్టి పిశాచారాధనము సైబీరియా తూర్పుభాగమున జననమొందినది. అప్పటికప్పుడే ఆర్యులు అచ్చటి ప్రజలనుండి విడిపోయిరి. తూర్పుసైబీరియానుండి ఏమార్గముననో అది భారతదేశమును ప్రవేశించినది. దానిని తీసుకొనివచ్చినవారు ప్రస్తుతపు మాలలు మాదిగలు ఎఱుకలు మొదలగువారి పూర్వులు. ఆర్యమతమునకును దీనికిని పోటీవచ్చి ఆర్యమతము విజయమందినను ఆమతములోను, ఆమతస్థులలోను కొంతవరకీభారతదేశపు టాదిమవాసుల నమ్మకములు వ్యాపించినవి. 'అమ్మోరు' ఈజిప్టునుండి వచ్చియుండవచ్చును. ప్రథమమున నున్న నమ్మకములందు, తంతులందు కాలక్రమమున మార్పులు వచ్చియుండవచ్చును. కాని నేటికిని అనేక వేలసంవత్సరముల క్రిందటి నమ్మకము లీ భారతీయాదిమవాసులలో ప్రబలుటయు షమన మతస్థులతో నింతపోలిక గనబడుటయు నాశ్చర్యకరములగు విషయములు. విజ్ఞానాభివృద్ధికిని పరిశోధనకును వీరిచరిత్ర మతి ముఖ్యము. కావున మనదేశపుటాదిమ వాసులకు సంబంధించిన అన్నిసంగతులను సేకరింపవలసినవిధి మనపైనున్నది.



ఈ వ్యాసమున నేను సూచించిన విధమున జరిగి యుండుననుటకు నాకు బలవత్తరములగు కారణములు కనబడినందున వానిని పాఠకలోకమునకు సమర్పించితిని. దీని విషయమై పరిశోధన జరిగిన కొలది క్రొత్తవిషయములు, క్రొత్తదారులు మనకు గోచరించుచుండును. అప్పుడిందలి యభిప్రాయములందు పరివర్తనము గలుగవచ్చును. కాని అట్టి మార్పునకు తగు కారణములు దృఢముగ నిర్మితములగువఱకు ఈ పై నాయభిప్రాయములు పరిశోధకులకును, చరిత్రకారులకును నభిమతము లగును.

---

# కురుక్షేత్రము*

ఓలేటి వేంకటరామశాస్త్రి గారు

౧

ధర్మ మధర్మ విధ్వంసంబుఁ గావించి యాత్మబలముఁ జూపినట్టి చోటు
భీష్మాది భారత వీరాగ్రసరుల దివ్యాత్మలు లీనమైనట్టి చోటు
భగవంతుఁ డజ్ఞాన పరవశుం డగు క్రీడి కాత్మబోధ మొనర్చినట్టి చోటు
భావితాత్ములు ధౌమ్యబాదరాయణ ముఖ్యు లాత్మ ధర్మము నేర్పినట్టి చోటు
కన్ను లున్నందులకు సార్థకములుగాఁ గఁ-దనిసి పులకించి దర్శింపఁ దగినచోటు
పరమ విజ్ఞానజనకంబు దురితహరము-నగు కురుక్షేత్రమును గన్నులారఁ గంటి.

౨

ప్రవహింపఁ బోలు నీపట్ల భారతమహా శూర విశ్వశ్లాఘ్య వీరరసము!
భరతయోధుల ధర్మబలమూర్తి యిచ్చోటఁ బ్రత్యక్షమై కనుపట్టఁ బోలు!
ప్రజ్వలింపఁగఁ బోలు భరతమాతృ తనూభవ ప్రతాపాభీల వహ్ని యిందు!
భారతీయుల దీర్ఘబాహు విక్రమలక్ష్మి వెలయ నిమ్మోడఁ దాండవింపఁ బోలు!
అద్దిరా! యల్లనాఁడు మాయామనుష్య-వేషమున నున్న యయ్యాది విష్ణుమూర్తి
యనఁగు మేనత్తకొడుకైన యర్జునునకు-నాలమునఁ దేరు నడపెఁ గాఁబోలు నిచట!

---

* ఇది శ్రీపురాపురము మహారాజావారి యనుగ్రహాతిశయమున వారితో నుత్తరదేశ యాత్ర సేయు సందర్భమున శ్రీవారియాజ్ఞ ననుసరించి, ౫-౧౨-౧౯౩౭ వ తేదిని కురుక్షేత్రము (రైల్వేస్టేషను) లోఁ జెప్పఁబడినది.

౩

ధనలోభమున సుయోధనుఁడు దాయల కీక పోరాడి యిట నీల్గిపోయె నకట!
యమలినప్రభుభక్తి కాత్మార్పణ మొనర్చి రాధేయుఁ డిచ్చోట ప్రాలె నకట!
పాడి దప్పిన బాహుబల మొండె నమ్మి దుశ్శాసనముఖు లిందుఁ జచ్చి రకట!
యేలినాతని ఋణం బీఁగ భీష్మద్రోణు లీయెడఁ బ్రాణంబు లిచ్చి రకట!
పౌరుషంబున కుసురులు బలియొసంగి-యెందఱో వీరవరు లిందు ప్రమంది రకట!
అట్టివారలతనువు లీమట్టిలోనఁ-గలసియున్నవి కాఁబోలుఁ! గానఁబడవు.

౪

గాంగేయుఁ డిచట నెక్కడ నంపసెజ్జపై నొరగి భౌతికదేహ మూడ్చెనొక్కొ?
ఆచార్యుఁ డెయ్యెడ నస్త్రసన్యస్తుఁడై ప్రాయోపవేశంబు పట్టెనొక్కొ?
విప్రుని ఘోరశాపప్రభావమునఁ గర్ణునిరథం బెచ్చోటఁ గ్రుంగెనొక్కొ?
అసహాయశూరుఁ డాయభిమన్యుఁ డేచోటఁ దమ్మిమొగ్గరమందుఁ దగిలెనొక్కొ?
ఉగ్రరూపంబుతో నావృకోదరుండు-చెనఁటిదుశ్శాసనుని ఱొమ్ము చీల్చి లోని
ప్రేవులు పెకల్చి రుధిరంబు పీల్చివైచి-తనదు పగ నెందుఁ దీర్చికొనియెనొక్కొ?

౫

ఎక్కడ నేమహామహు నహీన పవిత్రశరీర మాజిలోఁ
జెక్కులువోయి మృద్వికృతిఁ జెందెనొ యియ్యెడ! దీని నెట్లు నేఁ
ద్రొక్కుదుఁ గాలు మోఁపి? మది దొట్రిలుచున్నది; కేలు మోడ్చి నే
మ్రొక్కెద నెన్నొ నల్ పుడమి మోయఁగ మత్కులుషంబు వాయఁగన్.

౬

నెత్తుటియేరుల నెమ్ముల-మొత్తంబులఁ బలలఖండముల నీస్థలి మున్
జొత్తిలియుండియుధర్మము-పొత్తువిడనిదగుటఁ బుణ్యభూమియె యయ్యెన్.

---

కవికొండల వేంకటరావుగారు, బి. ఏ., బి. యల్.

## శు చి మ తి

"అది శరీరము యొక్కయు నాత్మయొక్కయు పరస్పర వ్యామోహమా? లేక ద్వంద్వయుద్ధమా?"—సుకుమారద్యోతనుని మనస్సునం దానాటిరాత్రి తాండవం బాడిన సమస్య యది యొక్కటే. పైజను లేమనుకొనుచున్నది యతనికిఁ దెలియదు. వైద్యుఁడు మందు ఏమిచ్చుచున్నది యతఁ డెఱుంగడు. ఎంతకాలము నుంచి మంచముపై నాతఁడున్నది యింక నెంతకాల మట్లుండవలసినది యతఁడు యోజింపడు. "అది శరీరము యొక్కయు నాత్మ యొక్కయు పరస్పరవ్యామోహమా? లేక ద్వంద్వయుద్ధమా" యను నొక్కటే సమస్య సుకుమారద్యోతనుని మనస్సునం దానాటిరాత్రి దాండవం బాడునది.

ఒకనిముసమం దాతఁ డేమనుకొనును? "సొగసైనశరీరము: చక్కనియూహాతోఁగూడిన మనస్సు—ఓ! జీవకళా! దానిని నీవు వీడుటా?" అని తలపోయు. మఱియొక నిముసమం దాతఁ డేమనుకొనును? "హేయమైన శరీరము: క్షణభంగురము. తలపులా—బుద్బుదప్రాయములు. ఓ! జీవకళా! దీనిని వీడి శాశ్వతమగు మఱియొక దాని నాశ్రయింపుము." అని వితర్కించు.

ఆతని ప్రక్కనున్నవా రెవరు? నవమోహనసుందరారవింద ముకుళిత కోరకంబు భాతి నొదిగియున్న యతని భార్య శుచిమతి: అమాయకపుటాటల మరగి 'ఇది పరిస్థితి' యని నేరని యతని ముగ్ధకుమారీకుమారగణంబు ధ్రువుఁడు సరస్వతి మున్నగువారలు. ఒక నేర్పరి యగు వైద్యుడు.

వారియందఱియొక్క మనోవృత్తియు నేమి? రోగియొక్క శరీరము నిలిపి యెప్పటి పొలుపు నందగింపఁజేయుటయే. రోగిమనస్సునందున్న తార్కికము వా రూహింపరు.

వైద్యుడు నాడి చూచి 'బిడ్డా!' యని ధ్రువుని బిలిచి నాతో వెనువెంట రమ్ము. నీచేతికొకమందు నిత్తు. తీసికొనివచ్చి మీతండ్రిగారి కిమ్ము!' అని ఆందోళన సూచకమ్ములగు నడకలతో గది వెలువడిచనియె. ధ్రువుడు వాని వెనువెంటనే చనియె. సరస్వతి మున్నగు తక్కుంగల పిల్లలు చిరునవ్వుల నొకరు వీధిలోనికి, నొకరు పెరటిలోనికి బోయి తిరిగి లోపలకు వచ్చి పండుకొనిరి. శుచిమతిమాత్రము మంచముపజ్జ కూర్చుండి సుకుమారద్యోతనున కుపచారముగ మంచినీళ్లు మున్నగున వందిచ్చుచుండెను. ఒకసారి మంచినీళ్లు త్రాగుటలో వానికన్నుంగవ యశ్రుపూరిత మగుచు తరళసల్లలితములగు చూడ్కుల నామెవదనమ్ముపైఁ బఱపెను.

శుచిమతి మో మప్పటి కెట్లున్నది? పది రోజులనుండి యప్పటికి రాత్రింబగళ్లు నిద్రాహారములులేక భర్తసేవనే వసివాడి కసుగంది

కన్నులు లోపలికి బోయి చెక్కిళ్లు పేలవములై యతి నీరసముగ నున్నవి. ఇటు తిరుగునప్పు డా పైనొసట వ్రాలు ముంగురులును, నటు తిరుగు నప్పుడు పిఱుదులకంట వ్రేలాడు పెన్నెఱు లునుమాత్రము నాకర్షించున వంతియే. సుకుమారద్యోతను డట్టి తన ముగుదనుజూచి 'ఓ! శుచీ! సుముఖి! ఏటి కీదుర్భరశ్రమ నీకు?' అని కనులు మూసెను. శుచిమతి గద్గదస్వరముతో 'ఏ మది? ఎట్లున్నది?' అని యతని నడిగెను. 'ఎట్లున్న దేమిటి? నాకు నెప్పటివలెనే యున్నది. నీ కెట్లు కనబడుచున్నాను? బలముగా లేనా? ఎప్పటి సుకుమారద్యోతనుడుగా గనబడుట లేదా? ఎట్లున్నదని యడిగెద వేల? నేను విడుమర నందఁబోవుచున్నాను. న న్నాపకుము. నన్నాపకుము...' అని యట్టె కనులు రెండవమాఱు మూసె. శుచిమతి పాదములు పట్టి చూచె. అవి మిక్కిలి చల్లగ నగుపించినవి. హృదయము ముట్టి చూచె. అది వెచ్చగ దడదడ కొట్టుకొనుచున్నది. మఱియొకమా ఱాపె 'ఎట్లున్నదండీ!' అని దీర్ఘదీనస్వరముతో పలుకరించెను. 'ఎట్లున్నట్లు నీ కగపడుచున్నది?' అని సుకుమారద్యోతనుడు మాఱడిగెను. 'గుండెలు వెచ్చగా నున్నవి—కాళ్లు చల్లగా నున్నవి' అని శుచిమతి బదులాడెను. 'హృదయము నీతో నున్నది: శరీరము నాతో నున్నది' అని యాతడు మూడవ సారి కనులు మూసెను.

శుచిమతి గజగజవణకుచు తొట్రుపాటుతో వీధిలోనికిఁ జఱచఱ నడచి 'వీరా? వారా?' అని కూయఁదొడంగెను. రాత్రి జామైనసమయము. ఒకదీపము వారియింటికి కొంతదూరములో పురపాలక సంఘమువారిచే వెలిఁగింపఁబడినది కునుకుచు కునుకుచు నుండి వెలుతు రిచ్చుచున్నది.

ఆకసము మబ్బుగ్రమ్మియున్నది. దూరమున నొక వంగిసకొమ్మల నావరించుకొని యున్న తురాయిచెట్టున్నది. ఆచెట్టును గనుక ఆమె చూచియుండెనా యానిశీథిని నయ్యది యొక పెనుభూతమువలె నామెకు భయము గొల్పెడిది కాని యామె దానివంక చూడలేదు. దీపపుఁగాంతివంకనే యామె తిన్నగఁ జూచినది. వీరా వారా యని యనబోయెను గాని గొంతు లేవలేదు. ఆమె ధ్రువుని కడుసమీపమున నంతలోఁ జూచినది. 'బిడ్డా! మందు దీసికొని వచ్చితివా?' యని యాపె యడుగుటలోనే యతని చేతిమందుఁ దాను దీసికొనుచు బిడ్డనితోఁ గూడ లోనికిం బోయి మోతాదుమందును సుకుమారద్యోతనుచేఁ ద్రావించి 'ధ్రువా?' అని పిలచెను. ధ్రువు డేడీ? అప్పుడే దుప్పటి కప్పుకొని మంచముపైని ప్రక్కగదిలో బండుకొని యున్నవాఁడు. ఆపిలుపు విని కుఱ్ఱవాఁడు 'ఇఁక నే నెక్కడికి వెళ్ల లేనే? నే నలసిపోయినాను. అస్తమానమును పనే. నాకు నిద్దుర పట్టిపోయినది. నే లేవలేను' అని మాటాడెను. శుచిమతి 'అదికాదు నాయనా? వైద్యు 'డీమందు మంచిమందు తప్పక పనిజేయు'నని చెప్పి యిచ్చెనా?' అని యడిగెను. 'పనిచేయక పోవునదైన

వచ్చెదరా?' అని కుట్టువాఁడు గొణఁగుచు మేనుమఱచి నిద్రించెను.

శుచిమతి మగనిమోమువంక తన దృష్టి నంతను కేంద్రీకరించి యానాటిరేయి తెల్లవాఱ గట్ల అయిదుగంట లగువఱకు—పళ్లెమన్న పళ్లెము, గిన్నెయన్న గిన్నె, నీళ్లన్న నీళ్లు, పాలన్న పాలు, కావలెనన్న దెల్లయిచ్చి, వద్ద న్నదెల్ల మాని, మగనికిఁ బరిచర్య చేసినది. కాని సుకుమారద్యోతను డేవ రేమి చేయు చున్నది తా నెఱుఁగక తా ననునది తాఁ దెలియక 'ఎవ రక్కడ ఏమది?' అని పల వరించుచు మూఁడుగంటలవఱకు గడపి మూఁడు గంటలకు ప్రమాఁగన్నుఁగ నొత్తిగిలి పండు కొనెను. అయిదుగంటలకు తిరిగి లేచుచు గిరగిర తనకన్నీళ్లు తిరుగ మేను చెమ్మటెక్క లోపల నీరసమెచ్చ 'ఎందు కీశరీరము? ఇది క్షణభంగుర'మని వ్రాకుచ్చెను. అట్లనుకుడని శుచిమతి మంచముపట్టిపైని తలవంచెను. బరు వుగా గనుఱెప్ప లామెకు తమంత నే వ్రాలెను. చూపు—లోలోపల చూచుచునే యున్నది. ఆమె కొకవేగురుఁజుక్క, యొకసూర్యోదయపు శోభ కనిపించినవి. రాత్రి తెల్లవాఱినది. ఎంత లో? ఒక నిముసములో—ధ్రువుడు మేలుకొ నుచు సన్నని గొంతుకతో సంగీతము తీయు చున్నాడు. శుచిమతి కన్నులు తెఱచినది. సుకు మారద్యోతనుడు శుచిమతితో 'నాకు జబ్బు కుదిరినది. నే నెప్పటివలె నున్నాను' అని చిరు నవ్వు నవ్వెను.–వాని కనులు వికాసవంతములై యున్నవి. ఒడలెల్ల నెప్పటి వెచ్చందనంబున శుచిమతియొక్క కరస్పర్శమునకు వింతవినోద ము నొసంగెను.

శుచిమతి పది పదియేనునాళ్లనుండి చిరు నగ వెఱుంగనిది యిట్టె మందస్మిత యగుచు 'రాత్రి ర ట్లన్నా రేమిటి?' అని యడిగెను. 'ఏమంటి' నని సుకుమారద్యోతనుడు బదు లాడెను.

'ఏమియు ననలేద'ని శుచిమతి యాతని ప్రక్క నరిగదీసి బట్ట నరిగఁ గప్పి 'మీ హృద యము నాతో నున్నది. మీశరీరము నాతో నున్నది. ఏమియు ననలేదు' అని యనెను.

---

ప్ర. త. 20 శ౦.లో — ఒ. దిన చర్య



ఉదయమే ప్రయాణమై —



చైనాలో తేనీరు త్రాగి —



అమెరికాలో వ్యవహారాలు చూచి —



స్పెయినులో భోజనము చేసి —



ఇంగ్లాండులో నాటకం చూచి —





ఈజప్టులో గుమస్తాకు దీవాట్లుపెట్టి —



రాత్రి యిల్లు చేరుట

## ౪౧

### చలికంతము

చలికాలము పసిపిల్లలు కంతముచుట్టు చిక్కనిబట్ట మడతపెట్టి రెండుమూడు చుట్లు కాళ్లదాకా వచ్చేటట్టు చుట్టించుకొని మెడ



చలికంతము

పక్కను ముడివేయించుకుంటారు. దానిపేరు చలికంతము. చిదుకులతో చిన్నమంట వేసి దానికి కొంచెందూరంగా కూర్చుంటారు. దాని పేరు చలిమంట. చలికి వణుకుతూ ఈపదము పాడుతారు.

చలిచలిచలిచలి చందాయమ్మ
గొంగళిగప్పుకో గోనాయమ్మ
వడవడవడవడ వణికేనమ్మ
చలిమంటకు చితుకులు తేవమ్మ.

## ౪౨

### గోరుముద్ద—గుజ్జుముద్ద

పసిబిడ్డలకు చిట్టిపిడతలతో అన్నము మెత్తగా వండుదురు. ఆమెత్తనన్నమును కంచంలోగాని గిన్నెలోగాని కలిపి గోరుముద్ద లని, గుజ్జుముద్దలని, పేర్లుచెప్పుతూ తినిపిస్తారు. బొట్టనవేలిగోరుమీదికి కొంచెముగా తీసుకొని పెట్టేదానిపేరు గోరుముద్ద. కలిపేటప్పుడు మెత్తనచేత చేతికంటితే కంచము అంచునగాని గిన్నె అంచునకాని గీచి ఎత్తిపెట్టేదాని పేరుగుజ్జు ముద్ద. పసిబిడ్డలు గోరుముద్దలన్నా గుజ్జుముద్ద



గుజ్జుముద్ద



గోరుముద్ద

లన్నా అల్లరిమాని ఆరగిస్తారు. గోరుముద్ద కంటె గుజ్జుముద్ద ఎక్కువరుచిగలది.

## ౪౩

పసిపిల్లలు అప్పుడప్పుడు అన్నముతినక మారాముపట్టుతూఉంటారు. అప్పుడు అన్నము పెట్టేవాళ్లు ముచ్చట్లుచెప్పి ఆనందము కలిగించి మారాము మరపించి అన్నము తినిపిస్తారు. అట్టి ముచ్చట్లు కొన్ని:—

### నాన్నముద్ద-అమ్మముద్ద

"అమ్మా! నాన్న మంచివాడు కాదూ! ఇదుగో! ఇది నాన్నముద్ద! తిను, తినవూ? నాన్నమంచివాడు కాదూ? ఆవేళ నీకుమిఠాయి తెచ్చిపెట్టలేదూ? నీకు మంచి చొక్కాలు కుట్టించలేదూ? అవునవు నన్నీ అంగీకరించును. అయితే తినుమఱి. మళ్లీ మిఠాయి తెచ్చిపెట్టుతాడు!— తినును. తర్వాత, ఇదిగో! ఇది అమ్మముద్ద, అంటూ తండ్రి ప్రేమవలెనే తల్లి ప్రేమను జ్ఞాపకపరిచి ఇంకొకముద్ద తినిపిస్తారు. అట్లాగే ఆతర్వాత, అత్తయ్యలముద్ద, మామయ్యలముద్ద అంటూ బంధువులపేర్లతో వారి వారి ప్రేమలను జ్ఞాపకపరుస్తూ అన్నిముద్దలను తినిపిస్తారు.



అమ్మముద్ద నాన్నముద్ద

దీనివలన పిల్లలకు మారాము మానడము తినవలసిన అన్నము తిన్నగా తినడము, బంధువులమీద ప్రేమబంధము మనసులో చక్కగా నిలుపుకొనడము కలుగుతుంది.

## ౪౪

### దొంగబువ్వ

అన్నము పెట్టేవాళ్లు ముద్దలు కలిపి కన్నులుమూసుకొని ఒక్కొక్క ముద్ద ఎత్తి పట్టుకొని ఇట్లుచెప్పుతారు.

కుక్కే వచ్చి తింటుందో నక్కే వచ్చి తింటుందో
యెలికే వచ్చి తింటుందో చిలకే వచ్చి తింటుందో
పిల్లే వచ్చి తింటుందో బల్లే వచ్చి తింటుందో



దొంగబువ్వ

మాఅమ్మాయే తింటుందో
మా అబ్బాయే తింటాడో
యెవరువచ్చి తింటారో
యెవరువచ్చి తింటారో!!

ఇట్లా చెపుతూ చెయ్యి అటూ ఇటూ తిప్పుతూ ఎరుగనట్టు బిడ్డ ముఖముదగ్గరకు తీసుకొనిపోతే తాను కానట్టు గటుక్కున మ్రింగును. ఇట్లు అంతా తినిపించినతర్వాత "చాకలివాళ్ల కుక్క వచ్చి చల్లా అన్నం తినిపోయింది పో— అమ్మాయి(అబ్బాయి) యింక నీకేది, నీకు లేదులే—"అని ముగించి మూతిచెయ్యి కడుగుతారు.

## ౭౫

### వెన్నెలగుజ్జులు

వెన్నెల రాత్రులందు పసిబిడ్డలను ఎత్తుకొని చందమామ ముచ్చట్లు చెప్పుతూ ఆరబైట అన్నము తినిపించడము తల్లులకు అలవాటు. అమ్మా, చూడు, చందమామలో ఒక



వెన్నెలగుజ్జులు

ముసలమ్మ పొయిమీద కుండపెట్టుకొని అన్నము వండుకొంటూ కూర్చున్నది! చూచావా! అదుగో! నల్లగా కనుపడుతున్నది! అంటారు. ఈపదము చెప్పుతారు.

చందమామ రావె జాబిల్లి రావె
కొండెక్కి రావె గోగుపూలు తేవె
ఒలవనిపండు ఒళ్లో ఉంచుకొని
ఒల్చినపండు చేత బుచ్చుకొని
వెండిగిన్నెలో వెన్న పెట్టుకొని
పమిడిగిన్నెలో పాలుపోసుకొని
అమ్మాయి నువ్వూ తిందురుగాని
అట్టాఅట్టా రావె!
చందమామా!

ఇంకా ఈపద్యములుకూడా చెప్తారు.

"వెండిగిన్నెలోన వెన్నయు నెయి పోసి
పమిడిగిన్నెలోన పాలుపోసి
చందమామ రావె జాబిల్లి రావె మా
చిన్నిబిడ్డతో భుజింతుగాని."

"జేజేలకును బువ్వ, శివునియాదల పువ్వ
జాబిల్లి రాగదే చందమామ!
మెండుచీకటి గొంగ, మెఱయుచుక్కబాజంగ!
జాబిల్లి రాగదే చందమామ!
చిగురు కైదువుకామ చెలగురావుతుమామ
జాబిల్లి రాగదే చందమామ!
చిన్నియన్నకు శ్రీరఘు శేఖరునకు
వెండిగిన్నియలోపల వెన్నపోసి
పమిడిగిన్నియలోపల పాలుపోసి
చాల దినిపించి పోగదే చందమామ."

---

## విధి

టి. శివశంకరంగారు

అలుకం గూర్మియు నెఱుగదు
తులదూచినభంగి నీదు దోషము గుణముల్
కొలుచుచు ఫలముల గుడుపును
అలవిధి మరి రేపొ,మాపొ,యటుమీ దెపుడో.

కుంతికి కర్ణుడు కాదన
నింతికి నలు డడవి నొంటి నిడిపోవుటయున్
వింతగ కశిపుడు మడియుట
నంతయు విధికృత మటంచు నరయుము తల్లీ.

కినియకు విధిచేతలకున్
అనురాగము శాంతిధర్మ మారయ నది యై
విను నీ బదుకును వెలచును
మనమున గొందలము చింత మానుము జననీ.

---




# పిఠాపురపు పీటలమ్మవారి కథ

అనగా అనగా వొకవూరు. ఆవూళ్లో వొక పెద్ద బ్రాహ్మణ కుటుంబం వుంది—తల్లి, తండ్రి, యేడుగురు కొడుకులు, యేడుగురు కోడళ్లున్నూ. కూతుళ్ల సంగతి, మనమల సంగతి మన కంతగా తెలీదు. వాళ్ల కింతా అంతా పాడి కాదు. మూడు నాలుగు ఆవులు, రెండు మూడు గేదెలు. ఎప్పుడూ పాలలోను, పెరుగులోను, నేతిలోను మునిగి, తేలుతూ వుంటారు.

అత్తగారు కోడళ్లను మహాకష్ట పెట్టేది. నిలుచుంటే తప్పు, కూచుంటే తప్పు, తుమ్మితే తప్పు, దగ్గితే తప్పు. ఈమోస్తరుగా యమ బాధలు పెట్టేసేది. కోడళ్లను తిన్నగా కడుపు నిండా తిననిచ్చేదేనా కాదు, దాని ధర్మమా అంటూ. తక్కిన కోడళ్లకంటె కడసారపు కోడలు కొంచెం గడసరి. అయినా అత్తగారు పెట్టేబాధలకి "అందరితోపాటు మనకీని, మనకు "ప్రత్యేకం కాదుగా" అన్నట్టుగా వూరుకునేది. ఇంతకూ మొగుడు చేతకానివాడైతే పెళ్లా మేమి చేయగలదు? వేరింటి కాపరం అన్న మాట అనరాదు, వినరాదు.

ఒకరోజున మధ్యాహ్నం కోడళ్లంతా యేదో లోకాభిరామాయణం చెప్పుకుంటున్నారు. మాటల ధోరణిలో పెద్దకోడలంది గదా "ఆవుపాలు మంచివి, చింతపిక్కేస్తే ములగవే అలాంటివి, మజ్జిగపాలలా చిక్కగా వుండాలన్న మాట, అలాంటిపాలతో పరమాన్నం వండుకు తింటే, అబ్బబ్బ!" అని గుటకలు మింగింది. "ఔనే అక్కయ్యా!" అని తోడికోడళ్లంతాకూడా వొప్పుకుని వూటలూరేరు. అలాంటి పరమాన్నం తినాలని ముచ్చటపడ్డారు. కాని చేసిపెట్టేవా రెవరు? అత్తగారిని కనకి అడుగుతేనా, వొక్కొక్క కోడలినే చీల్చి పోగులెడుతుంది. హడలు, రెండు చేతులతోను నోరు మూసుకు పడివుండవలసిందే.

కడసారపుకోడలు వాళ్ల కబుర్లు జాగ్రత్తగా వింది. అప్పటిమట్టుకు మాటాడకుండా

వూరుకుంది. ఎలాగైనా అలాంటి పరమాన్నం చేసి తోడికోడళ్లకు పెట్టాలని మనస్సులో అనుకుంది. లోలోపలే వొక చిన్నపన్నాగం వేసింది.

రాత్రి అంతా నిద్ర పోతున్నారు. అర్ధరాత్రి తానొక్కర్తె లేచింది. వంటిల్లు తలుపు తీసింది. ఉట్టిమీద వున్న బిందెడి ఆవుపాలు కిందికి దింపింది. పొయ్యి రాజేసింది. బిందె పొయ్యిమీది కెక్కించింది. ఎసరులో బియ్యం పోసింది. పెద్దమంట చేసి గబగబా పరమాన్నం వండేసింది. ఇంట్లో వున్న పీటలన్నీ శుభ్రంగా మరోమాటు కడిగి నేలమీద పరిచింది. పరమాన్నమంతా అన్నిపీటల మీద పోసింది చల్లారడానికి. తోడికోడళ్ల దగ్గరికి వెళ్లి వొక్కొక్కర్తెనే నెమ్మదిగా తట్టి లేపింది. హడావిడి చెయ్యవద్దనిచెప్పి అందర్నీ వంటింట్లోకి తీసికెళ్లింది. వాళ్లు విస్తుపోయేరు. బుగ్గలమీద చేతులు వేసుకుని నిలబడ్డారు. నిర్ఘాంతపోయిన వాళ్లను తట్టి వేగిరంపళ్లు తోముకుని రమ్మంది. పళ్లు తోముకున్నారు. మనస్సు ఆబతీరేటట్లా తెగ తాగేరు పరమాన్నం. చేతులూ మూతులూ కడుక్కుని యథాప్రకారంగా గప్‌చిప్‌గా పడుక్కున్నారు.

చిన్నకోడలు అంట్లబిందె, అంట్లపీటలు దొంతిపెట్టి చెరువుకు పట్టుకెళ్లింది. అన్నీ శుభ్రంగా కడిగేసింది. మంచినీళ్ల బిందె నెత్తిమీద పెట్టుకుని పీటలన్నీ చంకను బెట్టుకుని తిరిగి యింటికి వస్తూంది. వీథిగుమ్మానికింకా కొంచెం దూరంలో వుంది; ఇంతట్లోకి మామగారు బయటికి వచ్చేడు పనిమీద. ఇంకా చీకటిగా ఉంది. బిందెతోటి, పీటల తోటి వస్తూన్న మనిషిని చూచేడు. ధైర్యం తెచ్చుకుని, "యెవరు ను"వ్వన్నాడు. "నేను పిఠాపురపు పీటలమ్మ వార్ని" అంది అది. "అయితే యెందు కొచ్చే"వన్నాడు మామగారు. "ఈ కాలంలో అత్తగార్లంతా కోడళ్లను మహాకష్టపెడుతున్నారు. అలాంటి అత్తగార్లను మింగెయ్యడానికి వచ్చేను" అంది అది. ఆమాటలు వినడంతోటే మామగారు గబుక్కున యింట్లోకి గెంతేసేడు. తలుపు బిడాయించి పెళ్లాన్ని లేపించి, "ఇదిగో నేవ్, మరి చూసేవో లేదో, కోడళ్లను కష్టపెట్టే అత్తగార్లను తినెయ్యడానికి పిఠాపురపు పీటలమ్మవారు వచ్చిందేవ్ నువ్వేమైనా కోడళ్లను కష్టపెడుతున్నావా యేమిటి చెప్పు. తినేస్తుందేవ్ అమ్మవారు" అన్నాడు. "అబ్బే లేదండి. నేను మంచిదాన్నే నండి వాళ్లకంటే" అంది ఆమె.

ఆచిన్నకోడలు పెరటిదోవంట యింట్లోకి వెళ్లింది. నీళ్లబిందె వుట్టిమీద పెట్టేసింది, పీటలు గోడకు చేర్చింది. వెళ్లి మహారాణిలాగు పడుక్కుంది మంచంమీద.

ఆమన్నాటినుంచీ అత్తగారు కోడళ్లను వేధించుకు తినడం మానేసింది. కోడళ్లు అత్తా కూడా సుఖపడ్డారు.

కథ కంచికెళ్లింది; మనం ఇంటికి వచ్చాం.

టే. కా.

---

# కాలముల మహిమ

[ఒకనాడు నేను, మా అమ్మమ్మ కూర్చుని ఏవో కబుర్లు చెప్పుకుంటున్నాము. అప్పుడు వర్షం కుంభవృష్టిగా కురుస్తోంది. నేను 'అమ్మమ్మా! ఈ వెధవ వర్షాలవల్ల ఇల్లే కదల్లేము' అన్నాను. 'ఔను అలాగే! కాని ఇవి లేకపోతే బువ్వ రావడ మెలాగ'అంది. సాయంత్రంవరకు వర్షం కురిసింది. పెద్ద చలిగాలి బయల్దేరింది. ఎక్కువ చలిగా ఉంది. చాలా రాత్రయింది. అప్పుడు నేను 'అమ్మమ్మా! ఏమిటే ఈచలి? ఇప్పుడే ఇంతలా ఉంటే వెధవశీతాకాలం ఆగే లేము' అన్నాను. 'అలా కాలాలని తిట్టకూడదు నాయనా! ఏ కాలానికి ఆకాలము అలాగే ఉంటుంది. ఏది లేకపోయిన కష్టమే. వెనుక ఒకావిడ ఇలాగే కాలాల్ని తిట్టేసరికి నోటంట పురుగులు రాలాయిట!' అంది. 'ఎవరికే? అదేమిటో చెప్పవే' అని నేనడిగేను. మాఅమ్మమ్మ ఇలా చెప్పింది.]

అనగా అనగా ఒక ఊరుంది. ఆ ఊళ్లో ఒక బ్రాహ్మడున్నాడు. అతనితోపాటు తల్లి, పెళ్లాముకూడా ఉన్నారు. అతని మామగారు చచ్చిపోయాడు. బావమరదులు లేరు. ఇతనొక్కడే అల్లుడు. అందుచేత అత్తగారు కూడా ఇక్కడే ఉంది. బ్రాహ్మడిపెళ్లానికి చిన్నప్పుడు గారాము పెట్టడంచేత నెత్తికి కొమ్ములొచ్చాయి. అత్తగారంటే అయిష్టము. వియ్యపురాళ్లిద్దరు బాగానే కలసిమెలసి ఇష్టంగానే ఉండేవారు. బ్రాహ్మడిపెళ్లానికి ఇబ్బంది సబ్బంది వస్తే తల్లే ఉందిగదా అని అత్తగారిని ఎక్కడకైనా పంపెయ్యా లనుకుంది. ఒకరోజున మొగుడొచ్చేప్పటికి మూతిమూరెడు, ముక్కు బారెడు చేసికొని, ముఖంముడుచుకొని గదిలో భీష్మించుకు కూచుంది. మొగుడొచ్చిచూసి, 'ఏమిటే అలాగున్నావు' అని అడిగేడు. 'ఏమీ లేదు; నేచెప్పినట్టు చేస్తారా, చచ్చిపోనా' అంది. ఆసమయంలో ఏలాంటివాడైనా పెళ్లాం చావు కోరుకుంటాడా? 'ఏమైనసరే చెప్పినట్టు చేస్తా'నన్నాడు. చేతిలో చేయి వేయించుకుంది. ఒట్లు, ప్రమాణాలు చేయించుకుంది. 'మీ అమ్మను అడవులలో దిగబెట్టి రావాలి' అంది. దిగపెట్టకపోతే నిజంగా పెళ్లాం చస్తుందేమో అని ఇష్టంలేకపోయినా ఒప్పుకున్నాడు. ఒప్పుకున్నాడుగదా అనే సంతోషాన్ని చటాలున లేచి మొగుడికన్నం పెట్టింది. వియ్యపురాళ్లిద్దరూ ఉప్పిపిండితిని చెరో మంచముమీద పడుకున్నారు. కొంతసేపటికి ఊరంతా మాటుమణిగింది. బ్రాహ్మడు'అమ్మా! చెల్లెలికి జబ్బుగా నున్నదని తెలిసినది. చెప్పడం మరచిపోయాను. ఇప్పుడు వెన్నెలగనుక వెడితే చూసి మళ్లీ తెల్లారేప్పటికి రావచ్చు' అన్నాడు తల్లిని లేపి. కూతురికి జబ్బుగా ఉందని తెలవడంతోనే అడావడిగాలేచి 'పదరా అబ్బాయి పదరా' అని కొడుకుతో బయల్దేరింది. ఊరు దాటి ఒకమైలుదూర మెళ్లారు. బ్రాహ్మడు సాయంకాలము జరిగిందంతా చెప్పి ఏడుస్తూ తల్లిని విడిచి వెళ్లిపోయాడు. ఇంటిదగ్గర పెళ్లాం

మేలుకునే ఉంది. మొగుడింటికి రాగానే దిగపెట్టి వచ్చినట్లు ఒట్టు వేయించుకుంది.

అత్తగారు అడవిలోనే ఉంది. ఒకరాత్రి వేళ వేసవికాలం వచ్చి, 'ఏమమ్మా! నే మంచిదాన్నా కాదా' అంది. 'అయ్యో! నువ్వు లేకపోతే ఎలాగమ్మా? ఊరికెళ్లాలన్నా, మనుష్యులకు పశువులకు విశ్రాంతి కావాలన్నా నీకాలంలోనే కాదా! నువ్వు మంచిదానవు' అందీవిడ. తర్వాత వర్షాకాలంవచ్చి అలాగే అడిగింది. 'అయ్యో! నువ్వురాకేగాని పంటలే లేవు. పంటలు లేకపోతే మేము పస్తుండవలసినదే' అంది మళ్లీని. ఇంతట్లో శీతాకాలం వచ్చి 'ఏమమ్మా నే నెలాంటిదాన్ని' అంది. 'అయ్యో నీకాలంలో అట్టే ఎండ లేదు; అట్టే వాన ఉండదు. హాయిగా ఉంటుంది. తినడానికి జామిపళ్లు, సీతాఫలపుపళ్లు దొరుకుతాయి. నువ్వు మంచిదానవే' అందీవిడ. అంతట్లో మూడుకాలాలు ప్రత్యక్షమై 'నీనోటిలోనుంచి వరహాలు రాలుగాక!' అని వర మిచ్చి వెళ్లిపోయాయి. అప్పట్నుంచి ఈవిడ అవన్నీ తిరిగింది. అవన్నీ వరహాల పోగులే. అన్ని ఊళ్లవాళ్లు బళ్లమీద దెచ్చుకుంటున్నారు. ఈ సంగతి బ్రాహ్మడిపెళ్లానికి తెలిసింది. మొగుణ్ణి వెళ్లి ఆవిడను తీసుకు రమ్మంది. మొగుడెళ్లి తీసుకొచ్చాడు. ఆరాత్రి వాళ్లమ్మనికూడా అడవిలో దిగబెట్టమంది పెళ్లాం. 'సరే' అని దిగబెట్టాడు. వేసవికాలం వచ్చి ఆవిడను అడిగినట్టే అడిగింది. 'నువ్వు మంచిదానవు కావు. వెధవ ఎండలు. గుబులుగా ఉంటుంది' అందీవిడ. వర్షాకాలం వచ్చి అలాగే అడిగింది. 'నువ్వు మంచిదానవు కాదమ్మా! జారు, బురద, బంద, బాడీని. నానాఅవస్థపడాలి' అంది దాన్నీని. శీతాకాలం వచ్చి 'నేనో' అని అడిగింది. 'అబ్బబ్బబ్బ! నీ వెందుకమ్మా! చలి చలి ఎన్ని దుప్పట్లు కప్పినా తీరదు. ఎంత ఎండెక్కినా తీరదు. ఇట్టే ప్రొద్దుపొడిచి అట్టే మాయమౌతుంది. నీవు మంచిదానవు కా'దంది. మూడుకాలాలు వచ్చి ఆవిడను గాడిదను చేసి అల్లుడింటిముందు కట్టాయి. మాటాడితే నోటంటపురుగులు రాలాయి. కూతురు చూసి 'తన తెలివితక్కువే కదా' అని నెత్తినోరు కొట్టుకుని ఊరుకుంది.

[అందుచేత ఎప్పుడు తిట్టకు నాయనా' అని మా అమ్మమ్మ నాకు చెప్పింది. నేను మీకు చెప్పేను.]

---

# అముద్రితగ్రంథచింతామణి

## (౧౮౮౫ - ౧౯౦౪)

నిడుదవోలు వేంకటరావు గారు, బి. ఏ.
(ఆంధ్రగీర్వాణసాహిత్యసమ్మేళనము)

ఆంధ్రదేశ పత్రికావాఙ్మయమున నున్నత స్థాన మలంకరింపఁదగిన పత్రికలలో నముద్రిత గ్రంథచింతామణి యొకటి. కేవలాంధ్రభాషా విషయములనే ప్రధానములుగ నెంచి యాంధ్ర భాషాభ్యుదయమునకై తోడ్పడిన పత్రికలలో నిది యగ్రగణ్య మని చెప్పనొప్పును. అముద్రితగ్రంథప్రకటనమున నేమి, వ్యాకరణచ్ఛందోవిమర్శనమువలన నేమి, భాషా శబ్ద సాధుత్వాసాధుత్వ విచారణమున నేమి, యాంధ్ర వాఙ్మయమున కీ పత్రిక పలుతెఱఁగుల సంస్తవనీయ మగు సేవ గావించి ప్రఖ్యాతినందినది. నేఁటివఱకు నాంధ్రదేశమున దీనిఁ బోలిన పత్రిక యొకటియైన లేదనియు, నున్నవానిలో దీనియందుఁ గలవిషయములు కొఱవడుచున్న వనియుఁ జెప్పినచో నీ పత్రికా ప్రాముఖ్యము తెలియఁగలదు.

ఈ పత్రికయందుఁ బదునాఱుపుట లుండెడివి. ఇందు మొదటి నాలుగుపుటలు నముద్రితగ్రంథచింతామణి మయూఖము లనుపేర నొప్పుచు, విద్యార్థులకుఁ, బండితులకు నుపయుక్తము లగు వివిధ విద్యావిషయములతో వెలయుచుండెడివి. తక్కినపుటలయందు పేరు సార్థక మగునట్లు ప్రాచీనకావ్యములే గాక, యధునాతనకవికృతములు గూడ ముద్రింపఁబడుచుండెడివి. మఱియు నిందు నాఁకాలపుఁ బండితులయు, కవులయు నుత్తరప్రత్యుత్తరములు ప్రకటింపఁబడుచుండెడివి. ఈ యుత్తరములవలన నాయాపండితుల సామర్థ్యమే కాక, పెక్కు సంశయాంశములలో వారి యభిప్రాయము లెట్లున్నవో తెలిసికొనుటకు వీలు గలుగుచున్నది. ఇంతియే కాక, కవిపండితుల జీవితచరిత్రములఁ గూర్చియు, వార్తాపత్రికలఁ గూర్చియు, నధునాతనకవికృతులఁ గూర్చియు చారిత్రకవిషయములు పెక్కు ప్రకటింపఁబడుచుండెడివి. ఇవి యాంధ్రవాఙ్మయ చరిత్రకారుల కనేకవిధములుగ నుపయోగించుచున్నవి. ఇందు వార్తలు, చిత్రకథలు మొదలగునవి ప్రకటింపఁబడక కేవలము భాషాజ్ఞానము, సాహిత్యవిమర్శనము నలవడెడు విషయములే యిందుఁ బ్రకటితము లగుటవలన, నీపత్రిక కవిపండితులకుఁ గల్పవృక్షమై భాసిలినది.

ఈపత్రిక నెల్లూరుపురమునఁ బూండ్ల రామకృష్ణయ్య, ఒడయురు వీరనాగయ్య యనువారలచే క్రీ. శ. 1885 జూను నెలనుండి ప్రారంభింపఁబడినది. ఆకాలమున నెల్లూరు మండలముననే కాక యాంధ్రదేశమునఁ గూడ పత్రికలు విశేషముగ లేవు. నెల్లూరుపురమున 1882-83 లో నల్లిగొండము రామచంద్రరా

వను నాంధ్రపండితులు విద్యార్థికల్పభూజము అను పత్రికను సాగించిరనియు, నది పునరావృతిరహితపదవిఁ జెందినపిదప నీపత్రిక వీరు ప్రారంభించినట్లును తెలియుచున్నది. ఆంధ్రదేశమున నంతకు మున్ను పం[డెండేం]డ్లవిచ్ఛిన్నముగ మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారిచేఁ బ్రకటింపఁబడిన యాంధ్రభాషాసంజీవని యస్తమించినది. అయినను, రాజమహేంద్రవరమున శ్రీ వీరేశలింగము పంతులవారి వివేకవర్ధని, మదరాసున ఏడునూతులముత్తయ్యగారి సుజనమనోల్లాసిని, మన్నవ బుచ్చయ్యపంతులుగారి హిందూజన సంస్కారిణి, విశాఖపట్టణమున గరుడా కూర్మయ్యగారి యథార్థవాది, విజయనగరమున వేంకట రామయ్యగారి తెలుగుహార్పు (Telugu Harp) మొదలగు పత్రిక లాకాలమున నున్నట్లు ఈ చింతామణివలననే తెలియవచ్చుచున్నది. ఈ సందర్భమున నీపత్రికతోడనే పుట్టి మొన్నటివఱకు నవిచ్ఛిన్నముగ చెన్నపురమునఁ బ్రకటింపఁబడిన శ్రీ యాంధ్రప్రకాశిక యను పత్రిక ప్రశంసింపఁదగినది. ఈ పత్రికఁ దదధిపతులగు పార్థసారథి నాయుఁడుగారు నలువది మూఁడేండ్లు ప్రకటించిరి. మనదేశమున నిన్నియేండ్లు ప్రకటింపఁబడిన వార్తాపత్రిక దీనిఁ దక్క మఱియొకదానిఁ గానము. ఈపత్రిక తదధిపతితోఁ గూడ నస్తమించినట్లు తెలియుచున్నది.

ఈపత్రిక నిరాడంబరరూపమున నెలకొకమారు ప్రత్యాంగ్లేయ మాసారంభమున వెలువడుచుండెను. ఇయ్యది క్రీ. శ. ౧౮౦౪ సంవత్సరమునం దర్ధభాగమువఱకు వెలువడినను, నడుమనడుమ నంతరాయము లొదవుటచే నీకాలమున బదునేడుసంపుటములు వెలువడినవి. ఈపత్రికకు మకుటప్రాయముగ "విద్య నిగూఢగుప్తమగు" అను నాంధ్రభర్తృహరి శతకస్థపద్యము విరాజిల్లుచుండెడిది. మఱియుఁ బత్రికాధిపతు లీక్రింది ప్రతిజ్ఞఁ గావించియున్నారు:

క. జతనము మీఱంగ నము
ద్రిత సద్గ్రంథముల సేకరించి కడుఁ బరి
ష్కృతములు గావించి యథా [వానిఁ.
మతిఁ బత్త్రికఁ గూర్చెదము క్రమంబుగ

ఉ. తోరపు నూలుదారముల
తోఁ బదిలంబుగఁ గట్టి పెట్టియుం
జేరుప నందు జీర్ణదశఁ
జెంది మొగిం గ్రిమికీటకచ్ఛటా
పూరితమై వృథా సెడు న
ముద్రిత పుస్తకపంక్తి నెంతయుఁ
గూరిమి మీఱ నచ్చునను
గూర్చుట సెల్లదె పత్త్రికాకృతిఁ.

గీ. ఒనర మాపూన్కి రసికజనోపయోగ
మగుకతంబున నిజకార్యముగఁ దలంచి
కైకొనుఁడు పోషకాద్యధికారములను
శాశ్వతంబుగఁ బత్త్రిక జరుగుకొఱకు.

1. నెల్లూరఁ బత్త్రికాప్రచారము—ఒంగోలు వేంకట రంగయ్యగారు: ఆంధ్ర సాహిత్య పరిషత్పత్త్రిక, సంపుటము 10, సంచిక 4, 239 పుట.

ఈ పత్రికయందు వార్తలు మొదలగు నవి ప్రకటించినఁగాని వ్యాప్తము కాఁజాలదనియు, పత్రిక కొనసాగుట దుర్ఘటమనియుఁ గొంతమంది యీపత్రికాధిపతులకు వ్రాయఁగ, వీ రీవిషయముఁ గూర్చి కీ. శే. లైన విద్యావినోది పసప్పాకము ఆనందాచార్యులవారితో ప్రస్తావించి రనియు, వా రీపత్రికయం దట్టివి ప్రకటింప నవసరము లేదనియు, వానికి వేఱు పత్రికలు గలవనియు, నిది యింగ్లీషునందుఁ బ్రకటింపఁబడు 'ఏథెనియమ్' (Aetheneum) పత్త్రికవలె భాషావాఙ్మయవిషయమునే ప్రధానముగ నెంచి వెలయవలయుననియు వక్కాణించిరఁట.

ఈ పత్రికాధిపతులు పత్రిక నంతయు కేవల భాషావాఙ్మయ విషయములకే వినియోగించి యుండుటచే నిది నేఁ డాంగ్లేయ భాషయందు వెలువడు సుప్రసిద్ధ పత్రికారాజములతోఁ దులఁదూఁగుచున్నది. తెలుఁగుదేశమున నేఁడు వార్తాపత్రికలు విశేషముగ నున్నవి గాని యీఁచింతామణిఁ బోలిన పత్త్రికలు రెండు మూఁడు పత్రికలకంటె హెచ్చు లేవు. అవియైనకొన్నివిషయములలోఁ గొఱవడుచుండుటచే నంతయుపయుక్తములు కాకున్నయవి.

దీనికిఁ బ్రథమమునఁ బూండ్ల రామకృష్ణయ్యగారును, నోడయరు వీరనాగయ్యాగారును సంపాదకులుగ నుండిరి. వీరిలో వీరనాగయ్యగారు మూఁడేండ్లుమాత్రము దీనికి సహాయులుగనుండి తరువాత దీనివలన లాభము చేకూరమి దీని సంబంధముఁ బూర్తిగ వదలుకొనిరి. వీరు "బకింగ్‌హామ్ సింహపురీదర్శనము", "శివరాత్రిమాహాత్మ్యము" అను గ్రంథములను రచియించి యున్నారు. మఱియు శైవులగుటచేఁ గాఁబోలు, పిడుపర్తి సోమనాథకృతమగు పద్యబసవపురాణమునకు సంస్కృతమున చిన్న పీఠిక వ్రాసియున్నారు. వీరు ఖర సంవత్సరమునఁ గీర్తిశేషులైరి.

అప్పటినుండియు రామకృష్ణయ్యగా రీ పత్రికను కడుశ్రద్ధతో నడపుచు వచ్చిరి. వీరు స్వయంకృషిచేతనే నిగూఢమగు నాంధ్రసాహిత్యము గడించి విమర్శకులైరి. భాషావాఙ్మయ విషయమై వీరికిఁగల యభిమానము, దీక్ష యింతయని వ్రాయ నలవి కాదు.

కావుననే యముద్రితగ్రంథచింతామణితోఁగూడ వీరినామ మాంధ్రలోకమున శాశ్వతముగ నెలకొనియున్నది. వీరు పత్రికయందు విద్యావిషయమై వ్యాసములను, సంశయాంశములనుఁ బ్రకటించుటయే గాక, తాము ప్రకటించిన గ్రంథము లన్నింటికి దివ్యములైన పీఠికలు వ్రాసియున్నారు. ఈపత్రికకుఁ గొంత కాలము వీరికి సహాయులుగ వేంకటగిరి రాజవర్యుని యున్నతపాఠశాలా ప్రధానోపాధ్యాయులగు సి. వేంకట రామానుజరావు నాయఁడుగారు నుండిరి.

గ్రంథప్రకటనము:

పైని వివరింపఁబడినరీతి నీ పత్రికయందు ప్రాచీనప్రబంధములే గాక యధునాతనకవి

కృతములుగూడ ప్రకటింపఁబడినవి. వాని నీ క్రింద పేర్కొనుచున్నాఁడను.

ప్రాచీనప్రబంధములు:

౧. ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము — గణపవరపు వేంకటకవి కృతము. అబ్బురపుంగబ్బము. చిత్రబంధకవిత్వముల కిది పుట్టినిల్లు. ఈగ్రంథము వీరు ప్రకటించినవెనుక నేటివఱ కెవ్వరు తిరిగి ముద్రించియుండలేదు. ఇందుఁ గల చిత్రబంధ కవిత్వ వివరణమునకు నేఁడు ముద్రాయంత్రాది సౌకర్యము లాకాలము కన్న మిన్నగ నున్నవి గాన దీని పునర్ముద్రణము గావించుట యాంధ్రుల కర్తవ్యము.

౨. హరిశ్చంద్రనళోపాఖ్యానము (సటీక), రామరాజభూషణ కవికృతము. టీక చిత్రకవి యనంతకవిది. దీని నీతరువాత వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు బ్రహ్మశ్రీవఝల చినసీతారామస్వామిశాస్త్రులవారి యమూల్యమైన పీఠికతోకూడఁ బ్రకటించి యున్నారు. 3. మిత్రవిందాపరిణయము, కుందుర్తి వేంకటాచలకవి ప్రణీతము. ఈప్రబంధము పునర్ముద్రణము నందలేదు. ౪. చంద్రాంగదచరిత్రము, పైడిమఱ్ఱి వేంకటపతి రచితము. ౫. ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము, తక్కెళ్లపాటి లింగనామాత్యకృతి. ౬. యాదవ రాఘవపాండవీయము, త్ర్యర్థికావ్యము, నెల్లూరి వీరరాఘవకవికృతము. మూలముమాత్రము. ౭. వైజయంతీవిలాసము, సారంగుతమ్మయ్య కృతము. ౮. విజయవిలాసము. ౯.భోగినీదండకము. ౧౦. భర్తృహరినీతిశతకము, పుష్పగిరి తిమ్మనకృతము.

అధునాతనకవికృతములు, పద్యకావ్యములు:

౧. శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశచరిత్రము, మచ్చ వేంకటకవికృతము. ౨. ద్విరేఫవర్ణదర్పణము, ఓగిరాల రంగనాథకవికృతి. (సుమనోమనోభిరంజన కృతికర్త యగు నోగిరాల జగన్నాథకవి కీకవిపితృవ్య పుత్రుఁడు) 3. ముకుందశతకము, శృంగారకవి సర్వారాయకవి రచితము. ౪. యక్షప్రశ్నములు, శ్రీమాన్ కొమాండూరి శ్రీనివాసాచార్యకవి విరచితము. బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రిరచిత శ్రీకృష్ణాభ్యుదయము, ప్రాస్తావిక పద్యావళి, శ్రీవరాహనరసింహశతకము, త్రైపదేంద్రగురుచంద్రమాలిక, ప్రబంధబంధసంబంధనిబంధనగ్రంథము, పార్వతీశ్వరకవిచరిత్రము.

విమర్శనములు:

౧. బిల్వేశ్వరీయకృతివిమర్శనము. ౨. శ్రీకుమారాభ్యుదయకృతివిమర్శనము. 3. విక్రమార్కచరిత్రముద్రణవిమర్శనము. ౪. మనుచరిత్ర దోషారోపణఖండనగ్రంథము.

విద్వత్కవీంద్రుఁ డగు బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రులవారి కవితాప్రభావము లోకమునకు వెల్లడియగుటకును, సంస్కృతాంధ్రసాహితీపారగు లైన వేంకటరాయశాస్త్రిగారి పాండిత్యము విదితమగుటకును నీపత్రికయే మూలమని నిస్సంశయముగఁ జెప్పనొప్పును.—ఉపన్యాసవిలాసభూషణము శా

గ్దూలనక్షత్రమాలిక, ఈశ్వరప్రార్థనార్థ చంపక మాలిక, జిజ్ఞాసావిజ్ఞాపనము మొదలగు మాలి కలఁ జదివిన శాస్త్రిగారి నిరాఘాటకవనధారా పారీణత వెల్లడి యగును. ప్రాసవిషయముఁ గూర్చియు, "ఏను శబ్దము కళయా, ద్రుతప్రకృతికమా" అనువిషయమునుఁగూర్చియు, వెండి యు పుత్రమిత్ర సూత్రాదిశబ్దముల నిష్పత్తిఁ గూర్చియు వేంకటరాయశాస్త్రిగారి లేఖలను జదివినచో, వారి నిరుపమాన పాండితీవిశేష మును, బహుగ్రంథ పరిశోధన శక్తియు వెల్లడి యగును.

ఈపత్రికలన్నింటిని, వానియందు ముఖ్య ముగ మయూఖములను జదివిన వ్యాకరణ చ్ఛందోజ్ఞాన మెంతయో యలవడును. పరిఖా పరిఘశబ్దద్వయ విచారము, రేఫ ద్వైవిధ్య విచారము, శ్యమంతకశబ్ద విచారణము, వటు శబ్దప్రయోగపమర్శనము మొదలగు వ్యాసము లలోని విషయములు వ్యాకరణ శాస్త్రజ్ఞుల కత్యంతోపయుక్తములు.

సాహిత్యవిమర్శనమునం దీపత్రిక, యాంధ్ర దేశ పత్రికలన్నింటికన్న మిన్నగ సేవచేసిన దని చెప్పుట యతిశయోక్తి కానేరదు. రామకృష్ణయ్యగారి విమర్శనము కొంతవఱకు చారిత్రికవిమర్శనమే యనఁదగును. ఒకశబ్దమును గూర్చిగాని, యొకసూత్రమునుగాని విమర్శింప వలసివచ్చినపుడు వారు సాధారణముగ తమకు దొరకిన కావ్యములనేమి, వ్యాకరణములనేమి, కవి కాలక్రమమున వివరించుచుండెడి వారు. పరిఖాపరిఘశబ్దద్వయ విచారమున రమారమి యిరువదియైదు ప్రబంధములను, రేఫ ద్వైవిధ్య విచారమున నిరువదియైదు వ్యాకరణములను నుదాహరించియున్నారు. దీనివలన వారిగ్రంథ శోధన శక్తియో, గాక నేఁడు మన కెన్ని వ్యాకరణములు మొదలగునవి గలవో తెలిసికొనుటకు వీలుగలుగుచున్నది. శబ్దములవిషయమై వీరికిఁ గలపట్టుదల చూచి కొందఱు వీరివిమర్శనము కేవలము శాబ్దికవిమర్శనమే యని యనుకొన వచ్చును. కాని పత్రికాధిపతి ప్రకటించిన "విద్యావిషయిక సంశయములను, నాటకాదుల యందు గ్రామ్యభాష యుపయోగింపఁ దగునా, తగదా? అను విషయమునుఁ బరిశీలించినచో వీరికి సాహితీవిమర్శనమునం దాసక్తి యున్నట్టు కనుపట్టును. కాని గ్రంథముఁ జూచినతోడనే వారికి, యతిప్రాస నియమములును, శబ్దశుద్ధియుఁ, దుదకు ముద్రణమునందలి పదమధ్యస్థల నిర్దేశమును వీరి నాకర్షించుచుండెడివి. భాషా విషయమై యిట్టి వీరిదీక్షచేతనే, యాకాలపుఁ బండితులందఱు వీరిమాట శాసనమువలె శిర సావహించుచుండెడివారు. మఱియు వీరు ప్రకటించిన గ్రంథములకువ్రాసిన పీఠికలయందు కవి కాలనిర్ణయాదివాఙ్మయవిషయములనెన్నియో చర్చించిరి. కావున భాషావాఙ్మయ విమర్శన విషయమై యీపత్రిక పెక్కువిధముల మార్గ దర్శకమైనది.

ఈ పత్రిక యందలి వ్యాసములు తిరిగి ముద్రించిన నీకాలమున విద్యార్థిలోకమునకు, పండితబృందమున కెంతయేని యుపయోగ

ములు కాగలవు. ఇట్లముద్రిత గ్రంథ ప్రకటనమునకును, నాంధ్రభాషావాఙ్మయ విమర్శనమునకును ఈ చింతామణి చింతామణివోలె నాంధ్రసరస్వతి నుద్ధరించి యంతరించినది. నేఁడీపత్రికతోఁ బరిచయము లేనివారు దీని నొకసారి యామూలాగ్రముగ జదువుట యా పత్రికకు మనము సేయు గౌరవమని విన్నవించుచున్నాఁడను.

---

## రహస్సుధ ౪.

కొల్లూరు ధర్మారాయకవిగారు, బి. ఏ., (ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు)

గుట్టుగ నాకలోకమునకుం జను
ప్రేమనిధాన! యింక పై
మెట్టున కెక్కఁబోకు మిటు మేదిని
జూడుము, నా రహస్సుధన్
గట్టిన గాలిమేడ నరకానకుఁ
గూలకమున్న వచ్చి యా
రట్టడి వేవెలుంగుల దొరన్
తొలగింపుము నీలి నవ్వులన్.

నీ వరుదెమ్ము, చీకటులు నింపుము,
చుక్కలు లేని నీలపుం
ధోవతి మేల్ముసుంగుగ నధోముఖివై
ననుఁ జేరు, మవ్వడీ
భూవలయంబు నీ ప్రణయముగ్ధ
గళంబున నల్లపూసయై
పోవును, ధ్వాంతగోళ మొక
పూవులపొన్నగు ప్రేమసుప్తికిన్.

ఈరంగస్థలివీడి సౌఖ్యమునకై
యేనూతనాశా రహ
స్త్రీరాలం దుదయింప నెంచితివి?
నిస్తేజంపు మృత్పిండమున్.

భారంబంచుఁ దలంచి, మబ్బు
తెరచాపల్ విప్పి యెం దేగితో,
నా రేపట్టపురాణి! వేఁగుతటి
నైనన్ జెప్పుమీ నా చెవిన్.

ఎవరది, యీప్రశాంతనిశి
నేడ్చెద రిల్లిలుఁ గత్తి, నాదు చే
రువ కెవో వాల్గొరేకలు చురుక్కున
ముల్కులరీతి నీతమః
కవచము చీల్చి వచ్చెడిని,
కాటుకముద్దియ! యింక నైన
నీరవతిమిరప్రసార బధిర
మ్మొనరింపుము మూర్ఖలోకమున్.

అమృత విహాయసంబున
రహః ప్రణయానిలబాల డోలికా
గ్రముపయిఁ దూఁగు నో తిమిర కామిని!
రోదసి నెల్ల నీలి ప
క్షములను నిద్ర పుచ్చుము, ప్రసన్న
మొనర్పుము కాల మొక్కటే
యమవస గాగ, గొంతు తడి యారిన
నాకిడు మీ రహస్సుధన్.

---

# సోనదండసుత్తము

కిళాంబి రంగాచార్యులుగారు, యమ్. ఏ.

## ఉపోద్ఘాతము

బ్రాహ్మణులకును దదితర వర్ణముల వారికిని రాష్ట్ర పరిపాలనా విధానములలోఁ బ్రాముఖ్యమునకై (జీవన ప్రాముఖ్యమునకై) యీనాటివలెనే బహు పురాతనకాలమునుండియు వివాదలు జరుగుచుండెడివని బౌద్ధగ్రంథముల నుండియే కాక పురాణములనుండికూడ స్పష్టమగుచున్నది. ఈ వివాదలు కాలానుసారముగ రాష్ట్రపరిపాలనలోఁ బ్రాముఖ్యము సంపాదించుటకే యుపయోగింపఁబడుచున్నది. బౌద్ధసుత్తములలో మాత్ర మాధ్యాత్మికాది విషయములలో బ్రాహ్మణుల యాధిక్యము తదితరవర్ణజులచే నిరాకరింపఁబడినట్లు స్పష్టమగుచున్నది. బుద్ధుఁడు బ్రాహ్మణ, బ్రాహ్మణత్వశబ్ద ప్రతిపాదకములగు నాశయముల నంగీకరించి "ఎవఁడు బ్రాహ్మణుఁడు? ఏయ్యది బ్రాహ్మణత్వము?" అను విషయములను దరిచి తరిచి చర్చించి యా శబ్దములకు విశిష్టములగు నర్థముల నొసంగుచు స్వకీయ సిద్ధాంతానుసారముగ నట్లు మార్చెను. ధమ్మపదము నందు బ్రాహ్మణుఁ డెట్టివాఁడో చెప్పఁబడినది. జన్మమువలనగాక సదాచరణవలన బ్రాహ్మణత్వము నరునకు సిద్ధించునని వర్ణించుచు, బ్రాహ్మణునకు నత్యుత్కృష్టపదవి నొసంగిరి.

"మనుజుని జన్మమునుబట్టియు, జననింబట్టియు బ్రాహ్మణునిగఁ బరిగణింపను. నిశ్చయముగ నట్టివాఁ డహంకారపరుఁడై ధనికుఁడై యుండును. అభినివేశరహితుండై నిర్ధనుండైన వానినే బ్రాహ్మణుఁడని చెప్పెదను."

(౩౯౬)

"ఎవ్వాఁ డపరాధం బొనర్పకయే నిందాబంధన దండంబుల సహింపనోపునో, యెవ్వాఁడు క్షమను శక్తిగను, బలంబు సేనగను గలిగియుండునో యట్టివానినే బ్రాహ్మణుండని చెప్పెదను."

(౩౯౯)

(ధమ్మపదము: ఇరువదియాఱవ యధ్యాయము)

ఈ వచనములంబట్టి యా పూర్వకాలములోఁ గూడ వారిశీలమెట్లున్నను సర్వసామాన్యముగఁ బ్రజలు బ్రాహ్మణులను మిక్కుటముగ గౌరవించుచుండెడివారని నిశ్చయమగుచున్నది. వీనింబట్టి ప్రాచీనకాలపు బౌద్ధులకుఁ గూడ బ్రాహ్మణులన గౌరవ మనల్పముగ నుండెడిదని స్పష్టమగుచున్నది. కేవలము జన్మవలననేకాక విద్యాశీలాదికములచేఁగూడఁ జాలఁగను బ్రాహ్మణులు గౌరవపాత్రులై యుండెడివారని మన మూహింపవచ్చును

బ్రాహ్మణశబ్దమునకు విశిష్టార్థము నొసంగి జన్మసంబంధములేక శీలాదిసంపత్తితోఁ గూడుకొని యర్హత శబ్దవాచ్యుఁడగు నరుఁడే బ్రాహ్మణుఁడుగఁ బరిగణింపఁదగినవాఁ డను నాశయము లౌన్నత్యమున నుండినంతకాలము బౌద్ధమతము దేశమునఁ బ్రబలుచుండెను. క్రమముగ జన్మవలన బ్రాహ్మణులై యనల్పసంఖ్యాకులగు నిట్టివారలు విశిష్టచిహ్నములం గలిగియుండక సంసారమగ్నులై, భోగేచ్ఛచేఁ దదితరవర్ణజులకు నిర్ణయింపఁబడిన వృత్తుల నవలంబించి, ధనాదిసంపదలతోఁ గూడుకొనియుండ, బ్రాహ్మణత్వమునకు జన్మయే ముఖ్యకారణమై, శీలము, విజ్ఞానము బ్రాహ్మణచిహ్న పరిగణనలోఁ బ్రాముఖ్యమును బోఁగొట్టుకొన్నవి. బౌద్ధమతము దేశము నందంతరించినది. బ్రాహ్మణత్వమును, బ్రాహ్మణులును నధికశక్తిని సంపాదించి బౌద్ధమతవిధ్వంసమునకుఁ గారకులైరి.

ఆత్మనిగ్రహమే నిర్వాణమునకుఁ గారణమనియును, నీ జీవనముననే సదాచరణమువలన నిర్వాణప్రాప్తి కలుగుననియును, జీవాత్మ లేదనియును, దేవాదులుగూడ నితరులవలెఁ గర్మకు లోఁబడి మోక్షప్రాప్తికై పాటుపడుచున్నారనియును, గార్యమునకును దదుత్పాదకకారణమునకును గల సంబంధము నన్నిచోట్లను నిర్ణయించుటకుఁ బ్రయత్నించుచు "కా తే కాంతా కస్తేపుత్రః సంసారోయ మతీవ విచిత్రః। కస్య త్వం...

"మత ఆయాతిః" అను ప్రశ్నలకు యుక్తియుక్తమగు సమాధానము లిచ్చుట యసంభవమగుటచే వ్యర్థములని యిట్టివిషయములంగూర్చి మూచ్ఛటించువారల నత్యధికముగ నిరసించు సిద్ధాంతములు సామాన్యప్రజలఁ జిరకాల మాకర్షించియుండలేదు. అయిదారువందల సంవత్సరములలోనే యశోకచక్రవర్తి యవలంబించుటవలన దేశమునఁ బ్రాముఖ్యము వహించిన సిద్ధాంతము జన్మించినదేశములోనే యంతరించి మాయమయ్యెను.

(౧) ఇట్లు నే వింటిని: భాగవతుఁ డొకనాఁడైదు వందలమంది భిక్షుకులతో వంగదేశమునఁ బ్రయాణము చేయుచుఁ జంపాపురిం జేరెను. అచట గగ్గరా సరోవరతటమున బసచేసియుండెను

ఆసమయమున సోనదండుఁ డను బ్రాహ్మణుఁడు మగధరాజైన సెనియ బింబిసారునిచేత నగ్రహారముగ దత్తంబై వనశాద్వల సరోవర యుక్తంబును, ధాన్యపూరితంబును ఫలసత్త్వాకీర్ణంబును నగు క్షేత్రభూమిని రాజు రాష్ట్రింబునుఁబోలెఁ బాలించుచు నందు వసియించుచుండెను.

(౨) చంపాపురవాసులగు బ్రాహ్మణులును, గృహస్థులును, నీరీతిని జెప్పుకొనచుండిరి. "శాక్యకులపాంసనుండగు గోతమసమణుఁడు సంసారము విడిచి సన్న్యసించిబహుసంఖ్యాకులగు ఛాత్రులతోఁ జంపాపురమునకు విచ్చేసి గగ్గరా సరోవరతటంబున వసియించుచున్నాఁడు" అని వినవచ్చుచున్నది. పూజ్యుఁడగు నాగోతమునింగూర్చి యీతీరున వినవచ్చుచున్నది. ఆభాగవతుఁ డర్హతుఁడనియును, సంప్రబుద్ధుండనియును, ప్రజ్ఞానమయుండనియును, సౌజన్యరాశియనియును, బ్రహ్మాండభాండజ్ఞానపరిపూర్ణుండనియును, మోక్షమార్గాన్వేషులకు నద్వితీయుండగు మార్గదర్శియనియును, దేవమానవుల కుపదేశకుండనియును, మంగళప్రదుఁడనియును, ప్రబుద్ధుండనియును బహుశ్రుతమై యున్నది. ఊర్ధ్వంబులగు దేవబ్రహ్మమారలోకంబులను, పరివ్రాజక బ్రహ్మ క్షత్ర జనయుక్తంబగు నధోలోకంబును గలిగిన బ్రహ్మాండమును తెస్సఁగఁ బరిశీలించి, బ్రహ్మాండ విషయకజ్ఞానంబును గలిగినవాఁడై తద్విశిష్టజ్ఞానంబు నితరులకు వెల్లడించుచున్నాఁడు. జననవృద్ధి నివృత్తులయందలి రమణీయత్వమును యథావచనంబుగను, సారానుసారంబుగను, యథార్థముగను సంపూర్ణముగను బ్రకటించుచున్నాఁడు. ఇట్టి యర్హతుల సందర్శించుట శ్రేయోదాయకమని చంపాపురవాసులగు బ్రాహ్మణులును గృహస్థులును గగ్గరా సరోవరమునకై గుంపులు గుంపులుగఁ బోఁదొడంగిరి.

(3) ఆ సమయమున బ్రాహ్మణుఁడైన సోనదండుఁడు నిదురపోవుటకై మేడపై కెక్కి తండోపతండములుగ ప్రజలు పోవుట చూచి ద్వారపాలకుని "ప్రజ లెందుల కిట్లు గగ్గరా సరోవరమునకుఁ బోవుచున్నారు" అని ప్రశ్నించెను. ఆదౌవారికుఁ డతనితో వృత్తాంతమంతయుం జెప్పెను.

"ఓయీ! దౌవారికా! చంపాపుర వాసులగు బ్రాహ్మణులతోను గృహస్థులతోను 'బ్రాహ్మణ సోనదండుఁడు తానుకూడ సమణగోతముని సందర్శించుటకై రానున్నాఁడు కాన మిమ్ముఁ గొంత తడవు వేచి యుండ గోరెను' అని చెప్పుము" అని యనెను. అట్లేయని చెప్పుచు దౌవారికుఁ డట్లు కావించెను.

(౪) ఆసమయమునఁ జంపానగరమున దేశమందలి యన్నిభాగములనుండియు నేదియో వ్యాపారము పై వచ్చిన వారలైదువందలమంది బ్రాహ్మణు లుండిరి. బ్రాహ్మణ సోనదండుఁడు బుద్ధుని సందర్శింప నున్నాఁడని విని యాతనియొద్దకుం జని తాము విన్నది నిజముగునో కాదోయని యడిగిరి.

"ఆర్యులారా! అదియే నా యుద్దేశము. సమణగోతముని నేను సందర్శింప నున్నాఁడను"

"పూజ్యుఁడగు సోనదండుఁ డట్లు చేయకుండుఁగాక! అట్లుచేయుట యతనికి యుక్తముకాదు. పూజ్యుఁడగు సోనదండుఁ డతని సందర్శింప నేగిన, సోనదండపండితుని కీర్తి క్షీణించి సమణగోతముని కీర్తి వృద్ధిఁ జెందును. ఆర్యా! ముఖ్యముగు నీ కారణముచే నీవాతని సందర్శింపఁ జనరాదు కాని యాతఁడు నిన్ను దర్శించుట కిటకు రావలయును."

(౪) మఱియు వారు సోనదండ బ్రాహ్మణుని తో నితర కారణములం గూడఁ జెప్పిరి. అవి యీ క్రిందఁ బొందుపఱుపఁబడుచున్నవి. అతఁడు మాతృ పితృపక్షములయం దేడు పురుషాంతరములవఱకు మహాకులీనతఁ గలిగియుండెననియు, నతిపురాతనవంశజుండనియును, అతడు ధనికుఁడనియును, శ్రీమంతుండనియును, సంపన్నుఁడనియును,

అతఁడు వేదాధ్యయనపరుఁడనియును, వేదమును వేదాంగములైన తర్క వ్యాకరణ ఛందో నిరుక్త జ్యోతిష కల్పములను బాగుగ నెఱిఁగినవాఁడనియును, నుత్తమ పురుష చిహ్నముల నెఱిఁగినవాఁడనియును,

అతఁడు సుందరాకారుఁడనియును, విశ్వాసజనకంబగు నాకృతిగలవాఁడనియును, శుభ్రవర్ణముకలవాఁడనియును, బ్రహ్మవర్చస్సు కలవాఁడనియును, 'అక్షుద్రావకాశుఁ'డనియును, సప్రతాపుఁడనియును-

అతఁడు మధురంబగు గాత్రముకలవాఁడనియును, మనోహరాలాపముఁ గలవాఁడనియును, మధురభాషి యనియును,

అతఁడు సుశీలుఁడనియును, ధర్మాచరణ పరాయణుఁడనియును,

అతఁడనేకాచార్యుల కాచార్యుఁడనియును, మూఁడువందల మంది బ్రాహ్మణులచే వేదాధ్యయనముఁ జేయించినవాఁడనియును, వేదాధ్యయనము కొఱకనేక దిగ్భాగములనుండి బ్రాహ్మణ యువకులు వచ్చి యాతని వేఁడుచున్నారనియును,

అతఁడు మగధరాజైన సెనియ బింబిసారునిచే గౌరవింపఁబడి పూజింపఁబడుచున్నాఁడనియును,

అతఁడు బ్రాహ్మణ పౌష్కరసాదిచేఁ బూజార్హుఁడుగఁ బరిగణింపఁబడుచున్నాఁడనియును,

అతఁడు సెనియ బింబిసారునిచే నగ్రహారముగ దత్తంబైన పశుశాద్వల సరోవరయుక్తంబును, ధాన్యపూరితంబును, సత్వాకీర్ణంబును నగు క్షేత్రమును రాజు రాష్ట్రమునువలెఁ బాలించుచు నందు వసియించుచుండెననియును,

ఈ కారణములవలన బ్రాహ్మణుఁడైన సోనదండుఁడు సమణగోతముని సందర్శింపఁ బోరాదనియును, సమణగోతముఁడే యాతని సందర్శింప రావలయుననియును వారు చెప్పిరి.

(౫) వారట్లు చెప్పినపిదప సోనదండుఁడు వారలతో నిట్లు చెప్పెను. "అట్లైన నో యార్యులారా! నేనే పూజ్యుఁడగు గోతముని సందర్శింపవలయును గాని యాతఁడు నన్ను సందర్శింపఁ గూడదు. అందులకుఁ గారణములఁ జెప్పెదను. వినుఁడు.

"ఆర్యులారా! నిజముగఁ బూజ్యుఁడగు గోతముఁడు మాతృ పితృపక్షములయం దేడు తరములవఱకును బావనమైన వంశమున జనించి, జన్మము నుత్తమవంశమున బొందినవాఁడు.

"ఆర్యులారా! తన సమస్తబంధు జనంబుల విడనాడి పరివ్రాజకుఁ డయ్యెను.

"ఆర్యులారా! నిశ్చయముగ సమణగోతముఁడు వెండ్రుకలు కొంచెమైనను నెఱియకమునుపే యౌవనమునందే సంసార పరిత్యాగమును గావించి పరివ్రాజకుం డయ్యెను.

"ఆర్యులారా! నిజముగ తల్లిదండ్రులు యిష్టపడక యశ్రుసిక్తకపోలయుక్తులై రోదనము చేయుచున్నను ముండితమస్తక శ్మశ్రుఁడై కాషాయవస్త్రముల ధరించి సంసారమును బరిత్యజించి సన్న్యాసి యయ్యెను.

"ఆర్యులారా! నిజముగ సమణగోతముఁ డర్హతులకగు నుత్తమ గుణములు కలవాఁడై, సుశీలుఁడై, యతి సాధువృత్తి కలవాఁడై యున్నాఁడు.

"ఆర్యులారా! అతఁడు రమ్యమగు గాత్రముకలవాఁడనియును, మనోహరాలాపము గలవాఁడనియును, మధురభాషి యనియును చెప్పుచున్నారు.

"ఆర్యులారా! నిజముగ నతఁడు వీతకాముఁడై మనశ్చాంచల్యమును విడనాడెను.

"ఆర్యులారా! నిజముగ సమణగోతముఁడు కర్మవాదియు క్రియావాదియునై బ్రాహ్మణులొడగూడి పూజించు

బోధలలోఁగూడ ధర్మమునకే యగ్రస్థానము నొసంగు చున్నాఁడు.

"ఆర్యులారా! నిశ్చయముగ సమణగోతముఁ డభిన్నక్షత్రియ కులములోనుండి సన్న్యసించినాఁడు.

"ఆర్యులారా! నిశ్చయముగ సమణగోతముఁడు సిరి సంపదలతోఁ దులదూగుచుండిన కులమును విడిచి సన్న్యసించెను.

"ఆర్యులారా! నిజముగఁ బ్రజలాతనిఁ బ్రశ్నించుటకై నానాదేశములనుండియు వచ్చుచుందురు.

"ఆర్యులారా! నిశ్చయముగ సమణగోతముఁ డర్హతుఁడనియును, సుప్రబుద్ధుఁడనియును, బరమపురుషుండనియును, ప్రజ్ఞానపూరితుండనియును, ధర్మపరుఁడనియును, బ్రహ్మాండజ్ఞాన యుక్తుండనియును, భాగవతుండనియును, బుద్ధుఁ డనియును జనశ్రుతి యెల్లెడల వ్యాపించినది,

"ఆర్యులారా! సమణగోతముఁడు మహాపురుషుల యొక్క ముప్పదిరెండు చిహ్నములను గలిగియుండెను.

"ఆర్యులారా! నిశ్చయముగ జనులందఱితోను బ్రియభాషణములాడుచు, జనుల ననురంజించుచుఁ బ్రసన్నుఁడై మెలంగుచు, నతిసులభుఁడును వక్తయునై యున్నాఁడు.

"ఆర్యులారా! నిశ్చయముగ సమణగోతముఁడు నాల్గువర్ణములవారిచేతను గౌరవింపఁబడి యర్చింపఁబడుచున్నాఁడు.

"ఆర్యులారా! నిశ్చయముగ సమణగోతమునియందుఁ బలువురు దేవతలును, మానవులును భక్తిఁగలిగియున్నారు.

"ఆర్యులారా! నిశ్చయముగ సమణగోతముఁడు గ్రామమునఁగాని, పురమునఁగాని బసచేసి యుండునపు డచ్చటివారి కేరికిని మానుషకృతంబులగు బాధలు కలుగ లేదు.

"ఆర్యులారా! నిశ్చయముగ సమణగోతముఁడు సంఘమునకు ముఖ్యుఁడై, ధర్మనకర్తయై దార్శనికులలో నెల్ల ముఖ్యుఁడై యున్నాఁడు. మఱియుఁ గొంతమంది సమణులును, బ్రాహ్మణులును నత్యల్పవిషయములం జేసి ప్రాముఖ్యమం జెందియున్నారుగాని సమణగోతముఁడు మాత్ర మట్లుకాదు. పరిపూర్ణ సదాచరణచేతను, ధర్మపరత్వముంబట్టియు నతఁడు ప్రఖ్యాతిం జెందియున్నాఁడు.

"ఆర్యులారా! నిశ్చయముగ మగధరాజైన సెనియ బింబిసారుఁడును, నతనిపిల్లలును, భార్యలును, రాజవల్లభులును, బ్రజలును సమణగోతమునియందుఁ బరిపూర్ణమగు భక్తిం గల్గియున్నారు.

"ఆర్యులారా! నిశ్చయముగఁ గోసలరాజైన పసెనది మహారాజును, నతనిపిల్లలును, భార్యలును, రాజవల్లభులును, బ్రజలును సమణగోతమునియందుఁ బూర్ణమగుభక్తి గల్గియున్నారు.

"ఆర్యులారా! నిశ్చయముగ బ్రాహ్మణుఁడైన పొక్ఖరసాదియును, నతనిపిల్లలును, భార్యలును, బంధుగులును, మిత్రులును సమణగోతమునియందుఁ బరిపూర్ణమగు భక్తిఁ గల్గియున్నారు.

"ఆర్యులారా! నిశ్చయముగ సమణగోతముఁడు మగధరాజైన సెనియ బింబిసారునిచేతను, గోసలరాజైన పసెనది మహారాజుచేతను, బ్రాహ్మణుఁడైన పొక్ఖరసాదిచేతను నొక్కరీతిగనే గౌరవింపఁబడి పూజింపఁబడుచున్నాఁడు.

"ఆర్యులారా! నిశ్చయముగ సమణగోతముఁ డిప్పుడు చంపాపురమునకు విచ్చేసి గగ్గరా సరోవరతటముకడ బసచేసియున్నాఁడు. ఈపురమునకు విచ్చేయు సమణులును, బ్రాహ్మణులును మన యతిథులైయున్నారు. మఱియు నతిథులు మనచే నర్చింపఁబడఁ దగినవారు. అతఁ డతిథియై విచ్చేసినాఁడుకావున నాతఁ డతిథివలెఁ బూజింపఁబడవలయును.

"ఈకారణములచే సమణగోతముఁడు మనల సందర్శింపఁబనిలేదు. మనమే యాతనియొద్దకుం జని సందర్శించుట యుక్తము. నేను జెప్పినంతవఱకే యాతనిప్రజ్ఞలు

నాకుఁదెలియును. కాని యివిమాత్రమే యాతనిగుణములు కావు. ఆతని యుత్కృష్టగుణములు వర్ణనాతీతములు."

(౭) ఆతఁ డిట్లు సంభాషించిన పిదప నా బ్రాహ్మణు లిట్లు చెప్పఁదొడఁగిరి. "పూజ్యుఁడగు సోనదండునిచేఁ జేయఁబడిన సమణగోతము గుణసంకీర్తనంబు విన్న యాతఁడు క్రోశశతపరిమిత మార్గమం దున్నను, బరువును మూపుపైఁ బెట్టి మోయుచున్నను, వాతనియందు భక్తి కలిగిపోయి యాతని సందర్శింపును. మన మందరము ను సమణగోతముని సందర్శింతము రండు."

బ్రాహ్మణుఁడగు సోనదండుఁడు బ్రాహ్మణ సమూహముతోఁగూడి గగ్గరా సరోవరమునకుఁ బ్రయాణమై పోయెను.

(౮) వనమార్గమునఁ బోవుచుండ సోనదండుని మనమున నీయనుమాన ముద్భవించెను. "నేను సమణగోతము నొక ప్రశ్నయడిగిన నాతఁడు 'ఈరీతిగ నీవు ప్రశ్నింపరాదు. ఈ రీతిగ నీవు ప్రశ్న నడుగవలయును' అనియన్న 'బ్రాహ్మణుఁడైన సోనదండుఁడు మూర్ఖుఁడు చతురుఁడుకాఁడు. యుక్తి యుక్తముగఁ బ్రశ్న యడుగుటయైనం దెలియఁడు' అని నన్ను నిందింతురు. వారట్లు నన్ను నిందించిన నాకీర్తి క్షీణించి, నా యార్జనకూడ తగ్గును. ఏలయన మనయార్జన మనకీర్తిననుసరించి యుండును. మఱియు సమణగోతముఁడు నన్నుఁ బ్రశ్నించునపుడు, సమాధానముచే నే నాతనిమానసమును రంజింపజేయలేక పోయినయెడల నాతఁడు 'ఈరీతిగ నీవు సమాధానముఁ జెప్పరాదు. ఈరీతిన నీవు సమాధానముఁ జెప్పవలయును' అనియన్న సభ్యులు నన్నుఁగూర్చి 'ఈ బ్రాహ్మణ సోనదండుఁడు మూర్ఖుఁడు. నిపుణుఁడు గాఁడు. అడిగిన ప్రశ్నకు యుక్తమగు సమాధానముం జెప్పి సమణగోతముని రంజింపనేరఁడు' అని నన్ను నిందింతురు. అట్లైన నాకీర్తి క్షీణించి, నాయార్జన తగ్గును. ఏలయన మనయార్జన మనకీర్తిననుసరించి యుండును. అట్లుకాక నే నిచటినుండి సమణగోతముని దర్శింపక తిరిగిపోయిన వీరు 'బ్రాహ్మణుఁడైన సోనదండుఁడు మూర్ఖుఁడు. నిపుణుఁడుకాఁడు. గర్వియై యున్నాఁడు. సమణగోతముని సందర్శించుటకు భీతుఁడైనాఁడు. ఇంత దూరమువచ్చి తిరుగ నెట్లు పోఁగలఁడు' అని యన్న నా కీర్తి క్షీణించి నాయార్జన తగ్గును. ఏలయన నాయార్జన నాకీర్తి ననుసరించి యుండును."

(౯) బ్రాహ్మణుఁడైన సోనదండుఁడు భాగవతుం డాసీనుఁడైయున్న స్థలమునకుం జని, యుచితమర్యాద లైనపిదప నొకప్రక్క నాసీనుఁడైయుండెను. చంపాపురవాసులగు బ్రాహ్మణులలోను, గృహస్థులలోను, గొందఱు భాగవతునకుఁ బ్రణామము లాచరించి యొకప్రక్కను గూరుచుండిరి. మఱికొందఱు ఉచితమర్యాద లాచరించి యొకచోఁ గూరుచుండిరి. మఱికొందఱు భాగవతునినామ సంకీర్తనముం గావించి యొకయిక్కడఁ జేరిరి. ఇఁకఁగొందఱు ఏమియుం బలుకక యొకదెస నాసీనులై యుండిరి.

(౧౦) సోనదండుఁ డొకదగ్గఱఁ గూరుచుండి పూర్వమువలె సంశయపూరిత మనస్కుఁడై యీరీతిని వితర్కించుకొనుచుండెను. "సమణగోతముఁడు వేదసంబంధమైన విషయముంగూర్చి ప్రశ్నించిన బాగుండును, అపుడు నాసమాధానముచే నాతని సమ్మతిని బడయఁగలను."

(౧౧) భాగవతుఁ డాసోనదండుని మనోవైకల్యమును గ్రహించి యీరీతిగఁ జింతించెను. "సోనదండుఁడు చిత్తక్లేశమును బొందుచున్నాఁడు. వానిసిద్ధాంతముం గూర్చియే వానిఁ బ్రశ్నించెదను" అని చింతించి, "ఓ బ్రాహ్మణుఁడా! ఏవి బ్రాహ్మణున కుండవలసిన చిహ్నము లని బ్రాహ్మణులచేఁ బేర్కొనఁబడుచున్నవి? ఏగుణములు కలవాఁడు నేను బ్రాహ్మణుఁడనని పలికిన నయథార్థము కాదో యట్టి గుణములెవ్వి?"

(౧౨) అప్పుడు సోనదండుఁడు "ఏవేదత్రయ సంబంధమైన విషయముంగూర్చి నన్ను సమణగోతముఁడు ప్రశ్నించిన మేలని నే నూహించితినో, యెట్టిదాని నాతఁడు నన్నడుగుఁగాక యని నేను మనస్సునం దభిలషించితినో, యట్టిప్రశ్న నే నన్నాతఁ డడిగెను. ఆతని

మానసమును రంజించునట్టి యుత్తరమును నే నీయఁ గల్గుదునుగాక" అని చింతించెను.

(౧౩) అపు డాతఁడు దేహోన్నమనంబుం గావించి సభ నెల్లఁ గలయఁ జూచి భాగవతునితో "ఈ చిహ్నపంచకముఁ గలిగి 'నేను బ్రాహ్మణుడను' అని యన్న నెవ్వఁ డసత్యవాదికాక సత్యవాదియే యగుచున్నాడో యట్టివానినే బ్రాహ్మణులు బ్రాహ్మణుఁడని పరిగణించుచున్నారు. ఆచిహ్నపంచకము నీక్రిందఁ జెప్పుచున్నాఁడను. ఆర్యా! మొట్టమొదట బ్రాహ్మణుఁడు మాతృపితృ పక్షములయం దేడుపురుషాంతరములవఱకును నుత్తమవంశమందు జన్మించి జన్మకలన నిష్కళంకుఁడై యుండవలయును.

"వేదములయందును, వేదాంగములగు నిరుక్తవ్యాకరణాదులందును మహాపండితుఁడై మహాపురుష చిహ్నముల గుర్తింపఁగలిగియుండవలయును.

"అతఁడు సుందరాకారుఁడును విశ్వాసజనకంబగు నాకృతి గలవాఁడును, శుభ్రవర్ణము కలవాడును, బ్రహ్మవర్చస్సు కలవాడును, 'అక్షుద్రావకాశుఁడును' స్వప్రతాపుఁడునై యుండవలయు. పండితుడై, విజ్ఞానయుక్తుడై, సుశ్రువ ప్రయోగదక్షులలో నగ్రస్థానముల నలంకరింపవలయును."

(౧౪) "ఓ బ్రాహ్మణుఁడా! ఈ గుణములలో నొకటితప్ప మిగిలిన నాల్గింటిని గల్గియున్న యాతఁడుఁ నేను బ్రాహ్మణుఁడను అని వచించిన నావాక్యము సత్య విరుద్ధముగ నుండకుండునా ?"

"గోతముఁడా! అట్లు వీలగును. మనము వర్ణమును బరిగణింపక యుండవచ్చును. వర్ణములో నేమున్నది? మీఁదఁ జెప్పఁబడిన కులీనత, వేదాధ్యయనాదిసంపత్తి, సదాచారము, విజ్ఞానము అనునాల్గు గుణములు నుండిన బ్రాహ్మణు లిట్టి గుణములు కల యాతని బ్రాహ్మణుఁడని నిర్ణయింతురు. మఱియు నట్టివా డనృతభీతి లేక బ్రాహ్మణుడనని చెప్పుకొనవచ్చును."

(౧౫) "ఓయీ! బ్రాహ్మణుఁడా! యీ నాల్గింట నొకటి తప్ప మిగిలిన మూఁడింటిం గలిగియు నే బ్రాహ్మణుఁడనని చెప్పిన సత్యవిరుద్ధము కాకుండ నుండుటకు వీలగునా?"

"గోతముడా! అది వీలగును; మంత్రముల నిరాకరింపవచ్చును. మంత్రములలో నే మున్నది? సద్వంశము, సదాచారము, విజ్ఞానము వను మిగిలిన మూఁడు గుణములునుండిన నట్టివానిని బ్రాహ్మణులు బ్రాహ్మణుఁడని యందురు. మఱియు నాతఁ డనృతభీతి లేక తాను బ్రాహ్మణుఁడనని చెప్పుకొనవచ్చును."

(౧౬) "ఈమూఁటియందును నొకటితప్ప మిగిలిన రెంటింగలిగి నేను బ్రాహ్మణుడనని చెప్పిన సత్యవిరుద్ధము కాకుండ నుండుటకు వీలగునా ?"

"గోతముఁడా! అది వీలగును. జన్మమును నిరాకరింపవచ్చును. జన్మలో నేమున్నది? సౌశీల్యవిజ్ఞానములను రెండుగుణములుండిన నట్టివానిని బ్రాహ్మణులు బ్రాహ్మణుఁడని యందురు. మఱియు నాతఁ డనృతభీతి లేక తాను బ్రాహ్మణుడనని చెప్పుకొనవచ్చు."

(౧౭) అతఁ డట్లు చెప్పినతరువాత బ్రాహ్మణులు సోనదండునితో "పూజ్యుడవగు సోనదండుఁడా! అట్లు చెప్పకుము. అతడు మనవర్ణమునే కాక మనజన్మమును మంత్రములనుగూడ నిరాకరించి నిరసించుచున్నాఁడు. నిశ్చయముగఁ బూజ్యపాదుఁడగు సోనదండుఁడు సమణ గోతమ సిద్ధాంతమును బరిగ్రహించుచున్నాఁడు" అని యనిరి.

(౧౮) ఆ బ్రాహ్మణులతో భాగవతుఁ డిట్లు ముచ్చటించెను.

"ఓ బ్రాహ్మణులారా! సోనదండుఁడు విద్వాంసుఁడు కాఁడని కాని, యయుక్తసంభాషణ చేయుచున్నాఁడని కాని, మూర్ఖుఁడని కాని, యీ విషయములో నాతో సమముగ వాదింపలేకున్నాఁడని కాని మీరు యోచించిన నాతఁడు నాతోఁ జర్చింపనవసరము లేదు. మీరే నాతో జర్చింపవచ్చును. అట్లుకాక యాతఁడు విద్వాంసుఁడనియు, వక్తయనియు, ప్రాజ్ఞుడనియు, నాతో వాదించుటకుఁ దగినవాఁ డనియు,

మీరు యోచించిన మీఁద లూరకుండుఁడు. అతఁడే నాతో ముచ్చటించును."

(౧౯) బుద్ధుఁడిట్లు చెప్పినపిదప బ్రాహ్మణ సోనదండుఁ డిట్లు చెప్పఁదొడఁగెను. "ఆర్యపాదులారా! తామిట్లు దూషింపరాదు. వర్ణమునుగాని, మంత్రములనుగాని, జన్మమునుగాని నేను దృణీకరింపలేదు."

(౨౦) బ్రాహ్మణ సోనదండుని భగినీ పుత్రుఁడైన యంగకుఁడను బ్రాహ్మణయువకుఁ డాసభలోఁ గూర్చుండి యుండెను. 'నా మేనల్లుఁడైన యీయంగకుని మీ రెఱుంగుదురా?' అని యచటి బ్రాహ్మణులనడిగెను.

"ఆర్యా! అదుగో! అతని మే మెఱుంగుదుము."

"ఆర్యులారా! అంగకుఁడు సుందరాకారుఁడు. విశ్వాస జనకంబగు నాకృతిగలవాఁడు. శుభ్రవర్ణముకలవాఁడు. బ్రహ్మవర్చస్సుకలవాఁడు. 'అక్షుద్రావకాశుఁడు.' సప్రతాపుఁడు.

"ఈసభలో సమణగోతముఁడు తప్ప వేఱెవ్వరు నాతనిని వర్ణములో సరిపోలరు.

"ఆర్యులారా! అంగకుఁడు వేదవేదాంగ లోకాయతిక మహాపురుషచిహ్న శాస్త్రాదులం దెలిసినవాఁడు. నే నే యాతనిచే వేదాధ్యయనంబుఁ జేయించితిని.

"ఆర్యులారా! అంగకుఁడు పితృపక్షమునను, మాతృపక్షమునను నేఁడు పురుషాంతరములవఱకును మహాకులీనత కలిగియుండెను. అతిపూతవంశజుండై యుండెను. అతని మాతృపితృవంశములయందలి పూర్వుల నే నెఱుఁగుదును.

"ఆర్యులారా! అంగకుఁడు హంతకుఁడై, సువర్ణస్తేయియై, పరదారాభిలాషియై, యనృతవాదియై, సురాపాయియై యుండిన వాని వర్ణమును, జన్మమును, మంత్రములును నేమి ప్రయోజనము?

"ఆర్యులారా! బ్రాహ్మణుఁడు సదాచార సంపన్నుఁడై, సౌశీల్యముఁ గలిగియుండి, పండితుఁడై, విజ్ఞానయుక్తుఁడై, యాజకాగ్రగణ్యుఁడైన బ్రాహ్మణులట్టియాతని బ్రాహ్మణుఁడని యందురు. మఱియు నట్టివాఁడే నేను బ్రాహ్మణుఁడనని నిజముగఁ జెప్పుకొనఁగలఁడు."

(౨౧) "ఓయీ! బ్రాహ్మణుఁడా! యీ రెంటిలో నొకటి తప్పఁ దక్కిన దానింగలిగి నేను బ్రాహ్మణుఁడనని చెప్పిన సత్యవిరుద్ధము కాకుండ నుండుటకు వీలగునా?"

"ఓయీ! గోతముఁడా! నీవట్లు చెప్పఁగూడదు. ఓయీ! గోతముఁడా! విజ్ఞానము సదాచారముచేఁ బూతంబగుచున్నది. సదాచారము విజ్ఞానముచేఁ బవిత్రమగుచున్నది. సదాచారమున్నచోట విజ్ఞానమును, విజ్ఞానమున్నచోట సదాచారమును సంభవించుచునేయున్నవి. సదాచారసంపన్నులకు విజ్ఞానమును, విజ్ఞానయుక్తులకు సౌశీల్యమును గలుగుచునే యున్నవి. సదాచారమును, విజ్ఞానమును బ్రపంచమున సత్యోత్తమములైనవని చెప్పుచున్నారు. ఓయీ! గోతముఁడా! హస్తముతో హస్తమును, పాదముతో పాదమును నేరీతిఁ గడుగుకొనవచ్చునో యట్లే విజ్ఞానము సదాచారముతోడను, సదాచారము విజ్ఞానముతోడను బవిత్రములగుచున్నవి."

(౨౨) "ఓయీ! బ్రాహ్మణుఁడా; నీవుచెప్పినది నిజము. నేఁ జెప్పినదియు నదియే. సదాచారమన్న నేమి? విజ్ఞానమన్న నేమి?"

"ఓయీ! గోతముఁడా! వీనింగూర్చి నలుగురుచెప్పువిధముం దెలిసియును. పూజ్యపాదులగు గోతములీవిషయముం గూర్చి లెస్సఁగ ముచ్చటించి బోధింతురుగాక!"

"ఓయీ! బ్రాహ్మణుఁడా! నేఁ జెప్పుదానిని సావధానచిత్తుఁడవై యేమఱక వినుము."

(౨౩) "ఆర్యా! అట్లే" అని సోనదండుఁడు భాగవతునితోఁ జెప్పెను. మఱియు భాగవతుఁ డిట్లు ముచ్చటించెను. *

* భారతి అక్షయ సంవత్సర మాఘమాస సంచిక ౧౬౨-వ పుటలో "ఓయీ! ప్రపంచమున సుజ్ఞానియు బుణ్యకర్ముండును..." అను పేరా మొదలు ప్రభవ సంవత్సర వైశాఖమాస సంచిక ౧౨౩ వ పుటలో "మఱియు భిక్షుకుం డీగొణంబులలో" అను పేరా చివరవరకును (ఈ భాగమున 'గౌతమముని' అన్న పదమునకు మారుగ 'భిక్షువు' అని చదువుకొనవలెను), అదే సంచిక ౧౨౫-వ పుటలో 'మఱియు నప్పు డాతఁడు ప్రీతుఁడై...' అను పేరా మొదలు జ్యేష్ఠమాస సంచిక ౭౫-వ పుటలో "పార్వతదుర్గమునందు నిర్మలమును..." అను పేరా చివరకును ఇక్కడ చేర్చుకొని చదువుకొనవలెను.

"ఓయీ! బ్రాహ్మణుఁడా! యిదియేమనుమా ప్రజ్ఞ."

(౨౪) గోతముఁడిట్లు వచించిన పిమ్మట బ్రాహ్మణుఁడైన సోనదండుఁడు భాగవతునితో నిట్లు చెప్ప మొదలు పెట్టెను.

"ఓయీ! గోతముఁడా! నీవచనంబు లత్యుత్తమంబులు. క్రిందికిఁ బడఁద్రోయఁబడిన వస్తువును నిలువబెట్టినట్లు, గోప్యముగ నుండదగిన దానిని సుస్పష్టముగ జేసినట్లు, తప్పుత్రోవను బోయినవానికిఁ గ్రమమైన మార్గమును గనుపఱచినట్లు, కన్నులుగలవారలు చూడఁగలుగునట్లు, చీఁకటిలో వెలుతురు కలుగఁజేసిన రీతిని బూజ్యపాదులగు గోతములు వివిధాలంకార యుక్తంబులగు వచనంబులచే నాకు బోధపడురీతిని సత్యమును బ్రకటించిరి. నేనుగూడ ధర్మమును, సంఘమును, బూజ్యులగు గోతముల మార్గ ప్రదర్శకులుగ నెన్నుకొని నమ్మచున్నాఁడను. ఈనాటినుండియుఁ బ్రాణములు కంఠమున నుండునంతవఱకు నన్నుఁ దమశిష్యునిగఁ బూజ్యులగు గోతము లంగీకరింతురుగాక. రేపటిదినమున బూజ్యులగు గోతములు భిక్షుకులతోఁగూడ నాయింట భిక్ష నంగీకరించుట కనుగ్రహింతురుగాక."

భాగవతుఁడు మౌనముచేతనే యంగీకారమును సూచించెను. గోతముఁడు తనభిక్ష నంగీకరించెనని సోనదండుఁడు గ్రహించి, యాసనమునుండి లేచి, భాగవతునికి మ్రొక్కి, దక్షిణహస్తము నాతనివైపునకు జాఁచి, ప్రదక్షిణంబుచేసి యటనుండి వెడలెను. మరునాటి యుదయముననే కఠినంబులును, మృదువులునునగు మధుర భక్ష్యంబులఁ జేయించి, "భక్ష్యములు సిద్ధములైనవి. ఓగోతముఁడా! భోజనమునకు సమయమైనది." అని భాగవతునికి దెలియజేసెను.

(౨౫) ఉదయముననే మేలుకాంచి, స్నానాది కృత్యములంజేసి సంసిద్ధుఁడైయున్న భాగవతుఁడు, వస్త్రమును ధరించి, భిక్షాపాత్రను గ్రహించి, భిక్షుకులతోఁగూడ సోనదండుని గృహమునుం జేరి, తనకొఱకు సిద్ధము చేయబడియున్న యాసనము నలంకరించెను. భాగవతునకును, నాతని భిక్షుకులకును వలసినవఱకును కఠినంబులు, మృదువులునగు మధురభక్ష్యములను దనచేతులతోడనే వడ్డనచేసెను. భాగవతుఁడు భోజనమును ముగించి భిక్షాపాత్రను, హస్తములను గడుగుకొనిన పిదప సోనదండుఁ డాతనిప్రక్కను నీచాసనముపై గూరుచుండి యాతనితో నిట్లు సంభాషించెను.

(౨౬) "ఓయీ! గోతముఁడా! పూజ్యుఁడవగు నీకు మ్రొక్కుటకై సభలోనే నాసనమునుండి లేచిన సభ్యులు నన్ను నిందింతురు. అట్లు సభలో నిందితుఁడైన వానికీర్తి క్షీణించును. కీర్తి తగ్గిన వాని యార్జన తగ్గును. ఏలయన మనుజుని యార్జన యాతనికీర్తి ననుసరించియుండును. కాన సభలో నున్నపుడు నా ముకుళితకరములను బ్రత్యుత్థాన మొనర్చినట్లు పూజ్యపాదులగు గోతము లంగీకరింతురుగాక. సభలోనే నాసీనుఁడనై యుండి శిరోవేష్టము తీసివేయునపు డద్దాని శిరమునే వంచినట్లు పూజ్యులైన గోతములు భావింతురుగాక. నేను రథారూఢుఁడనై యుండి యద్దానినుండి నే క్రిందికి దిగినఁ జూపఱు నన్ను నిందింతురు. రథారూఢుఁడనై ప్రతోద దండమును గ్రిందికి వంచిన నేను దిగినట్లే పూజ్యపాదులైనగోతము లంగీకరింతురుగాక రథారూఢుఁడనై యుండి నేను హస్తముల నూపిన నద్దానిని బూజ్యులగు గోతములు నా ప్రణామముగ భావింతురు గాక."

(౨౭) భాగవతు లపుడు సోనదండు నసమాన తత్త్వబోధచే నుత్సాహయుక్తునిగను, నానందముయునిగను నొనర్చి యచటినుండి వెడలిపోయెను.

# శకుంతలాంధ్రీకరణము

శ్రీ రాజా వత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు

106

చరణరాజీవగుంజన్మంజు మంజీరశింజా నినాదంబు చెంగలింప
కమనీయపాణికంకణమణీకింకిణీక్వణనాతిరేకంబు గణనకెక్క
తుందిస్తనస్యంది మందారరసబిందు బృందంబు లందంద చిందువంద
జఘనబింబాలంబిసంతానసుమదామ కాంచీకలాప మగ్గలమువలవ
పదచమత్కృతి సువ్యక్తభావవివృతి-రసపరిష్కృతి మండనప్రస్తుతి మెఱయ
జిన్మయాకృతి సన్నిధి సేయుఁ గాత-కావ్యభారతి మన్మనఃకమలవీథి.

బాలకలాకలాప నవభాగ్యవశంబున నాంధ్ర విశ్వవి
ద్యాలయ మేర్పడం దొడఁగె నందు నవశ్యసుపాఠ్యమై కలా
శాలలలోన నాటకపుశాలలలోన నజస్రదృశ్యమై
చాల శుభంబుఁ గూర్చు కృతి సల్పుట యొప్పు జగద్ధితంబుగన్.

త్రేనుపు వచ్చునట్లు నునుతీఁగల నీఁగలు నాఁడు నాఁడు పూఁ
దేనియ లాని యాని మఱి తియ్యనిట్టులు వెట్టునట్లు నా
నానిగమాగమప్రకటనాటకకావ్యరసంబు సత్కవుల్
వీనుల నాని కావ్యములు వింతలు వుట్ట రచింపఁగాఁ దగున్.

కావ్యములందు శ్రవ్యములకంటెను దృశ్యము లొప్పు దృశ్యపుం
గావ్యములందుఁ బ్రాభవము గాంచె శకుంతల సర్వలోక సం
భావ్యకలావిలాససుషమావిభవంబునఁ దత్కృతీంద్రమున్
నవ్యరుచిన్ రచింపఁదగు నాటకరాజముగా తెలుంగునన్.

నాటకరంగముల్ ప్రబలె నాట్యకలాభ్యసనంబుమీఁద నా
నాఁటికిఁ దీపు హెచ్చె సుజనంబులకున్ నటరాజశేఖరుల్
పూటు పడంగఁజొచ్చిరి తెలుంగున నింక కలాకలాప శృం
గాటకమైన నాటకము గల్గెడు గాక తెలుంగువారికిన్.

పాకమునందు గాని రసభావనిరూపణయందు గాని ప్ర
త్యేకత యేమి యున్న రుచియించు సచేతసు లైనవారికిన్
పోకలఁ బోవుచున్న నటభూషణ భూమిక లెట్టు లట్లు యాం
ధ్రీకరణప్రకారసరణిన్ గవిభూషణ వాక్యశిల్పముల్.

పరికర మెల్లఁ గూర్చుకొని ప్రాఁబడిపోని యనల్పకల్పనా
పరిణతిఁ బేర్చి కూర్చు రసబంధురతన్ దొరయంగ సంతసన్
బెరయఁగ క్రొమ్మెఱుంగు మిసిమిం బొరయంగ త్రిభంగియత్నముల్
జరిగినఁ గాక చిత్రపట సౌధకృతుల్ లలితత్వ మొందునే.

ఉల్లము చాల విశ్రమము నొంది ఘటాంతరదీపకోరకా
వేల్లితవృత్తిమై నిలిచి వెల్గినఁ గాక కృతిప్రయత్నముల్
మొల్లము గావు దానికయి మొల్లము గావలె పౌరుషంబుపై
నుల్లము నిల్పఁగావలసియుండుఁ దదభ్యుదయంబు గోరినన్.

నన్నయభట్టు నశ్వగమనంబు చమత్కృతి చారుఖేలనన్
నన్నె నృపాలు హస్తిగమనంబు బెడంగును సార్వభౌము సం
పన్న కలావిభూతి దను మై మయిఁ జూఱగొనంగఁ జిత్తమ
భ్యున్నత రాజ్యవైభవముఁ బూను ప్రయత్నము సేయ దేమియున్.

భోజ్యము రాజధర్మజయపూర్వకలభ్యము పిత్ర్య మమ్మహీ
రాజ్య మనూనభోగ సుకరం బయినప్పుడు చూత మంతికున్
బ్రాజ్యము మాతృవంశసముపాగత మీసుకలావిలాస సా
మ్రాజ్యము చూఱ మీకు సుషమాలవ మున్నఁ గొనుండు భావుకుల్.

# బౌద్ధవాఙ్మయము: పరిశోధన

'హారితస'

బౌద్ధవాఙ్మయ పరిశోధనోదంతము చాల విచిత్రమైనది. హిందువుల వలెనే బౌద్ధులును, తమ మతగ్రంథములను మతాంతరులకు జూపక కడుజాగ్రత్తతో వాటిని పేటికలలో పెట్టి తమ తమ పుస్తకభండారముల భద్రపఱిచి యుంతురు. హిందూదేశమున బౌద్ధమత మెన్నడో యంతరించిన దగుటచేత తన్మతగ్రంథము లేవియో, అవి యేభాషలో నున్నవో బౌద్ధులకు మాత్రమే తప్ప తదితరులకు దెలియనే తెలియదు. నశించిపోక ఏమూలలనైన ఒదిగి మెదిగి బౌద్ధ మింకను ప్రాణముతో నున్నను, చాలవఱకు అది హిందూమత లక్షణముల నవలంబించి వాడుకకు తన్మతానుకరణమే యై, పేరునకు మాత్రమే బౌద్ధముగ నిలిచిపోయెను. అందువలన ఉన్న మత గ్రంథములైనను సమర్థులును, పండితులునైనమతాచార్యులకే కాని తదితరులకు తెలియరాక యుండెను. ఈకారణములవలన పౌరస్త్యులైన భారతీయులకే వీటిని గుఱించి తెలియలే దనిన ఇక పాశ్చాత్యులైన యూరోపియనులమాట యేల?

క్రీస్తుశకము పందొమ్మిదవశతాబ్ది ప్రాచ్య విజ్ఞానపరిశోధన కారంభయుగము. ఈ యుగారంభమున విజ్ఞానతృష్ణ కల పాశ్చాత్యపండితులును, వారు చూపినమార్గమునే యనుసరించి కొందఱు ప్రాచ్యపండితులును ఈప్రాచ్య విజ్ఞానరత్నాకరమును మథింపజొచ్చిరి. ఈ సందర్భముననే యీపౌరస్త్య, పాశ్చాత్యపండితులకు బౌద్ధవాఙ్మయోదంతము తెలియవచ్చినది. అప్పటి కయినను బౌద్ధమతగ్రంథములు పాలీభాషలో నున్నవని మాత్రమే వారికి దెలియును. అవి సంస్కృతభాషనుగూడ గలవనుట క్రీ. శ. ౧౮౨౧-౧౮౨౮ల నడిమి కాలమున మాత్రమే తెలియవచ్చిన రహస్యము. ఈ రహస్యము వెల్లడియగుటకు కారణభూతు డైనవాడు బ్రియన్ హౌటన్ హాడ్జ్సన్ దొర.

ఈతడు క్రీ. శ. ౧౮౨౧ లో నేపాళదేశపు 'బ్రిటిషు రెసిడెంటు'గ నియమింపబడెను. ఈయుద్యోగమును స్వీకరించిన నాటినుండియు ఈతడు ఆదేశపు ప్రజల మతవాఙ్మయములను గుఱించి తెలిసికొన గృషి చేసెను. తత్ఫలితముగ ఈతని కచ్చటి మతాచార్యులతో మైత్రి కలిగెను. వీరిలో బౌద్ధులు చాలమంది కలరు. వీరి విహారములకు, మఠములకు బోయి, యచ్చటి పుస్తకభండారములలోని బౌద్ధగ్రంథములను పరిశోధించి, తన్మతాచార్యుల సహాయమున అఱువది బౌద్ధమతగ్రంథసంపుటములను సంపాదించెను. వాటి నన్నిటిని పరిశీలనార్థము కలకత్తా బెంగాలు ఏషియాటిక్

సొసయిటీవారికి పంపెను. కాని యచ్చటి పరిశోధకపండితు లెవ్వరును ఆగ్రంథములపరిశోధనయం దాసక్తి కలవారుగ గాన్పింపకపోవుటచేత అవ్వేగ్రంథములు మఱి రెండుజతలు సంపాదించి, ఒకజత లండను 'ఏషియాటిక్ సొసయిటీ'వారికిని, మఱియొకజత పారిస్ (ఫ్రాన్సు), 'సొసయిటీ ఏషియాటిక్'వారికిని పంపెను. ఇట్లు పంపుటయే కాక అతడు తానుగూడ ఆగ్రంథములను బాగుగ పరిశోధించి, యచ్చటి బౌద్ధమతాచారాదులనుగూర్చి తెలిసికొని పత్రికలకు వ్యాసములు వ్రాయుచువచ్చెను. హాడ్జ్‌సన్ పరిశోధనలవలన ఈబౌద్ధమతవాఙ్మయము నేపాళదేశమున క్రీస్తుశకము రెండువందలసంవత్సరములనుండియు నున్నట్లు తెలియవచ్చెను. త్రివిష్టప మనబడు టిబెత్తుదేశమున బౌద్ధమతము బాగుగ పాదుకొన్నపిదప క్రీ. శ. ఏడెనిమిదిశతాబ్దులలో, ఈబౌద్ధవాఙ్మయ మంతయు టిబెత్తుభాషలోని కనువదింబడెను. చీనాదేశమునుండి ముద్రణయంత్రము టిబెత్తుకు వచ్చినపిదప ఈగ్రంథము లన్నియు ముద్రితములై ఒక్కొక్కగ్రంథమున కెన్నిప్రతులు వలసిన అన్నిప్రతులు దొరకుచుండెడివి: కాని టిబెత్తుభాష రానిది ఆగ్రంథముల ప్రయోజన మేమి, పరిశోధకపండితులకు?

సరిగా ఇదేసమయమున దైవికముగ ఆ లోటుకూడ దీరెను. హంగేరీ (ఆస్ట్రియా) నుండి అలెగ్జాండరు సోమ డి కొరోసీ అను తద్దేశీయు డొకడు పురాతత్త్వపరిశోధనయం దాసక్తి కలవాడు—మధ్యఆసియాఖండమున ఎచటనో హంగేరీదేశస్థుల ఆదిమనివాసస్థలము ఉండవలెనని యూహచేసి, దానిని కనిపట్టవలయునను మహోత్సాహముతోను, ఆశతోను హంగేరీనుండి టిబెత్తు వఱకు కాలినడకను ప్రయాణముచేసి వచ్చెను. తుదకాత డచ్చటికి వచ్చునప్పటికి దేశమును, భాషయు గూడ క్రొత్త వగుటచేత తద్దేశభాషను - స్వప్రయోజనము నిమిత్తమే - నేర్చుకొనవలసినవా డయ్యెను. నూతనభాషావశమున బుట్టిన నూతనోత్సాహ మాతనిని స్వకార్యాచరణోన్ముఖునిగ జేయుటకు మాఱుగ ఆతనిదృష్టిని తద్దేశవాఙ్మయముపై ద్రిప్పెను. టిబెత్తు బౌద్ధవాఙ్మయమును పరిశోధించి లోకమున కందలి సంగతులను దెలుపుభారము ఉత్సాహవశమున ఆతనిపై బడెను. ఆతడు టిబెత్తుబౌద్ధమతగ్రంథములను చాల పరిశీలించి పరిశోధించెను. టిబెత్తుదేశములోని బౌద్ధగ్రంథములు రెండు గొప్పగ్రంథభండారములలో కలవు. వీటినే కంజూర్, తంజూర్ లందురు. కంజూర్ గ్రంథభండారమున నూఱు, నూటఎనిమిది సంపుటములు కలవు. ఒక్కొక్క గ్రంథమునకు పాఠభేదముల నొప్పు వేఱువేఱు ప్రతులు కలవు. అసలు గ్రంథములు ౧౦౮౩ వఱకు నున్నవి. ఇక తంజూరుగ్రంథభండారమున రెండువందలఇరువదియైదు సంపుటములు కలవు. హంగేరీదేశస్థుడు క్రొత్తమతవాఙ్మయమును గనిపట్టితి నన్న ఉత్సాహమున ఏతద్గ్రంథజాలమును జాలవఱ కవలోడనము చేసి

నను, దీని నంతను మథించుట ఒక్కనికి తలకు మీఱిన పని. అయినను అతడు చేయగలిగి నంత చేసి తన పరిశోధనఫలితములను వ్యాస రూపమున పత్రికల బ్రకటించెను; కాని గ్రంథ ముల కనువాదములు చేయడయ్యెను. ఇట్టిపని కవకాశము కలుగకపూర్వమే, అనతికాలము ననే, ఆతడు ఏతత్కష్టతమ ప్రాచీనాన్యమత భాషాధ్యయనమునకు జిక్కి యసువులం గోలు పోయెను. జ్ఞానతృష్ణ యలసటను గాని, యపా యమునుగాని యెఱుంగదుకదా!

నేపాళదేశమున హాడ్గ్సన్ ద్వారయును, తిబెత్తు దేశమున సోమ డి కొరోసీయును బౌద్ధ వాఙ్మయ పేటికలనుగాలించి యందలి యమూ ల్యవిషయములనులోకమునకు వెల్లడించుచుండి నప్పుడే మంగోలియాలోని బౌద్ధవాఙ్మయము ను ష్మిట్ ద్వార (Schmidt)యు, సింహాళము నందలి బౌద్ధవాఙ్మయమును జార్జి టర్నరు ద్వా రయు తరుచుచు, తమ ప్రయత్న ఫలితములను లోకమునకు వెల్లడించుచు వచ్చిరి. హాడ్గ్సన్ ద్వార పారిస్ పంపిన బౌద్ధమత గ్రంథములను యూజీన్ బర్నాఫ్ పరిశోధించి, తనపరిశోధన ఫలితముల నాతడుకూడ ఇంచుమించుగ ఈ కాలముననే లోకమునకు వెల్లడిపఱుచుచుండె ను. ఈవిధమున నేల నాల్గుచెఱగులనుండియు బౌద్ధమతవాఙ్మయవిజ్ఞాన ప్రవాహమువఱదలై ప్రవహింపసాగెను. నాటినుండియే, అనగా పందొమ్మిదవశతాబ్ది ప్రథమ పాదాంతము నుండియే లోకమునకు బౌద్ధమతవాఙ్మయము యొక్క అసలుస్వరూపము వ్యక్తమయ్యెను.

నాలుగు దిశలనుండియు దెలియవచ్చిన బౌద్ధమతవాఙ్మయ విషయకవృత్తాంతము నవ లోకింపగా బౌద్ధమతగ్రంథములు సంస్కృత మున ఒక్క నేపాళదేశముననే కాక చీనా, జపాను, తిబెత్తు దేశములలోగూడ కలవని వెల్లడియైనది. చీనా, జపాను, తిబెత్తుదేశముల లోని బౌద్ధమతగ్రంథములు సంస్కృతభాష నున్నవి అరుదుగ గాన్పించుచున్నను అవి అసలు సంస్కృతగ్రంథములకు అనువాదము లని స్పష్టమయినది. ఈగ్రంథములవలన దెలియ వచ్చిన బౌద్ధమతమునకు, నేపాళదేశ బౌద్ధ మత గ్రంథములవలన దెలియవచ్చిన బౌద్ధమత మునకు అంత వ్యత్యాసము కానరాదు. ఇట్లే మరియొకవిషయముకూడ దెలిసినది. సింహాళ దేశమునందలి బౌద్ధమతగ్రంథములు పాలీభా షలో నున్నట్లే బర్మా, సయాం, ఆనామ్ మొదలైన ఆసియాఖండ దక్షిణదేశములలోని బౌద్ధమతగ్రంథములును పాలీభాషనే కలవు. ఈపాలీభాషాగ్రంథముల బౌద్ధమతము వ్యత్యా సము లంతగలేక ఒక్కటి యనియే స్పష్టమ య్యెను. అంతియేకాక పాలీగ్రంథ బౌద్ధమత మునకు, సంస్కృత గ్రంథ బౌద్ధమతమునకు చాల వ్యత్యాసము కలదని కూడ సిద్ధాంత మయ్యెను. ఈపోలికలను, ఈవ్యత్యాసములను గమనించి పాశ్చాత్యులైన బౌద్ధవిద్వాంసులు నేపాలు, తిబెత్తు, చీనా, జపానులలో వ్యాపిం చిన బౌద్ధమతమునకు ఉత్తరబౌద్ధమతమనియు సింహాళము, సయాం, బర్మా, ఆనాందేశముల లోని బౌద్ధమతమునకు దక్షిణ బౌద్ధమతమని

యు పేర్లుపెట్టిరి. కాని యీవిభాగము సరియైనదికాదని 'టకకుసు' మొదలైన ప్రాచ్యదేశ పండితులు చెప్పియున్నారు; పెలయన సుమత్ర, జావాద్వీపములు హిందూదేశమునకు దక్షిణముననే యున్నను అందు వ్యాపించియున్న బౌద్ధమతము సంస్కృతగ్రంథ బౌద్ధమతమును బోలినదే. అందువలన ఇట్టి ప్రాంతికవిభాగము సరియైనది కాదనియే చెప్పదగును.

కాని యీవిభాగమువలన గొంత యుపయోగము లేకపోలేదు. దక్షిణబౌద్ధమే అసలు బౌద్ధమతము. అశోకుని కాలమున బౌద్ధమత బోధకులు మతవ్యాపనము చేయుటకై సింహళద్వీపమునకు పోయియున్నారు. అట్లువెళ్లిన వారిలో అశోకచక్రవర్తి కుమారుడైన 'మహిందు' డొకడు. ఇతడే "త్రిపిటకము" లను (బౌద్ధులవేదములు—ఇవి మూడు. (౧) వినయపిటకము (౨) సుత్తపిటకము (3) అభిధమ్మపిటకము), వాటి భాష్యము లనదగు "అత్థకథ" లను సింహళమునకు గొనిపోయినట్లును, అక్కడివారి కుపయోగపడునట్లు "అత్థకథ"లను సింహళ దేశభాషలోనికి పరివర్తించినట్లును చెప్పుదురు. 'మహిందు'ని సోదరియైన "సంఘమిత్త"యే సింహళములో మొట్టమొదటి మాఱు బౌద్ధమత మవలంబింపదలచినస్త్రీలను "భిక్కుణు"లం గావించినట్లు తెలియుచున్నది. "మహిందు"నితోపాటు "ఇత్థియ", "ఉత్తియ", "భద్దసాల", "సుమనులు" కూడ బౌద్ధమతమును వ్యాపింపజేయు నిమిత్తము వెడలిరి. ఈబౌద్ధభిక్షువుల త్యాగదీక్షమూలమునను, ధర్మనిరతిమూలముననే బౌద్ధమతము సింహళమున వ్యాపించెను. అది అచ్చటి నుండియే బర్మా, సయామ్, ఆనామ్ మొదలైన దేశములకు ప్రాకెను. ఈకారణములవలన పాలీగ్రంథ బౌద్ధమతమును—దక్షిణబౌద్ధమతమును—ఒకవిధముగ అసలు బౌద్ధమత మనవచ్చును. ఉత్తరబౌద్ధ మనునది అశోకచక్రవర్తి యనంతర మభివృద్ధి గాంచిన బౌద్ధమతమునకు పేరు.

అశోకునికాలముననే బౌద్ధులలో బౌద్ధులకు పెక్కు మతవిషయములను గుఱించి చాలయభిప్రాయభేదము లుండెను. అశోకుడు వేఱువేఱుబౌద్ధమతకక్షులవారి నేకీకరించుటకై చాల ప్రయత్నించెను. అశోకునికాలమున ప్రధానముగ నుండిన కక్షులు రెండే: స్థవిర, మహాసాంఘికకక్షులు. స్థవిరులు మహాసాంఘికులతో నిర్వహింపలేక మగధను విడిచిపెట్టిరి. వీరిలో 'వినయభాణకము'లనవలంబించినవారు సింహళమునకు బోయిరి. "సూత్రభాణకము"లనవలంబించినవారు కాశ్మీర, గాంధార దేశముల కరిగిరి. మొదటి తెగవారికి సింహళమును, రెండవ తెగవారికి కాశ్మీర, గాంధారములును ప్రధానస్థానము లయ్యెను. కాశ్మీర, గాంధార స్థవిరులు చాలకాలమువఱకు బుద్ధభగవానుని ఆదిమసిద్ధాంతములకే అంటిపెట్టుకొని యుండిరి కాని కాలక్రమమున దేశమున గలిగిన 'మహాసాంఘిక'ప్రాబల్యమువలన వారి మత స్వరూపమున మార్పుకలిగెను. వీరు క్రమక్రమముగ ఆ సిద్ధాంతములలోని తత్త్వమును గుఱించియే

చర్చ నేయుచు, దానినే బోధింపదొడగిరి. తత్త్వ బోధకు ప్రాధాన్యము కలిగినపిదప ఈ తెగ వారికే సర్వాస్తివాదు లను పేరు వచ్చెను. అందువలననే ఉత్తరబౌద్ధమున కొంత అసలు బౌద్ధమును, మఱికొంత వృద్ధిపొందిన బౌద్ధ మునుగూడ కలదని చెప్పుదురు.

ఈపైసంగతులవలన చీనా, తిబెత్తు, జపాన్ దేశములలోని బౌద్ధులకు సంస్కృతమును, సింహళము, బర్మా, సయాము ఆనాములలోని బౌద్ధులకు పాలీయును హిందువులకు సంస్కృత మెట్లో యట్టి పవిత్రభాషలని తేలుచున్నది. ఉత్తరదేశ బౌద్ధులకు సంస్కృతము పవిత్ర మైన సామాన్యభాషయైనను వారిలో పెక్కు శాఖ లుండుటచేత ఒక్కొక్క శాఖవారు ఒక్కొక్కవిధమైన భాషను దమ మతగ్రంథ ముల వాడుక చేసినట్లు తెలియవచ్చుచున్నది. ఉత్తరదేశబౌద్ధుల మతగ్రంథములు కొన్ని (సంస్కృత) గ్రాంథికభాషను, కొన్ని గాథా భాషను, వేఱొక కొన్ని ప్రాకృతమునను, ఇక కొన్ని పాలీభాషలోనుగూడ గలవు. క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దిలో నుండిన బౌద్ధ భిక్షువగు వినీతదేవు డనుగొప్పవిద్వాంసుడు తమ మతగ్రంథములకు సర్వాస్తివాదులు సం స్కృతమును, సమ్మితీయులు అపభ్రంశము ను, స్థవిరవాదులు పైశాచిని వాడుచుండి నట్లు తెలిపియున్నాడు.

క్రీస్తుశకము పందొమ్మిదవ శతాబ్ది ప్రథ మపాదాంతమున ప్రాచ్య, పాశ్చాత్యపండితుల పరిశోధనలవలన బౌద్ధమత, వాఙ్మయోదంత ము లీరీతిని లోకమునకు వెల్లడియైనవి. పైని తెలిపిన విషయములన్నియు తద్విద్వాంసుల వ్రాతలవలన దెలియవచ్చినవే. నాటినుండి విదే శీయులును, స్వదేశీయులును గూడ బౌద్ధమత వాఙ్మయమును చిలుకుచున్నారు. చిలుకగా, చిలుకగా అందలి కొన్నిసమస్యలు తొలగు చున్నవి; మఱికొన్ని ఇదివఱ కనుగొననట్టివి కలుగుచున్నవి. అయినను గతశతాబ్దమునందు కంటె నేడు ఈబౌద్ధవాఙ్మయమును పరిశో ధించువారు మనభారతీయులలో గూడ అనే కులు కలరు. ఆంధ్రులకు బౌద్ధవాఙ్మయాధ్య యనమత్యంతావశ్యకమైనది ఒకప్పు డాంధ్ర దేశము బౌద్ధమతమునకు భారతదేశ మంత టిలో ప్రధానస్థానముగ నుండెను. బౌద్ధాంధ్ర దేశచారిత్రమునకు బౌద్ధవాఙ్మయము అత్యం తోపకారకము. అందువలన ఆంధ్రులు ఏత ద్వాఙ్మయమునం దభిమానము వహించి తద ధ్యయన, పరిశోధనములకు బూనుకొనుట అవసరము.

---

# విహంగము—స్వేచ్ఛ

కూరెళ్ల రామనరసింగరావు గారు

నిరుపమ మోదసంభరిత నిర్మలచారుసుగంధ మారుతో
త్కరముల మోహగీతముల గానము సేయుచుఁ బద్మినీ మనో
హరుని మయూఖజాలముల హాయిగ నుయ్యెల లూఁగుచున్ నిరం
తరముఁ జరించుచుండెదు; స్వతంత్రగతిన్; భళిరే! విహంగమా!

గ్రంథనిర్మాణంబుఁ గావింపనెంచిన, భాషాభిమాన మే ప్రజకు లేదు;
సంఘదురాచార సంస్కారమును జేయ యత్నింప నైకమత్యంబు లేదు;
భారత దేశీయ భూరిదారిద్ర్యంబుఁగని సహాయ మొనర్ప ధనము లేదు;
అఖిల లౌకికవిషయావళీత్యాగంబు నాచరింపంగ ధైర్యంబు లేదు;
మానవున కీవిశాలబ్రహ్మాండమందు; జీవితావధివఱకును స్వేచ్ఛ లేదు
ఏది సాధింపనెంచిన నెచటఁగనిన నన్ని నిర్బంధనములే విహంగవర్య!

జనకాది బాంధవ సంతతిచేతను గురువర్యుచేతను కొన్నినాళ్లు
మానినీమణిచేఁ గుమారవర్గముచేఁ బ్రసన్నులౌ సఖులచేఁ గొన్నినాళ్లు
బహుళధనార్జనోపాయమోహముచేత భిన్నవృత్తులచేతఁ గొన్నినాళ్లు
కామమాత్సర్యాది కలుషగుణాళిచే గురుదుఃఖభరముచేఁ గొన్నినాళ్లు
బంధితుఁడయి మానవుఁ డీప్రపంచమందు జీవనముఁ జేయుచుండును; స్వేచ్ఛయనఁగ
నిముసమైన నెఱుంగక; నీకునిముస మైన బంధముల్ గలవె; విహంగవర్య!

పక్షవిచ్ఛేదన మొనర్చి పర్వతముల- స్థావరముఁజేసె నింద్రుఁ డాతేవఁ దృష్ణ
మానవుని తెల్విహరియించి, మాపె; స్వేచ్ఛ-నఖిలభూమండలమున విహంగవర్య!

ఆశాపాశమునందుఁ జిక్కకయ స్వేచ్ఛాయత్తవృత్తిన్ సదా
యాశాఖావళిపై వసించెదు; విహంగాధీశ్వరా! మానవుం
డాశన్ భావమునందు వీడినక్షణంబందే విరాజిల్లు స
ర్వాశాముద్రిత ధారుణీస్థలిని స్వేచ్ఛానందసందోహముల్.

---

# హిందూదేశపు పారిశ్రామికసమస్యలు: కొన్ని సూచనలు

చావలి వెంకటహనుమంతరావు గారు, యం. ఏ.

మన భారతదేశపు పరిశ్రమాభివృద్ధిని గురించి ఇంతవరకు ఒక నిశ్చయవిధానము లేదనియే చెప్పవచ్చును. కాని అట్టి నిశ్చిత విధాన మొకదాని నేర్పాటుచేసి దాని కార్య రూపకముగ ఆచరణలోనికి తీసుకొనివచ్చిన కాని మన దేశపు పారిశ్రామికాభివృద్ధికి చాల ఆటంకము కలుగునని అందరకును తెలిసినదే. ఏదేశము కాని ఆర్థికముగ స్వాతంత్ర్యము ననుభవించుచున్న కాని రాజకీయస్వాతంత్ర్యము సంపాదించుకొనుట కాని, నిలువబెట్టుకొనుట కాని కష్టము. నిజముగా ఆలోచించిన ఆరెండువిధములయిన స్వాతంత్ర్యములును ఒకదానిపై ఇంకొకటి ఆధారపడి యున్నవని తేలును. ఏదేశపుప్రజలు కాని ఆర్థికముగ బలము కలిగి యున్న కాని రాజకీయపు హక్కులను కాపాడుకొనుటకు తగినస్థితియందుందురని యనుకొనుటకు వీలు లేదు; కోట్ల కొలది ప్రజలు తమనిత్యజీవనము జరుపుకొనుటకు తగినస్థితియందు లేనప్పుడు వారు రాజకీయముగ కాని, ఇతరవిషయములలో గాని ముందడుగు వేయుటకు అవకాశము లెట్లుండును? ఒకదేశముయొక్క ఆర్థికస్థితి బాగుపడవలెనన్న, దానికి ఒకటే మార్గము కలదు: అది దేశపరిశ్రమల నభివృద్ధి పొందించి వాటి మూలముగ ప్రజల రాబడియు, దానిమూలముగ వారిజీవిత ఆర్థిక స్థితియు పెంపొందించుటయే. ప్రస్తుతము హిందూదేశమునకు ముఖ్యముగ కావలసినది ఇట్టి పరిశ్రమాభివృద్ధియే. కాని కేవలము పరిశ్రమల నభివృద్ధిచేయుటయే కాక మన దేశపు వృత్తులలో ప్రధానవృత్తి యగు వ్యవసాయమును పెంపొందించుటకూడ చాల అవసరము. పరిశ్రమాభివృద్ధికి కొన్ని ముఖ్య విధానములు ప్రప్రథమమున ఏర్పాటు చేయవలసి యుండును; ఆవిధానము లేవో, వాటివిషయములో చేయబడవలసిన మార్పు లేవో ఈ వ్యాసములో చర్చించెదము.

అట్లు చర్చించుటకు ముందు ఒక ముఖ్య విషయమును గూర్చి మనస్సునందు మనము దృఢపర్చుకొనవలసి యున్నది. అది ఏదన, మన దేశములో వ్యవసాయాభివృద్ధిమాత్రమే పెంపొందించి పరిశ్రమాభివృద్ధిని రెండవస్థానమునకు పంపుటా — లేక పరిశ్రమాభివృద్ధినే ప్రధానలక్ష్యముగ పెట్టుకొనుటా — యనునది. మన దేశస్థులలో కొంతమందియు, విదేశస్థులలో చాలమందియు హిందూదేశము వ్యవసాయవృత్తి గల దేశముగనే యుండవలెననియు, పరిశ్రమలయందు పరిశ్రమ చేయుటకూడ దనియు, దానివలన చాల నష్టము కల్గు

ననియు చెప్పెదము. ముఖ్యముగ ఈ సలహా ఇంగ్లీషువర్తకశాఖకు చెందిన కొంతమంది వద్దనుండి చాలసార్లు మనము వినుచుందుము. ఈవిధమగు సలహా నిచ్చుటలో వారు హిందూదేశపు సత్యసమస్యను సరిగ గ్రహించకపోయినైన నుండవలెను, లేదా ఎప్పటికిని ఈ దేశము ప్రస్తుతపు బానిసతనమందే, బీదస్థితియందే యుండవలె నను దురభిప్రాయముతోనైన నుండవచ్చును. కాని హిందూదేశపు ఔన్నత్యమే మనస్సులో నుంచుకొని ఈసలహా నెవ్వరైన ఇచ్చియుండిన వారిని పిచ్చివారని చెప్పటలో ఏమాత్రము సందియ ముండ నక్కర లేదు. హిందూదేశము ప్రపంచదేశములలో ముఖ్యస్థానము నాక్రమించవలయు నన్న, మన ప్రజాసామాన్యము దారిద్ర్యదశనుండి విమోచనము నొంది సౌఖ్య మనుభవించవలె ననిన, వారి సాలువారీ ఆదాయము ఎక్కువయై జీవిత విధానములో మార్పు రావలె ననిన, వ్యవసాయము, పరిశ్రమలు రెండింటికినికూడ ఒకేవిధమైన ప్రోత్సాహ మిచ్చి రెండింటివృద్ధికిని పాటుపడుటయే దానికి ముఖ్యసాధనము. ఈ విషయము ఈకాలములో సాధారణముగ అందరును అంగీకరించినదే. హిందూదేశస్థులు ఈ ఆధునికకాలపు ప్రధాన సూచనయగు ప్రపంచావృత-అభివృద్ధిలో పాల్గొని దానిలో తగిన స్థానము సంపాదించుటకు ఈవ్యవసాయ, పరిశ్రమ సమ్మిళిత విధానమే సూత్రము.

మొట్టమొదట క్లుప్తముగ వ్యవసాయాభివృద్ధికి కావలసిన ముఖ్యములగు మార్పులను సూచించెదము. మనదేశమందు వ్యవసాయపరిశ్రమయొక్కయు, వ్యవసాయదారుల యొక్కయు స్థితిగతులు చాల హీనముగ నున్నవి. ఒక ప్రక్క ప్రభుత్వమువారు విధించు భూమిపన్ను వలనను, వేరొక ప్రక్క వ్యవసాయమువలన తగినరాబడి లేకపోవుటవల్లను, వ్యవసాయదారులు క్రుంగిపోవుచున్నారు. భూమి పన్నులను విధించుటలో క్రొత్తమార్గముల నవలంబించుటయు, వ్యవసాయమును నవీన శాస్త్రసమ్మతమైన పద్ధతులపై నాధారపడిన పద్ధతులతో నడుపుటయు ఈపరిస్థితులలో మార్పును తీసికొనివచ్చుటకు చాల తోడ్పడును. మన దేశములో వ్యవసాయదారులు సంపదలతో తులతూగుచున్నారని ఈమధ్య సర్ థామస్ మాయర్ గారు మద్రాసుశాసనసభలో చెప్పిన మాటలు చాల సత్యదూరములని గ్రామముల లోనికిపోయి వ్యవసాయదారుల నిజస్థితి గమనించినవారికి స్పష్టమగును. పైకి నవనాగరికతా వాసనవలన కొంత అభ్యుదయసూచన అక్కడక్కడ కన్పించినప్పటికిని, అదంతయు పట్టి వేషముమాత్రమే యనియు, నిజముగ లోలోపల మనరైతులు అప్పులతోను, బీదతనముతోను నిండి చాల హీనస్థితియందున్నారనియు వేరుగ చెప్పనక్కరలేదు. ఈమధ్య మద్రాసు ప్రభుత్వమువారిచే ఏర్పాటు చేయబడిన ఆర్థిక విచారణ సంఘమువారు చేసిన పరీక్షలో ఈ విషయము ఏవిధమైన అనుమానము లేకుండ బయల్పడినది. ఆ విచారణలో మేము కూడ చాల పనిచేసియున్నాము; చాలగ్రామములు

స్వయముగ చూచి అచ్చటి పరిస్థితులను సంపూర్ణముగ గమనించియున్నాము. దానివలన తేలిన సారాంశ మేమన, వ్యవసాయము లాభదాయకముగ లేదని, వ్యవసాయపుఖర్చులు మొదలగునవి విపరీతముగ పెరిగిపోవుటయు, భూమిపంట పూర్వపుమోస్తరుగ నుండుట గాని, తగ్గుట కాని తటస్థించుటయు జరుగుచున్నవనియు, ఏమాత్రపు భూమిపన్ను హెచ్చుదల గాని రైతులు భరించలేనిస్థితియందున్నా రనియును.

ప్రతి ౨౦ ఏండ్లు, లేక ౩౦ ఏండ్లకును భూమిపన్నును తప్పక హెచ్చుచేయవలె నను ప్రభుత్వమువా రేర్పాటుచేసికొనిన నిశ్చయ విధానములో ఏవిధమైన న్యాయమును లేదు. అట్లు చేయుట ఏవిధముగ అన్యాయమో, దానివలన వచ్చునష్టము లేవో ఇదివరలో 'భారతి' పత్రికకు మేము వ్రాసిన 'హిందూదేశ ఆర్థికస్థితి' అను వ్యాసపరంపరలో ౩-వ వ్యాసమందు చర్చించియుంటిమి. భూమిపన్నును ఒకసారి విధించిన దానిని మరల కనీసము ౪౦ సంవత్సరములలోపుగా మార్చరాదని మా అభిప్రాయము. ౬౦ సంవత్సరములపరిమితి నేర్పాటు చేయుట మంచిదని ఆర్థికవిచారణసంఘము వారు తమరిపోర్టులో సూచించియుండిరి. తరువాత వ్యవసాయాభివృద్ధికి కావలసిన ముఖ్యములగు మార్పులలో వ్యవసాయమును ఎక్కువ లాభదాయకముగ చేయుటయు, భూమి నుండి వ్యవసాయదారునకు ఎక్కువపంటయు, దానితోపాటు ఎక్కువ ఆదాయము వచ్చునట్లు చేయుటయు ప్రధానము లైనవి. దానికై వ్యవసాయము చేయు పద్ధతులందును, పొలములకు వేయు ఎరువునందును, వ్యవసాయమున కుపయోగించు పరికరములందును, పశువులను బలము కలిగియుండి ఎక్కువ పని చేయునట్లు చేయుటయందును ప్రస్తుతము పాశ్చాత్యదేశములలో అమలునందున్న మార్గములను కొంత కాకపోయిన కొంతవరకైనను, మన వ్యవసాయదారులు ఆచరణలో నుంచునట్లు చేయుట పరమావధిగా నున్నది. భూమిసారము తగ్గిపోవుట చేత పంటలు విరివిగ పండుటలేదు; పశువులను బలముగా నుంచుటకు వాటికి తగినమేత వేయుటకు చాలమంది వ్యవసాయదారులకు శక్తి చాలకపోవుటచే అవి చనిపోవుటయు, వాటివలన నష్టమును ఎక్కువగ కలుగుచున్నవి; ఇట్లే ఇతర విషయములందు కూడ మనము వెనుకబడి యున్నాము. ఈ ముఖ్యము లగు మార్పులను ప్రవేశపెట్టి దేశాభ్యుదయమునకు తోడ్పడుటలో ప్రభుత్వము ముందంజవేసి మార్గదర్శకులుగ నుండి పనిచేయవలసిన అవసరమెంతేని కలదు. ౧౯౨౭-వ సంవత్సరములో ఏర్పాటుచేయబడిన వ్యవసాయపు కమీషను (Royal Commission on Agriculture) వారు కొన్ని ముఖ్యసూచనలను వ్యవసాయాభివృద్ధికిని, వ్యవసాయదారులస్థితిని బాగుచేయుటకును చేసియున్నారు. ఆసూచనలలో ఒకదాని ననుసరించి ప్రభుత్వమువారు వ్యవసాయమునకు

సంబంధించిన సమస్యలను పరిశోధించుటకు సామ్రాజ్య వ్యవసాయ పరిశోధక సంఘము (Imperial Agricultural Research Council) నొకదాని నేర్పాటు చేసియున్నారు. రాష్ట్ర ప్రభుత్వములు ముఖ్యముగ వ్యవసాయాభివృద్ధికి తోడ్పాటుగా నుండవలసిన సంస్థలగుటచే వారుకూడ కొంతసొమ్ము నీ పరిశోధక సంఘమువారి సహాయనిధికి ఇచ్చియుండుటయే కాక, తమతమ వ్యవసాయ శాఖోద్యోగుల ద్వారా ఈసంఘమువారు చేయు పరిశోధనల ఫలితములను ప్రజలకందరకును తెలియునట్లుగా ప్రచారముచేయుట కనుమతించి యున్నారు. రాష్ట్రప్రభుత్వములు అచ్చటచ్చట తమసొంత యాజమాన్యము క్రింద వ్యవసాయపు వాళ్లు (Agricultural farms) మొదలగువాటిని పెట్టి, వాటియందు నవీన వ్యవసాయపు పద్ధతుల ననుసరించి పంటలు పండించుట మొదలగు ఉపయోగకరములగు పనులు చేయుచున్నారు కాని ప్రజలలో వాటివలన ఏవిధమైన ప్రబోధము కలిగినదో అంచనావేయుట కష్టము. ఎక్కువ విరివిగ వ్యవసాయశాఖవారు పని చేయుట అవసరమని వేరుగ చెప్పనక్కరలేదు.

పైన సూచించిన ఏమార్పులు కాని వ్యవసాయదారులు ప్రస్తుతము వారున్న ఆర్థికస్థితిలో తమంతట తామే తీసుకొని రాగలుగుదు రనుమాట అబద్ధము. అందులకై వారికి తగిన పెట్టుబడిధనము కావలెను. ఈ విషయమై విపులముగ ముచ్చటించుట కిది తావు కాదు; కాని ఒకవిషయముమాత్రము చెప్పవచ్చును: ప్రభుత్వమువారు తమ రెవిన్యూ శాఖద్వారా కొంతసొమ్మును రైతులకు ముఖ్యావసరములకు పెట్టుబడి పెట్టుటయే కాక (అట్లు ఇవ్వడు ఎచ్చటనో కాని ప్రభుత్వము వారు చేయుటయే లేదు), ఈ మార్గములో చాల ప్రశంసార్హమగు కృషి సల్పుచున్న సహకారసంఘమును ప్రోత్సహించుట చాల అవసరము. సహకారసంఘములు మన దేశమునకు తమ పాతికసంవత్సరముల జీవితకాలములోను అనేకవిధముల లాభము కలుగచేసి చాల గొప్పమార్పును తీసికొనివచ్చినవి. కాని అవి చేయవలసినంత సహాయము చేయలేకపోయినవనియే చెప్పవచ్చును: దానికి ప్రభుత్వమువారి విముఖతకూడ కొంత కారణమని వేరుగ వ్రాయనక్కరలేదు. వ్యవసాయదారులను వారి అప్పులనుసముద్రము నుండి బయటకు తీసుకొనివచ్చి కాపాడి, ఇకముందు వారు వ్యవసాయపు పెట్టుబడికి కావలసిన సొమ్మునకు పూర్వమువలె మార్వాడీలవద్దకును, ఇతర వడ్డీవ్యాపారస్థులవద్దకును పోయి వారి పాశములందు తగుల్కొనకుండ చేయుటకు విరివిగా మనదేశమందు భూమితనఖాబ్యాంకులను స్థాపించుటయే మార్గము. మన మద్రాసు రాజధానిలో ఈమధ్యనే ఇట్టిసంస్థ నొకదానిని మద్రాసునందు ఏర్పాటుచేయుటకు ప్రభుత్వమువారు తోడ్పడియున్నారు. దానిని నిర్వహించుటకు ఒక బలమైన డైరెక్టరులసంఘము నేర్పాటుచేయుటయే కాక వివిధప్రాంతములలో దానికి బ్రాంచిలను స్థాపించి రైతు

లకు సహాయముచేయుట కేర్పాట్లు జరుగుచున్నవి. ఇది చాల శుభసూచకము.

వ్యవసాయాభివృద్ధికి సదుపాయములు కల్పించుటకు చేయుప్రయత్నములలో పంటలు లాభమునకు అమ్ముమార్గముల నన్వేషించుట ఒక ముఖ్యమైన పనియై యున్నది. పంటలు ఎక్కువగ పండినప్పటికిని, ఆపంటలకు ప్రపంచమునందు బేరములు విరివిగ నుండినప్పటికిని, మనవ్యవసాయదారులకు తగినంత విద్యయు, అనుభవమును లేకపోవుటచేత ఏవిధములుగ ఏయేదేశములకు ఎగుమతిచేసిన ఎక్కువ ఖరీదు వచ్చునో తెలిసికొనలేక నష్టపోవుచున్నారు. మధ్యవర్తులు, కమీషన్ ఏజెంట్ల ద్వారా వారు తమ పంటను సాధారణముగ అమ్మజూపుటచే, ఈమధ్యవర్తులే బేరములో వచ్చులాభము నంతను మ్రింగివేసి వ్యవసాయదారులకు, నిజముగ లాభము పొందవలసిన వారికి, ఏమియు సహాయము చేయకపోవుచున్నారు. సహకారసంఘములు ఈ విషయములో వ్యవసాయదారులకు చాల సహాయకారులుగ నుండుట కవకాశము లున్నవి. పంటల అమ్మకమునకై సహకార సంఘములు (Co-operative Societies for the sale of agricultural produce) డిపోలు మొదలగు వాటిని స్థాపించుటయు, వాటిద్వారా పంటలు అమ్మకము చేయించుటయు ఈ రెండుమార్గముల వలన కమీషన్ ఏజెంట్లదుర్మార్గము చాలవరకు తగ్గిపోవుటకు వీలగును. సహకార సంఘములు కొద్దికమీషన్ పుచ్చుకొని ఎక్కువ లాభము వచ్చుచోట్ల పంటలను అమ్మకముచేయించివ్యవసాయదారులకు రావలసినంత లాభము వచ్చునట్లు చేయుటకు ప్రయత్నించుట ముఖ్యము.

వ్యవసాయదారుల శ్రేయోభివృద్ధికి వ్యవసాయపు కమీషన్ వారు చేసిన ఒక ముఖ్యసూచననుగూర్చి కొంత తెల్పి ఈ భాగమును ముగించెదము.

"వ్యవసాయదారుల జీవిత దృక్పథమునందు మార్పు రావలెను. వ్యవసాయ విషయములలో ఏ విధమైన అభివృద్ధి కాని రావలెననిన, వ్యవసాయదారుడు తన జీవితవిధానమునందు గొప్పమార్పును తెచ్చుకొనుటకును, వ్యవసాయమార్గములలో నవీన శాస్త్రసంబంధమైన పరికరముల నుపయోగించుటకు తగిన తెలివితేటలు సంపాదించుటకును శక్తివంచన లేకుండ ప్రయత్నము చేయుట ముఖ్యమని మా దృఢనిశ్చయము. వ్యవసాయాభివృద్ధికి కావలసిన ముఖ్యమగుమార్పులలో ఈదృక్పథమందు రావలసిన మార్పే ప్రధానమైనది. ఈమార్పు వచ్చుటకు వ్యవసాయదారులు నివసించు వాతావరణములో మార్పు రావలసిన అవసరము కలదు. కాన వారి అభివృద్ధికి ఏర్పాటు చేయబడు ఏ క్రొత్తవిధానమునందైనను ఈవాతావరణమందు మార్పు తీసికొనుటకు చేయు ప్రయత్నములే అగ్రస్థాన మాక్రమింపవలయును. ఈ విషయము అంగీకరింపబడిన, గ్రామజీవితమునందు అన్నివిధముల, అన్నిమార్గములలోను

అభివృద్ధి తీసికొనివచ్చుటకు సర్వతోముఖమైన ఒకప్రభుత్వవిధాన మేర్పాటు కాబడవలె నను సంగతి విశద మగును. దానివలన ప్రజాసామాన్యముయొక్క శ్రేయోభివృద్ధి పెంపొందుటయే కాక జాతీయజీవనమందు కళాకాంతులు కల్గి జాతీయఆదాయములో హెచ్చు కాన్పించుటకు అవకాశము లెన్నేని కలవు. ఈజీవిత దృక్పథములో క్రొత్తమార్పు సమకూరుటకై గ్రామజీవితమందు ఒకవిధమైన గొప్పఅభివృద్ది పొడసూపవలెను; ఈఅభివృద్ధికి మార్గముల నన్వేషించుటయు, దానికి తగినప్రోత్సాహము నొసంగుటయు ప్రభుత్వమువారు చేయవలసిన పనులే యని మేము నొక్కి చెప్పుచున్నాము."

(వ్యవసాయపు కమీషన్ రిపోర్టునుండి.)

పైన పొందుపరుపబడిన అభిప్రాయముతో మనము సంపూర్ణముగ ఏకీభవించవచ్చును. ప్రభుత్వము వారు దానిలో సూచింపబడిన మార్పును తీసికొని వచ్చుటకు సర్వవిధముల తోడ్పడవలసిన బాధ్యత కలిగియున్నారు. వ్యవసాయదారులకు తగిన విద్యావిధానము నేర్పాటుచేయుటకు, గ్రామపారిశుద్ధ్యమును చక్కగ నుంచుకొను మార్గములలో వారికి త్రోవ చూపుటయు, తమవృత్తియందు తెలివితేటలుగ కృషిచేసి ఎంత ఎక్కువలాభము పొందుటకు వీలగునో అంతలాభమును పొందుటకు ప్రయత్నించునట్లు వారికి ప్రోత్సాహము నిచ్చుటయు వారు చేయవలసిన విధులలో ముఖ్యమైనవై యున్నవి. వ్యవసాయదారులలో చాలమంది తమ వృత్తియం దుత్సాహము లేనివారై దీనత్వములోనే తమజీవితములను గడపుచుండుట మనము చూచుచున్నాము. అట్టివారిలో నూతనమైన జీవితమును పురికొల్పుటయే ప్రధానాంశము; దానితో ఇతరవిషయములందు మార్పు దానంత నదియే వచ్చును.

వ్యవసాయము మన దేశపరిశ్రమలలో చాల ముఖ్యమైనది. నూటికి 70 మందికి జీవనోపాధి కల్పించునదై యున్నదని మన కందరకును తెలియును. దానియభివృద్ధి దేశాభివృద్ధియే యని చెప్పుటలో అతిశయోక్తి లేదు. ఆపరిశ్రమను దృఢమైన పునాదులపై ఏర్పాటుచేయుట దేశాభివృద్ధికి చాల ఎక్కువ తోడ్పాటుగా నుండును. ఇంకను అనేకవిధములుగ వ్యవసాయాభివృద్ధికి తోడ్పడవలసిన అవసరము కలదు; పైన వ్రాయబడిన సూచనలు వాటిలో కొన్ని విషయములకు మాత్రమే చెందియున్నవి. రాష్ట్రప్రభుత్వములలో ప్రజాయత్తశాఖలగు వ్యవసాయ, అభివృద్ధి, విద్యాశాఖల సంయుక్తప్రయత్నములవలనను, ఇండియాప్రభుత్వమువారి స్నేహపూర్వకమైన సహాయమువలనను, ప్రజానాయకుల తోడ్పాటు వలనను వ్యవసాయపరిశ్రమ అభివృద్ధి గాంచుటకు చాల అనుకూలపరిస్థితు లేర్పడును. మన ప్రాథమికవిద్యావిధానమునందు వ్యవసాయమునకు సంబంధించియు, గ్రామజీవితమును ఏర్పాటు చేయుటను గురించియు బోధించు

టకు వీలగునట్లుగా బోధనవిధానములందు తగిన మనఃపరిపాకము చేకూరును. ముందు మార్పు చేయుటవలన, వ్యవసాయదారులకు భాగములో వస్తువులను తయారుచేయు పరి ఇతరవిషయములను తేలికగ గ్రహించుటకు శ్రమల అభివృద్ధికి అవసరములగు విషయ ను, తమవృత్తిలో లాభము పొందుటకును ము ను చర్చించెదము.

---

# నీలిరత్నాలు

రామచంద్ర అప్పారావుగారు

వెరు తుపానునఁ గంపించు వనధియలల-మధ్యఁ జొక్కెడి చంద్ర బింబపుఁ గిరణ
మీవు బాల! యిప్పుడు పొందినావు నన్ను-మూసికొనిపోవు సాంద్ర జీమూత పటలి
కారుచీఁకట్ల దొంతర్ల కలలనుండి-వేకువకుఁ బ్రేమ కుత్సాహ విభవమునకుఁ
బావనానంద నిత్యసామ్రాజ్యమునకుఁ-జేయి నూఁత నొసఁగి నన్నుఁ జేర్చినావు.

*  *  *  *  *

నీలిరత్నంబుల నిర్మలతేజస్సు బ్రవహించుచున్నవో భవదీయ కుంతలాల్
ముసువు నీముచ్చట ముడి విప్పితిన యోసి! మున్నీటి కెరటాలఁబోలె నల్లనఁబారి
కన్నులమిరుమిట్లు కాంతిలో మూయించునంతలో నొకవిధమ్మైన సువాసన
కలకలగా లేచి సలలితావేశాలఁ భావమ్ము హరియించు స్వర్గమందాకినీ
శీతల తీరకుంజేద్య ప్రదేశాలఁ దలఁపులో నిలువెల్లఁ గలకలా మెఱయును
దెలి మల్లెపూమొగ్గ స్థిరహారిగర్భానఁ గరఁగించి కరఁగించి కరఁచును నీశ్వరీ !

*  *  *  *  *

వెన్నెలబైలులో వెలుఁగుజాబిల్లినై
మెపుడు నిన్ బిలుచుకోనే-నీరూపు-
నెపుడు డాసిన ప్రీతినే;
ముసిముసినగవుల కొనరుసందిళ్లలో

సోక్కి-సోలితిని నేను-కాంతినే-

నొక్కి- ముద్దాడినాను;

తలిరు జొంపములలోపల మంచుచినుకునై

యల్లల్లనాడినాను-మెల్లగా-

నటుదొర్లి కలసినాను;

నాయడ్గుత్రోవనే నాటెనెన్నో మల్లె

లెగ్గెత్తి పాడుకొనెను-పికములు-

పిల్చెఁ బాటల లోకము.

*　*　*　*　*

సృష్ట్యాదిముక్తమౌ ఇనుతొలి కిరణమ్ము కటికచీఁకటిగుంపుఁ గలఁచు వజ్రపురోచి

విచ్చలవిడిఁ బరువిడువిహారము నాదు నూహాంబరంబున నూఁగుచే యున్నది

ఆదూరపుం జూపునందు వెలుంగు నక్షత్రిక కాంతిలో శమనమ్మునొందుచుఁ

బైఁడిదారుల నీను వలపు మూర్తిని నమ్మి కుమిలి యాసల నమ్ముకొని మాసిపోదునో

యీశ్వరీ! యీశ్వరీ!

*　*　*　*　*

నాఁచు ముసుఁగున నల్ల డాఁగిన నల్లకేఁవ్రయె విరియదే

కలకలచ్ఛట మందహాసము తళుకు జాబిలి నీశ్వరీ!

తలఁపు తలఁపులు తరలు మాలలవెలుఁగు దారుల యెండనే

కులుకుటక్కుల కౌఁగిలింతల కోర్కెనే వీడనానొకో?

*　*　*　*　*

('సిలిరత్నాలు'నుండి కొన్ని.)

---

# సౌందర్యము

"విద్యార్థి"

మానవుఁడు సౌందర్యాభిలాషి. ఆ యభిలాషయు సహజమే. ఆ సహజసౌందర్యపిపాస చేతనే యతఁ డెన్నెన్నియో శ్రమము నొందుచుండును. తత్పిపాసయే యతని మానవత్వమును సైతము ధ్రువపఱచుచుండును. తద్వాంఛా సంతర్పణముననే చిత్రవర్ణసంశోభితములును, అద్వితీయామోద సంధాయకములును నగు కుసుమ విసరములను ప్రేమించుచున్నాఁడు. దర్శనమాత్రమున మనుజులను చిత్రితుల నొనర్చు చిత్రముల జిత్రించుచున్నాఁడు. రసప్రవాహమున నోలలాడించు కావ్యకన్యామణుల సృజించుచున్నాఁడు. నూత్నరూప సందర్శనోత్సుకతతో సంభ్రమించుచున్నాఁడు. రమణీయానంద రసాస్వాదనోద్దేశముననే యీ కావ్యప్రపంచము సృష్టింపఁబడినది. అనూనగాన వాహినులు ప్రవహింపఁజేయ బడుచున్నవి. ఇంత యేల? ఈ చతుష్షష్టి కళలును తత్ఫలానుభవార్థమే జన్మించినవి. తన్మూలముననే ప్రపంచ మీవిధముగ నేఁడు మనకుఁ గానంబడుచున్నది. సౌందర్యవారాశియం దొకతరంగమాత్రమగు కావ్యమనోహరతను గాంచఁ జాలని మాత్రమున ద్విపాద పశువైనచో, నే తరంగమును గాంచనివాని నేమనవచ్చునో మనము చెప్పఁజాలము.

సామాన్యమానవులు వస్త్రభూషణముల యందును, విలాస వస్తు సంజాతమునందును, మిత్రరత్నములయందును, ఇష్టరూపముల యందును సౌందర్యానుభవము నొందుచున్నాఁడు. కాని యివియే సుందరవస్తువులా? సౌందర్యరాశి నివియే తమయందు బంధించుకొని యున్నవా? కాదు కాదు. సమస్తవస్తువులయందును సౌందర్యము నిబిడీకృతమై యున్నది దశదిశలయందును మనోహరత పిక్కటిల్లుచున్నది. సౌందర్యహీనమగు వస్తువు లోకమున నేదియు లేదు. సౌందర్యపరిమాణమును విస్పష్టముగఁ జెప్పఁగలవారును లేరు.

కుసుమకోమలతయందు రమణీయత యున్నయటులనే కర్కశశిలాకాఠిన్యమునందును రమణీయత కలదు. మధురత్వమునందు రుచిరత్వమున్నటులనే కటుత్వమునందును రుచిరత్వము గలదు. కోకిలాలాపములయందు మనోజ్ఞత్వమున్నటులనే మయూర క్రేంకారములయందును మనోజ్ఞత్వము గలదు. కన్నులు మిఱుమిట్లుగొల్పు తటిల్లతాదులయందు మంజులత గల్గినటులనే ప్రకాశహీనములగు మృత్తికాదులయందును మంజులత గలదు. కవికులగురువగు కాళిదాసుని లలిత కవితా మాధుర్యమున నాదరము నొందినటులనే లేబాలకునివచ్చియు

రాని ముద్దుపలుకులవలనను నానందము నొందుచున్నాము. ఉత్తుంగతరంగ సంగతమగు సాగరమును గాంచి సంతసము నొందినటులనే ప్రాతఃకాలమున బాలతృణాగ్రమున నొయ్యారముగ నర్యాటలు సలుపు హిమబిందువును గాంచియు సంతసము నొందుచున్నాము. బాల్యచంచలతయు, యౌవనగాంభీర్యమును నానందదాయకములే. ప్రాతఃకాల సాంధ్య రాగమును, మాధ్యాహ్నికోజ్జ్వల ప్రకాశమును శోభావంతములే.

ఇఁక సౌందర్య మననేమియో యొక్కింత తెలిసికొనఁ బ్రయత్నింతము. అనంత తారావారముచే రత్నఖచిత వితానమువోలె సంశోభితమగు ననంతనీలాకాశమును గాంచినప్పుడును, శ్యామపత్రములతోడను, చిత్రవర్ణపుష్పములతోడను విలసిల్లు లతావితానములను వీక్షించినప్పుడును మన మొక్కటే మాట ననుచుందుము: "ఆహా! ఎంత సౌందర్యము!" ఉజ్జ్వలత్కౌముదీ తరంగ సంయోగముచే నుల్లసజ్జలతరంగోపేతమగు నదీప్రవాహమును గాంచినప్పుడును, అవ్యక్తకలకలారావములతో, కర్బురపక్షవిక్షేపములతో గగనాంగణమున విలాసముగ విహరించు నంశజానీకమును జూచినప్పుడును ఒక్కటే మాట వెలువడుచుండును: "ఆహా! యెంత సౌందర్యము!" సరల మృదులభావదర్పణమగు బాలుర ముద్దుమోము నీక్షించినప్పుడును, అవ్యక్తానందానుభవమున నోలలాడు పసిపాపలను సందర్శించినప్పుడును, రసవత్కావ్యముల నాకర్ణించినప్పుడును, జీవకళ లుట్టిపడు శిల్పచాతుర్యము నాలోకించినప్పుడును ఒక్కటే వాక్యము బహిర్గత మగుచుండును: "ఆహా! యెంతటి మనోజ్ఞత్వము!" ఎంతయో యానందము నొందుచుందుము. ఎన్నియో భావము లుత్పన్నములగుచుండును. ఎన్నియో వికారములు కల్గుచుండును. కాని యొక్కటే మాటనుమాత్రము మనము చెప్పఁగల్గుదుము: "ఔరా! యెంతటి రామణీయకము"

భావములను భాష ప్రదర్శింపలేదు. భాష పరిమితము. భావము లవ్యక్తములు. ఎంతటి కవివరుఁడును నావిషయమున మూకీకృతుఁడు కావుటకంటె మఱేమియుఁ జేయఁజాలఁడు. కనుక నీవిషయమునుగూర్చి యెవ రేమి చెప్పినను నది సౌందర్యాంశికబోధకమే యగును గాని యంతకు నెక్కువ కాఁజాలదు.

కలావిదులు కళలవలన బ్రహ్మానందసబ్రహ్మచారియగు నానందరసానుభవ మూలమునఁ దన్మయత నొందఁగల్గుదురని చెప్పుచున్నారు. నిశ్చయమే. ఆయానందము తత్సౌందర్యగ్రహణ సమర్థులకే గాని యన్యులకుఁ గాదు. అమృతరసార్ద్రమగు నాదికవి కవితయైనను నెల్లర కాహ్లాదము గలిగింపఁజాలదు. సర్వాంగసంపూర్ణసౌందర్యముగల పూర్ణేందుముఖి చిత్రరామణీయకమును మానవమాత్రుల నెల్ల నానంద మొందింపఁజాలదు. కారణమేమి? ఆ సౌందర్యగ్రహణాభావమున్న

మతి యేమున్నది? కనుకనే సకలకళలకును సౌందర్యము ధ్యేయమగుచున్నది. ఆసౌందర్యము గాంచువారి కానందాభావము లేదు. అనఁగా సౌందర్యము ఆనందాంశ మన్నమాట. కళాప్రపంచము లావణ్యాదేవతోపాసనకు పూజాద్రవ్యము. ఆనందము కళలయందు మాత్రము గాదు; ప్రతివస్తువును నిస్తులరామణీయకోపేతమే. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనియే మన మతసిద్ధాంతము. పరబ్రహ్మమున్నచోట సౌందర్యమునకు కఱవా? కనుకనే 'సర్వప్రపంచమునందును ఆ పరమేశ్వరుని యుజ్జ్వలతేజోరూపదర్శన మొనరించి నిర్మలానందము ననుభవించుటయే సౌందర్యము!' అని యొక మహాత్ముఁడు సెప్పియున్నాఁడు. దీనినిబట్టి సౌందర్యమహత్త్వమును దెలిసికొనఁగల్గుదుమని కొందఱు భావింపవచ్చును కాని తన్మహత్త్వకల్పనయు సామాన్యము గాదు. కల్పనకు సౌందర్యముతోడ గాఢసంబంధము గలదని యొక సౌందర్యప్రేమి వక్కాణించి యున్నాఁడు. అనఁగా సౌందర్యానందానుభవజ్ఞులు మాత్రమే దానిని కొంతవఱకైన నూహింపఁ గల్గుదురు. కాని ధీరులైనను, సూరులైనను కల్పన మొనరింపఁజాలరు. వారు తమజీవనమును పరభయంకరముగను, సర్వసమ్మాన్యముగను గడుపవచ్చును. మదవారణేంద్రకుంభవిదారణపాటవంబగు మృగరాజుగాని, సకలలోకముకుటాయమానమగు తాజమహల్‌గాని, సుందరతానందము నొందఁజాలవు.

సామాన్యమానవులకు సర్వవస్తువులును మనోహరములు గాఁజాలవు. కొందఱు తమ మనోహారిణీరూపమునందును, తమ ప్రియమిత్రాకారముల యందును, తమవాంఛితార్థములయందు మాత్రమే లావణ్యమును వీక్షింపఁగల్గుదురు. ఏమి? తక్కిన వస్తుజాలమునందు రామణీయకము లేదా? ఉన్నచో నన్నిపదార్థములును ఏల మనోహరములు గావు? అని యొక చిన్నసందియము గలుగుచుండును. నిశ్చయమే. సర్వవస్తువులును సౌందర్యసంభరితములే. దశదిశలును సౌందర్యపరిపూరితోజ్జ్వలములే. కాని యీ సౌందర్యదర్శనమునకు వారియం దధికారము—అర్హత, లేదు. అనర్హుల కది గోచరముకాదు. సౌందర్యకావ్యము బహిరంగముగ—విప్పియుంచఁబడియున్నది. కాని రసికులుమాత్రమే యీ గ్రంథమును పఠియించి యానందము నొందఁగలరు. వాల్మీకిరామాయణమునందున్న యమృతరసము నక్షరాస్యు లెల్లరు ననుభవింపఁజాలరు. రసికులుమాత్రమే యాయానందము ననుభవింపఁగలరు. ఆరసికత యూరక లభింపదు. అది యలభ్యమును గాదు. తదేకమనస్కులై ప్రయత్నించినవారి కెల్లరకు నది లభ్యమేయగును. సౌందర్యకావ్యరసాస్వాదనమునకును అర్హతను సమార్జింపవలయును. అందుకు హృదయమును నిర్మల మొనరించుకొనవలయును. మనోలోచనము పటాచ్ఛాదిత మైనచో నాగ్రంథమును పఠింపఁజాలరు. ఆయాచ్ఛాదనమును మొదట తొలఁగించుకొనవలయును.

మనోభావములను శుద్ధములుగ నొనర్చుకొన వలయును. అనఁగా హృదయమును సౌందర్య పూరితముగ నొనరించుకొనవలయును. నేత్రముల కేవర్ణాచ్ఛాదన మొనరింతురో ప్రపంచ మంతయు నావర్ణముగనే గాన్పించును. మనో నేత్రము నింతియే. దానికి సౌందర్యపటము గప్పుఁడు; మీకు లోక మెల్లెడ నట్టిసౌందర్యమే ప్రత్యక్ష మగుచుండును. సౌందర్యము హృదయమునందే యున్నది. మానసికావస్థావికాస మే సౌందర్యము. మనస్సంబంధము లేకుండ నింద్రియములును విషయములను గ్రహింపఁ జాలవు. ఇంద్రియములు ద్వారమాత్రములు. కనుక మనస్సు నెట్లు శిక్షింతుమో ప్రపంచ మంతయు నటులనే గానంబడును. కనుకనే

> 'సర్వత్ర సంపద స్తస్య
> సంతుష్టం యస్య మానసం,
> ఉపాన ద్గూఢపాదస్య
> నను చర్మావృతైవ భూః.'

(చెప్పులు తొడుగుకొనినవానికి భూమి యంతయు చర్మావృతమై యుండునట్లు మనస్సును సంతర్పిత మొనర్చుకొనినవానికి అంతటను సంపద లుండును.) అని చెప్పుదురు. కాన నా సౌందర్యానందానుభవము నొందఁ దలంపు గలవారు తమ యాంతరంగికవృత్తులను నిష్కల్మష మొనర్చుకొనవలయును.

అటు లయినచో తమ మిత్రబృందము, తమ గృహము మాత్రము సుందరముగఁ గాన్పింప నేల? రసికవతంసుఁడు కావ్యమందంతటను రసమును గ్రహించుచుండఁగా సామాన్యులు తాను గ్రహించిన భాగములయందు మాత్ర మానందము నొందుచుండుట విపరీతము గాదు. అటులనే స్వార్థపరులు తమవిషయములందు మాత్రము సంతోషము నొందఁగల్గుచున్నారు. మానస మెంత సంకుచితముగ నుండునో సౌందర్య గ్రహణ మంత సంకుచితముగ నుండును.

సౌందర్యవిషయమున మఱియొక్క యంశమునుగూడ గమనింపవలయును. కేవల బహిస్సౌందర్యము నే కాంచరాదు. బహిస్సుందరతనే కాంచువారు అంతస్సౌందర్యానందము ననుభవింపఁబోరు. కావ్యమునందు శబ్దజాలమును, పదాడంబరమును, ప్రాసానుప్రాసాదులను, చిత్రకవిత్వము నే కాంచువారు రసామృతము ననుభవింపఁగలరా? రసపిపాసువులు కవిత్వచిత్రములనే సర్వస్వముగ భావింపఁబోరు. వారికి గమ్యము రసగ్రహణము. మధుగ్రహణచణము లగు మత్తద్విరేఫములు పద్మాకారదర్శనమున నే సంతృప్తి నొందఁబోవు. వాని యాదర్శము మకరందాస్వాదనము. అటులనే సౌందర్యాభిలాషియు కేవల బహిస్సౌందర్యము నే కాంక్షింపరాదు. వాని యాదర్శ మంత స్సౌందర్యగ్రహణముగ నుండవలయును. ఒకచిత్రమును గాంచునపుడు చిత్రపరిమాణమును, అందుపయుక్తములగు వర్ణములను, వస్త్రభూషణాదులనే కాంచరాదు. ఆ మాత్రమే దర్శించుచున్నచో నాచిత్రలేఖకుని

శ్రమయంతయు వ్యర్థ మైనటులనే తలంపవచ్చును. కళావిదులు విమర్శించునది బాహ్యాకారము గాదు. అంతరంగసౌందర్యము. మనోహర భావతరంగము లాచిత్రమునందు ప్రస్ఫుట మగుచుండును. తన్మనస్సౌందర్య మంతయు నం దుద్గత మగుచుండును. రసికులదృష్టి యా సౌందర్యమునందే యుండును. ప్రధానమును, లక్ష్యమును అంత స్సౌందర్య మగుట నిశ్చయమే. అయినను బహిస్సౌందర్యము నిరర్థకమని యనఁజాలము. నేర్పరు లగు చిత్రకారులు వట్టిగీతలవలననే మనోభావములను వెల్లడింపఁగల్గినను వర్ణలేపనమును, వస్త్రధారణమును అనవసర మనము గదా! గులాబిపూవునందు బహిరాకారమును జూచియు మనము ముగ్ధుల మగుటలేదా? బంగారమునకుఁ బరిమళము కూడ నున్న మఱి యెంత మనోహరముగ నుండును!

ఇఁక సుందరతాలాభములను గూర్చి యొక్కింత విచారింతము. మనుష్యునకు సౌందర్య మత్యంతావశ్యక మగు వస్తువు. కనుకనే యది కృత్రిమము గాక సహజమైనది. మానవుఁ డున్నతి నొందుటకు ద్వివిధము లగు శిక్షణము లవసరములు. ఆతనిబుద్ధి తీక్ష్ణ మొనర్చునది యొకటి. ఇందులకు సాధనములు ప్రకృతిశాస్త్రములు. కేవలప్రకృతి శాస్త్రాభ్యాసమువలన నతఁడు హృదయశూన్యుఁ డగును. శాస్త్రపరిశీలనవలన ప్రకృతి నెంత లోఁబఱచుకొని యెంతటి భౌతిక శక్తుల నార్జించినను అతని హృదయ మౌన్నత్యము నొందకపోయినచో నతఁ డాదర్శస్థానము నందఁజాలఁడు. మానవుఁ డానందరూపులగు నమరులయెడ కొఱగుచుండవలయును. హృదయౌన్నత్యము లేక యా కార్యము సాధ్యము కాదు. నేఁటి పాశ్చాత్య విజ్ఞానశాస్త్రవేత్తలలో పెక్కురు తమ కుశాగ్రమగు విజ్ఞాన మంతటిని మారణసాధన కుపయోగించుటను జూచినచో వారి హృదయము నైర్మల్య మొందలేదని స్పష్టమగుచున్నది. వారి మానస మట్టియున్నతస్థితి నొందినచో వా రెంతటి నిర్మలానందము నొందఁగల్గెడువారు! కనుకనే మానవు లున్నతి నొందుటకు హృదయౌన్నత్యము మూలము. ఇదియే రెండవ శిక్షణము. ఇందుల కాధారము సౌందర్యోపాసనయే. కనుకనే యిది ప్రతిమనుజున కావశ్యకమగుచున్నది. విలాసవంతులకు మాత్రమే సౌందర్యదేవీపూజన మవసరమని కొందఱనుకొనుచున్నారు. కాని యది సరిగాదు. మధ్యకాల నాగరకతను కొందఱు తమచేతులలో నుంచుకొని, దానిపై నాధిపత్యము గల్గియుండి, వారు భోగవిలాసములలో పడియున్నందువలన సామాన్యజనులు దానితో తమ కవసరము లేదనియు, అది తమ జీవనమున కనావశ్యకమనియుఁ దలఁపసాగుటయే యందులకుఁ గారణమని కొందఱు విద్వాంసుల యభిప్రాయము. ఏమైనను సౌందర్యదర్శనాకాంక్ష మానవమానసములనుండి దూర మొనర్పఁబడఁజాలదు. ప్రాణరక్షకవృత్తులు మొదలుకొని శుద్ధ మానసికానందదాయకములగు వస్తువుల

వఱకు సౌందర్యాలోకన మప్రయత్నముగ
నైనఁ గల్గుచునే యుండును.

సౌందర్యలిప్సవలన మనోవేగము పరి
మార్జితము, శుద్ధము నగును. భావము లున్నతి
నొందుచుండును. హృదయము,కల్పనాశక్తియు
నున్నతము లగుటవలన విజ్ఞానమయకోశము
వికాసమునొంది తన్మూలమున మానవుఁ డున్న
తినొందఁగలఁడు.దీనిని మనము ప్రయత్నపూర్వ
కముగ సంరక్షించుకొనవలయును. అది మన
ముఖ్యకర్తవ్యము. కానిచో మనుజుఁ డున్నతి
నుండి యధఃపతితుఁ డగును. అట్టివాఁ డెంతటి
విజ్ఞానశాలి యయినను, ఎంతటి రాజ్యశాసకుఁ
డయినను పవిత్రమగుమానవత్వమును గాంచఁ
జాలఁడు. తమ పాశవికవృత్తులను సంతృప్తి
పఱచుట కమరతుల్యమగు నద్భుతశక్తిని సంపా
దించినను వారు నిర్మలానందలేశమైనను గాం
చఁజాలరు. వారి నాగరకత సంపూర్ణవికాస
మొందకయే వాడిపోయిన పుష్పమువలె విధ్వ
స్తమగును. మనము మనపురాణములయందు
ఎన్నియో రాక్షసచరిత్రములను దీనికి లక్ష్య
ముగఁ జూడఁగలము.

పెక్కురు దార్శనికులు సుందరతా శ్రే
యస్సులకు భేదము లేదని యనుచుందురు.
ఒక్కొక్కప్పుడిది యనుచితముగాఁ గానంబడ
వచ్చును గాని లెస్సగా నాలోచించినచో సృష్టి
మూలము ఈసత్యమునందే విద్యమాన మగు
చున్నదని తెలియఁగలదు. ఇది భ్రమాత్మక
ము గాదు.మన వేదాంతానుసారము ఈసమస్త
ప్రపంచమును ఆనందావిర్భావమే. అంతమున
నానందమునందే లీనమగును. ఈ యానంద
మునకు శాంతిసౌందర్యప్రేమ లంగములు. మ
నుష్యుఁ డిట్టి సౌందర్యమును దర్శింపసాగినచో
నీమార్గమున ననాయాసముగ నీశ్వరునిఁ జేరఁ
గలఁడు. అవిద్యమూలమున విద్యను సంపా
దించుట యన నిదియే యర్థము. సర్వవ్యాపి
యగు పరమాత్ముని సౌందర్యమును సర్వవస్తు
వులయందును గాంచుటవలననే మానవునకు
సహజానందము లభింపఁగలదు. ఈవిషయ
మునే మన యుపనిషత్తును ప్రతిపాదించును.
ఈసౌందర్యదర్శనమువలనఁ గల్గినయానందమే
నిర్మలానందము.

'ఉదితే పరమానందే
నాహం న త్వం నవై జగత్'

అని చెప్పంబడిన దీయానందమే. మనము
ద్వంద్వములను గడచి ప్రతివస్తువునందును
మాధుర్యమును, అఖండరసమును, నిర్మల
నిస్సీమానందమును అనుభవింపవలయును అని
మహర్షి యరవిందఘోషు అభిప్రాయము.

'ప్రతిక్షణం య న్నవతా ముపైతి
తదేవ రూపం రమణీయతాయాః'

అని పేర్కొనఁబడిన సౌందర్యరూపము నెవ్వరు
కాంక్షింపకుందురు ?

---

# గుండాల అప్పాజి

దువ్వూరి జగన్నాథశర్మ గారు

౧

ఇతఁడు సామాన్యుఁడా అప్పాజి మేటి
విశదతమోర్కుఁడౌ విజయరామాఖ్య
మణికిరీటికిఁ గూర్పు మంత్రి యతండు
అణుమాత్ర మాపత్తు నంటరానీఁడు
శ్రేయోభిలాషియై చేరి కాపాడు
హేయమౌ ధనవాంఛ నిచ్ఛ నెపడేడి
రాజసేవకులకు రావణుం డతఁడు
రాజనీతి నవభార్గవ విభుం డతఁడు
నృపకోప వైఖరు లెఱిఁగిన యతఁడు
కపటబుద్ధుల నమ్మకపు చేఁతఁ దెలిసి
తివిరి వర్తించి భేదించి మేలున్నచు
నవిశథ మెఱిఁగింపఁ డాగ్రహ పడఁడు
రాణివాసమె తల్లి రాజె దైవంబు
గాణిక్యపరులె యాఘాంతశత్రువులు
తనకని తలపోయు ధన్యుఁ డా మంత్రి
వినుమింత యేల? పృథ్వీనాథభవన
భవభన వ్యాపార పరతంత్రమూర్తి
సవినయ ఘోరపిశాచము లతని
గుణభైరవుం డనుకొని మూల కొదుఁగు
వినమిత సామంత పృథ్వీశుఁ డతఁడు
ఉద్యోగ మూడునో? ఉదర మేమగునో?
సద్యఃఫలముఁ ద్రోవ సాహస మగునో?
అను భీతి లేదు - శ్రేయంబె బోధించు
మణికిరీటుల నాఁటి మంత్రి యప్పాజి.

౨

అట్టి యా యప్పాజి నెఱుఁగకో రాజు
గట్టిగా ధూర్తవాగ్వైఖరి నెఱపి
"ఎదురాడుటా? కొ! మాయిష్ట మెట్టిదియొ
మది నెంచఁజాలని మంతిరి-యితఁడు
పైనుండెఁ బో-మాదువైగులఁ గలఁచుఁ
గాన నీతని వేగ ఖైదు గావింపఁ
బనుచుఁడు-చీపురుపల్లె జైలునకు"
అనె నొక్కతఱి విజయాన నీభర్త
అనుమగా ఖైదున నప్పాజి నుంచి
పనివడి మన్న భూపాలుర పయికి
దాడి గావింప నర్థమువోయె- సేన
లోడె- చికాకయియుండి యా నృపతి
అంగుళి వోయిన హస్తము మాడ్కి-
భంగ మూహించి యప్పామంత్రిఁ దెచ్చి
గౌరవమునఁ బల్కె—"మీరు లేకున్న
మా రాజకీయాలు మార్గము దప్పె
మా మేలుఁ గోరిన మంత్రి పుంగవులు
తా మింక నన్యథా తలఁపకుఁడయ్య!"

* * * *

"ఇంగిత మెఱిఁగించు నింతితోఁడ రస
భంగముఁ గావించు భర్తనుబోలె
మే లెఱింగించుడు మీ మాటఁ ద్రోసి
మాలిమి మాలెను మా చేఁతలెల్ల
విరసహేతువు"లని విజయరాణ్ణృపులు
పరితప్తహృదయానఁ బల్కి రప్పట్ల.

౩

ఆకాల మా రాజు లామంత్రు లహహా!
ఆ కార్యమర్యాద లా మంతనములు!
ఆ పాపభీతి—విద్యాశాస్త్ర భక్తి—
కాపాడు నుద్యోగగౌరవా లేవి?
నేఁటి గోష్ఠులె వేఱు — నీతులే వేఱు
నాఁటికి నేఁటికి నల్లపూసంత
పోలికే లేదు—ఆ పూర్వ వైభవము
ఆ లీలలును—కాలునం దణఁగారె.






# సనాతన హైందవ చిత్రరచన మనకు ఆదర్శకము కాగలదా?

తలిసెట్టి రామారావు గారు, బి. ఏ., బి. యల్.

సనాతన హైందవ చిత్రరచన మనకు ఆదర్శకము కాగలదా యను ప్రశ్నకు ప్రత్యుత్తరము పూర్తిగ వ్రాసినయెడల వ్యాసము విరివియగును. జాతీయచిత్రరచనను బాగడుచు, ఇదియే జాతీయజీవనమును పెంపుచేయగలదని చెప్పువారు సనాతనహైందవచిత్రరచన మనకు ఆదర్శకము కాగలదని నమ్ముచున్నారు. కనుక వీరికి సంశయనివారణ మనవసరము. మారుచున్న పరిస్థితుల కనుకూలముగ చిత్రరచనయు మారవలెననియు, ఇట్టి నూతనజీవనమున కనుగుణమైనది ఐరోపాచిత్రరచనయే యనియు, పాశ్చాత్య కళావ్యామోహితు లనుచున్నారు. ఇట్టిసోదరుల సంశయమును తీర్చుటకు ఐరోపా రచనకు మన రచన ఆదర్శకము కాగలదని నచ్చజెప్పిన చాలును.

మొగలు సామ్రాజ్యము విచ్ఛిన్నమైన కాలమున దేశమునందు శాంతి లేకపోయెను. అంతఃకలహములవలనను, ఆంగ్లేయులు యుద్ధరంగమునకు వచ్చుటవలనను పురాతనసంస్థలు కంపించిపోయినవి. శాంతిదేవతయొక్క ఆశీర్వాదమువలన పెరుగవలసిన లలితకళలు యుద్ధబీభత్సమునందు కృశించిపోయినవి. రాజుల రాజ్యాలు పోవుచుండ, ధనికుల ధనము పరుల పాలగుచుండ చిత్రరచన నాదరించువా రెవరు? చిత్రకారులజీవనము జరుగుటయే కష్టమయ్యె. ఏవో పురాతన చిత్రముల నమూనాలను వ్రాసి, చౌకగ నమ్ముచు వీరు కాలయాపనము చేయవలసివచ్చెను కాన మంచి బొమ్మలను వ్రాయుట కవకాశము లేకపోయినది. హైందవ చిత్రములయెడల సానుభూతిలేని ఆంగ్ల సైనికులు శిరోధుల నగరులను కొల్లగొట్టి నప్పుడు అమూల్యములైన చిత్రసంపుటములు నముదాయములు నశించినవి. మిగిలినవాటిలో చాలవరకు ఏస్యాసు మ్యూజియమునకో, లండను మ్యూజియమునకో పంపబడెను. అచ్చటచ్చట అప్పటికిని చిత్రరచనయే వృత్తిగ నేర్పరచుకొన్నవారు ఆంగ్లేయుల రచన ననుసరింప ప్రారంభించిరి. ఆంగ్లవిద్య వ్యాపించిన కొలది ఆంగ్ల

సంఘముయం దభిరుచి కలుగుటచే జాతీయసంస్థలందు ప్రజలకు మక్కువ కలిగెను. ఇట్టి పరిస్థితులలో రవివర్మ గారి చిత్రరచనవలన ప్రజలను మెప్పించి ఐరోపా చిత్రరచనయెడల పుట్టిన ప్రేమను స్థిరపరచెను. ఆంగ్లేయ కళావిమర్శకులు మన చిత్రనిర్మాణములను జూచి నవ్వుట వలన వారు చెప్పునది నిజమేయనుకొంటిమి. మన సంప్రదాయములనుబట్టి పాశ్చాత్యసంప్రదాయములను విమర్శించుటకు బదులుగ వారి సంప్రదాయములను బట్టి మన సంప్రదాయములను విమర్శించుట కలిగెను.

మన విధానముల ననుసరించి ఐరోపా చిత్రరచనను విమర్శించినయెడల మనస్సునకు నచ్చినచిత్ర మొక్కటియు వారిచిత్రములందు కానవచ్చుట దుర్లభము. వారి విధానములను బట్టి మనచిత్రరచనను విమర్శించి చూచిన యెడల నెట్టి ఫలితము చేకూరునో చూతము. పాశ్చాత్యకళావ్యామోహితుల కిట్టి మార్గమే నచ్చగలదు.

అనాదినుండియు ఐరోపాదేశమునందు చిత్రములు బాహ్యప్రకృతియొక్క నమూనాలుగ వ్రాయబడుచుండెను. సూర్యాస్తమయము, చక్కనిమేఘమండలి, పుష్పములతో నిండియున్న ఉద్యానవనము, పచ్చనిచెట్లు, సెలయేళ్లు గల ప్రదేశములు, సుందరస్త్రీవిగ్రహములు మొదలగు మనోహరదృశ్యములను చేతి కందజేయుటయే చిత్రకారులపనియని వీరు తలచుచుండిరి. ప్రకృతి నెంత బాగుగ ప్రదర్శించిన నంతగ చిత్రకారుడు పొగడ్తబడయుచుండెను. మతవిషయిక చిత్రములను, చరిత్రాత్మక చిత్రములను వ్రాయునప్పుడు ఆ యూరుచుల నెంత బాగుగ ప్రదర్శించిన నంత ప్రజ్ఞావంతు డగుచుండెను. ప్రకృతిని, ఘటనలను ప్రత్యక్షముగ జూచినటుల నుండుటయే చిత్రములయుద్దేశమయ్యెను. కాని, యీభావము లెందుకు కలుగుచున్నవి? ఇటులు కలిగిన భావములను వ్యక్తపరచుటెటులు? అను ప్రశ్నలకు వీరు ప్రత్యుత్తరమును నచ్చజెప్పుకొనలేదు. భావములను పుట్టించు దృశ్యములే ముఖ్యమని వారు తలంచిరి. దృశ్యముల వలన కలిగినభావములే ముఖ్య మని మనము తలంచితిమి.

ఇటీవల, ఐరోపాచిత్రకారుల దృక్పథము మారెను. వస్తుపరిశోధన, విజ్ఞానము పెరుగుట వలనను, తాము వ్రాయుచుండిన చిత్రముల వంటివి కెమెరావలన సృజింపగలుగుట సాధ్యమగుటవలనను విస్తరించుచున్న ప్రజల రుచులకు చిత్రరచనా సంప్రదాయములు వెనుకబడుచున్నవని వీరు గ్రహించిరి. సనాతన కాలమునుండి యేర్పడిన బంధములను త్రెంచుకొనుటకు కొందరు ధైర్యశాలులు యత్నించిరి. వారు చేసిన యత్నములను కొంచెము గమనించినయెడల ఎట్టివారైనను మన చిత్రరచనయొక్క యాధిక్యమును గ్రహింపగలరు.

మనకండ్లకు కానవచ్చునదేది? ప్రకృతియందు కనబడునటులు దృశ్యములను వ్రాయుట

కలవాటుపడినవారికీ ప్రశ్నయే వేగము స్ఫురించును. లోనున్న రక్తమాంసములతోను, చెట్లలోనున్న కర్రతోను చిత్రకారున కేమి సంపర్కము—ఆయా లోపలిభాగములను వ్రాయవలసివచ్చినప్పుడు తప్ప? పైకి కానవచ్చెడి యాకారమునేకదా వ్రాయుట? ఈ యాకారమును రంగులతోకదా ప్రదర్శించుట? రంగులను పూసినంతమాత్రమున కాగితముపై వస్తువుల యాకార మేర్పడుచున్నది. రంగులు లేక చిత్రనిర్మాణమును చేయుటకు వలనుపడదు. ప్రతివస్తువునకు నేదో యొకరంగు కలదు కాని కాలమునుబట్టియు, పరిస్థితులను బట్టియు ఈ రంగు మారవచ్చును: ఎండయం దుండిన లేత రంగు, నీడయందుండిన ముదర రంగు; ఎండయందుండిన వర్ణతీవ్రత, నీడయం దుండిన వర్ణ మాలిన్యము. ఇంతేకాక వస్తువుల యాకృతి బాగుగ కనబడుటకు చాయ యవసరము. గుండ్రముగనున్న వస్తువుయొక్క చాయ వేరు; కోణముగ నున్నయెడల చాయ వేరు. నునుపుగ నున్నవస్తువును చూపుటకీ చాయ నొక విధముగ పూయవలెను; నునుపుగలేని వస్తువుయొక్క చాయను వేరువిధముగ పూయవలెను. ఎండయందునీడ, మబ్బునందునీడ, వెన్నెలలో నీడ వేరువేరువిధముల నుండును. ప్రపంచమంతయు వస్తువుల వర్ణముల వలనను, చాయవలనను, ఆకారమునుదాల్చి మనకు కానబడుచున్నది. దీనిసారాంశ మేమనగా: మనకు కనబడునవి రంగులు మాత్రమే యని.

రంగులనగా నేవి? అన్నిరంగులును తెలుపువర్ణమున నిమిడియున్నవి. శాస్త్రపరిశోధకులీవిషయమును మనకు నచ్చజెప్పియున్నారు. వర్షాగమమున మనకు కానవచ్చెడి ఇంద్రధనుస్సు దీని కుదాహరణము. కాన మనము రంగులమూలమున చిత్రింపవలసినది వెలుతురు కాని వేరుకాదు. ప్రపంచమంతయు వెలుతురుమయము. ఇది లేనిది ప్రపంచదృశ్యమే మనకులేదు. రంగులీ వెలుతురుయొక్క వేరురూపములు.

నిజ మిటులుండ తేటరంగులను ప్రదర్శింపక మట్టి, బూడిద మొదలగు మిశ్రవర్ణములను బూసి చిత్రము నేల పాడుచేయుట?

ఐరోపాచిత్రకారు లిటుల తర్కించుట వలన పూర్వపు బంధములు విడిపోయినవి. పూర్వపు సంప్రదాయములు సడలినవి. ఈ క్రొత్త నియమములతో వ్రాయబడిన చిత్రములందు రంగులు తాండవమాడుచున్నవి. ప్రపంచ మంతయు రంగులమయమై యుండ వీటికీ ప్రాముఖ్య మేల ఉండరాదు? మనుష్యాకృతియందు ముక్కున కాకుపచ్చ, చెక్కిళ్లకు నలుపు ఉండవచ్చును. ఎచ్చట చూచినను రంగే; ఏరంగెచ్చటనున్నను సరే. చిత్రమును చూచినయెడల వస్తువుల యాకృతులే కానవచ్చుట కష్టమయ్యెను. ఇట్టి రచనను "ఇంప్రెషనిజము" (Impressionism) అందురు.

ఈపిచ్చి యింతటితో సరిపోలేదు. "రంగులకు భేద మేర్పరుపక పోయినయెడల బాగుగ

లేదు" అని కొందరు వాదించి తమచిత్రము లందు రంగులను చతుర్భుజాకారములుగ బూసిరి. "ఇదియు బాగుగలేదు. ప్రపంచ మంతయు బిందువుల (Points)తో నేర్పరుప బడెను" అని కొందరు తమచిత్రములందు రంగులను వలయాకారములుగ వ్రాసి రూప ముల నేర్పరుపజూచిరి. "వెలుతురు తిన్నగ— వంకలులేక — ప్రవహించుచుండ వర్ణములను చతుష్కోణములుగను, వలయములుగను చి త్రించుట పొరబాటు" అని మరికొందరు రంగు లను త్రిభుజాకృతినివ్రాసి చిత్రముల నేర్పర చిరి. ఈ నూతనవిధానమును "పోస్టు-ఇంప్రె షనిజము" (Post-Impressionism) అందురు.

హిందూచిత్రకారులు వర్ణసంకరమువలన చిత్రము చెడునని గ్రహించి ప్రత్యేకవర్ణము లతో నాకారముల నేర్పరచి, లేతచాయ తో రూపుచూపి, వస్తుభేదము స్ఫుటముగ తెలియునటుల రేఖలతో దిద్దిరే కాని ఐరోపా చిత్రకారులవలె దారి తెలియక త్రప్పుదారులను త్రొక్కలేదు. మనచిత్రముల నను కరించి యుండినయెడల వారికీ క్లేశయత్నసమే లేక పోయెడిది.

ఇట్టి పరిస్థితులందు చిత్రింపబడిన ఐరోపా చిత్రములందలి వస్తువులరూపు చెడెను. ఆకా రముల నేర్పరచుకొని "ఇది మనుష్యాకృతి, ఇది చెట్టు, ఇది ఫలము" అనుకొని సంతసించ వలసివచ్చెను. "సూచన చాలదా? వస్తువు యొక్క రూపమంతయు వ్రాసినంతమాత్ర మున వచ్చినలాభమేమి?" అని వీరివాదము. ఈ నూతనమైన వాదనవలన "ఫ్యూచరిజము" (Futurism) అను క్రొత్తరచన యేర్పడెను.

కవిత్వమైనను, సంగీతమైనను, చిత్రరచన మైనను చదువువారికి, వినువారికి, చూచువారికి కొన్ని భావముల నందజేసి వారిహృదయమునం దు వాటి కనుగుణమైన సంచలనమును కలిగిం చును. ఈకార్యము నెంత సూక్ష్మముగ నెర వేర్పగలిగిన కళావంతున కంత ప్రజ్ఞ. కావ్యము నుదాహరణముగ దీసికొనుడు. పద్యములందు అవసరములేని పదములను వాడుటవలన కావ్య ముయొక్క విలువ తగ్గును. గొప్పకవు లిట్టి పదములను వాడరు. ఏవో కొన్నిచోట్ల గొప్ప చెప్పినదే చెప్పుటయు సత్కావ్యలక్షణము కాదు. పదిపదములలో చెప్పవలసినది వందపద ములలో చెప్పినయెడల రచనయు నిస్సారమగును. ఇటులనే అవసరములేని రూపములను వ్రాయు ట వలన చిత్తరువు యొక్క విలువ తగ్గును. లేనిపోని వస్తువులను వ్రాయుటవలన చూపవల సిన భావముకూడ వాటియందు మరుగుపడు టయు కలదు. ఈవిషయమును గ్రహించి భార తీయచిత్రకారులు అక్కరలేని వస్తువులను, వివ రములను వ్రాయక ధన్యులైరి. ఫ్యూచరిజము చిత్రకారులు మాత్రము వింత మార్గముల ద్రొక్కిరి. వీరి బొమ్మలందుమనుష్యునియాకా రమును వ్రాయవలసి వచ్చినయెడల ఆ వ్యక్తి యొక్క సంపూర్ణ స్వరూపమును వ్రాయక, చిత్రమునందా వ్యక్తియుండుటకు కారణమును తెలియజేయునటుల నేవో కొన్ని భాగములను సూచించి తృప్తి జెందిరి. వీరి చిత్రములందు

ఏ వస్తువు యొక్క సంపూర్ణాకారము (అవసరము లేనప్పుడు) కానరాదు. ఎచ్చటనో యొకచెవి, చేయి, కాలు కానబడినయెడల అవి మనుష్యులను సూచించుచున్నవనియు, వారు వినుటయో, చూపుటయో, నడచుటయో జరుగుచున్నదనియు ఊహింపవలసినదే. కుక్కయొకటి పరుగెత్తుచున్నటులు ఆచారప్రాయముగ వ్రాయవలసివచ్చినయెడల దేహము సాగియున్నటులు, కాళ్లు ఒక విధముగ వంగినటులు చూపవలెను. కాని అన్ని సమయములందును మనకిటులు కానవచ్చునా? వడిగ పరుగెత్తునప్పుడు నాలుగుకాళ్లు ఎనిమిదిగ కనబడవచ్చును. దృశ్యమే చిత్రము కనుక కుక్క పరుగెత్తుటను చిత్రించుటయందు ఎనిమిదికాళ్లనే వ్రాయరాదు? కుక్కకు నాలుగు కాళ్లే యను నియమమువలన భావప్రదర్శనమున కాటంకము కలుగుటలేదా?

నేనీ టేబిలువద్ద కూర్చొనియున్నాను. చెమటపోయుటచే యెండయొక్క తీవ్రత స్ఫురించుచున్నది. ఫ్యూచరిజము తరగతి చిత్రములు కొన్ని కళ్లకు కానవచ్చుచున్నవి. కాకియరపు వినబడుటచే కాకియు ఆచిత్రములమధ్య కలదు. రోడ్డుపై పిల్లలు ముద్దుగ మాటలాడుటవలనను వారును తలపునకలరు. నాచిన్నతనమున సంభవించిన యొక ఘటనయు జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఇది నా ప్రస్తుతావస్థ. దీని నాచారప్రాయముగ చిత్రించుటకు వీలులేదు. ఫ్యూచరిజము రచనాపద్ధతికిది సాధ్యమగును. నాయీనిమిషపు జీవనమును గూర్చి ఫ్యూచరిజము చిత్రమున టేబిలువద్ద కూర్చున్న సూచన, ఎండ, ఫ్యూచరిజముచిత్రభాగములు, అరచుచున్న కాకియొక్క ముక్కు, బాలుర శిరస్సులు, నాచిన్నప్పటిఘటన అన్నియు కలిసియుండును. కాలముయొక్క కట్టుబాటు, స్థలనియమము, ప్రకృతి నియమము ఈచిత్రమున నుండవు; అనగా భావమే ప్రధానము. భావమే ప్రధానమని గ్రహించిన వీరు హైందవచిత్రకారుల యున్నత పదవిని సమీపించుచున్నారు. భావమునకు ప్రాముఖ్య మిచ్చుటవలననే కదా కొన్నిచోట్ల భారతీయచిత్రకారులు ప్రకృతి నియమములను పాటింపలేదు.

ఇంతలో "క్యూబిజము" (Cubism) అను మరియొకపద్ధతి బయల్వెడలెను. ఉదాహరణముగ నొకటేబిలును తీసికొనుడు. మీదనుండి చూచినయెడల కాళ్లు కనుపడవు. ప్రక్కనుండి చూచినయెడల వెనుకభాగము మరుగుపడును. కాని టేబిలుమీదిబల్ల చతుష్కోణమనియు, దానికి నాలుగుకాళ్లున్నవనియు మనకు తెలియును. భావప్రపంచమున నివి యన్నియు మనకు కనబడును. చిత్రమునందీ భావరూపమును ప్రదర్శించుటకు పురాతనసంప్రదాయములు చోరవనీయవు. టేబిలుయొక్క సంపూర్ణాకృతిని జూపవలెనన్నచో యీ కట్టుబాట్లను నిర్లక్ష్యపెట్టుటయే మార్గము. ఇంప్రెషనిజము, ఫ్యూచరిజము ఈవిషయమై మార్గదర్శకము లయినవి. టేబిలుమీది చెక్క చూపుటకు దానిని కొంచెము మునవైపునకు వంచ

వలెను. అటు లగుచో వెనుకకాళ్లు కనబడవు. అందువలన ముందున నున్న కాళ్లను మామూలుగనే వ్రాసి, వెనుకకాళ్లను కొంచెము ప్రక్కకు వ్రాసినయెడల భావమున కానవచ్చు టేబిలుయొక్క ప్రతియంగము చిత్రమున కానవచ్చును. ఇది క్యూబిజము పద్ధతి.

భావప్రపంచమున మునిగియుండిన భారతీయచిత్రకారులు ఈ క్యూబిజమును అనాదినుండియు గ్రహించియున్నారు. భారతీయరచన చైనా, జపాను, టిబెత్తులందు వ్యాపించియుండుటచే ఇంచుమించుగ ఏష్యాఖండపు చిత్రకారులందరికి క్యూబిజము చిరపరిచితము. శిల్పమునందు మంచము యొక్కయు, గృహము యొక్కయు అన్నియంగములును మనకు కానవచ్చుట సామాన్యము. ఇదివరలో భారతియందు ప్రచురించిన రాసలీలయందు వలయాకారముగ నాట్యమాడుచుండిన గోపికలు క్యూబిజము పద్ధతిని వ్రాయబడియున్నారు. మధ్య నున్న రాధాకృష్ణులు, గోపికలు సంపూర్ణముగ కనబడునటుల చుట్టునున్న స్త్రీలసమూహము పెద్దసంఖ్యను తెలియజేయుటకే కాన వీరిని వ్రాయుటయందు క్యూబిజము అక్కరలేకపోయెను. సాధ్యమైనంతవరకు ప్రకృతి ననుసరించుట; భావమున కడ్డు కలుగుచోట నీ ప్రకృతి నియమములను విడనాడుట; ఇది భారతీయుని విశేషము. ఏదో యొక పద్ధతికి కట్టుబడవలసిన బానిస కాడు కాని మానసికచింతకు ప్రాపంచికనియమము లడ్డు రానప్పుడు వాటిని గౌరవించు సన్మార్గి—భారతీయకళాకోవిదుడు.

ఈ నూతన మార్గము లన్నియు నిలువజాలవు; ప్రజల నాకర్షింపజాలవు. నూతనోద్యమమునందు ఉత్సాహము హెచ్చుగ నుండును. ఈయుత్సాహమును అధీనతయందుంచుకొనక పోయినయెడల మితిమీరి అనర్థమును చేకూర్చును. ఇంప్రెషనిజము మొదలగునవి యిటులనే పరిణమించి ప్రజల యామోదమునకు దూరమై కృశించినవి; కాని పూర్వపు సంప్రదాయము లే గతి యనుభావమును తొలగించినవి.

ఇంప్రెషనిజము, ఫ్యూచరిజము, క్యూబిజము తగిన మార్గములు కావని భావోద్రేకము కల జర్మనులు, రష్యనులు "ఎక్స్ప్రెషనిజము" (Expressionism) అను క్రొత్తరచనను ప్రారంభించిరి. భావము, ఉద్రేకము, ఉత్సాహము, హృదయసంచలనము కలిగినయెడల వాటిని సూచించుటయే యీవిధానము. చిత్రకారునిభావమే చిత్రము—చిత్రమే చిత్రకారుని భావము. కాని వీరి చిత్రములందలి భావము సర్వదా సుగోచరము కాదు. భావపరిచయముకల చిత్రకారునకు తాను రచించునది బోధపడవచ్చును కాని చిత్రకారుని హృదయము నెరుగనివారికి బోధపడుట కష్టము. ఇట్టి చిత్రములందు కొన్ని చక్కనివి కలవు. భారతీయచిత్రకారు డధిష్ఠించిన సింహాసనమునకీ చిత్రకారు లెవరును అర్హులు కాకపోయిరి.

బూడిద, మట్టి మొదలగు రంగులు చాయలకు హెచ్చుగ నుపయోగపడును. వీటివలన కలుగు వర్ణసంకరము భారతీయునకు సరిపడలేదు. సాధ్యమైనంతవరకు ఈవర్ణములతో

జోక్యము లేకుండునటుల వర్ణలేపనమును జేసెను. వీటిని పూర్తిగ త్యజించుట కాని, వర్ణతీవ్రతకు వలయములుగ, చతుర్భుజములుగ, త్రిభుజములుగ రంగులను పూయుట కాని చేసి హాస్యాస్పదుడు కాలేదు. భావప్రదర్శనమునకు సరిపడునటుల సాదృశ్యమైనంతవరకు ప్రకృతి ననుసరించెను. ఇంప్రెషనిజము చిత్రకారు లీవిషయములను భారతీయచిత్రరచననుండి నేర్చుకొనవలెను.

హైందవచిత్రములందు ఫ్యూచరిజము ననుసరించి పెక్కుచోట్ల సూచనామాత్రముగ భావము కలదు. వ్యక్తీకరణము (Symbolism) నందు భారతీయు లద్వితీయులు. వ్యక్తీకరణము అనేకవిషయములను సూక్ష్మముగ సూచించ గలదు. ఒకే చిత్రమునందు అనేక ఘటనలను జూపు చిత్రములు రామాయణమహాభారతాది చిత్రసంపుటములందు కలవు. భారతీయుని దేవుళ్లు, దేవతలు కామరూపులు—కాలప్రవాహమును, స్థలభేదమును ఎరుగనివారు. వీ రారాధించు భగవంతుడు సర్వాంతర్యామి. పురాణచిత్రములను వ్రాయుటయందు అనేక వ్యక్తులు—చరిత్రబంధములు లేక యొకేచోట నుండుట కలదు. ఇట్టిస్వేచ్ఛకలిగినను ఏమియు బోధపడనటులు అన్నివస్తువులు, విగ్రహములు కలసిపోయినటుల ఈ రెప్పుడును వ్రాయలేదు. ఫ్యూచరిజముచిత్రకారు లీ విషయమును భారతీయచిత్రరచననుండి నేర్చుకొనవలెను.

క్యూబిజమును హైందవు లెటులు వినియోగించిరో వెనుక వ్రాసియున్నాము. ప్రకృతినియమములు భావమునకు అడ్డువచ్చునప్పుడు క్యూబిజము; లేనియెడల ప్రకృతినియమములు. ఈ విషయమును క్యూబిజము చిత్రకారులు నేర్చుకొనవలసి యున్నది.

ఎక్స్ప్రెషనిజము చిత్రములందు భావము మరుగుపడుటవలన విలువ చెడియున్నవి. రచనయందును, భావప్రదర్శనమునందును హైందవ చిత్రరచనను జూచి ఐరోపాచిత్రకారులు నేర్చుకొనవలసిన విషయము లనేకములు కలవు.

పాశ్చాత్యసనాతనసంప్రదాయములు సరిపడవని గ్రహించి లేవదీసిన నూతనోద్యమము లన్నియు భారతీయచిత్రరచనా సంప్రదాయములవైపు నడచినవి — నడువగలిగినంత వరకు. అనగా ఐరోపాచిత్రకారులు హైందవ చిత్రరచనయొక్క యుత్తమగుణములను స్వీకరింపకపోయినను అప్రయత్నముగ ననుకరించుటకు ప్రయత్నించిరి. ఐరోపాచిత్రరచనకు మన చిత్రరచన ఆదర్శమము కాగలదని దీనివలన స్పష్టపడుచున్నది. మనచిత్రములను జూచి ఐరోపాచిత్రవిమర్శకులు నవ్వినప్పుడు తమచిత్రములందు మార్పులు కలుగునని గ్రహింపజాలరైరి.

భారతజాతీయజీవనమును విస్తరింపజేయుటకు భారతీయచిత్రరచన సరిపడి యున్నదనియు, ఇతరవిధానములు సరిపడవనియు బ్రిటిషు చిత్రకళాసమితివారుకూడ చెప్పియున్నారు.

మనలో కల పాశ్చాత్య చిత్రకళావ్యామోహితు లీ విషయములను మనస్సులో నుంచుకొనవలెను. వారిలో వీరును హైందవ చిత్రరచనయొక్క గొప్పతనమును గ్రహింపగలరు.

# ప్రభు సంభవము

వి. ఆర్. భరద్వాజగారు

(వేల్పుచుక్క)

౧

గాటముగ నల్లికొన్న చీకటి తమాల
వాటి విరిసిన క్రొత్తపూబంతి యనఁగ
జాలుజాలుగ నవవికాసమున వెడలి-
జగతి సజ్ఞానతిమిరమ్ము సమయఁజేయ
నంబరము త్రోవ దిగు పవిత్రాత్మ యనఁగ
సకల దిక్తటులంటఁ దేజమ్ము నించి-
తరళ గగనంపు మించుటద్దమునఁ దోఁచు
ప్రభుకుమారుని ముఖబింబభాగ్య మనఁగ
మధురసూక్ష్మ భావసంపదల నల్లి-
చదలఁ బాడసూపె దివ్య నక్షత్ర మొకఁడు.

ముత్తియము రేయికడుపునఁ బుట్టెనేమొ
పూవు క్రొమ్మించు చివురునఁ బూచెనేమొ
చీఁకటిముఖాన హాసమ్ము చెలఁగెనేమొ
పాలు మిన్నేటి తరఁగలఁ బారెనేమొ
దవ్వులవెలింగెఁ దారాపథమ్ము నాఁడు.

అమర మంత్రోపదేశ వాక్యములనంగ
జలదపథమునఁ గిరణపంక్తులు నటించె
దైవతత్త్వార్థసూత్ర తాత్పర్య మనఁగ
వాయుపథమునఁ దేజసంపద చెలంగె
ప్రభుకుమారుని దివ్యానురాగమనఁగ
నాల్గుదిక్కులఁ జలువసోనలు స్రవించె
దేవదేవుని వేదసందేశ మనఁగ
శాంతిముఖమున మధురనిస్వనము పొదలె
వేల్పు చుక్కవియత్తున వెలుఁగువేళ.

పవనతంత్రులు రాత్రివిపంచి మీటి
తత్త్వగీతార్థములు శకుంతములు పాడె
జగము పులకించి మోదబాష్పములు నించె
నాఁడు వేలుపుచుక్క మింటను వెలుంగ.

నీలిమబ్బులు చలువపందిటఁ బిసాళి
చివురుపచ్చిక నునుబట్టు సెజ్జఁ బండి
మధురసుస్వప్నముల మేను మఱచి హాయి
నిదురవోయెడు ప్రాచ్యపండితుల కనుల
కలువలకు నాఁడు పండువెన్నెల రచించె
సుధల వెదచల్లు వేలుపు చుక్క వెలుఁగు.

సత్యదివ్యప్రభావవర్ణనలతోడి
ప్రభుకుమారుని నూత్నకావ్యము లనంగ
విరిసెఁ బ్రాక్పండితుల జ్ఞానవీక్షణములు-
వెడలె దృగ్జాలగీతికా వితతి-బాష్ప
రసము చిప్పిలె-పులకాంకుర ప్రశస్తి
భావపంక్తులు తలసూపె-ప్రకృతి లలిత
కళలు వికసించె-దివ్యనక్షత్ర కాంతి.

ఆ వినిర్మల తరళ నీలాంబరంపు
వీణ చేకొని వెలుఁగు తీవియలు కూర్చి
ప్రీతి నెలుగెత్తి యాశర్వరీలతాంగి
పాడె నాహ్వానగీతప్రబంధములను
ప్రభుకుమారునిఁగూర్చి యా ప్రాచ్యసీమ.

నిద్ర మేల్కొన్న మేటి పండితుల తోడ
దీక్షితుల నప్పు డౌకవింత తెలివి గదిరె-
దివ్యకాంతిని వెలుఁగొందు దేసలతోడ
పండితులమోము లతులభాస్వరము లయ్యె—

ఎనసి యొండొరు గుర్తించు హితులవోలె
ప్రేమసూత్రార్థములు బయల్వడలె నాఁడు.

దివి నటించెడు ముంజేతిదీప మనఁగ,
నెలమిఁ జేయూఁత నడిపించు హితుఁ డనంగఁ,
దశ్వ మెఱిఁగించు ఋజుమార్గదర్శి యనఁగ,
వెలుఁగుఁ జూపుచు, నిజకరవితతిఁ జాఁచి
వెడలెఁ బ్రాక్పండితులముందు వేల్పుచుక్క.

పల్లవమ్మునఁ జేవ చొప్పడియె నంట;
కోరకమ్మునఁ దేనియ లురిసె నంట;
పిందె మధుఫలరసము చిప్పిలియె నంట;
కన్నెకడుపున మగవాఁడు గలిగె నంట;
ప్రజలనోములు ముంగిళ్లఁ బండె నంట!

## పుణ్యదంపతులు

ప్రాపెఱుంగని తరుణశంపాలతాంగి,
మధుప మంటని వికచపద్మాయతాక్షి,
జలదసంపర్క మెఱుఁగని చంద్రవదన,
ప్రీతి వర్ధిల్లు నాఁటి మేరీకుమారి.

దివ్యపథముల సతము గుర్తించువాఁడు,
విమలజీవనశోభ చే వెలయువాఁడు,
లలితరసపూర్ణహృదయుఁడై చెలఁగువాఁడు,
శీలమున నొప్పు నాఁటి యోసెపు ఘనుండు.

వాని ప్రేమమ్ము చూతప్రసూన మట్లు
రాగసంపదఁ జిలికి, సౌరభమె లొలికి,
తేనియలఁ జింది, ఫలరసార్ద్రీకొలిపి,
విరిసె నానాఁడు యౌవనవీథిలోన—

ఆమె పికి యయ్యె, మలయమందానిల మయ్యె,
గానబుతుమ్మెదయయ్యె, చిల్కకొదమయయ్యె
మధురకంఠస్వరమ్మున, మందగతుల,
మధురసాస్వాదనాసక్తి, మాటరక్తి,

* * *

పరఁగు నూత్నపురాణదంపతు లనంగ
మెలఁగి రానాఁడు యోసేపు మేరు లనఁగ.

మగువ నెమ్మేన విమలాత్మ నెగడె ననఁగ
బిద్దపుంజెక్కుఁదోయిఁ బాండిమము పొదలె—
చెలియగర్భానఁ బూతాత్మ చెలఁగె ననఁగ
పిడికిటను బోవు నడు మంత విస్తరించె—
నెలఁతలోనఁ బవిత్రాత్మ నిండె ననఁగ
నడువ నడుగులఁ దడఁబాటువొడమఁ జొచ్చె—
పడఁతి డెందాన దివ్యాత్మ వరలె ననఁగ
తడవతడవకు నిట్టూర్పు గడలుకొనియె,
మేరికడుపునఁ బడి యేసు మెలఁగు నాఁడు.

పలుకెఱుంగని యంబారవములె గాని
కపటగంభీరదంభవాక్యములు లేవు.

చెలఁగు కమ్మని నిట్టూర్పులలలు గాని
సంకుచితభావయుతరహస్యములు లేవు.

తృణముఁ గైకొని సంతుష్టిఁ గనుట గాని
యైహికాపారతుచ్ఛభాగ్యాశ లేదు.

ప్రకటితమ్మైన సాధువర్తనమె కాని
కలుషభూయిష్ఠదుష్టవక్రగతి లేదు.

తొడరి యోసేపుమేరులు విడిది గొన్న
యా "బెతలహేము"లోఁ గల యాలశాల.

కడపెసల వేఁడి యూర్పులు గడలుకొనియె;
వలుఁద పొదువులకడఁ బాలవాన గురిసె;
నాలనాల్కల వాత్సల్య మంకురించె;
లేఁగచూపులఁ బ్రేమవల్లికలు సాగెఁ;

ప్రాచ్యపండితహృదయపుష్పములు విరిసె
పుడమి తొలిఁ జేసికొన్న నోములు ఫలించె
నేఁమి నారేయి కా బెత్లెహేములోనఁ
బసులశాలను బుణ్యదంపతులు విడియ.

## దివ్యోదయము

కమ్మతావులఁ బూలు ధూపమ్ము లిడఁగ
వేలుపులచుక్క వెలుఁగు నివాళిఁ బట్ట,
లలి భరద్వాజఖగము మంగళముఁ బాడ
నానిశాశాతికాంత నృత్యము పొనర్పఁ,
బొడమెఁ బసులశాలఁ బచ్చికపొత్తులందు
యేసునాథుండు 'కన్యమేరీ' సుతుండు.

పాపము శమించు గాఢానుతాప మనఁగ
నవ్యగతిఁ గారుమని రోదనమ్ము సేసి,
సృష్టి సంశయపాశవిచ్ఛేద మనఁగఁ
దొడరి మెల్లనఁ గాలుసేతులు విదల్చి,
స్వర్గసోపానమార్గదర్శన మనంగ
మంజులవిశాలనేత్రయుగ్మమ్ము విప్పి,
తెరలు దివ్యానురాగచంద్రిక లనంగఁ
జారుతరమైన మందహాసమ్ము సేసి,
తొలుతఁ బొడసూపె నాపూరితొట్టెలోన
"యేసు"నాథుండు "కన్యమేరీ" సుతుండు.

"యేసు"నకుఁ బండితులు కానుక లిడినయంతఁ,
గడవఁ దేనియ వెరఁగంది కరడుగట్టె;
గంపలను ద్రాక్షఫలములు కరఁగిపోయె;
వేది నగరువు పొడిసీఱు విడిచి చనియె:
క్రీస్తుఁ గని స్థాణువును బులకించుఁ గాదె!
"యేసు"ఁ గన్గొని మూఁగవోయినవిధాన
పండితులు కేలు మోడ్చి ప్రాస్పడిరినాఁడు.

ప్రభుని పథములు రచియింపఁ బదము లేవి?
ప్రభునిరాగమ్ముఁ గీర్తింప రాగ మేది?
ప్రభునివర్ణమ్ముఁ జిత్రింప వర్ణ మేది?

---

# * విలాసయాత్రలు

శ్రీమతి యస్. సావిత్రమ్మగారు

విలాసయాత్రలు వివిధ దేశములు తిరిగి చూచి, అందలి విశేషములను తెలిసికొని, సంతోషించుటకై ఏర్పడినవి. విలాసయాత్ర యనుమాట ఇతరభాషనుండి నూతనముగ మనభాషలోనికి వచ్చినది. ఎక్స్కర్షను నను వాంగ్ల భాషాశబ్దముయొక్క యాంధ్రీకరణమే ఈవిలాస ప్రయాణ మనునది.

పదమును బట్టి చూడగా విలాసయాత్ర యనునది యేదో క్రొత్తగ నేడే ఆకసమునుండి భారతభూమికి దిగివచ్చినట్లు అనుకొందురు. కాని యది అనాదిసిద్ధమైనది. మనపూర్వులు వేదయుగమునుండి ఇట్టి ప్రయాణములొనర్చిరనుటకు ఎన్నియో యాధారములు గలవు. అట్లు లేనియెడ మన భారతభూమి యింత నాగరకత కెట్లు వచ్చును? మనవారు అనేక దేశములు తిరిగి, యెంతయో లౌకికజ్ఞానమును సంపాదించిరియు, ఎక్కువవిద్యను గడించిరియు, మనభారతభూమిని యింతయుచ్చస్థితికి తెచ్చియున్నారు. మన యనాదిజనులు ఒక యడవినుండి మఱియొక యడవికిని, ఒకకొండనుండి మఱియొకకొండకును, ప్రయాణములు సలిపినవారేగదా! మన ఆర్యులు ఏదోయొక నెపమున సింధునదీ ప్రాంతములనుండి దక్షిణభాగమునకును, దక్షిణప్రాంతములవారు ఉత్తరప్రాంతములకును, ప్రయాణములు చేసినవారే. శివుడు కైలాసగిరిని వాసభూమిగ జేసికొని యుండి, అపుడపుడు తన యర్ధాంగియగు పార్వతితో విమానమెక్కి, లోకసంచారము చేసెనని తెల్పుట కెన్నియో కథలు గలవు. ఇన్నిటిని బట్టిచూడ, ఈవిలాస ప్రయాణములు అనాదిసిద్ధములైనవని తేలుచున్నది.

మన తొల్లింటి యార్యఋషులు, ఎత్తయినప్రదేశములందు, ఉన్నతమై విశాలమైన స్థలములలో ఆశ్రమములను నిర్మించుకొని, తమ్ము ఆశ్రయించివచ్చిన శిష్యమండలికి జ్ఞానబోధచేయుచు, తాము పొందిన లౌకికజ్ఞానము భారతదేశమున వెదజల్లుచుండిరి. అప్పటి గృహస్థులు ఆమహామునులయొద్దకు వెళ్లి వారి బోధనలు వినుచు వారి ఆశీర్వచనములు బడయుచు, తమజన్మము సార్థకమైనట్లు భావించుచు తిరిగివచ్చుచుండిరి. పూర్వము బ్రహ్మచారులు ఇరువదియైదేండ్ల వఱకు, నట్టి మహర్షులదగ్గరనే విద్య నభ్యసించుచుండిరి. వారియొద్ద సకల విద్యలనుగడించి వచ్చినతర్వాతనే, బ్రహ్మచారులకు వివాహములు జరుగుచువచ్చినవి. అట్లు వివాహము జరిగిన తర్వాత కాశీయాత్రవెళ్లి వచ్చుట వారికి ముఖ్యాధికారముండెను. అనగా పెండ్లికొడుకు లౌకికజ్ఞానమంతగాలేని తనభార్యను వెంటబెట్టుకొని, కాశీవఱకుగల ఋష్యాశ్రమములను దర్శించి, అందందు ఋషిపత్నులకును, ఋషులకును ఆశీర్వాదములు పొంది వచ్చుచుండెను. ఇట్లు గృహస్థులు, నూతనదంపతులు, నార్యఋషులు నివసించుచుండిన పుణ్యాశ్రమములయందు యాత్రలుచేసివచ్చుచుండినందున, అట్టి యాత్రలు పుణ్యక్షేత్రయాత్రలని వెనుక వాడుకలో నుండెను. అవియే ఇప్పటివిలాస యాత్రలు.

ఇప్పుడు మనతొల్లింటి యార్యఋషులు లేరు; కాని పావనతనొందిన వారుతిరుగాడిన ప్రదేశములును, వారు స్నానములుచేసిన కొలనులును, నదులును, ఇప్పటికిని గలవు కాన, మనవారు ఇప్పుడును ఆయాస్థలములకు

* శ్రీ రాజకీయోన్నతబోధనాభ్యాసనమహిళాపాఠశాల (అనంతపురము) లో, వాఙ్మయసంఘపక్షమున జనవరి మాసమున జరిగిన వ్యాసలేఖన పరీక్షయందు, రెండు గంటలలో వ్రాసిన ద్వితీయవర్గపు ౩౬ గురు అభ్యర్థినుల వ్యాసములలో ప్రథమస్థానము వహించినట్లు పరీక్షకులచే నిర్ణయింపబడి, తత్సంఘ ద్వితీయవార్షికోత్సవ సమయమున (౧-౨-౩౦)న బారితోషికము బొందిన యభ్యర్థిని వ్యాసము.

వెళ్లి, ఆయాకొలనులలో స్నానము చేసి, మేము పవిత్రుల మైతిమనుచు తిరిగివచ్చుచున్నారు. ఆ యార్యఋషులు తిరుగాడిన స్థలములు మన (దత్త) మండలమున అనేకములు గలవు. పెద్దకొట్లయొద్ద కణ్వమహర్షి కోనయు, పెనుగొండ తాలూకాలో వేంకటగిరి పాళెముదగ్గర కోనయు, ధర్మవరముదగ్గర కాటమయ్యకొండయు, సింగనమలయను నామాంతరముగల ఋశ్యశృంగుని కొండయు, ఆర్యఋషులు సంచరించిన స్థలములే; కాన ఇప్పటికిని యుత్తమ ఆయా స్థలములందు నేటేట ఉత్సవములు జరుగుచున్నవి. జనులు కూడ వేలకొలదిగా యాత్రలు వెడలుచున్నారు. ఇట్టి యాత్రలే పుణ్యక్షేత్రయాత్రలనబడు చున్నవి.

పుణ్యక్షేత్రయాత్రలనగా కంచి, కాళహస్తి, గయ, కాశీ మున్నగు ప్రదేశములకు వెడలుటయనియు, తీర్థయాత్రలనగా పినాకినీ, కృష్ణా, తుంగభద్రా గంగా ప్రయాగ మున్నగునదులలో స్నానముచేయుటయనియు, మనపెద్దలలో పెక్కండ్రకు అభిప్రాయము కాని, ఇవి యేకాక మన పూర్వపురాజులు పాలించిన రాజ్యములు, వీరులు, కవులు, భక్తులు, నివసించినస్థలములును, భూగోళశాస్త్రములో ప్రసిద్ధికెక్కినస్థలములు కూడ ఇట్టి యాత్రలలో చేర్చుట అవసరము. ఈ యాత్రలుసల్పవలసిన వారు ఎక్కువసంసారసుఖమనుభవించి, ముక్తికి సిద్ధముగ నుండువారని మనవారి యభిప్రాయము; కాని కేవలము ముక్తికేకాక యిట్టి యాత్రలుచేయుట లౌకికజ్ఞానము కొఱకు నని భావించుపక్షమున, పిల్లలు, పెద్దలు, యువతులు, యువకులు సర్వులు, ఇట్టి ప్రయాణములు చేయవలసియున్నది. ముఖ్యముగ విద్యార్థులు ఎక్కువగ ఈ ప్రయాణములు సల్పుట మంచిది. ఎందుకన వారెంతో లౌకికజ్ఞానము పొందవలసియుండును; కాన వారు ఈ ప్రయాణములు చేయుట మిక్కిలి అవసరము.

విద్యార్థులలో ఎందరో యేమియు తెలియక తమ పుస్తకములు, తమ బడిపంతులు, తమఇల్లు తమతల్లిదండ్రులు తప్ప, బయటిప్రపంచ మెట్టిదియో యెఱుగక కూపస్థమండూకములవలె లోపలనే యున్నవారి నెందఱనో చూచుచున్నాముగదా! వారు పుస్తకజ్ఞానమే చాలుననియుందురు. అంతమాత్రమున తృప్తిపొంది యుండరాదు; పుస్తకజ్ఞానము వేఱు; లౌకికజ్ఞానము వేఱు; ఒకపుస్తకములో విరూపాక్షదేవాలయము చాలపెద్దదనియు దానికొక ఎత్తయిన గోపురమున్నదనియు, దానికి తూర్పున మాల్యవంతమను పర్వతము కలదనియు అది ఎక్కిచూచిన చుట్టునుండుశిథిలములును, రాచనగళ్లు, చెఱకుతోటలు, పొలములు మొదలగు ప్రదేశములు మిగుల మనోజ్ఞముగ గనబడుననియు చదివినంతమాత్రమున ఏమిలాభము? ఆప్రదేశములకువెళ్లి, ఆ కొండఎక్కి చూచినప్పుడే పుస్తకములో చదివినదానికంటె ఎక్కువగ మనసునకు పట్టును; కనుక విద్యార్థులట్టిప్రదేశముల నధికముగ చూచుట చాలమంచిది. ఏలన పుస్తకమువలన తెలుసుకొనుజ్ఞానమునకంటె, అనుభవజ్ఞానమే యుత్కృష్టమైనది,

విలాసప్రయాణములవలని ప్రయోజనములు చాల గలవు. ప్రయాణముకాకమునుపే తాముపోవుస్థలములలో ఏమేమిచూచెదమో అను నుల్లాసము బాలబాలికలయందధికమగును. వెళ్లుదినమున తమకుతామే ఉత్సాహముతో తమపరుపులు కట్టుకొని, పెట్టెలు సరిదిద్దుకొని, తిండిపదార్థములు తీసిపెట్టుకొని, ఎవరికివారు ముందుగనే బయలుదేరుదురు. బండిలో కూర్చున్న తర్వాత కిటికీలగుండ బయలుచూచుచు చుట్టుప్రక్కల గిఱ్ఱున తిరుగుచుండు చెట్లను, పొలములను, గుట్టలను, కనుగొనుచు, ఒకరిపైనొకరు చేతులువైచుకొని ఆనందపడుచు ఉందురు. అప్పుడు అందరు ఒక్కకుటుంబములోనివారివలెను, ఒక్క తల్లిబిడ్డలవలెను, జాతిభేదము మఱచియుందురు. ఇంక బండిదిగిన తర్వాత ఈ వస్తువులునావి, యివి ఇతరులవి యను భేదభావము లేకుండ, వానిని దించుకొనుటలో నొకరికొకరు తోడ్పై, యైకమత్యమున మెలగుదురు. బసచేసినచోట, పప్పులేకయో ఉప్పులేకయో కట్టెలుదొఱకకయో చిక్కులు కలుగగా, తాముకూడ ఇట్టి ఇబ్బందులు పడవలసియుండుననని తలంచి, కష్టసుఖములను ఓర్పుతో సహింపవలెనను జ్ఞానమువారికి కలుగును. హంపి పెనుగొండ యిట్టిస్థలములు

చూచినపుడు, వీనిని పాలించిన రాజులు తమజాతికి చెందినవారు, వారిజనసంతతివారము తాము, అను జాతీయతాభావము హెచ్చును. ఇంకను దేవుని యద్భుత శక్తియు జ్ఞాపకమునకు వచ్చును. కాన ఈ యాత్రలవలన అత్యధికమైన మేళ్లు కలుగగలవు.

మేము మాచిన్నియనుభవములో కొన్ని యాత్రలు చేసియున్నాము. ఒకటి హంపీయాత్ర, రెండవది పెనుగొండయాత్ర, మూడవది మైసూరియాత్ర. అందులో మొదటియాత్రలో చాలకష్టములు పడితిమి. రెండవయాత్రలో కష్టసుఖములు సమానముగ నుండెను. మైసూరియాత్ర చాల సుఖప్రదముగ జరిగినది.

కనుక ఇట్టివిలాసయాత్రలవలన కష్టానుభవమును సుఖానుభవమును మనస్సునకు వచ్చుటయేకాక, మంచి జ్ఞానమును వృద్ధియగును.

---

## తొలకరి

పిన్నరాజు లక్ష్మీపతి గారు

నల్లనివాడు మూపునయి నాగలి మోకులు దాల్చువాడు, దా
పల్లెలలో పొలమ్ముల నివాసము నిత్యముచేయువాడు, యీ
నల్లనిమన్ను దున్నుచు జనంబుల నెల్లర బ్రోచు యోగిరా
ట్టల్లజు డాకృషీవలుడు తావెలయుగా గలకాల మిద్ధరన్.

అల్లన భావరాట్నము నొయ్యారముగా వెసత్రిప్పిత్రిప్పి, యీ
తెల్లని మేఘపుం గొనల దీయుదు దారము లీ నవీన రా
గోల్లసనంబుతోడుగ, నయోక్తులు వస్త్రము లల్లియల్లి, నా
యుల్లము కొల్లలాడు హాలికోత్తమముఖ్యుని సత్కరించెదన్.

మెరసిపోవుచునుండె మిరిమిట్లుకొల్పుచు నీలజీమూతముల్ చీలిపోవ
యురిమిపైబడుచుండె నుర్వీతలంబెల్ల కదలొంది యదరున బెదరిపోవ
పెఠిలిపేలుచునుండె పిడుగులురాలగా పర్వతాగ్రంబులే పగిలిపోవ
నూదివేయుచునుండె నొకగడ్డిపోచగా నేమూలకో లోక మెగిరిపోవ
యేదియీశక్తి! యీమహోన్మాదలీల-కర్థమెయ్యది! యేదిలక్ష్యంబు! చెపుమ!
కృతయుగమునాటిపురుషుడ పీవుతండ్రి!-లోకము పునాదులే కద లొందుచుండె!

ఆటవిడుపొసగబడిన విద్యార్థిగణము-లటుల విడివడి చెలరేగి యాడుచున్న
వవిగో! యాకాశవీథియం దంబుదములు-లాస్యకేళీకళామహోల్లాస మొలయ.

ఇదిమహావిప్లవంబు మహేంద్రజాల-మిది జగన్నాటకంబునకెల్ల నాంది
పులకరించెనువిశ్వ మపూర్వఘణితి-తొలకరించెనుకనుము రోదోంతరంబు.

అదె కను మేకమేఘముగ నాకసమందలి యర్ధభాగముం
బొదివెవినీలమై, చదలవొల్చెనుభానుని మ్రింగివైచె, న
య్యదె! పెనుగాలితో గగనమంతయు మేఘము లాక్రమించె, నీ
యది ఋతువిప్లవంబు కనుమా జగమంతయు మారిపోయెడిన్.

గగనముననిండియున్న గంగాభవాని-ధరణిలోడాగియున్న చైతన్యలక్ష్మి [బు.
యొండొరులగవియు సీసుముహూర్తమందు, నిను గటాక్షింతు రియ్యది నిక్కువం

ఆహుతియయ్యె బూర్వకళలన్నియు బశ్చిమవాయువహ్ని వీ
చీహతిసోలుచు న్నిరవశేషముగా; నదె నీలనీరద
వ్యూహముతోడ నంబర మహో,రణరంగములీలమారె, నీ
యాహవమెల్ల నీకొరకెయంచు ధ్వనించెడు మేఘఘోషముల్.

* * * *

పలుకుచున్నది యాకాశవాణి యదిగో! యాలకింపుము నీవారహస్యములను,
గ్రాహ్యమగునీకు నీస్వధర్మంబు దాన-చల్లుమాపైన నమృతబీజములు భూమి!

# కల్యాణకలుబరిగెలు—కృష్ణరాయలు

డాక్టరు యన్. వెంకటరమణయ్యగారు, యం. ఏ.,

౧

శ్రీకృష్ణ దేవరాయలు తురుష్కుల రాజ్యముపై దాడివెడలి కల్యాణ, కలుబరిగెలను సాధించెనని పెక్కుగ్రంథములయందు వ్రాయబడి యున్నది.

'కలబరిగనగర
నగరపుర వరపరిబృఢజనన యువన
పృతన భవదసి నని దెగ'

అని రాయలు రచించిన యాముక్తమాల్యద యందును,

'ప్రళయఘనాఘన ఘోష జయానక
భాంకృతిభీమ పేటలుతత్
కలుబరిగీకటక క్షితి రక్షక'

అని పెద్దన్నగారి మనుచరిత్రయందును వ్రాయబడియున్నది. స్వయము దిగ్విజేత యగురాయలవారును; ఆయనకు సమకాలికుడును, అష్టదిగ్గజములలో ప్రధాన దిగ్గజమును, రాజువెంట దరచుగ యుద్ధయాత్రలు సల్పువాడును అగు పెద్దన్నగారును కల్బరిగె విజయమును సూక్ష్మముగవర్ణించినారు. కొంచెమించుమించు సమకాలికు డనదగు పోర్చుగీసు వర్తకు డగు న్యూనిజుగూడ ఇట్లే వ్రాసి యున్నాడు.

'(రాయలు) క్రోధావేశపరవశుడై దక్కనురాజ్యమును ప్రవేశించి కలుబర్గర పురముపైకి దండెత్తి పోయెను.'[1]

తరువాతి చరిత్రకారులును ఈ విషయమును వచించియున్నారు.

"కల్బరిగెకోటమీద లగ్గలకునెక్కి
కార్యమొనరించి జయలక్ష్మి గాంచి యనట"

అని కృష్ణరాయ విజయమందును,

"కల్యాణి కలుబరిగెకోటలవారు గర్విష్ఠులై కోటమీదనుండి మాతలింగా ఆవార్తలు రాయలు విని యెదిరితెగవారిని అడుగగా మ్లేచ్ఛులతెగవారు వున్నారు. గనుక కోటమీద అంద్దుల మగుడించనుని కలబరిగకోటకు లగ్గబెట్టించి మూడుమూర్కాలు ఘడియలో కోట సాధించి"

అని రాయవాచకమునందును,

"ఇంతెందు నియామిసి యుచితమాదుదుగొరెయ నిత్తు నాంబపడెనితరొళ్ళిం ముంతైది కల్యాణకలుబరగి కోంటెగళం కొంబుదెందొరెదు కొడె కెలవళ్యగ జపదాతిగళం కొడిసి వీళ్కొండలొడనె"[2]

అని కెళదినృపవిజయమందును,

"కలుబరిగెవద్ద విజయ స్తంభం వేయించి,[3]"

అని 'విజయనగరదసామ్రాజ్యము'లోను,

"కొన్నిదినములకు కల్యాణం, కలబరిగి మీద యుద్ధసన్నద్ధులై సమస్తమైన జహాగీర్దార్లను పిలిపించగా కడనకొలను గ్రామంలో వున్న మునలి చన్నమనాయుడు

1. Sewell: The Forgotten Empire, P, 357.

2. కెళదినృప విజయం, ఆ. ౧౫, పుట 30.

3. భారతి, అక్టోబరు ౧౯౨౯, పుట ౬౯౨.

తన జమీయ్యతుతో విజయనగరానకు కృష్ణరాయలవారి సముఖానకు పోయిన తదనంతరం రాయలువారు సైన్యముతో కూడ ప్రయాణమై కలుబరిగెమీదికి వెళ్లగా"[1] అని నడిమిదొడ్డిపాళెయగాంఢ్ర కయిఫీతులోను వ్రాయబడియున్నది.

పై గ్రంథములలోని వ్రాతలను బట్టి చూడగా కలుబరిగ దండయాత్ర యందు ఒక్క-కలుబరిగెకోటనుమాత్రమేగాక కల్యాణి, సాగర్ అను మరిరెండు దుర్గములను గూడ సాధించిరని తెలియవచ్చుచున్నది. ఈదుర్గములన్నియు ఇప్పటి నైజాము రాష్ట్రమున నిమిడియున్నవి. కలుబరిగె ప్రస్తుతము గుల్బర్గాయను పేరుతో నైజాము రాజ్యములోని యొకమండలమునకు ముఖ్యపట్టణము. అది బిజాపురమున కాగ్నేయముననున్నది. సాగరు గుల్బర్గా జిల్లాలోని యొక ముఖ్యదుర్గము. కల్యాణీదుర్గము గుల్బర్గకు ఆగ్నేయమున నున్నది. ఇది పూర్వము దక్కనును నేలిన పశ్చిమచాళుక్యరాజులకు రాజధానియై యుండెను. కావున రాయ లీ దండయాత్రలో ప్రస్తుతపు గుల్బర్గామండలములోని దుర్గముల నన్నింటెనిసాధించి మండలము నంతటి నాక్రమించుకొన్నట్లు తోచుచున్నది. ఈయుద్ధయాత్రకుగారణములేవో, పైస్థలముల యందు రాయలవారితో పోరిన శత్రువు లెవ్వరో కనుగొనవలసియున్నది.

## ౨

### కారణములు

1. రాయచూరు కడ సంపూర్ణపరాభవమును బొందిన ఇస్మాయిల్ అదిల్‌షా కృష్ణరాయలతో సంధిచేసుకొనగోరి యొకదూతను రాయచూరుదుర్గమునం దున్నరాయలకడ కంపెను. అదిల్‌షాకడనుండి రాయ లొడిచికొనిన రాష్ట్రమును, దుర్గములను అతనికి తిరిగి యిచ్చివేయవలయుననియు, సలబత్‌ఖాను మొదలగు సర్దారులను చెరనుండి వదలిపెట్టవలయుననియు రాయబారి కోరెను. అదిల్‌షాహ వచ్చి తనకు పాదాక్రాంతు డైనచో అతడు కోరినమేరకు అతనికడనుండి గెల్చుకొన్న సర్వపదార్థములను యిచ్చెదనని కృష్ణరాయలు జవాబు చెప్పెను. ఈవిషయమును దూత అదిల్‌షాకెరుకపరచెను. సరిహద్దుకడ రాయల దర్శనమును అదిల్‌షా సేయునట్లు యేర్పాట్లు జరిగెను; కాని, కృష్ణరాయలు నిర్ణీతస్థానమునకు నియమితకాలమున బోయినను అదిల్‌షా రాడాయెను. అచట సుల్తానుం గానక సేనతో గూడ సుల్తాను రాజధానియగు బిజాపురమునకు బోయి యచట కొంతకాల ముండెను. అదిల్‌షా యెచ్చటనో డాగియుండెను. తరువాత జలాభావముచేత బిజాపురమునుంచి తరలి ముదుకల్లుకు వచ్చి చేరెను. అప్పుడు అదిల్‌షా స్వరాజధానికి మరలవచ్చి రాయలతో సంధి గావించుకొనుటకై అసాదుఖాను ని దౌత్యమును నల్ప నియమించెను. విజయనగరమున చెరయందు సలబత్‌ఖాను డను బీజపుర సుల్తాను మంత్రి యొక డుండెను. సలబత్‌ఖానునిపై అసాదుఖానునికి ప్రబలమగు ద్వేష ముండుటచేత, అతని తుదముట్టింప నదియ యదనని తలచి,

1. Ibid, 689.

ముదుగల్లు చేరినతోడనే రాయలతో నతనిపై కొండెములు చెప్పసాగెను. వాస్తవముగ రాయలను సందర్శించుట యదిల్‌షా కిష్టమనియు, అతడు సరిహద్దుకడ వచ్చి రాయలను జూడ నువ్విళ్లూరుచున్నాడనియు, ఇంతకు పూర్వ మట్లు సేయకపోవుటకు, సలబత్ఖానుని దుస్సలహాలే కారణములనియు చెప్పి, రాయలకు సలబత్ఖానునిపై ద్వేషము గలిగించి యాతని జంపించెను. అటుపిమ్మట నచ్చట నుండుట క్షేమకరము గాదని తలచి యొక నాటి యర్ధరాత్రికాలమున దొంగతనముగా వెడలిపోయెను. పిమ్మట,

"కృష్ణరాయలు దన రాజ్యపు టుత్తరపుటెల్లకు బోయి, యచ్చట అసాద్ఖాను జెప్పిన తెఱంగున, అదిల్‌షాను గాని యాతని జననింగాని గానక, సర్వమును అసాద్ఖానుడు సలబత్ఖానుని జంపింప నెత్తిన యెత్తుగడ యని గ్రహించి క్రోధావేశపరవశుడై దక్కను రాజ్యము బ్రవేశించి, కలుబర్గపురముపై సేనలను నడిపెను."[1]

కలుబరిగపై నెత్తిపోవుటకు అదిల్‌షా మీద కృష్ణరాయలకు గలకోప మొక్కటియే గాదు కారణము. "కల్యాణ, కలుబరిగెకోటల వారు గర్వితులై కోటమీందనుంచి కూతలీంగా, "వారిని శిక్షించుటకు రాయలు దండెత్తినట్లు రాయవాచకమునందు చెప్పబడి యున్నది. కల్బరిగె అదిల్‌షా రాజ్యములోనిదైనను, కల్యాణము నిజాంషావారిదో లేక బరీదుషావారిదో. కావున రాయలు ఆముదానగరము, బీదరురాజ్యములపైగూడ నెత్తిపోయినట్లున్నది. ఈయూహ కనుకూలముగ కల్యాణ, కలుబరిగెలకడ రాయలు జయించిన తురకలు బైరీనిజాము పాదుషాగారి సర్దారు లని 'కెలది నృపవిజయము'నందును,[2] 'నడిమిదొడ్డిపాళెపు పాళెగాండ్ర కయిఫీతు'నందును[3] చెప్పబడియున్నది. అదిల్‌షాదుర్గమగు కల్బరిగెపై దండు వెడలిపోయినకృష్ణరాయలను నిజాంషాసర్దారు లడ్డగించి యుద్ధముసేయుటకు గారణము లేకపోలేదు. ఫెరిష్టాచరిత్రను దిలకించిన నది స్పష్టముకాగలదు.

"మిర్జా జహంగీరు తత్పూర్వము (రాయచూరు) యుద్ధమున మడియుటచేత, సుల్తాను (అదిల్‌షా) తన విపత్తును దొలగించుకొను మార్గము నెరిగింపుమని అసాద్ఖానుని సలహా అడిగెను. అతడు (సుల్తాను) పొందిన నష్టము గొప్పదనియు, సేనలకు ధైర్యము సెడినదనియు, తత్కారణమున బుర్హాన్ నిజామ్‌షాతో సఖ్యము కుదిరి, సహజశత్రువగు అమీర్ బరీదును సరిహద్దునకు దూరస్థునిగ సేయునవరకును, కసితీర్చుకొనుతలంపులనుమఱచి, ప్రస్తుతము బిజాపురమునకు బోవుట శ్రేయస్కర మనియు చెప్పెను. పైయుద్దేశములు నెరవేరిన పిమ్మట నాస్తికులను (Infidels: అనగా హిందువులను) శిక్షింపవచ్చుననియు (మనవిచేసెను). ఈసలహాలను సుల్తాను అంగీకరించి, కృష్ణానదియొడ్డునుండి తరలి బిజాపురము చేరెను, అసాద్ఖానునకు సిపాసలార్ అను బిరుదునొసంగి, అతని జాగీరుతో ననేక నూతనస్థలములను జేర్చి, అటుమీద నతనిని సర్వముఖ్యవిషయములయందును ప్రధానామాత్యునిగ జేసుకొనెను."

"పూర్వము ఇస్మాయిల్ అదిల్‌షా పారశీక రాజుకడకు దూతగ నంపిన సయ్యద్ అహమద్ హిర్వీ

---

1. Sewell—The Forgotten Empire, pp. 349-358.

2. కెళది నృపవిజయము, పుట ౩౦.

3. భారతి, అక్టోబరు ౧౯౨౯. పుట ౬౮౯.

అను వానిని అహమదునగరపు రాజుతో సఖ్యమును గుదుర్చుటకు రాయబారిగా నియమించి అచటికి పంపెను. పురపరిసర ప్రాంతములయందు షాతహిర్ మొదలగు గొప్ప దొరలతని నెదుర్కొని, బుర్హాన్ నిజామ్‌షా సముఖమునకు గొనిపోగా అతడు హిర్ష్వని విశేషముగ సత్కరించెను. అప్పుడు బిజాపుర అహమదానగర సుల్తానులిరువురికిని తత్పూర్వమే ఉత్తర ప్రత్యుత్తరములును, ఉచిత మర్యాదలును నడచియుండుటచేత, షోలాపురమున వారికి భేటీ యగునట్లు నిశ్చయింపబడెను. ఆసమయమున (షోలాపురమున భేటీయైనప్పుడు) బుర్హాన్ నిజామ్‌షా ఇస్మాయల్ అదిల్‌షా తోబుట్టువగు మర్యమ్‌ను తనకిచ్చి వివాహము సేయవలయునని కోరుటచేత గర్భాధానము తగు సన్నాహములతో గావింపబడెను. ఆరాజులు గుఱ్ఱములు, ఏనుగులు మొదలగు విలువగల యుడుగరలనొండొరుల కిచ్చుకొనిరి. ఈ వివాహమహోత్సవము మహావైభవముతో ౯౩౦వ హిజరీ రజాబునెలయందు నడచెను. తరువాత, ఆరాజులొండొరుల వీడ్కొని స్వనగరంబులకు జనిరి"[1]

కృష్ణరాయలు కలుబరిగె మొదలగు దుర్గములపై దాడివెడలుటకు వాస్తవమగు కారణము పైసంధియే యని తోచుచున్నది. ఇంతేకాక, రాయచూరుదుర్గముకడ కృష్ణరాయలు అదిల్‌షాను పరాజితుని జేసి తరిమివేసినపుడు నిజామ్‌షా ప్రభృతులగు తురకరాజులు రాయలను బెదరింపుచు ఉత్తరములను వ్రాసియుండిరి. వాటి సారాంశమిది: అదిల్‌షాను నిర్జించుటతో రాయలు తృప్తి నొందవలయును; ఇంకను అతనితో కయ్యము సేయగూడదు; అదిల్‌షా దగ్గరనుండి కైకొన్న యావత్పదార్థములు, ఉదారస్వభావము గల రాయలు అతనికి తిరిగి యిచ్చివేయవలయును. అట్లొనర్చిన రాయలవారి యాజ్ఞచొప్పున వారు (ఆలేఖలను వ్రాసిన తురుష్కప్రభువులు) ఎల్లప్పుడును ప్రవర్తింప సిద్ధముగనుందురు. వారి వేడికోలును సరకుసేయనిపక్షమున వారందఱును అదిల్‌షాతోగూడి రాయలపై యుద్ధముచేసి యదిల్‌షా పోగొట్టుకొన్న సర్వమును అతనికి గెల్చి యియ్య నిశ్చయించియున్నారు అనియెఱుకపఱచిరి.[2]

ఈ యుత్తరములలోని విషయములను గ్రహించి, పైతురుష్కప్రభువులకు రాయలీ క్రింది ప్రత్యుత్తరమును బంపెను.

"ఇమాద్‌షా, నిజామ్‌షా, బరీద్‌షా, కుతుబ్‌షా, ప్రభృతులగు దక్కను దేశమును పాలించెడి మహాప్రభువులారా, మీరు వ్రాసిన లేఖలను దిలకించితిని. మీరంపిన సందేశమునకు మీ కభివందనములు సల్పుచున్నాడను. అదిల్‌షావిషయమై నేనొర్చిన కార్యము అతనికి తగిన శాస్తియే; అతనియొద్ద నేను గెల్చుకొన్న వన్నియు నతనికి తిరిగి యిచ్చివేయుట నాకంత సమంజసముగ గన్పించలేదు; కావున వానిని నే నివ్వజాలను. ఇక మీరు చెప్పిన తెరగున నడుతమన్న మీరందరు అదిల్‌షాతో నేకీభవించి నాపై కత్తిగట్టువిషయమై, మీరు శ్రమపడి యింతదూరము రావలదని వేడుకొనుచున్నాను; ఏలన, ధైర్యముతో మీరు మీరాజ్యములయందే యుండుపక్షమున, మిమ్మన్వేషించుచు నేనే వచ్చుచున్నాను. ఇది నేను మీ కంపు ప్రత్యుత్తరము."[3]

కావున నిజామాది తురుష్కప్రభువులతో యుద్ధముసేయుటకు గృష్ణరాయలకు

1. Brigg's Ferista Vol. III, pp. 50-52.
2. Sewell: The Forgotten Empire, P. 348.
3. Ibid P. 349.

ప్రబలమైన కారణములు లేకపోలేదు. కృష్ణరాయలపై గసి తీర్చుకొనుటకై అదిల్‌షా, బుర్హాన్ నిజాం షాతో పైసంధి కుదుర్చుకొనెను. కృష్ణరాయలు బిజాపుర రాజ్యముపై నెత్తివచ్చుచున్నాడని విన్నతోడనే నిజామ్‌షా స్వసైన్యములతో బైలుదేరి బిజాపూర్, బీదరు రాజ్యముల సరిహద్దునకు ఆగ్నేయముగ నడచి కల్యాణి, కలుబరిగె, సాగర్ మొదలగు కోటల నాక్రమించుకొని రాయసైన్యముల రాకను నిరీక్షించుచుండవలయును.

## 3

### కాలము

ఇక ఈయుద్ధయాత్ర యెప్పుడు నడిచెనో కనుగొనవలసియున్నది. కీర్తిశేషులైన శ్రీ కొమఱ్ఱాజు వి. లక్ష్మణరావుగారు "రాయలు గుల్బర్గాను సాధించినయేడు క్రీ. శ. ౧౫౧౪ అగును"[1]అనిరి. ఇట్లు చెప్పుటకుఁ గారణము రాయవాచకములోని,"కృష్ణరాయలవారుఉత్తరాదితురకల కార్యం జయంచేసికొని శీమకై తిరిగి తిరుపతికి రాంగా కల్యాణ కలుబరిగెలవారు గర్వితులై కోటమీదనుండి కూంతలీగా ఆ వార్తలు రాయలవారు విని .....కోటమీదికై అంద్దుల మగుడించమని కలుబరిగెకోట లగ్గబెట్టించి మూడుముక్కాలుఘడియలలో కోట సాధించి"[2] యన్న వాక్యము. కృష్ణరాయలు "ఉత్తరాదితురకలను" క్రీ. శ. ౧౫౧౨లో నొక పర్యాయము గృష్ణయొడ్డున నోడించెను. "రాయలు తిరుపతికి వెళ్లినయేడు శా. శ. ౧౪౩౯ అనగా క్రీ. శ. ౧౫౧౭ అగును." కావున "గుల్బర్గానుసాధించినయేఁడు ౧౫౧౪అగును" శ్రీ లక్ష్మణరావుగారి వ్రాత కనుగుణముగ, 'విజయనగరద సామ్రాజ్యవు' అను గ్రంథములోని "ప్రజోత్పత్తిసంవత్సరం తయిమాసం తే౧౨ది కుతప్పశాహ నిజాంశాహమీదికి కూచిచేశి వెలిగుడారం వేశి తర్లిపోయిరి. మూడు యేండ్లు దండుచేసి మూడు సంస్తానాల మీఁద కార్యంచేసి కలుబరిగెవద్ద విజయ స్తంభం వేయించి" అనువాక్యము లున్నందున, క్రీ. శ. ౧౫౧౩ కు "పూర్వమే కలుబరిగెను రాయలు స్వాధీనముచేసుకొనియుండవలెను." అని శుక్లసం. ఆశ్వీయుజ భారతిలో వ్రాసియుంటిని. ఈవిషయమునుగూర్చి మరల చింతించగా పైకాలనిర్ణయము సరికాదని తోఁచుచున్నది.

౧౫౧౨లో రాయలు గృష్ణను దాటలేదనుటకు గొంత యాధారమున్నది. తురకలను నిర్జించిన పిమ్మట,

" జనవరు డప్పాజి గనుం
గొని యిట్లని పలికె నపుడు కుతుకం బలరన్.
విరిగిన వైరులం దరిమి
వేగమె వారల సీమలెల్ల సు
స్థిరమతి నాక్రమింపవల
దే యను డాకొలమంత్రి పల్కె భూ
వర, యిది వేళ గాదు పోరవం
జోరనిచ్చి కలంకులందు స

1. లక్ష్మణరాయవ్యాసావళి. పుట ౪౩.
2. The Sources of Vijayanagar Hisrory, ·P.712

త్వరులగు శాత్రవుల్ గడియ
వైపు దొరంగదె యెంత వారికిన్.

భూమిపాలక గజపతిసీమలోన
గలుగువారలు మించు మార్గములయందు
నెందు ముట్టడి గావించనెంచ మనకు
రస్తు సామగ్రి సేరుట దుస్తరంబు.

తూరుపునం గలగజపతి
వారి దళము నెల్ల దచ్చి కరుసన్ జయల
క్ష్మీరమణి జెందు మనవుడు
భేరీ భాంకార మడర పృతనాయతుడై.

తన ప్రతాపప్రకాశంబు దనర బంధు
జనమనఃపద్మ నికరరంజన మెలర్ప
నహితకువలయ పరగర్వ మణగ నుదయ
గిరికి వేవేగ నయ్యీతం డరుగుదెంచె.[1]

రాయవాచకము నందును ఇట్లే చెప్పబడి యున్నది.

"అప్పాజి, అయ్యమరసు, కొండమరసు, బాచరసుగార్లున్ను అనేక స్తుత్యములుగా విన్నపంజేసి కృష్ణవేణి యీ పఱయాన నిండేరు వచ్చినందువల్ల మ్లేచ్ఛులకు అపజయమై తమ తమ స్థలాలకు పోయినట్లాయను. యేరు నీళ్లు విడిసి కాలినడ అయినతోడుతోనే ముందర కార్యముఖానకు నడువవలెను. ఈఆషాఢశ్రావణాలు రెండు నెలలున్ను యేటికి దక్షిణముగానున్న తురకల దుర్గాలున్ను కోటస్థలాలున్ను గజపతిదుర్గములున్ను స్థలములున్ను చేకూర్చుక ఆతర్వాత అహముదానగరం పర్యంతమున్ను పోయిరావలెను. అని విన్నపంచేసినందులకు కృష్ణరాయలవారు మీరు చెప్పినది కార్యసరవి అవును. మునుకలుగా యేరుదాంటి మ్లేచ్ఛులరాజ్యానకు కవలిపొయ్యినట్టాయనా గజపతివారి శీమలోనున్ను ఉదయగిరి, కందుకూరు, కొండవీడు, బెల్లంకొండ, నాగార్జునకొండ, వినుకొండ మొదలైన దుర్గాలలో వుండువారు మనదండుకు రస్తు సామగ్రీలు రానీకుండా అరికట్టుదురు. ఆరీతి గాకుండా, మునుకలుగా ఆయాస్థలాలు సాధించి ఆయాదుర్గాలను మనతెగ తాంణ్యా వుంస్తే రస్తుసామగ్రీలు నడుచును. అని ఆనతిచ్చినారు...... రాయలవారు బయలుమెరసి గుఱ్ఱం యెక్కి సకలసన్నాహములతోడట్టు సకలదళసమేతుడై గుత్తి గండికోట మార్గముగా ఉదయగిరికి వచ్చి (చేరిరి.)"[2]

ఇందువల్ల ౧౫౧౨ లో రాయలు తురకలను జయించినపుడు వారిని తరుముకొని కృష్ణను దాటిపోవుట క్షేమము గాదని యా యుద్యమమును త్యజించి పూర్వాభిముఖుడై గజపతివారి రాష్ట్రముపై నడచిరని తెలియ వచ్చుచున్నది. కలుబర్గె దుర్గము కృష్ణానదికి చాల యుత్తరముననున్నది. కావున, ౧౫౧౨ లో కృష్ణానదినిదాటుట శ్రేయస్కరము కాదని యుదయగిరిపై నడచిన రాయలు ఆసంవత్సరమున కలుబరిగెను లగ్గలువట్టుట యసంభవము. ఉదయగిరియందు కృష్ణరాయలవి నాలుగుశాసనములు గన్పించుచున్నవి.[3] అందు రెండు కన్నడభాషయందును రెండు తెలుగునందును వ్రాయబడియున్నవి. అందు మొదటి శాసనములో (U. 37) శకముగాని, (ప్రభవాది) వర్షము పేరుగాని జెప్పబడలేదు. రెండవదానియందు రాయిపెడెత్తుటచే శకవర్ష సంఖ్యమాసిపోయినను 'భావసంవత్సర' యని యుండుటచే దానిశకము గడచిన ౧౪౩౬ అగును. మూడు నాల్గుశాసనములు (U. 40, 41) రెండును గడచిన శా. శ. ౧౪౩౬ సం. భావ జ్యేష్ఠ

1. కృష్ణరాయవిజయము, ఆ. 3, ప ౫౦-౫౩.
2. The Sources of the Vijayanagar History, pp. 121-2.
3. Nellore District Inscriptions, Vol. III, U. 37, 38, 40, 41.

బ. విదియ నాడు చెక్కింపబడినవి. మొదటి శాసనము (U. 37) సైత మప్పటిదే కావచ్చును. ఈశాసనములు వేయించుటకు గొంత కాలము పూర్వమే రాయ లుదయగిరి దుర్గమును స్వాధీనము చేసుకొనియుండవలయును. ఏలనగా, పై శాసనములలో మొదటి దాని యందు (U. 37) జెప్పబడినదానము, శ్రీకృష్ణదేవరాయలు ఉదయగిరిని స్వాధీనము జేసుకొనిన పిమ్మట విజయనగరమునకు వెళ్లి యిచ్చుట జేసినట్లు

"ఉదయగిరి దుర్గదమేలే బిట్టు ప్రతాపరుద్ర గజపతియనూ కొండవీడుపర్యంతవాగలూ బాముటియలిరుదు ఉదయగిరిదుర్గకె విడియనూ హోకి ప్రతాపరుద్ర గజపతియవర చిక్కప తిరుమల రాఘవరాయననూ హిడిదుకొండు తిరిగి బిజయనగరిగె విజయమాడువాగె ఉదయగిరి రామచంద్రదేవరిగె సమర్పిస్త..."

అను వాక్యమువల్ల దెలియవచ్చుచున్నది. కావున ఉదయగిరిదుర్గము శా. శ. ౧౪౩౫కు సరియగు శ్రీముఖ సంవత్సరము కడపట స్వాధీనమైయుండవలయును. ఉదయగిరిదుర్గమును రాయలు ఒకటిన్నరసంవత్సరము పర్యంతము ముట్టడివేసి యుండెనసియు, ఆకాలమున, తనదళము కోటగోడలను సమీపించుట కనుకూలమగునట్లు గండశిలలను త్రవ్వి మార్గములు చేయుచుండె ననియు న్యూనిజ్ తెల్పుచున్నాడు*. కావున శా. శ. ౧౪౩౩ సం. కడపటనో లేక శా. శ. ౧౪౩౪ సం. ఆరంభముననో, అనగా క్రీ. శ. ౧౫౧౨ లోనే ఉదయగిరిముట్టడి ప్రారంభమై యుండవలయును. ఈ సంవత్సరముననే విజయనగరపురాజు రాచూరుదుర్గమును, బీజపూరుసుల్తాను నోడించి కైకొనియెనని ఫెరిష్టా వ్రాయుచున్నాడు. కృష్ణరాయవిజయ, రాయవాచకములలో వర్ణింపబడిన విజయ మిదియే. కావున రాయలు ఈ విజయానంతరము పై గ్రంథములయందు జెప్పబడినట్లు ఉదయగిరిపైకి కూచీచేసెను. కాని దండుతో గూడ కృష్ణరాయలు పయనముచేసినట్లగపడదు. ఏలనగా గడచిన, శా. శ. ౧౪౩౪, ఆంగీరస ఫాల్గున శు. ౫ నాడు రాయలవారు కాళహస్తిలో నుండిరి.[1] శా. శ. ౧౪౩౫ 'మీాదనడచే శ్రీముఖసంవత్సర వైశాఖ బ ౧౨ సోమవారాన, 'శ్రీవీరప్రతాపశ్రీవీరకృష్ణరాయ మహారాయలు శ్రీతిరువెంగళనాథునికి,' తిరువాభరణాలుసమర్పించినట్లు, తిరుపతిలోని వెంకటేశ్వరస్వామి దేవాలయమునందలి శాసనమువల్ల తెలియుచున్నది.[2] కావున సైన్యమును సాగనంపి, స్వయము తిరుపతికిబోయి స్వామిని సేవించి కానుక లర్పించి, తదనంతరము ఉదయగిరిని చేరియుండవలయును.

ఉదయగిరిదుర్గమును గాపాడుటకు సైన్యసమేతుడై యరుదెంచిన ప్రతాపరుద్ర గజపతి నోడించి, కొండవీటివఱకు బారదోలి మరలి వచ్చి యుదయగిరిని సాధించెను. సైన్యమును

*. Sewell. The Forgotten Empire, P. 316.

1. Rep. of Epigraphy, 150, 165, 185 of 1924.

2. ఆం. ప. ప. పుట ౨౨౬.

కొండవీటి దుర్గముపైకి సాగనంపి, రాయలు శా. శ. ౧౪౩౬ భావసంవత్స రారంభమున స్వామిసన్నిధికి తిరుపతికి బోయెను.[3] అచటి నుంచి కంచికి వెళ్లి వరదరాజస్వామిని సేవించుచు భావ సం. జ్యేష్ఠశుద్ధ ౧౦ వఱకు నచ్చటనే యుండి,[4] జ్యేష్ఠ బ. ౨ కు పూర్వమే విజయనగరమునకు వచ్చిచేరెను.[5] కొంత కాలము నగరముననుండి, కొండవీటి సీమలోని దుర్గములను లగ్గలుకొనుచున్న స్వసైన్యమును జేరి, కొండవీటిని స్వాధీనము జేసుకొని శా. శ. ౧౪౩౭ యువ సం. శ్రావ శు. ౧౫ లు చంద్రగ్రహణ కాలమున నాగులవర మను గ్రామమును సూరార్యుడను బ్రాహ్మణునకు దానము జేసెను.[6] పిమ్మట, యువ సం. ఆషాఢ బ. ౧౨ నాడు భార్యాసమేతుడై అమరావతికి వెళ్లి యమరేశ్వరుని సేవించెను.[7] ఇంతటితో కళింగ దిగ్విజయమునకు సంబంధించిన మొదటిధాటి ముగిసెను. రాయలవారు రాజధానికి బోవుచు మార్గమున మల్లికార్జునుని దర్శించుటకు యువ సం. శ్రావ. శు. ౧౫ నాడు శ్రీశైలమునకు బోయెను.[8] అచ్చటినుంచివిజయనగరము సేరికొంత కాల ముండెను. కళింగముపై రెండవధాటిని సాగించుటకై బెజవాడయందు విడిసియున్న దండునుగలిసికొను తలంపుతో బయలువెడలి మార్గమధ్యమున, యువ సం. పుష్య. శు. ౧౫ అహోబళస్థలమున మకాముచేసి, అహోబళ నరసింహుని అర్చించి కానుకలుసమర్పించెను.[9] తరువాత కొంత కాలమునకు బెజవాడను చేరి దండును తరలించి, వెంగిమండలమునుజయించి శా. శ. ౧౪౩౮ ధాతు సం. చైత్ర బ. ౧౨ నాటికి సింహాచలము చేరి జయసూచకముగ శాసనము వేయించెను.[10] ఈ రెండవధాటి సంపూర్ణము గాకమునుపే ఏకారణము చేతనో సైన్యము నచ్చటనే నిలిపి, తానుమాత్రము వెనుకకు తిరిగి శా. శ. ౧౪౩౮ ధాతు పుష్య బ. ౨ నాటికి కంచిని జేరి యచట ఆ సప్తమి వఱకు నిలిచెను.[11] తదనంతరము అరుణాచలేశ్వరునిదర్శనమపేక్షించి తిరువణ్ణామలెకుపోయెను.[12] ఈతరుణముననే యరుణాచలేశ్వరుని దేవాలయమునకు, సహస్రస్తంభమంటపమును, పదునొకండు అంతస్తులుగల గోపురమును గట్టుటకును, తటాకమును ద్రవ్వుటకును దగు నేర్పాటులను గావించెను. శా. శ. ౧౪౩౯, ఈశ్వర సం. మేష. శు...నాటికి కంచికి తిరిగివచ్చి[13]యచ్చటినుంచి బయలుదేరి బెజవాడలోనున్న సేననుగలసికొనెను. ఈశ్వరసం. పుష్య బ.౫ కి ముందే పొట్టనూరు-సింహాచలపర్యంతముగల దేశమును జయించి బెజవాడకు విచ్చేసెను.[14] ఆదినమున చోళమండలములోని పెక్కు దేవాదాయములపై రావలసినపన్నును త్యజించెను.

3. Rep. Epi. 53, 54, 55, 56 of 1889.
4. „ 569 199.
5. „ N. Dist.Inscriptions, Vol. II.
6. Ibid. Vol. I, P 129.
7. Rep. Epi. 266-1897.
8. do. 18-1915.
9. Rep. Epi. 64-1915.
10. do. 245-1899.
11. do. 474-1919; 533-1919.
12. do. 574-1902.
13. do. 641-1919.
14. do. 184-1925.

పిమ్మట తీర్థయాత్ర వెడలి, తీర్థ నగరి మీదుగా[15] చిదంబరమునకు బోయి కనక సభాపతిని పూజించి, దేవాలయపుటుత్తరగోపురమును గట్టించెను.[16] తరువాత, మరలి బెజవాడకు శా. శ. ౧౪౪౦ బహుధాన్య సం. వైశాఖశుద్ధ ౧౫ ముందే చేరెను.[17] ఆసంవత్సరము ఫాల్గున శు. ౧౧ నాడు ఆంధ్రవిష్ణువును సేవించుటకై శ్రీకాకుళమునకుబోయెను.[18] మఱియు శా. శ. ౧౪౪౧ ప్రమాది శ్రావ. శు. ౧౩ నాడు సింహాచలము పోయి యచ్చట నొక శాసనమును వేయించెను.[19]

ఇందువల్ల రాయలవారి కళింగ దిగ్విజయము శా. శ. ౧౪౩౪ లో ఆరంభమయి శా. శ. ౧౪౪౧ వ సం. వఱకు జరుగుచుండెననియు, అప్పుడప్పుడు రాయలవారు అనుకూలమును జూచుకొని పుణ్యక్షేత్రములకు యాత్రలు సేయుచుండిరనియు తెలియుచున్నది. ఈ సందర్భమున నొకప్రశ్నకు సమాధానము చెప్పవలసియున్నది. రాయలు రెండుమూడుపర్యాయములు తిరుపతి వెళ్లియుండెనుగదా! రాయవాచకములో కలుబరిగెను స్వాధీనపఱచుకొనినపిమ్మట తిరుపతికి బోయినట్లు చెప్పబడియున్నది. కలుబరిగెను రాయలు పైజెప్పబడిన రెండుమూడు తిరుపతిప్రయాణములలో నొకదానికి ముందు జయించియుండవలయునుగదా. ఎప్పుడు జయించెను? శా. శ. ౧౪౪౧ వెనుక అనగా కళింగదిగ్విజయము సంపూర్తియైన తరువాతనే రాయలు కలుబరిగెను సాధించెనని పై ప్రశ్నకు సమాధానము చెప్పవలసియున్నది. ఏలనగా:

౧. రాయలసైన్య మంతయు గజపతుల రాజ్యమును జొచ్చి శా. శ. ౧౪౩౪ మొదలు ౧౪౪౧ వఱకు నిరంతరము శత్రువులతో పోరాడుచుండుటచేత, ఆకాలమున బలవంతుడగు బిజాపుర సుల్తానుయొక్క రాష్ట్రమధ్యమున నున్న కలుబరిగెకోటను రాయలు స్వాధీనపఱచుకొనుట దుష్కరమైన కార్యము. మఱియు మనకు లభించిన శాసనములమూలమున సందు చిక్కినప్పుడెల్ల రాయలు ద్రావిడదేశములోని పుణ్యస్థలములను గాంచబోయినట్లే దెలియుచున్నది. తురకరాజ్యముపై దాడి వెడలినట్లు కానరాదు.

౨. రాయవాచకములోను, కృష్ణరాయవిజయమునందును రాయలు కలుబరిగెను, కళింగదిగ్విజయానంతరమే సాధించినట్లు చెప్పబడియున్నది. రాయవాచకము కృష్ణరాయవిజయమునకంటె ఎక్కువవిషయములను దెలియజేయుచున్నది. ఈగ్రంథమున కళింగవిజయానంతరము గజపతితో సంధి, తురకరాజులతో సంధి, కలుబరిగెముట్టడి, తీర్థయాత్ర మున్నగునవి వరుసగ వర్ణింపబడియున్నవి.

---

15. Rep. Epi. 125-1904.
16. do. 371-1913.
17. లక్ష్మణరాయవ్యాసావళి, పుట ౩౨, ౩౩.
18. లక్ష్మణరాయవ్యాసావళి పుట ౩౩.
19. Rep. Epi. 243-1899.

కలుబరిగెను సాధించినపిమ్మట రాయలు తిరుపతి, కాళహస్తి, అళగిరిగుడి, మధుర, శ్రీవల్లిపుత్తూరు, కరువనల్లూరు, శంకర నారాయణదేవళం, దక్షిణకాశి, త్రికూటాచలం, అగస్త్యపర్వతం, గజేంద్రమోక్షం, శాలివటపురం, తోతాద్రి, కురుంగుడి, కన్యాకుమారి, శ్రీకందూరు, నవతిరుపతులు, ఆదిసేతువు, ధనుష్కోటి మున్నగు పుణ్యక్షేత్రముల సందర్శించి, గోకర్ణమునకుబోయి శ్రీరంగపట్టణము మీదుగా విద్యానగరమునకు వచ్చి చేరినట్లు తెలియుచున్నది. ఇందు తిరుపతి, కాళహస్తి, గోకర్ణ, శ్రీరంగపట్టణములు దక్క తక్కిన ప్రదేశములన్నియు పాండ్య కేరళ దేశములయందున్నవి. పై స్థలములయందు రాయలవారి శాసనము లింతవఱకు లభించకపోవుటచేత, యాత్రాకాలమును నిర్ణయించుటకు వీలు లేకున్నది. అయినప్పటికిని, శా. శ. ౧౪౪౪ సరియగు చిత్రభాను సం॥న రాయలు దక్షిణదేశమున సంచారము సల్పెననుటకు శాసనములయందు కొంతసూచన యున్నది.[1] కావున రాయలు కలుబరిగెను శా. శ. ౧౪౪౩ లో అనగా క్రీ. శ. ౧౫౨౧-౨౨ లో సాధించియుండవలయునన్నయూహ పొడముచున్నది.

3. అచ్యుతరాయలకాలమున విజయనగరమున నివసించుచుండిన పోర్చుగీసువర్తకుడు న్యూనిజు కృష్ణరాయల దిగ్విజయములను జక్కగ వర్ణించియున్నాడు. కళింగదిగ్విజయమైనతరువాత కొటూరుముట్టడియు, తదనంతరము రాయచూరుదండయాత్రయు, పిమ్మట బిజాపూరుపై ధాటియు, కడపట కల్యాణకలుబరిగెల ముట్టడియు వరుసగా వర్ణింపబడినవి. మఱియు రాయచూరుయుద్ధమున నోడిపోయిన ఇస్మాయల్ అదిల్ షా తనభేటికి రాకపోవుటచే రాయలు కోపించి బిజాపురము, కలుబరిగె మున్నగు స్థలములపై దండువెడలెనని న్యూనిజు స్పష్టముగ వ్రాసియున్నాడు. విజయనగరచరిత్రమును రచించిన సూయెలుగారు రాయచూరుయుద్ధము క్రీ. శ. ౧౫౨౦ సం. మేనెల ౧౯ తేదిని జరిగెనని సకారణముగ నిరూపించియున్నారు. కావున కలుబరిగె క్రీ. శ, ౧౫౨౧ లోనో, ౧౫౨౨ లోనో ముట్టడింపబడి యుండవలెను. రాయవాచకమున వర్ణింపబడిన తీర్థయాత్రకాలము శా.శ. ౧౪౪౪ అనగా క్రీ. శ. ౧౫౨౨-౩ అయినట్లు సూచనలుండుటచేత అంతకుముందు నడచిన కలుబరిగె ముట్టడి క్రీ. శ. ౧౫౨౦-౨౧ లో జరిగెననుట సమంజసముగ నున్నది. 2

---

1. Rep. Epi. 4/1894; 146/1903.

2 సముస్తదిక్కులను జయించి, తీర్థయాత్రలు సల్పి విద్యానగరమునకు వచ్చినపిమ్మట ఒకనాడు 'నిండుసభలో సాళువతిమ్మరుసయ్యగారున్ను రాయసం కొండమరసయ్య మొదలైన వార్లున్ను ప్రసంగ్గం వెంబడిని అంద్దరును యెంచినట్లు కవితాచాతుర్యము గలవార్లున్ను, రాయలవారిని ప్రసంగ్గం వెంబ్బడిని నీసుకీర్తి శాశ్వతముగా నిలిచేటందులకు ఆదియంద్దు అవనీపతులు కృతులంద్దురాంగా వాల్ల ప్రతాపములున్ను కీర్తిన్ని అంద్దరున్ను యెంచినట్లు స్వామివారున్ను కృతులంద్దుకొంట్టె కీర్తి ప్రతాపములు శాశ్వతముగానిలుచును గనక తిమ్మరసయ్య అయ్యమరసయ్య, కొండమరసయ్య, బాచరసు, తిప్పరసు అయ్యమరసు మొదలైనవార్లు దెలుపగా రాయలవారున్ను చాలా సంతోషపడి ముక్కు తిమ్మయ్య,

౪

విజయనగరమునుంచి ప్రయాణమై రాయలు సరిహద్దునుదాటి బిజాపురరాజ్యమును ప్రవేశించెను. రాయలు కలుబరిగెను ముట్టడించి లగ్గగొన్ని, కోటగోడలను నేలచదరము గావించెననియు, ఇట్టి దుస్థితియే యితరములగు పెక్కు దుర్గములకు బట్టెననియు న్యూనిజు వ్రాసియున్నాడు.[1] కావున రాయలు యీ దండయాత్రలో ఒకగుల్బర్గనేకాక మరికొన్ని దుర్గములను ధ్వంసముచేసినట్లు తెలియుచున్నది. ఈదండయాత్ర ఆంధ్రకర్ణాటకగ్రంథములయందు చక్కగ వర్ణింపబడియున్నది. ఇందు 'కేలది నృపవిజయము' ముఖ్యమైనది. రాయలు పోయిన మార్గము పైగ్రంథమువల్ల కొంతవఱకు తెలియుచున్నది. ప్రథమమున జంబుఖండికిని, యచటినుంచి కల్యాణమునకును, పిమ్మట కలుబరిగెకును, కడపట బీదరురాజ్యమునకును రాయలు కూచీచేసినట్లు విదితమగుచున్నది. మార్గమధ్యమున పెక్కుపర్యాయములు తురకల నోడించెను; అనేకదుర్గములను ధ్వంసముజేసెను.

విజయనగరసైన్యము తెరలివచ్చుచున్నదనివిని, బిజాపురసుల్తానుతో జేసుకొన్న సంధిషరత్తుల ప్రకారము 'తామ్రతుండా గ్రేసరుడగు ఆముదానగరపు భైరీ నిజామపాతుశాహా' 'పేరోజిఖాన, తాలీతఖాన, సంజార్ఖాన, శాతేఖాన, మునిలఖాన, దస్తూరఖాన, బొక్కసింగ' ప్రభృతులగు సర్దారులను[2] రాయలసైన్యము

---

అల్లసాని పెద్దయ్య, మాదనగారి మల్లయ్య మొదలైన కవీశ్వరులతో కృతులందుకోవలెనని కవితానాయకులతో పలుకరించి ఆతీరున అయ్యాని అనంగా కుళ్ళాయి, కబ్బాయి, తాళిచౌకట్లు, చేసరిపేరులు, కోకతాకలు యిచ్చి పారిజాతాపహరణమున్ను, మనుచరిత్రాను చెప్పుమని ఆనతిచ్చినారు." (ఆంప. ప. పుట      )

ఇట్లే కృష్ణరాయ విజయమందును దిగ్విజయము, వివాహము, పుణ్యక్షేత్రసందర్శనము జరిగిన పిమ్మటనే రాయలు మనుచరిత్ర కృతినందినట్లు చెప్పబడియున్నది.

"బంధుర కవీంద్ర కృతులలో ప్రౌఢిగన్న
మనుచరిత్రాది కృతులంది మహిమ జెలగ
సకల సామ్రాజ్య వైభవసరణి వెలయ
ధరణి యేలుచునుండె నదరణివిభుడు"

(కృ. రా. వి. పుట. 117)

కావున, మనుచరిత్ర, పారిజాతాపహరణము అను నీరెండు ప్రబంధములను,దనరాజ్యకాలపు చతుర్థభాగమున శ్రీకృష్ణరాయలు కృతి నందియుండవలయును. మనుచరిత్రలో శ్రీకృష్ణరాయలచే నిర్జింపబడిన శత్రువులలో నొకడని పేర్కొనబడిన "శకంధరుడు" క్రీ.శ. ౧౫౧౮ వ సం॥ "ఫిబ్రవరి, మార్చి, యేప్రిల్" నెలలలో గుజరాతు నేలినట్లు శ్రీ లక్ష్మణరావుగారు వ్రాసియున్నారు. ఇది నిజమగునేని మనుచరిత్రను రాయలు క్రీ. శ. ౧౫౧౮ యేప్రిలు తరువాత కృతినందినాడనుట నిశ్చయము.

1. Sewell: The Forgotten Empire p.357.

2 బుర్హాన్ నిజామ్షా మంత్రులలో కాన్హా నరసియను బ్రాహ్మణు డొకడుండెను. అతడు గొప్పశూరుడు. 'అతని పన్నుగడలమూలమున, నిజాముషాసైన్యములు ముప్పది దుర్గములను స్వాధీనపఱచుకొనెను. ఇతనియందు బుర్హాన్ నిజామ్ శాహాకు విస్తారమగు నమ్మకముండెను. (See I. A. XLIX P. 165) మఱియు, దస్తూర్ ఉల్ ముల్క్, మునీర్ ఖాన్ (దస్తూర్ఖాన్, మునీర్ఖానులు) నిజామ్షాగారి సర్దారులని తెలియవచ్చుచున్నది. (See I. A. XLIX, P. 159.) కావున కేలది నృపవిజయమున పేర్కొనబడిన తక్కిన సర్దారులుగూడ కృష్ణరాయని సమకాలికులుగ నుందురని తోచుచున్నది.

నడ్డగించుతలంపున దక్షిణదిక్కున కంపెను. ఈసర్దారులకునాయకుడు మహాపరాక్రమశాలి యగు బొక్కసింగ డని యూహించుట కవకాశము కలదు.

మురిదవజీరర నీక్షిసు
తురతరకోపదొ ళిదిర్చి సైన్యసమేతం
తరుబిమార్గ లెతుకైగె
ద్దురుబువ కలిబొక్కసింగనం నోయిసిదం.1

అనియు, "ఇంతె సెవపరాక్రమశాలి యప్ప బొక్కసింగనంకై సెరె విడి దొప్పిసి రాయరం పరమసంతోషంబడిసి"2 యను వాక్యములవల్ల, ఆముదాపురపుసర్దారులలో బొక్కసింగ డధికు డని తోచుచున్నది. కావున అతడు నిజాము శాహ సేనాధిపతి యని తలచుట సమంజసము.

ఇట్లు బయలుదేరిన తురకదండు దక్షిణముగ నడిచి జంబుఖండి యను గ్రామమున మార్గమును అరికట్టి, నిలచి రణమునకు సంసిద్ధముగ నుండెను. విజయనగరసైన్యమును అచ్చటికివచ్చినపిమ్మట ఇరుదెగలవారికి చేతులుగలసి మహాయుద్ధప్రసక్తియాయెను. రాయలసైన్యము విరిగి వెనుకకు దిరుగుటను జూచి కేలది పాళెగాడగు సదాశివనాయకుడు స్వపరాక్రమప్రకటనచేత తురకదండును విరుగగొట్టి తురకసర్దారులను భంగపఱచెను. విరిగిన దండును గాంచి, మహాకోపముతో బొక్కసింగడు పొరలివచ్చుచున్న శత్రువాహిని కడ్డుపడి ధైర్యసాహసపరాక్రమములతో బోరాడెను; కాని అపజయమును బొంది శత్రువుచేత జిక్కెను.

పరజంబుఖండియొడెయొ
త్తరుబిద తెరుష్కపతియ ఖానరనెల్లం
కరిదరిదు బొక్కసింగన
సెరవిడిదెత్తెందు రాయరిం గొప్పిసిదం.3

ఇంతటి పరాక్రమశాలి యగు బొక్కసింగని పట్టితెచ్చి ఒప్పించగా రాయలవారు పరమసంతోషమును బొంది సదాశివనాయకుని దగినవిధమున సత్కరించిరి.

తరువాత రాయలు సైన్యముతో విఖ్యాతమగు కల్యాణమునకు బోయి, శత్రువులను సంహరించి, దుర్గమును లగ్గకొనెను.

౨. అప్పుడుకలుబరిగెకోటవారు "గర్వితులై యుండగా" రాయలవారు తనకొలువున నున్న మన్నెవారిని ఆకోటను బట్టుకొనుడని యాజ్ఞాపించిరి. రాయలసైన్యము కలుబరిగెను సమీపించుసరికి నిజాములు ఫౌజు లడ్డపడెను. అప్పుడు మహాఘోరమగు నొకయుద్ధము జరిగెను.

ఈ యుద్ధము నడిమిదొడ్డిపాళెము పాళెగాండ్రచరిత్రయందు వర్ణింపబడియున్నది.

"కొన్ని దినములకు కల్యాణం కలుబరిగెమీద యుద్ధసన్నద్ధులై సమస్తమైన జాగీర్దార్లను పిలిపించగా కడవకొలను గ్రామంలోవున్న ముసిలి చన్నమనాయుడు తన జమీయ్యతుతోకూడా విజయనగరానకు కృష్ణరాయలవారి సముఖానకు పోయినతదనంతరం రాయలవారు సైన్యముతోకూడా ప్రయాణమై కలుబరిగెమీదికి వెళ్లగా సమస్తమైన నిజాములు ఆకలుబరిగెదగ్గరికి భారి ఫౌజులు స్తోమంగా కూడివున్నందున రాయలవారు సమస్తమైన వారిని పిలిపించి, యీయుద్ధమందు వెనుకకు తిరుగక లడాయిచేసి శత్రుపలాయనం చేస్తే మీకు సకల బహు

1. కేళది నృపవిజయం, ఆ. ౨, ౧౩, పుట ౩౧.
2. Ibid. ఆ. ౨, ౧౭, పుట ౩౨.
3. కేళదినృపవిజయము: ఆ. ౨: ౧౬, పుట ౩౨.

మానాలు యిస్తున్నారము. అని వీరకంకణాలు తోం బూలాలు యిచ్చినంతలోగా లడాయికి షురువు అయి యుద్ధముసేయగా అప్పుడు బహుమంధి సర్దారులు మెసా ముసిలి చన్నమనాయడు సాంనలాపురం హండేవారు యింకా పాళేలవారుసహా యేకస్తులై యుద్ధానకు నడచి నంతలో అగాదయుద్ధప్రసరిణిఅయి రాయలవారి ఫౌజు విరిగినందున రాయలవారు చెయ్యెత్తి ఘల్లున కూశి యీ సమయమందు యవ్వరు యెదురెక్కి శత్రుపలాయినం చేస్తూవున్నారో వారికి సకల బహుమానాలు బిరుదులూ యిప్పిస్తూన్నామని చెప్పినందున ముసిలి చన్నమనాయడు యింకా కొంతమంది సర్దార్లతో తురుష్కుల వారి లష్కరుమీదికి యెదురెక్కి తరుముకొని వస్తూవుండిన నిజామాది ఫౌజులమీదికి దూరి చిత్త స్వాతి సంధించినట్టుగా యుద్ధముచేసి మొదటికోపు విరుగగొట్టినందున యావత్ఫౌజు యేకరాసిన దూరగా నిజాముల ఫౌజు విరిగి శానా హతమైపోయినందున కలుబరిగెలో వరాహధ్వజ మెత్తించి జయభేరి వేయించిరి."[1]

యుద్ధరంగమున స్వసైనికుల కష్టసుఖములను విచారించి, వారికి తగుఏర్పాటులను చేయుట రాయలకు వాడుక. కావుననే, యీ 'యుద్ధమున మిక్కిలియు గాసిజెందిన సైన్యమెట్టిస్థితియందుండెనో కనుగొనుటకు విజయానంతరము, యుద్ధరంగమును బ్రవేశించి సరదార్లను, జాగీరుదార్లను 'నొప్పదప్పులు విచారించి జఖముపట్టి యిచ్చెను.' పైయుద్ధమున ధైర్య సాహస పరాక్రమములను బ్రకటించిన వారిలో ముఖ్యుఁడును, వృద్ధుడును అగు మెసా చన్నమనాయ డేమాయెనని 'విచారించగా భారీగాయములతో స్థళాంతరమందు' పడియున్నట్లు తెలిసెను. అప్పుడు 'ఖాసా కృష్ణరాయలవారు పోయి జఖములు కట్టించి తమ డేరాదగ్గిరనే డేరావేయించి' కాపాడెను. ఇట్లు ఆ హావరంగమునందు తాను మహారాజు నను సంగతిని మఱచి సామాన్యసైనికులతో కలసి మెలసి వారికష్టముల నరసి నివారించుచుండి నందువల్లనే, ప్రతిభటుడును కార్యము వచ్చి నపుడు దేహముపై నాశయుంచక పోరి రాయలకు జయమును సమకూర్చుచుండెను. ఇది యుత్తమసేనాపతుల మార్గము.

కలుబరిగి కోటను బట్టుకొన్నప్పుడే, రాయలవారు తత్సమీపమున నున్న 'సాగ' రనుకోటనుగూడ స్వాధీనము చేసుకొన్నట్లు ఆముక్తమాల్యదయందు జెప్పబడియున్నది. సాగరు గుల్బర్గకు సుమారు ౫౦ మైళ్లు దూరమున నైరృతి దిశయందున్నది. మఱియు ఆముక్తమాల్యదయందలి

> ఇది యంధ్రోక్తి యథార్థనామయువనా
> స్పృశ్యార్ణ కెంబావి వా
> రిదపద్ధత్యవరోధివప్రవలయు
> శ్రేణీవిఘాతక్రియా
> స్పదసేనాగ్రదకృష్ణరాయమహిభృ
> త్సంజ్ఞాస్మదాముక్త మా
> ల్యదనాశ్వాసము పంచమం బమరు
> హృద్యంబైన పద్యంబులన్.

అనుపద్యమువలన గృష్ణరాయలు కెంబావి యనుస్థలమున దురకలను మర్దించెనని తెలియుచున్నది. కెంబావి గొప్ప దుర్గమనియును మేఘమార్గము నంటునంతటి యెత్తయిన

1. భారతి, అక్టోబరు ౧౯౨౯, పుట ౬౮౯.

గోడలు గలదనియు వ్రాయబడియున్నది. ఈ కెంబావి పై సాగరుకోటకు పశ్చిమమున ౧౬-౧౭ మైళ్లమీఁద నున్నది.3 ఇంత సమీపమున నుండు సాగరు కెంబావులను రెంటిని రాయలు ఒక్కధాటియందె స్వాధీనపఱచుకొని యుండవలయును.

సాగరు గుల్బర్గలకడ మడిసిన తురకవీరుల స్వర్గవర్తనమును రాయలవారే చిత్రముగ వర్ణించియున్నారు.

సనకాదిదివిజ మస్కరిఫాలగోపిచం
　　　దనపుండ్రవల్లిక ల్నాకినాకి
సెలసి హాహాహూహూవుల దండియలతంత్రి
　　　ద్రవ్వసింగిణులుగా దివిచి తివిచి
సప్తర్షికృత వియర్ఝురవాలుకాలింగ
　　　సమితి ముచ్చెలగాళ్ల జమిరి చమిరి
రంభాప్రధానాప్సరః పృథూరోజకుం
　　　భంబులెచ్చట గన్న బట్టి పట్టి
తిరుగు హరిపురిసురతరు సురల మరిగి
బహుల హళహాళి భరితకల్బరిగనగర
సగరపురవర పరిబృఢజవనయవన
పృతన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ.1

ఇట్లు నాథులు స్వర్గస్థులు కాగా దిక్కులేక పారుతెంచు తురకబీబీలగతిని యజ్ఞాతకవియొకడు హృదయవిదారణముగ వర్ణించియున్నాడు.

చెడిపిరాలొత్తిన యడుగుదమ్ములకును
　　　గట్టిపయ్యెద జించికట్టుకొనుచు
బయలైనకుచకుంభపాళులకును జంటి
　　　శిశువుల మాటుగా జేర్చుకొనుచు
గసుగందులకు వడగాలికి జాటుగా
　　　కచభరంబులు విప్పి కప్పుకొనుచు
వీడిన తురుము నీవియదాక సడలించి
　　　చేలాంతమును సుంగు జేర్చుకొనుచు
ఖానమల్కవజీరులమానవతులు
పాటుపరువున నీవు కల్బరిగ గొనిన
బ్రమసి దెసచెడి నలుగడ బరతురౌర
ఆహవోపేంద్ర కృష్ణరాయక్షితీంద్ర.2

3. తరువాత కృష్ణరాయలు బీదరును పాలించు బరీదు పాదుశాహామీఁదికి దండువెడలెను. బీదరు కల్యాణ, కలుబరిగెలకు దూర్పున నున్నది.

"కృష్ణరాయలు సదాశివనాయకుని బిలిచి, తన్నెదిరించుచున్న బరీదుపాదుశాహాయొక్క మదోద్రేకమును దగ్గించుటకు నియమించిపంపగా, దాడివచ్చుచున్న వార్తను బరీదుపాతుశాహా విని అత్యంత కోపాటోపముతో నత్యద్భుతపరాక్రమశాలులగు వజీర్లతో, అపరిమితహస్త్యశ్వపదాతిసమూహాసమేతుడై బయలువెడలివచ్చి రణమునకెదిర్చి నిలువగా నుభయసైన్యములవారికిని చేతులుగలసి మహాద్భుతమైన తుములయుద్ధము నడిచెను."3

ఈకయ్యమెచ్చట నడచెనో చెప్పుటకు వీలులేదు. ప్రాయశః బిజాపుర బీదరురాజ్యముల సరిహద్దునందై యుండవచ్చును. ఈ యుద్ధమున బరీదుశాహా తనయావచ్ఛక్తిని వినియోగపఱచి శత్రువులతో బోరెను. కాని యతనిసైన్యము విరిగెను. గుఱ్ఱములు, ఏనుగులు, డాలు, డమామి, ఛత్రము, మెఱ్ఱనిశాని, మ్లేచ్ఛలిపి లాంఛనలాంఛితములగు కాంచన ముద్రాంగుళీయకములును శత్రువులకు గైవస

1. ఆముక్తమాల్యద, ఆ. ౧.

2. చాటుపద్యమణిమంజరి, సం. ౨, పుట ౭౫.

3. కేళది నృపవిజయము, ఆ. ౨, వ. ౨౫, పుట 33.

మాయెను. కొందఱు వజీర్లను పట్టువడిరి. మఱియు సదాశివనాయకుడు "బరీదుపాదు శాహానుకూడ చెరబెట్టితెచ్చి రాయల కొ ప్పగించగా కృష్ణరాయలుచూచి మహాహర్షి తుడై ఆసదాశివనాయనికి రత్నాభరణ తాం బూలంబుల నిచ్చి యాదరించి మందలె మేఘ డంబరదివాప్రదీపాది బిరుదుల నిచ్చి బరీదు పాదుశాహాయొక్క ముద్రాంగుళీయకములను సదాశివనాయుని రెండుప్రేళ్లకును బెట్టి సదరు బొక్కసింగని విడిచి తదారభ్యముగ బరీద సప్తాంగహరణ సదాశివనాయక అనుబింక"ము నొసంగి మన్నించెను.[1]

ఇట్లు బీదరుప్రభువగు బరీదుపాదుశాహ ను గృష్ణరాయ లోడించి చెరబెట్టెనని 'కేలది నృపవిజయము'వల్ల తెలియుచున్నది. అటు పిమ్మట రాయలు బీదరుపట్టణమును ముట్ట డించె ననుటకు గొంతయాధారము కలదు.

గనకు ల్వల్లిదుర్యో ఢిల్లికిని
మక్కాకోట మేలర్యో మం
డువకుం గ్రొత్తగ గ్రొత్త డం
బులమరెన్ బోలేరు, చందేరులన్
దవసంబెక్కె బెడందకోట
పురకాంతా గర్భనిర్భేదన
ప్రవణంబై న భవత్ప్రియాణ
జయవార్తన్ గృష్ణరాయాధిపా![2]

ఘోరమైన యుద్ధము జరిగెను. తురు ష్కులను రాయసైన్యము చించి చెండాడెను విజయలక్ష్మి రాయలను వరించెను. అల్లసాని పెద్దన యీసమరము తెలుగును హృదయా హ్లాదకరముగ వర్ణించియున్నాడు.

"సమరక్షోణిని కృష్ణరాయల
భుజాశాతాసిచేబడ్డ దు
ర్దమదోర్దండ బెడందకోట
యవనవ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునం గాంచి, శబా సహో
హరిహరం గా ఖూబు ఖోడాకితే
తుముకీభాయిల భాయిదే మలికి
యందు ర్మింటికిం బోవుచున్.[3]

రాయలకు బీదరుకోట స్వాధీనపడెను. కావున రాయలు తానుజేసిన శపథమును నెరవేర్చుకొ నెను. బిజాపుర,అముదానగర బెడందకోట రాజ్య ములం బ్రవేశించి తన్నృపాలురర పించ మడం గించెను. బిజాపురసుర్తాణుడు పాఱిపోయి డాగుకొనెను. బెడందకోట సుర్తాణుడు పట్టు వడియెను. అముదానగర సుర్తాణు డెదుర్కొ న వెఱచి, నిజాంతఃపురముననె నిలిచిపోయెను.

రాయ లీవిజయములతో దృప్తినొంద లేదు.

"అచ్చటినుంచి ఉత్తరమునకు బోవ నతడు సమ కట్టెను;[4] కాని యతని మంత్రు లందు కంగీకరించలేదు.

---

1. కేళది నృపవిజయము, ఆ. ౨, ప. ౪౯, పుట ౩౮.

2. చాటుపద్యమణిమంజరి, సం. ౧, పుట ౧౫౮.

3. అప్పకవీయము, వావిళ్ల వారిది. ౧౯౨౫, పుట ౭౫.

4 ఉత్తరమునకు బోవలయున్న తలంపు రాయలు తాత్కాలికముగ మానెను; గాని తరువాత నిజాముషా రాజ్యముపై దండువెడలి అహమద్‌నగరమును ముట్టడిం చెను. 'కేళది నృపవిజయము'లోని

మిగగర్వోద్రేకదె సం
యుగదోశ్శాయగిఢదిచిఢ కై గ్ధ్యమదా

మార్గమున నీరు దొరకుట దుర్లభమనియు, తాము మిత్రులని పరిగణించు తురక దొరలందఱును, రాయలవారితరుల రాజ్యముల నాక్రమించినట్లు వారి రాజ్యముల నాక్రమింతురని తలచి, రాయలవారికి భయపడక, వారందరును ఒక్క ప్రభువుయొక్క సామంతులగు కారణముచేత అదిల్‌షాతో నేకీభవించి రాయల నెదిరింపవచ్చునని యు; అట్లు తురకలందరు నొక్కటై యెదిరింతురని బెదరవలసిన యవసరము లేకపోయినను, జలాభావమునకు శంకించవలసియున్నదనియు; నీటికరు వప్పటికే సేనను బాధించుచున్నదనియును జెప్పిరి. మంత్రులు జెప్పిన సలహా మంచిదని రాయ లంగీకరించెను."1 అని న్యూనిజు వ్రాయుచున్నాడు.

కావున కృష్ణరాయలు యుద్ధయాత్రను చాలించి విజయనగరమునకు దరల వలసివచ్చెను. ఈ సందర్భమున న్యూనిజు మఱొక విషయమును బ్రస్తావించుచున్నాడు.

"కల్బుర్గరపట్టణమునందు, కోటలో కృష్ణరాయలు దక్కను దేశప్రభువు (బహామనీసుల్తాను) పుత్రులను మువ్వురను బందీలనుజేసెను.

అదిల్‌షా వీరిలో దనవురదియు, దక్కనుసుల్తానునకు కాంతవల్ల జనించినవాడునునగు రాకొమరుని దక్కను దేశమునకు రాజును జేయవలయునను తలంపుతో వీరిని నిర్బంధించియుండెను. రాయలు వారిలో

నగరద నిజామశాహన
మొగమిక్కడె తెరదెధురదె మురిదోడిసిదం॥
ఇంతమర్ద రణాంకదొళ మదానగరద నిజామ
శాహనమదోద్రేకమం మురిదుపలాయనంగొళిసల్
కృష్ణరాయం ప్రముదితమానస నాగి......"

అనుపద్యగద్యములవలన కృష్ణరాయలు అమదానగరపర్యంతము దాడివెడలినట్లు తెలియుచున్నది. ఈ విషయమును మహమ్మదీయ చరిత్రకారులుగూడ సూచించియున్నారు:—

"సుల్తాను (మహమూదు) గతించినవెనుక (క్రీ. శ. ౧౫౧౮) దక్కనుదేశమున నకస్మాత్తుగ అరాజకమును, కలతయు ప్రబలెను. అమీరులును, దొరలును, యెచ్చటివారచ్చట స్వాతంత్ర్యము బ్రకటించి ప్రభుత్వము సేయదొడగిరి. అల్లరులయొక్కయు పితూరీలయొక్కయు ధర్మము దేశమునందంతటను బ్రకటింపబడెను. అమీరులును మలికలును దేశాధిపతులవలె ఒండొరులయెడ నమ్రతనుజూపక, స్వతంత్రప్రభుత్వ ధ్వజములను నిలిపిరి. ఈకారణమువల్ల, విజయనగరపు నాస్తికులు (Infidels) ముసల్మాను ఆస్తిని దోచుకొనుచు, ముసల్మానుల రాష్ట్రములలోనికి ప్రతి సంవత్సరమును దండయాత్రలు సేయనారంభించిరి. ఆ నాస్తికుల మూలమున ముసల్మానుల దేశమునకు గొప్ప విపత్తు సంభవించుచుండెను.

తరువాత అదిల్‌షాయను బిరుదునందిన అదిల్‌ఖానుడును, కుతుబ్‌శాహి సింహాసనాసీనుండగు ఆలీమలిక్ కుతుబ్ ఉల్‌ముల్కును ఆ నాస్తికుల రాజ్యమునకును సమీపస్థులగుటచేత కడుకష్టనష్టములకు పాలగుట సహజము. ఆ నాస్తికజాతియొక్క క్రోధము బలముగ అహమదనగరమునకును తత్సంబంధమగు రాష్ట్రమునకంతటికిని వ్యాపించెను." —బుర్హాన్ ఇమా అసీర్ (p. 148.)

పైదానివల్ల రాయలు అమదానగరమును ముట్టడించుటయేగాక తద్రాష్ట్రమును సైతము తన సేనాసముద్రమున ముంచెనని తెలియుచున్నది. ఈదండయాత్రను జూచినవా రగుటచేతనే పెద్దన్నగారు

'అవాడపతి శికంధర సింధురాధ్యక్షు లరిగాపు లె
[వ్వాని కరతిరాసి
కాపంచ గౌడధాత్రీపడం బెవ్వానికసివారుగా
[నేగునట్టిబయలు.'

అనుపంక్తులను వ్రాయగలిగిరి. "అసివారుగా నేగునట్టి బయలు"అన్నమాటవల్ల పెక్కుపర్యాయములు రాయలు ఉత్తరదేశముపై దండువెడలెనన్న యర్థము సూచితము.

1. Sewell. The Forgotten Empire, P. ౩57.

పెద్దవానిని (అప్పటికి అతనితండ్రి మృతినందియుండుట చేత) దక్కను రాజ్యమున కభిషిక్తునిగ జేసెను. ఇట్లభిషేకింపబడిన రాజపుత్రునికి, అదిల్ షాయున్నగు దక్కను దొర లందరును రాయలవారియెడగల భీతిచే నమ్రులై కొలిచిరి. తక్కినయిద్దరిని రాయలవారు తనతో విజయనగరమునకు గొనిపోయి, రాజపుత్రుల హోదాకుతగిన రీతిని సత్కరించి, ఒక్కొకనికి సంవత్సరమునకు ౫౦,౦౦౦ పదార్లవుల వేతనము లిచ్చుచుండెను."1

పైవిషయ మంతగ విశ్వసింపదగినదిగాదు: కృష్ణరాయలచే జిక్కిన దక్కను రాజపుత్రులలో నొక్కడు బిజాపురసుల్తానగు ఇస్మాయల్ అదిల్ షాకు బావమరిది యని న్యూనిజు వ్రాసియున్నాడు. బహమనీరాజపుత్రులలో అదిల్ షా సోదరిని పెండ్లాడినది రెండవ మహమూదు పుత్రుడైన అహమదనువాడు. రెండవ మహమూదు క్రీ. శ. ౧౫౧౮లో కాలధర్మము నందెను. తదనంతరము పై అహమదు రాజై ౧౫౨౦ వఱకు పాలించెను. తరువాత ౧౫౨౦ లో ఒకరితరువాత నొకరు, అహమదు తమ్ములు రాజులైరి. వారివెనుక సదరు అహమ్మదు కొమారుడగు కలిముల్లా సింహాసనము నధిష్ఠించెను. వీరందఱును పేరునకు మాత్రము రాజులు. వాస్తవముగ అధికార మంతయు అమీర్ బరీదు స్వాధీనమున నుండెను. కలిముల్లా ఢిల్లీశ్వరుడగు బాబరు సహాయమును గోరగా, అమీరుబరీ దాతని నిర్బంధించెను. ఆబాధ పడజాలక కలిముల్లా తన మేనమామయగు ఇస్మాయలు అదిల్ షారాజ్యమునకు పారిపోయెను. ఇంతటితో బహమని రాజ్య వంశ మస్తమించెను.

కావున క్రీ. శ. ౧౫౨౨లో జరిగిన కలుబరిగె దండయాత్రకాలమప్పటికి, బహమనీ రాజులలో కడపటివాడగు కలిముల్లా రాజ్యము సేయుచుండవలయును. కలిముల్లా అదిల్ షాకు మేనల్లుడుగాని బావమరది గాడు. మఱియు గుల్బర్గా ౧౫౧౪ సం. మొదలు అదిల్ షా స్వాధీనమందుండెను. ౧౫౨౬ తరువాతగాని కలిముల్లా బిజాపురరాజ్యమును ప్రవేశించలేదు. కావున న్యూనిజు వ్రాతలో లోప మేదియో యున్నట్లు తోచుచున్నది. ఫెరిష్టా యథార్థవాది గాడు. హిందువులపట్ల యెన్నిబొంకులైన బొంకగలడు. నిజము భావిపరిశోధనవల్లగాని బయల్పడదు.

# అరికేసరి కొల్లిపఱ శాసనము

మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

కొల్లిపఱ కాపురస్థులైన కొల్లి చిట్టారెడ్డిగారు సుమారు ఇరువది సంవత్సరములకు పూర్వము తమ తాలూకు స్థలములో పాటి మట్టి త్రవ్వుచుండగా రెండుగజముల లోతున ఈశాసనము మూతి వెడల్పుగల పెద్దకుండలో పోసియున్న బొగ్గులమధ్య నుండగా దొరకినది. దీనిని చూచి వారు దిగ్భ్రమ జెంది యీ విషయము నెవ్వరికి దెలుపక తమ యింట బోషాణముననే దానిని గొంతకాలము దాచియుంచిరి. పిదప తమపశువులు, కుటుంబము సుఖముగ నుండుటకై తమ పూర్వులు దీనిని పాతిపెట్టి యుందురని భావించి వారు దీనిని ధూప దీపాదికముల బూజించి మఱల కుండలో బొగ్గులు పోసి వాటిమధ్య దీనినుంచి యాకుండను చాల లోతుగ నొక పెంటకుప్పలో జాగ్రతగ నొక చోట పాతిపెట్టిరి. ఈసంగతి కొల్లిపఱ కాపురస్థులు ముక్కామల వెంకట హనుమద్దీక్షితుల వారికి తెలిసి చిట్టారెడ్డిగారియొద్దనుంచి బహు శ్రమపడి ఈశాసనమును సంపాదించిరి. ఆ రెడ్డిగారు పీటి నిచ్చుటకు చాలభయపడిరట. అటు తరువాత చరిత్రాభిమానులైన శ్రీమేళ్లచెఱువు పద్మనాభముగారు దీక్షితులవారి యొద్ద నుండి ఈశాసనమును దీసికొని రేకులకు అర అంగుళము దళసరిని చిలుముపట్టి అక్షరములు తెలియరాక యుండుటచే పిడకల దాలిలో వేసి గంటసేపు కాల్చి చిలుము పోగొట్టి పిదప ప్రకటనార్థము నాకడ కంపిరి.

కాల్చుటవలననో యేమో రేకులలో అక్కడక్కడ చివరల బెజ్జములుపడి కొన్నికొన్ని అక్షరములు చెడిపోయినవి. శాసన మారంభమగు మొదటిరేకు రెండవపెడ చాల చెడిపోయినది. అక్కడక్కడ పంక్తి కొకటి రెండక్షరములు తెలియవచ్చుచున్నను పంక్తి యేర్పడుటలేదు. రేకు లన్నిటిలో చాలచెడిన దిదియే. రెండవరేకు మొదటిపెడ దిగువ కడపటిపంక్తి మొదటి నాలుగైదక్షరములభాగము చెడిపోయినది. ఈ యక్షరముల ఎగువభాగములు మాత్రము కాన్పించుచున్నవి. రెండవ పెడ మొదటి రెండుపంక్తులు కడపటి రెండు పంక్తులు అచ్చటచట చెడిపోయినవి. ఈపంక్తులలో బొత్తుగ పోయిన యక్షరములు కూడ గలవు. ఎట్లయినను, రేకులు ఏకారణముననో కాని యచ్చటచట మొత్తముమీద చెడియున్నవి. ప్రకటితము లగుచున్న ప్రతిబింబములనుబట్టియే వాటిస్థితి తెలిసికొనవచ్చును. అయినను రెండవరేకునుండి కడవఱకు ఎచ్చటనో అయిదారక్షరముల విషయమున దక్క సాధారణముగ శాసనమూలపాఠ క్రమమునకు భంగము రాదు. చెడినదియు, శాసనపాఠ మేర్పఱుపరానిదియు ఒక్క మొదటిరేకే.

ఆకారాదికములు

ఈ శాసనమున అయిదు రేకులు కలవు. ఒక్కొక్క రేకు పొడవు ౮.౮ అంగుళములు; వెడల్పు 3.[illegible] అంగుళములు. రేకులు కుడి యెడమ చివరల వెడల్పుగను, నడుమ గొంచెము సన్నముగను ఉన్నవి. కొనలు ముద్రికలో అతికిన ఒక రాగికడియమున ఈ రేకులు తగిలింపబడియున్నవి. నాదగ్గఱకీ రేకులు వచ్చునరికి ఈ రాగికడియము కోయబడియుండ లేదు; రేకులను విడదీసి చదువునిమిత్తము ఆకడియమును నేనే కోసితిని. కడియముయొక్క వ్యాసము 3.౫ అంగుళములు. ముద్రిక గుండ్రముగ నున్నది. దీని వ్యాసము ౧.౯ అంగుళములు. ముద్రిక మీద ఎగువభాగమున వరాహముకలదు. వరాహమునకుపైన చంద్రుడు కలడు. ప్రాయికముగ సూర్యుడుకూడ ఉండదగును కాని తచ్చిహ్నము అరిగిపోయి యుండును. వరాహమునకు దిగువ 'అరికేసరి' అనుపేరు కలదు. మొదటి నాలుగు రేకులకు రెండుపెడలను వ్రాతకలదు. రెండుపెడలను వ్రాత లేనిది ఒక్క అయిదవ రేకే. మొదటిరేకు మొదటిపెడపూర్తిగ వ్రాత కలదు. ఇది నాలుగవ రేకు రెండవపెడ తరువాయిగ దోచును. ఈపెడయంతయు పూర్తిగ అరిగిపోవుటచేత అచ్చటచ్చట ఒక్కొక్క యక్షరము అస్పష్టముగ గనబడును.

లిపి : భాష

శాసనమునందలిది తెలుగు - కన్నడలిపి. బాదామిచాళుక్య శాసనములందును, కొన్ని మాల్యఖేటరాష్ట్రకూటశాసనములందును వాడిన లిపియే. కావున ఇందలి యక్షరములు తచ్ఛాసనాక్షరముల బోలియున్నవి. కాని యివి చాల పొంకము తేరి సుందరముగ నున్నవి. వీటిని పైని పేర్కొనినశాసనములలో నేదో యొక దానియందలి యక్షరములతో బోల్చ ప్రయత్నించుటమాత్రము కష్టసాధ్యము; ఏలయన బాదామిచాళుక్యవంశజులైన మొదటి విక్రమాదిత్య, వినయాదిత్యుల కాలమునకు దరువాతినుండి రాష్ట్రకూటరాజయిన మొదటి అమోఘవర్షునివఱకు, అనగా రమారమి క్రీ. శ. ౭౦౦లు మొదలు ౯౦౦ల వఱకు, బాదామిచాళుక్య, మాల్యఖేటరాష్ట్రకూటశాసనములలో ఈ యక్షరములు కొన్ని కొన్నిట పొంకముగ నున్నను లేకున్నను, వ్రాతకత్తులలో వ్యత్యాసము గన్పట్టినను, మొత్తముమీద నొక్కరీతి నుండుట గాంచగలము. పట్టదకల్ విరూపాక్షాలయములోని బాదామిచాళుక్య విజయాదిత్యుని శాసనములు[1], కోలారుజిల్లా శ్రీనివాసపూరు తాలూకా అరులుకోటె మహావలి బాణరాజులశాసనములు[2], అమోఘవర్షుని మంత్రవాదిశాసనము[3] (క్రీ. శ. ౮౬౫), అమోఘవర్షుని శిరూరుశాసనము[4] (క్రీ. శ. ౮౬౬)- వీటిలోని అక్షర

1. Ind. Ant. Vol. X, p. 165.
2. Ibid. pp. 38-39.
3. Ep. Ind. Vol. VII, p. 200.
4. Ibid. p. 206.

ములు చాలవఱకు ఈ శాసనాక్షరములనే పోలియున్నవి. ఆళుపుల ఉదియవర శాసన[5]లిపి కూడ సరిగా ఇట్టిదే. ఆళుప విజయాదిత్యుని ఉదియవర శాసనాక్షరములు చాల పొంకము గను, సుందరముగను ఉండి ఈ కొల్లిపఱ శాసనాక్షరములనే పోలియున్నవి. ఈ శాసనముల ను ప్రకటించిన హుల్ష్‌దొరగారు ఇవి క్రీ. శ. ౧౦౦౦ల నాటివి కాదగునని యభిప్రాయపడు చున్నారు. కొన్ని వేంగీచాళుక్య శాసనముల లోని యక్షరములుకూడ ఈ కొల్లిపఱ శాసనాక్షరములకు సరివచ్చుచున్నవి. రెండవ విజయాదిత్యుని 'ఈడేరు' శాసన[6]లిపియు, ఇదియు గూడ గొంచె మించుమించు ఒక్కతీరున నున్నవనవచ్చును. అయితే రెంటికి తేడా యిది: విజయాదిత్యశాసనాక్షరముల 'సాఫు' లేదు. ఇందలి యక్షరములు 'సాఫు'గను, సంతనగను ఉన్నవి. క, భ, మ, య, ర, స, ల మొదలైన యక్షరముల తీరంతయు నొక్కటే. మూడవ విజయాదిత్యునినాటి అద్దంకి శిలాశాసన[7]లిపియు నిట్టిదే. వీటి నన్నిటినిబట్టి చూడగా బాదామి చాళుక్యశాసనములలోని తెలుగు-కన్నడలిపి కొంచెమించుమించు రెండుశతాబ్దములపాటో, లేక ఇంచుకంత ఎక్కువగనో గమనార్హము లైన మార్పు లేవియులేక, గుర్తింపదగినంత పరిణామమునుబొందక ఉన్నదున్నయట్లే యుండెనని తేలుచున్నది. ఈ కాలమున పొంకమునను, సౌందర్యమునను అక్షరములలో మార్పు, అభివృద్ధులు కలిగెను గాని రూపమున మార్పులంతగ గలుగలేదు.

అ, ఆ, ఇ, ఉ, ఊ, ఏ అను అచ్చులు ఈశాసనమున వచ్చినవి. సంయుక్తవర్ణములలో ప్రాచీనవర్ణక్రమమునను సరించి వర్గాక్షరములు సాధారణముగ వర్గానునాసికములతోనే కలసి యున్నవి. అయినను ఇందుకు భిన్నరూపములు కూడ అందందు గాననగును (చూడు: పం.౧౮, ౨౨, ౪౨ లు). త, న, మ, శ అక్షరముల పొల్లులు ౮, ౧౮, ౨౭, ౪౪, ౪౬, ౫౧ పంక్తుల జూడదగును. ఇవి అక్షరమునకు తలకట్టుగ నున్న మీది యడ్డుగీటు తీసివేసిన నేర్పడుచున్నవి. సాధారణముగ వలపలగిలకతో నున్న హల్వర్ణము లన్నియు ద్విత్వముం బొందినవి. కాని యొకటిరెండుచోట్ల ఈనియమము పాటింపబడలేదు (చూడు: పంక్తి ౨౨-బబ్బర; పం. ౩౭-రణార్జున). అనుస్వారమునకు దరువాతి హల్వర్ణము ద్విత్వముం బొందిన సందర్భ మొక్కచోట మాత్రము కలదు (చూడు: పం. ౩౬-అంక్కుట). ఉపధ్మానీయపుగుర్తు బండిఱవలన సూచితమైనది (చూడు: పం.౧౧, ౫౨ లు). ఇంతకంటె అక్షరముల విషయమున గమనింపదగిన విశేషములు లేవు.

శాసనభాష సంస్కృతము. శాసనమంతయు గద్యపద్యాత్మకము. శాసనము కడపట "స్వదత్తాం పరదత్తాం వా......", "భూమిదా

5. Ep. Ind. Vol. IX, p. 22.
6. Ep. Ind. Vol. V, p. 127.
7. భారతి, సం. ౫, పుట ౪౮౪.

నాత్ ..." మొదలైన మామూలు శ్లోకములు కలవు. అచ్చటచ్చట భాషాదోషములు కలవు. మొదటి రేకు మొదటి పెడ పూర్తిగ అరిగిపోవుటచేత ఇప్పుడున్న రీతిని శాసన మసంపూర్ణము గనే యున్నది.

శాసన విషయము

చాళుక్యవంశజుడైన అరికేసరి యను రాజొసంగిన శాసన మిది. మొదటి రేకు రెండవపెడ చెడిపోవుటచేత అందలివృత్తాంతము తెలియవచ్చుట లేదు కాని తెలియవచ్చు దానినిబట్టి చూడ అందలివి మంగళశ్లోకములుగ గాన్పించును. రెండవ రేకు మొదటి పెడగల మొదటిశ్లోకము చాళుక్యవంశ ప్రశస్తిని దెలుపును (పం. ౧౦ వఱకు). ఆ వంశమున పాలసంద్రమున చంద్రునివలె సత్యాశ్రయుడు పుట్టెను. ఇతడు తనఖడ్గప్రతాపమున శత్రురాజులను లోబఱుచు కొన్నవాడు. ప్రభుగుణమహితుడు: భూతలమున విశేషకీర్తి నార్జించినవాడు (పం. ౧౦-౧3 లు). రణవిక్రముడు, పృథుబలుడు అయిన ఆసత్యాశ్రయ మహీపతికి పృథివీపతి యను కుమారుడు పుట్టెను (పం. ౧3-౧౪ లు). ఆ పృథివీపతికి భూమిని ప్రసిద్ధిగన్న(?)మహారాజు అను కుమారుడు కలిగెను (పం. ౧౪-౧౬ లు). ఆ మహారాజునకు పృథువిక్రముడును, పృథు మాంధాతలతో సమానుడును అయిన రాజాదిత్యు డను తనయుడు కలిగెను(పం. ౧౬-౧౭లు). రాజాదిత్యుని కొడుకు వినయాదిత్యుడు. ఇతనికి శ్రీరాముడు, ధామవిక్రముడు, విశ్వరాట్, యుద్ధమల్లుడు, నృపాంకుశుడు అను బిరుదములు కలవు (పం. ౧౭-౧౮). రాజాశ్రయుడైన యీయుద్ధమల్లుడు (వినయాదిత్యుడు) సాగరవేలావేష్టితమైన సకలధరామండలమునకు అధిపతి యని ఈతనిని గుఱించిన వర్ణన కలదు (పం.౧౯-౨౨ లు). ఈతడు తురుష్క, యవన, బర్బర, కాశ్మీర, కాంభోజ, మగధ, మాళవ, కళింగ, గంగ, పల్లవ, పాండ్య, కేరళ ప్రభృతి నరపతి ససంభ్రమ సమర్చిత పాదపీఠుడని తెలుపబడినది: అనగా పూర్వోక్త నృపతుల నందఱిని జయించెనని భావము (పం. ౨౨-౨3 లు). ఇతడు భగవన్నారాయణుని వరాహలాంఛనముచేత భూచక్రమునంతను వశపఱుచుకొన్నవాడు (పం. ౨౮). ఈవినయాదిత్యమహారాజుకొడుకే అరికేసరి. ఇతడే యీశాసనమున దాత. ఇతడు నల, నహుష, దిలీప, దుంధుమారులతో సమానుడు (పం. ౨౪-౨౬ లు). అరికేసరి గుణాభివర్ణనము (పం. ౨౬-౨౯ లు). ఇతడు (?)వ్యాకరణ, ధర్మవేత్త; గజతంత్రమున - గజశాస్త్రమున - సమర్థుడు; న్యాయనిపుణుడు; ధనుర్విద్యలో విశ్రుతుడు. వైద్యశాస్త్రమునసధికుడు (పం. ౨౯-3౦లు). మఱల ఇతనినిగుఱించిన వర్ణనము (పం. 3౦-3౮ లు). ఇతనికి సమస్తలోకాశ్రయు డని, త్రిభువనమల్లుడని, రాజత్రినేత్రు డని, సాహసరాము డని యభిధానములు కలవు(పం. 3౮-3౪ లు). ఇచ్చటినుండి ప్రతిగ్రహీతయైన శివాచార్యుల వర్ణనము కలదు. కలివ్యాపించిన యీజగతి యందు దానమున ఐరావతమును (సురేంద్రదే

భము), తేజస్సున సూర్యుని (అర్కుడు), స్థితిని సముద్రమును (సాగరము) జయించినట్టియు, మహాత్ముడైనట్టియు "అంకుట" గురుకుల ప్రభువులైన శైవాచార్యులచే పొందబడిన తపఃప్రభావముకలిగినట్టియు, శ్రీకంఠుని(శివుని) కావాసమైన శ్రీపర్వతము (శ్రీశైలము)న కుత్తర ద్వారమైన ఏలీశ్వరము (?ఏలేశ్వరము) నిలయముగా జేసికొన్నట్టియు, సదా శాకాహారియైనట్టియు సద్యోశివాచార్యునికి శిష్యుడును, (శైవ) సిద్ధాంత నిబద్ధ బుద్ధియు, ధ్యానముచే పోగొట్టబడిన పాపసంచయము కలవాడును, శుద్ధ చరితుడును, మహితుడును, ముగ్ధశశిశేఖరుడును అగు ముగ్ధశివాచార్యుడు కలడు (పం. ౩౫-౪౦). ఈశివాచార్య మహామునికి సమస్త లోకాశ్రయ, రాజత్రినేత్ర, రాజాంకుశనామముల నొప్పు అరికేసరి మహారాజు (?)రామడు విషయమున ('రామడువిషే') ఊరిగె యను మహాప్రసిద్ధమైన గ్రామమునకు దక్షిణదిగ్భాగమున నున్నట్టియు, "తువతోఱు", "పరివాతుర్ల", "పుల్చెఱువుళ్", "పోతువాదుపి" గ్రామముల మధ్య నున్నట్టియు "బెల్మొగ" మని విశ్రుతమైన గ్రామమును విద్యాదానముగ నిచ్చెను (పం. ౪౦-౪౬ లు). ఈవిషయమును దెలుపుటకే యీశాసనము పుట్టెను. నాలుగవ రేకు రెండవప్రక్క వ్రాయబడిన శ్లోకము లన్నియు శాసనాంతమున నుండు మామూలు శ్లోకములు. సాధారణముగ శాసనములందివి "వ్యాసేనాప్యుక్తం", "వ్యాసగీతాః" అని ప్రారంభమగుచుండ ఇందు "ఉక్తం చ మన్వాదిభిః" అని యారంభమగును (పంక్తులు ౪౭-౫౨).

శాసనవిషయ విమర్శనము

ఈశాసనము చాళుక్యవంశజుడైన అరికేసరి మహారాజుది. ఈరాజు వంశావతారక్రమము శాసనము ననుసరించి యిట్లు తెలియుచున్నది:




ఈ కడపటియాతడే మనశాసనదాత. సత్యాశ్రయునికి రణవిక్రము డనియు, రాజాదిత్యునికి పృథువిక్రము డనియు బిరుదములు కలవు.

అరికేసరి నామమునం బరగు చాళుక్య వంశమహీపతులు చరిత్రకు దెలియవచ్చినవారు ఇంతవఱకు ఇరువురుమాత్రమే కలరు: ఒకడు భారతనామాంతరమునం బరగు విక్రమార్జున విజయమును రచియించిన కర్ణాటకవి పంపని కాశ్రయు డగు అరికేసరి: రెండవవాడు నిజాంరాజ్యమునం గల శిలాశాసనములవలన దెలియవచ్చిన అరికేసరి. మనశాసనదాతతో

గలసి వీరు మువ్వురగుచున్నారు. ఈ మువ్వురు నొక్కరగునో కాదో చూతము.

౧. పంపకవి జైనబ్రాహ్మణుడు: కొండకుందాన్వయమునకు జెందినవాడు. వేంగిమండలమున వేంగిపళు అను గ్రామము కలదు: ఈ గ్రామమునకు జేరి కొట్టూరు, నిడుగుంది, విక్రమపురము అను నగ్రహారములు కలవు. వీనిలో అగ్రగణ్యుడైన వత్సగోత్రోద్భవుడగు మాధవసోమయాజి యుండెను. ఇతని కొడుకు అభిమానచంద్రుడు. ఈతని ప్రపౌత్రుడే ఆది పంపకవి. ఈతనిగురువు దేవేంద్ర ముని. పంపకవి పులిగెరె రాజయినట్టియు, చాళుక్యవంశ సంభవుడైనట్టియు అరికేసరియొక్క ఆస్థాన పండితుడు. ఈతడు ఆదిపురాణ, భారత నామాంతరములం బరగు విక్రమార్జునవిజయమును రచియించెను. ఈకవి తానీగ్రంథమును శకవర్షము ౮౬౩ కు సరియైన ప్లవ సంవత్సరమున రచియించినట్లు అందే తెలిపియుండుటచేత ఈతడును, ఇతని కాశ్రయుడైన అరికేసరియుగూడ క్రీ. శ. ౯౪౧ నాటివారని స్పష్టపడుచున్నది. ఈవిక్రమార్జునవిజయకావ్యమును విని సంతోషించి అరికేసరి పంపకవికి "బచ్చె సాసిరము (వేయి)"లోని ధర్మపురమును అగ్రహారముగ నొసంగెను.

పంపకవి తనవిక్రమార్జునవిజయమున తన కాశ్రయుడైన అరికేసరినరపాలునివంశము నీ క్రిందిరీతి నభివర్ణించియున్నాడు :

చాళుక్యవంశమున యుద్ధమల్లు డనురాజు ఒక డుండెను. ఇతడు సపాదలక్షక్షితీశుడు. ఇతనికి అరికేసరి యను కొమారుడు కలిగెను. ఇతడు నిరుపమదేవుని రాజ్యముపై దండెత్తి వెళ్లెను. ఇతనికి నరసింహ, భద్రదేవ నామాంకితులు ఇరువురు తనయులు కలరు. వీరిలో నరసింహభూపతి జ్యేష్ఠుడు. ఇతనికి దుగ్ధమల్లుడను కొమారుడు కలిగెను. ఇతని యగ్రసుతుడు బద్దెగనృపతి. నలువదిరెండు యుద్ధములలో ఇతడు తనశత్రువుల నోడించెను. ఇతడు తన విక్రమముచేత వనధి పరీతమైన భూతలమునందంతట 'సోలదగండడు' (ఓటమిలేని దండిముగడు) అను బిరుదుపేరు గాంచెను. మొసలిని పట్టుకొననో యన్నట్లు నీట జొచ్చి గర్వితుడైన భీముని బట్టుకొనెను. భద్రదేవు డనియు ఈతనికి నామాంతరము కలదు. బహువిధ లక్షణప్రవీణ నృపాలుడైన దుగ్ధమల్లుడు ఈ భద్రదేవుని కొమారుడు. ఈ (రెండవ) దుగ్ధమల్లుని తనయుడు (రెండవ) నరసింహమహీపతి. ఈతనినే కలినరసింహు డందురు. ఇతడు సుభద్రముని శిష్యుడు. ఈనరసింహుడు లాళులతో (లాటులతో) యుద్ధముచేసెను. (?) ఏడు మాళలము దొరలను దోచుకొనెను. ఘూర్జర రాజసైన్యమును పారదోలెను. ఈతని సైన్యమును జూచి భయపడి మహీపాలుడు పారిపోయెను. గంగాసాగరసంగమమున ఈతడు తన యశ్వమును గడిగెను. జాతవ్వ (? జాకవ్వ) యితనిభార్య. ఈ జాతవ్వ నరసింహ భూధవులకు (రెండవ) అరికేసరి యను కుమారుడు

కలిగెను. ఇతడు పంచమహాశబ్ద గౌరవాంచితుడు: గుణార్ణవుడు. సకల చక్రవర్తియైన గొజ్జిగుడు విజయాదిత్యునిపై దండెత్తిరాగా ఆతనికి బాసటయై యాతనిని పరిరక్షించెను.

విక్రమార్జున విజయము ననుసరించి తెలియవచ్చు సంగతులివి. వీటినిబట్టి అరికేసరి వంశవృక్షము నీక్రిందిరీతి నేర్పఱుపవచ్చును:




పంపకవి వర్ణించిన యీచాళుక్యవంశావతారక్రమమున దెలిపిన రాజులపేరులు పూర్వపశ్చిమచాళుక్య వంశములందు కానరాకపోవుటచేత ఈకవి తెలిపిన విషయములు సత్యములగునో కావోయని కొందఱు సంశయించుచున్నారు: కాని ఆదిపంపకవి తన కాశ్రయమిచ్చినవాని వంశవృక్షము నిచ్చుటలో అసత్యములు వ్రాసెననుటకు హేతువు కానరాదు. అదియునుగాక యీచాళుక్య వంశజులు జయించినట్లు తెలుపబడిన యితరరాజులు కల్పిత పురుషులు కారని ఫ్లీటుదొరగారు ఈక్రిందిరీతిని వ్రాసియున్నారు:

"ఈచాళుక్య వంశమున పేర్కొనబడిన యితర రాజులను గుఱించి యాలోచించి చూచిన గొజ్జిగుడు రాష్ట్రకూటరాజయిన సువర్ణవర్ష (నాలుగవ) గోవింద భూపతి కావలెను. ఇతడు క్రీ. శ. ౯౩౦-౯౩౩ సంవత్సరములనడుమ పాలించుచుండెను. ఇతని పేరు గొజ్జిగదేవుడనికూడ కలదు. విజయాదిత్యుడు నిస్సంశయముగ పూర్వచాళుక్యభూపాలుడైన నాలుగవ కొల్లభిగండ విజయాదిత్యుడే. ఇతడు క్రీ. శ. ౯౧౮ నాటివాడు. ఎఱప ప్రాయికముగ పశ్చిమగంగ రాజయిన ఎఱెయప్ప కావచ్చును........భీముడు క్రీ. శ. ౮౮౮-౯౧౮ సంవత్సరములనడుమ నుండిన పూర్వచాళుక్యమొదటిభీముడు కావచ్చును. తరములనుబట్టి చూచినచో నిరుపమదేవుని క్రీ.శ.౭౮౦ కు ఇంచుక పూర్వముండిన రాష్ట్రకూటరాజయిన కలివల్లభ నిరుపమ ధారావర్ష ధ్రువునిగ గుర్తింపవచ్చును. చాళుక్య వంశవర్ణనసందర్భమున పేర్కొనబడిన యితర రాజులీవిధముగ గుర్తింపబడుచున్నందువలన పంపకవి తెలిపిన వంశావతారక్రమము సాధారణముగ సరియైనదే యని స్థిరపఱుపవచ్చును.[8]"

పంపకవి తెలిపిన సంగతులీవిధమున విశ్వాసయోగ్యములగుచున్నవి. ఇక అరికేసరి రాజధానియైన పులిగెరెవిషయము విచారింతము. ఫ్లీటుదొరగారు దీనిని ధార్వాడజిల్లాకు చేరికగ ఆగ్నేయదిశనున్న మిరాజ్ సంస్థానములోని లక్ష్మేశ్వరము తాలూకాకు ముఖ్యపట్టణమైన లక్ష్మేశ్వరముగ గుర్తించియున్నారు. ఈలక్ష్మేశ్వరము చాల పురాతననగరము. ఇందు ప్రాచీనదేవాలయములు అనేకములు కలవు. అందు (౧) సోమేశ్వరాలయము (౨) శ్రీ లక్ష్మీలిం

8. Bomb. Gaz. Vol I. Pt-I. PP 380-381

గాలయము (3) శంఖబస్తి యను ప్రాచీన జైనాలయము (४) హాలబస్తియను జైనాలయము (చిన్నది) (౫) కొడియెల్లమ్మగుడి (?) ఇవి ముఖ్యమైనవని తెలియుచున్నది[9]. ఇచ్చట ప్రాచీనశాసనములుకూడ అనేకములు కలవు కాని యివియన్నియు ఇంకను ప్రకటితములు కాలేదు[10]. ఈప్రాచీనశాసనములలో పులిగెరెపేరు కనబడుచుండుటచేతను,[11] పులిగెరెలోని శంఖ (జినేంద్ర) వసదికి చేయబడినదానము లీలక్ష్మేశ్వరశాసనములందు దెలుపబడియుండుటచేతను లక్ష్మేశ్వరము పులిగెరె యనియే నిశ్చయింపవచ్చును. పంపకవి కాశ్రయుడైన అరికేసరికిని, అతని వంశమునకును సంబంధించిన విషయములివి.

౨. ఈవిధముగ దెలియవచ్చిన విషయముల నన్నిటిని సమన్వయించి ఫ్లీటుదొరగారు ఈభారతోక్త చాళుక్యవంశము పూర్వచాళుక్యవంశమునకు గాని బాదామి చాళుక్యవంశమునకుగాని సంబంధించినదా? ఈరెంటిలో దేనితోనైన దీనిని ముడిపెట్టవచ్చునా? యని కొంత విమర్శించి యున్నారు. లక్ష్మేశ్వరమునే పులిగెరెగా గుర్తించియుండుటచేత ఫ్లీటుదొరగారు దానికిని విజాపురమండలములోని బాదామికిని గల ప్రాంతసన్నిహితత్వము నాలోచించి భారతోక్తవంశమునకును, బాదామి చాళుక్య వంశమునకును సంబంధముండవచ్చునని యనుమానించిరి. కాని యీ బాదామి చాళుక్యవంశమున యుద్ధమల్లు డను పేరుగలవాడు కానరాడు. ఒక్కకౌథేమ్ శాసనమున[12] మాత్రము బాదామి చాళుక్య వంశజుడైన సత్యాశ్రయ వినయాదిత్యునికి యుద్ధమల్లనామము కలదు. ఇంతటి యనిశ్చితాధారమును ప్రమాణముగనే గ్రహించి సత్యాశ్రయవినయాదిత్యుడైన యుద్ధమల్లుడును, భారతోక్తవంశములోని యుద్ధమల్లుడును ఒక్కరేకావచ్చుననుకొన్నను భారతోక్తవంశమునందలి రెండవ అరికేసరినుండి వెనుకకు తరములనుబట్టి లెక్కచూచినచో ఆ యుద్ధమల్లుని కాలమును, సత్యాశ్రయ వినయాదిత్యుని కాలమును సరిపోదు కావున ఫ్లీటుదొరగారు ఈయనుమానము వదలుకొనవలసినవారైరి. భారతోక్తవంశమునకు బాదామి చాళుక్యవంశమునకు సంబంధము లేదని తేలినది. పూర్వచాళుక్యవంశసంబంధమును విచారింప, ఆవంశమున క్రీ. శ. ౯౭౫ నాటి తాడపరాజకుమారుడైన యుద్ధమల్లునికి పూర్వము తన్నామాంకితులెవ్వరును గానరానందున ఆ

9. Revised lists of antiquarian remains in the Bombay Presidency—p. 150.

10. వీటిలో గొన్నిమాత్రమే ప్రకటింపబడినవి. చూడుడు: P. S. & O. C. Ins. No. 97; Ind. Ant. Vol. VII, pp. 101 & 111; XI, p. 156; Jour. Bo. Br. R. As. Soc. Vol. IX, p. 329.

11. రాష్ట్రకూట శాసనము లన్నియు ఈ గ్రామనామమును 'పులిగెఱె' యని పేర్కొనుచున్నవనియు, ఇతర రాజవంశముల శాసనములం దిది 'పులిగెఱె'యని పేర్కొనబడిన దనియు ఫ్లీటుదొరగారు తెలుపుచున్నారు— Ind. Ant. Vol. XI, p. 156.

12. Ind. Ant. XVI, p. 21.

వంశమునకు నీభారతోక్తవంశమునకు కూడ సంబంధము లేదని ఫ్లీటుదొరగారు నిర్ణయించిరి. కాని తాలపరాజకుమారుడు కాక అంతకు పూర్వుడు మరియొక యుద్ధమల్లుడు పూర్వచాళుక్యవంశమున లేకపోలేదు. అతడు తాలపరాజు తండ్రి మొదటియుద్ధమల్లుడు. ఈతడు కలివిష్ణువర్ధనుడనబడు అయిదవ విష్ణువర్ధనుని కొడుకు[13]; మూడవవిజయాదిత్య, యువరాజవిక్రమాదిత్యుల సోదరుడు: క్రీ.శ.౮౮౦-౮౯౦ కాలమునాటివాడు. పూర్వచాళుక్యవంశమున క్రీ. శ. ౯౨౪కు పూర్వమే అనగా క్రీ. శ. ౮౮౦-౮౯౦ ప్రాంతములనే ఇట్లు ఒక యుద్ధమల్లనామాంకితు డుండెనని యంగీకరించినను రెండవ అరికేసరికాలమునుబట్టి తరములు వెనుకకు లెక్కించిచూచినచో తద్వంశకర్తగ దెలుపబడిన యుద్ధమల్లుడు నితడు నొకకాలమునాటివారు కారని తేలును. ఈవిధమునజూచినను పూర్వచాళుక్యవంశమునకు భారతోక్తవంశమునకు సంబంధము కుదురుటలేదు. అందువలన పంపభారతోక్తచాళుక్యవంశమును ఉన్నదున్నట్లుగ గైకొని ఫ్లీటుదొరగారు చెప్పినట్లు ఇటు పూర్వచాళుక్య వంశముతో గాని, అటు బాదామి చాళుక్యవంశముతో గాని సమన్వయించి సంబంధము కలుపుదమన్న వీలుపడుటలేదు.[14]

3. ఇక చరిత్రపాఠకులకు దెలిసిన మఱియొక అరికేసరినిగుఱించి విచారింతము. హైదరాబాదు ఆంధ్రచరిత్ర పరిశోధక సంఘమువారు తెలింగానాలో సంపాదించిన చాళుక్య శాసములలో ఒకదానిలో చాళుక్యవంశావతారక్రమ మీ రీతిని దెలుపబడినది :

(మొదటి) యుద్ధమల్లుడు
|
(మొదటి) అరికేసరి
|
(మొదటి) నరసింహుడు
|
ఆదిత్యుడు
|
(రెండవ) యుద్ధమల్లుడు
|
(రెండవ) నరసింహుడు
|
(రెండవ) అరికేసరి

ఈ శాసన మింతవఱకు ప్రకటింపబడలేదు. ఈశాసనమునందలి వంశావతారక్రమము మాత్రమే ఒకనివేదికలో దెలుపబడినది.[15] నివేదికయైనను ఇంత కెక్కువ విశేషములను

13. Ep. Ind. Vol. IX, p. 47.

14. భారతి, సం. 3, సం. ౧౨ న వేంగీచాళుక్యులను శీర్షికక్రింద నేనువ్రాసిన అయిదవ వ్యాసమున పంపభారతోక్త చాళుక్య యుద్ధమల్లుడును, కలివిష్ణువర్ధనుని కొడుకయిన మొదటి యుద్ధమల్లుడు నొక్కరే యని వ్రాసియున్నాను. (చూడు: పుట ౮౨; ౬వ పుటనోటుకూడ). కాని తరములనుబట్టి లెక్కించిన ఇరువురి కాలము సరిపోదు; కావునఅదట వ్రాసినది పొరపాటు.

15. ఈనివేదికను హైదరాబాదు 'నిజాముకాలేజి' చరిత్రాధ్యాపకులైన శ్రీయుత యస్. వి. హనుమంతరావుగారు, వారి కుత్తరము వ్రాసినవెంటనే దయతో బంపియున్నారు. వారి కిందుమూలమున నాకృతజ్ఞతాపూర్వకవందనములను దెలుపుకొనుచున్నాను. హెచ్. యి. హెచ్. నైజామువారి రాష్ట్రమున చారిత్రక పరిశోధనను గుఱించి యొకపత్రికకు శ్రీ హనుమంతరావు

దెలుపుటలేదు. ఈ శాసనమును బట్టి తెలియవచ్చిన వంశావతారక్రమమునకు, పంప భారతవంశావతార క్రమమునకు చాల దగ్గఱ సంబంధము కన్పట్టుచున్నది. రెండు వంశవృక్షములును యుద్ధమల్లునితోనే ఆరంభమగుచున్నవి. అంతేకాదు; మొదటి నరసింహునివఱకు అవి రెండు నొక్కటే. ఇచ్చటినుండి రెండును భేదించును. హైదరాబాదు శాసనోక్తవంశము ప్రకారము నరసింహుని పుత్రుడు ఆదిత్యుడు, పౌత్రుడు యుద్ధమల్లుడు; పంపకవి యొసంగిన వంశము ప్రకారము నరసింహుని పుత్రుడు దుగ్ధమల్లుడు; పౌత్రుడు భద్రదేవుడను బద్దెగ నృపతి; ప్రపౌత్రుడు దుగ్ధమల్లుడు. నరసింహుని ప్రపౌత్రుడైన యీదుగ్ధమల్లుడును, హైదరాబాదు శాసనవంశమునందలి నరసింహుని పౌత్రుడైన యుద్ధమల్లుడును—దుగ్ధమల్లుడనునది యుద్ధమల్లుడనుటకు పొరపాటు అనుకొని—ఒక్కరే యన్నయెడల హైదరాబాదు శాసనవంశమున ఏకారణముననో ఒక్క తరము లోపించి పోయినదని చెప్పవలసియుండును. మఱల ఈ యుద్ధమల్లు (దుగ్ధమల్లు)ని నుండి కడవఱకు రెండువంశములందలి క్రమమును సరిపోవుచున్నది. ఇట్లీరెంటికి ఇంచుక వ్యత్యాసము కాన్పించుచున్నను మొత్తముమీద నీరెండువంశములందు దెలుపబడినవారు నొక్కరేయనియు, హైదరాబాదు శాసనవంశమునందలి రెండవ అరికేసరియు, పంపకవి కాశ్రయుడైన రెండవ అరికేసరియు నొక్కరే యనియు నానమ్మకము.

శ్రీ టుదొరగారు చెప్పినట్లు లక్ష్మేశ్వరమునకు పులిగెఱె నామాంతరము కలదని అంగీకరించినప్పటికి హైదరాబాదు శాసనాధారమున అది పంపకవి కాశ్రయుడైన రెండవ అరికేసరి రాజధానిగ నంగీకరింపరాదని నా యభిప్రాయము. పులిగెఱె, పులిచెఱువు నామాంకితములైన గ్రామములు చాల కన్పట్టుచున్నవి. అట్టిచో అరికేసరి రాజధాని ఈ పులిగెఱెయే (లక్ష్మేశ్వరము) అన్న సిద్ధాంతమేమి? అది యునుగాక హైదరాబాదు శాసనోక్త చాళుక్యవంశమును, భారతోదిత చాళుక్య వంశము నొక్కటియేయై, నే నూహించునట్లు ఈ యిరువురు ద్వితీయ అరికేసరి భూపతులు నొక్కరే యగుచో వీరిశాసనములు నిజాం రాజ్యమున గానవచ్చుచుండ వీరికి ధార్వాడ ప్రాంతమునందలి పులిగెఱె ఎట్లు రాజధాని యగును? ఇందువలన కూడ అరికేసరి రాజ్యము నిజాం రాజ్యముననే యుండవలెను. అందునను-ఇది హైదరాబాదు ఆంధ్రపరిశోధకసంఘమువారు తెలింగానాభాగమున సంపాదించిన శాసనమే గనుక నిజాంరాజ్యమునందలి-తెలింగానాభాగ

గారు వ్రాసినవ్యాసమే యీనివేదిక. నివేదికలో తెలుపబడిన యీఅరికేసరి శాసనము ప్రకటితమైనచో ఇందు తెలుపబడిన చాళుక్యవంశమును గుఱించి పెక్కువిషయములు తెలియరాగలవని నానమ్మకము. వ్యయప్రయాసముల కోర్చి నిజాంరాజ్యమునందలి చారిత్రకపరికరములను సంపాదించుచున్న హైదరబాదు ఆంధ్రచరిత్రపరిశోధక సంఘమువారు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులు.

మున నే యుండదగును. ఇది వేంగీవిషయము నకు చేరిక గనుకనే పంపకవి తనకు సమీపస్థుడైన అరికేసరి యాస్థానమును జేరి ఆతని నాశ్రయించి యుండును.

హైదరాబాదు ఆంధ్ర పరిశోధకసంఘము వారిచే సంపాదితమైన యీ రెండవ అరికేసరిశాసన మేగ్రామమునందలిదో ఏకాలమునాటిదో నివేదికలో దెలుపబడకపోవుట చేతను, ఆశాసన మింకను ప్రకటితముకాకపోవుటచేతను అందును గుఱించి విశేషము చర్చించుట కవకాశములేదు. అందువలన హైదరాబాదు శాసనవిషయము నింతట విడిచిపెట్టి మన శాసనవిషయమునకు మఱలుదము.

౭. మన శాసనము నందలి వంశావతారక్రమము ననుసరించి చూచినయెడల నీవంశ మొకవేళ బాదామిచాళుక్యవంశశాఖ యగు నేమో యని తోచును కాని యీవిషయమును నిర్ధారణగ జెప్పుటకు వీలు కనిపింపదు. ఏల యన తరతరమునకు అన్నియు సందేహములుగనే యున్నవి.

మన శాసనవంశమునందలి మొదటిరాజు సత్యాశ్రయుడు. ఇతనికి రణవిక్రమ బిరుదము కలదు. బాదామిచాళుక్యవంశములోని మొదటి పులకేశికిని రణవిక్రమ, సత్యాశ్రయ నామములు కలవు. ఈకారణమున ఇరువురు నొక్కరే యగుదురన్నచో మనశాసనమునందలి పృథివీపతి మొదటి పులకేశి కొమారుడైన మొదటి కీర్తివర్మ కావలెను. మొదటి కీర్తివర్మశాసనములలో నెచ్చటను అతనికి పృథివీపతియను రూఢిపేరున్నట్లు తెలియరాదు. ఒకవేళ పృథివీపతి కీర్తివర్మయే యగునేని అతని కుమారుడైన (?)మహారాజు సత్యాశ్రయ రెండవపులకేశి కావలెను. రెండవపులకేశి యేశాసనము లందును వట్టి మహారాజనామమున పేర్కొనబడలేదు. రెండవ పులకేశికి ఆదిత్యవర్మ, చంద్రాదిత్యుడు, విక్రమాదిత్యుడు, జయసింహవర్మ అను నలుగురు తనయులు కలరు. మన శాసనమునందలి మహారాజును రెండవ పులకేశియు నొక్కరే యని మనము విశ్వసించినచో మనశాసనమున 'మహారాజు' కొడుకుగ దెలుపబడిన రాజాదిత్యుడు ఆదిత్యవర్మయో, చంద్రాదిత్యుడో కావలెను. చంద్రాదిత్యునిశాసనము లేవియు ఇంతవఱకు గనబడలేదు కాని యతని భార్యయైన విజయమహాదేవి దానములను దెలుపు రెండుశాసనములు కలవు: ఒకటి సావంతవాడిసంస్థానములోని నెరూరు శాసనము[16]: రెండవది రత్నగిరిమండలములోని కోచ్రేమ్ శాసనము.[17] ఈశాసనములు దొరకిన స్థలములు ధార్వాడమండలమునకు సమీపస్థములే. ఇక ఆదిత్యవర్మది ఒక్క శాసనము మాత్రమే కలదు. అది కర్నూలుశాసనము.[18] ఇందు శకవర్షములేదు కాని శాసనకాలము "ప్రవర్ధ

16. Ind. Ant. Vol. VII, p. 163.
17. Ind. Ant. Vol. VIII, p. 44.
18. Jour. Bo. Br. R. As. Soc. Vol. XVI, pp. 223.

మానవిజయరాజ్య ప్రథమసంవత్సరే కార్తిక పౌర్ణమాస్యాం" అనిమాత్రము కలదు. పైతా మహీహిరణ్యా గర్భమహోత్సన సమయమున ఆదిత్యవర్మ కొంతమంది బ్రాహ్మణులకు చేసిన ముండకల్లు, పల్గితె గ్రామములకు సంబంధించిన "ఉంఛమన్న పన్నాస వృత్తి" దానమును తెలుపుట కీశాసనము పుట్టినది. ఇందు చాళుక్య శాసనముల పరిపాటిగ గాంచనగు "(శ్రీ) మతాం సకలభువనసంస్తూయమాన మానవ్యస గోత్రాణా" మను చాళుక్య వంశప్రశస్తి కలదు. చంద్రాదిత్యుడో, ఈ ఆదిత్యవర్మయో మన శాసనమునందలి రాజాదిత్యుడు కాదగును. లక్ష్మేశ్వరమే పులిగెఱెయన్న ఫ్లీటు దొరగారి దిద్దుబాటు నంగీకరించినచో ప్రాంతసన్నిహితత్వము ననుసరించి మన రాజాదిత్యుడు చంద్రాదిత్యుడు అగుననవచ్చును. పులిగెరె లక్ష్మేశ్వరము కాదన్నచో ఆదిత్యవర్మశాసనమున మఱియొకపల్గిఱె (? పుల్గిఱె) కానవచ్చుచున్నందువలనను, ఆశాసనము కర్నూలుమండలమున గానవచ్చుట వలనను కర్నూలుమండలముననో దానికి చేరికగనో ఎచ్చటనో మఱియొక పుల్గిఱె (పులిచెఱువు - పుల్చెఱువు- పుల్చెరువు) ఉండునని భావించుకొని మనశాసనపు రాజాదిత్యుని యీఆదిత్యవర్మతో ముడిపెట్టవలసి యుండును. పులిచెఱువులు పులిగెఱెలు (గ్రామములు) చాలచోట్లకలవు. కర్నూలుమండలమున ఒక పుల్చెఱువు కలదు. చిత్తూరుజిల్లాలోకూడ ఏతన్నామాంకిత గ్రామములు కలవు. అదియునుంగాక మనశాసనమునందలి ప్రతిగ్రహీతయైన ముగ్ధశివాచార్యులగురువగు సద్యోశివాచార్యులు (?)ఏలీశ్వరము నివాసముగ జేసికొన్నట్లు చెప్పబడి యుండుటవలనగూడ ప్రాయికముగ మనశాసనమునందలి అరికేసరి ఏలీశ్వరప్రాంతము వాడనియు నూహింపనవకాశము కలదు. అట్లయిన శాసనదాతయైన అరికేసరి రాజ్యము కర్నూలుమండలమునగాని లేక దాని యిరుగు పొరుగుల నిజాంరాజ్యమునందలి మండలములలోగాని వ్యాపించియుండవలయును. ఇదియే మన మంగీకరించునెడల శాసనమునందలి రాజాదిత్యుడు బాదామిచాళుక్యవంశజుడైన ఆదిత్యవర్మ యగునేమో యని యనుమానము కలుగుచున్నది. అట్లయిన మనశాసనదాత బాదామి చాళుక్యులలోని ఆదిత్యవర్మవంశమునకు చెందినవాడు కావలెను.

ఆ వంశమునకు చెందినవా డయినను కాకపోయినను ఏలీశ్వరప్రాంత సన్నిహితత్వమును ఆలోచింపగా మన అరికేసరి కర్నూలు మండలమువాడో లేక దానికి చేరికగనున్న (నిజాంరాజ్యము, చెన్నరాజధాని) మండలములలోనివాడో యగునని నా నిశ్చయము. అదియునుగాక దానము చేయబడిన గ్రామమునకు సరిహద్దుల నున్నట్లు తెలుపబడిన గ్రామముల వన్నియు తెలుగుపేర్లగనే యుం[illegible] కూడ ఈ యూహను బలపఱుచును. వీటిలో ఒక్కటియు కన్నడపు పేరు కానరాదు.

మన శాసనమునందలి అరికేస[illegible]ఆదిత్యవర్మ వంశమునకు సంబంధించినవాడే [illegible]నచో

—తరమున కిరువదియైదు సంవత్సరములు చొప్పున లెక్కచూచినచో—అతడు క్రీ. శ. ఎనిమిదవశతాబ్ది మొదటిపాదములోనివాడు అనగా క్రీ. శ. ౭౧౫-౭౨౦ నాటివాడగును.

౫. ఇక మన శాసనమునందలి చాళుక్యవంశమునకు, పంపభారతోక్తచాళుక్యవంశమునకు ఏదైన సంబంధము కలదేమో యించుక విచారింతము. పంపకవి కాశ్రయుడైన అరికేసరి రాజధాని పులిగెఱె. కెఱె యను కర్ణాట పదమునకు తెలుగున చెఱువని యర్థము. పులిగెఱె పులిచెఱు వగును. మన శాసనమున గూడ పులిచెఱువు వచ్చును. అది దానము చేయబడిన గ్రామమునకు సరిహద్దు గ్రామములలో నొక్కటి. ఈ పులిచెఱువు—అతని రాజధానియైనను కాకపోయినను—దాతయైన అరికేసరి రాజ్యములోనిదని చెప్పవచ్చును. దాత చాళుక్యవంశజుడగుటయు, పులిచెఱువు (పులిగెఱె) అతని రాజ్యములోనిదగుటయు జూడ పంపభారతచాళుక్యవంశమునకు, మనశాసన చాళుక్యవంశమునకు గూడ గొంత సంబంధ ముండిన నుండవచ్చునని తోచుచున్నది. ఈ విధమునగూడ దాతయైన అరికేసరి నిజాంరాజ్య ప్రాంతమువాడే యగును. మన శాసనవంశమునకు, భారతోక్తచాళుక్యవంశమునకు సంబంధము కలదని యంగీకరించునెడల మనశాసనము నందలి వినయా[దిత్యు]నికి యుద్ధమల్ల నామాంతరము కలదుగావున అతడును, అతని తన[యుడగు] అరికేసరియు పంపకవి యిచ్చిన వంశ[వృక్ష]ములోని మొదటి యుద్ధమల్ల, అరికేసరులు కావలెను. తరములనుబట్టి లెక్కించి చూచిన యెడల భారతమున దెలుపబడిన మొదటియుద్ధమల్లుడు క్రీ. శ. ౭౪౦-౭౬౦ ప్రాంతమువాడగును. ఆదిత్యవర్మ వంశసంబంధము నంగీకరించిన మన యుద్ధమల్లుడు (వినయాదిత్యుడు) క్రీ శ. ౭౧౫-౭౨౦ ప్రాంతములవాడగును. ఈ వ్యత్యాస మంత పరిగణింపదగినది కాదన్నచో భారతమునందలి మొదటి యుద్ధమల్ల, అరికేసరులును మన శాసనమునందలి యుద్ధమల్ల (వినయాదిత్య), అరికేసరులనుగ నిశ్చయపఱుప దగును.

౬. మన శాసనమునందలి దాతయైన అరికేసరిని గుఱించి పైనిచేసిన కాలనిర్ణయము ఆతనిది బాదామిచాళుక్యవంశజుడైన ఆదిత్యవర్మ వంశమనియు, మన శాసనమునందలి మొదటి సత్యాశ్రయుడు మొదటి పులకేశి యనియు జేసిన యూహలపై నాధారపడి యున్నది. మఱొకవిధమైన కాలనిర్ణయమునకు గూడ మనశాసనమున అవకాశ మున్నట్లు కాన్పించును. ఎట్లన: మనశాసనమున ప్రతిగ్రహీతయైన ముగ్ధశివాచార్యుని గురువగు సద్యోశివాచార్యుని గుణవర్ణన సందర్భమున

"కలౌ(లా) వ్యాప్తే జగత్యస్మిన్
సురేంద్రే భాక్తి-సాగరాః,
దానేన తేజసా స్థిత్యా
జితా యేవ మహాత్మనః"

అను శ్లోకము కలదు. ఇందు శ్లేషపూర్వకముగ శాసనకాలము తెలుపబడి యున్నదని నా యూహ. కలి వ్యాపించిన యీ జగత్తు

నందు దానమున సురేంద్రేభము (అయిరావతము)ను, తేజస్సున అర్కుని (సూర్యుని), స్థితిని సాగరము(సముద్రము)ను ఏమహాత్మునిచేత జయింపబడినవో అటువంటి - సద్యోశివాచార్యుడని అతడు వర్ణితుడయ్యెను. సురేంద్రేభము (౧), అర్కుడు (౧౨), సాగరము (౪)-సురేంద్రేభార్కసాగరమన ౪౧౨౧ అగుచున్నది. ఇది కలియుగాబ్దము. కలియుగాబ్దము ౩౧౭౯-౩౧౮౦ లో శాలివాహన శకము ప్రారంభమగును. అట్లయినచో మన శాసనము శకవర్షము ౯౪౧-౯౪౨ అనగా క్రీ. శ. ౧౦౧౯-౧౦౨౦ నాటిదగును. ఇది తెలుగు-కన్నడలిపి మార్పుకాలము. అందువలన మారుచున్నట్టియు, మారక యున్నట్టియు రెండురకముల లిపులుకూడ నీకాలపుశాసనముల సామాన్యముగ గనబడుచుండుటచేత ఇంతటి 'తరువాతికాలము'నకు లిపిరీతి అనుకూలించునా, అడ్డురాదా యను సంశయమవసరము లేదు.

అందువలన నిశ్చయముగ నీపై శ్లోకమున ద్వ్యర్థిగ శాసనకాలమే తెలుపబడెనని విశ్వసించినచో పైనిచేసిన చర్చయు, నూహలుకూడ అర్థములేనివనియే చెప్పవలెను. ఏలన రెండవ పులకేశికొడుకైన ఆదిత్యవర్మ కాదగునను కొన్న రాజాదిత్యుని పౌత్రుడు క్రీ. శ. ౧౦౧౯-౧౦౨౦ లో నుండుట ఎట్లు సంభవించును? ఈకాలమునే విశ్వసించిన ఈశాసనము సృష్టియని కొట్టివేయవలసి యుండును. శాసనకాలమునే తెలుపనిచో పూర్వోదాహృత శ్లోకమున 'కలౌవ్యాప్తే' అన్నదానికి సార్థకతయే యుండదు.

కావున ఈశాసనము సృష్టికాదు సరియైనదే యని సమర్థింపదలచినచో (౧) పైశ్లోకమున శ్లేషపూర్వకముగనైన కలియుగాబ్ద సూచన లేదని కాని, గ్రహింపరాదని కాని చెప్పవలెను; (౨) శాసనోక్తవంశము ఆదిత్యవర్మ, చంద్రాదిత్యులలో నెవరిదో యొకరివంశమని యైన గ్రహింపవలెను; లేదా (3) పూర్వచాళుక్య బాదామిచాళుక్యవంశములకు వేనికి సంబంధింపని యొక ప్రత్యేకచాళుక్యవంశశాఖయని కాని, పంపభారతోదాహృతవంశశాఖయే యని కాని చెప్పవలసియుండును.

౭. ప్రతిగ్రహీతయైన ముగ్ధశివాచార్యుడును, అతనిగురువు సద్యోశివాచార్యుడును కాలాముఖశైవులు. వీరికి సాధారణముగ పేర్లచివరరాసి, శివ, శక్తిపదము లుండును. శాసనకాలము నీ శివాచార్యులనుబట్టి నిర్ణయింతమన్నను అందులకును అవకాశము కాన్పింపదు. నేను పరిశీలించినంతవఱకు ఏయితర శాసనములందును వీరు పేర్కొనబడలేదు.

౮. వంశ, కాల నిర్ణయములనుగుఱించి యున్నట్లే స్థలనిర్ణయమును గుఱించియు చిక్కులు కలవు. ఈశాసనమున పేర్కొనబడిన గ్రామము లెచ్చటివో తెలియవచ్చుట లేదు. 'పోస్టల్ డైరెక్టరీ'ని బట్టిచూచినచో కర్నూలుజిల్లా, రామల్లకోట తాలూకాలో ఒకపులచెఱువు

కానవచ్చును. మన శాసనములోని పులచెఱువిది యగునేమో. దత్తగ్రామము రామకు విషయమున నున్నట్లు శాసనమున దెలుపబడినది. ఈవిషయము రామల్లకోట తాలూకా కనువర్తించునేమో. ఎట్లయినను శాసనోదాహృతగ్రామములు గుర్తింపవచ్చుటలేదు.

మన యీశాసన మంతయు ఈరీతిని చాల చిక్కులతో గూడియున్నది. ఏవిషయము నిద మిత్థమని నిర్ణయించుట కిప్పటి కున్నయాధారములు చాలవు.

## మూలము*

మొదటిరేకు : రెండవప్రక్క[1]



1. ఓం [॥*] జయత్యమలజాహ్నవీజలతరంగసంఘాతభృ [।*] జ్జటామకుట
2. విష్ఫు(స్ఫు)రత్తరుణచన్ద్రచూడామణి [ః।*]...యపుషా . జేన వపు (?) ష
3. వపు మ్మనోహరతర.............................................ః ॥[౧*]
4. వ్యాభుగ్నప్రో............శ్రీ . . . . . క్ర . . . శ [।*] ఘోణా
5. ఘాతాభిఘాతప . . . . . . లశైలప్రత (?) ధ్యాన . . . . . దై
6. త్యప్రముదితవిది . విక్రమాక్రాన్తనా . పాయాదా . . . . . . . కువలయ
7. వ్యాపినశ్చక్రపాణిః ॥[౨*]॥ . . . . . . . . . న్దరశిఖరశిలాఘృష్టిదో

* నాదగ్గర నున్న రేకుల ననుసరించి.

1. మొదటిరేకు మొదటిపెడ వ్రాత కలదు. ఇది నాలుగవ రేకు రెండవప్రక్క తరువాయి అనుకొనెదను. కాని అంతయు అరిగిపోయినది. అచ్చటచ్చట నొక్కొక్కయక్షరము కాన్పించు చున్నది.

రెండవరేకు : మొదటిప్రక్క



8. షోజితారై [।*] ప్రోద్భిన్న న్నాభిపద్మాశ్రిత[2]కమలభువ [।*]శ్చక్రిణః క్రోడరూప[స్య]
9. భూత మ్మూర్త్యై భువో య ద్ధృతసకలధరామణ్డలం తత్ప్రసాద[।*]ప్రాదుర్భూతో ధరార
10. తిణపటు రసుల శ్చారుచాళుక్యవంశః॥ [3*] తస్మి న్వంశే కలాభృ త్కులక
11. లిజనిత ధ్వాన్తభి త్సౌమ్యవృత్తిః [।*] క్షీరోదన్వ త్యుదంశు శ్శశధర ఇవ య ఙ్ప్రా
12. దు[3]రాసీ న్మహాత్మా [।*] ఉత్ఖాతాసీ[4] ప్రతాపానమితరిపు భూభృత్కులో భూతధై
    త్ర్యా[5] [।*]
13. భర్త్తా సత్యాశ్రయ స్స ప్రభుగుణ మహితో భూతలఖ్యాతకీర్త్తి[ః*]॥[4*]ఏతస్మా ద్ర
14. ణవిక్రమా త్పృథుబలా త్సత్యాశ్రయ త్క్ష్మాభృత[।*] పృథ్వీశః పృథ్వీపతి[ః*][6] పృథుసభో
15. [లోకస్తుతో]భూ త్సుతః [।*]తస్మా త్తత్పృథివీ[7]పతే ర్వ్యసుమతీఖ్యాతో మహారాజ

---

2. ॰పద్మాశ్రితం అని చదువవలెను.
3. ప్రాదుం॰ అని.
4. ఉత్ఖాతాసిం॰ అని.
5. భూతధాత్ర్యా అని.
6. పృథివీపతిః అని.
7. ॰త్తత్పృథివీపతేం॰ అని.

## రెండవ రేకు : రెండవ ప్రక్క



16. [శ్శః।*][త్యా][గౌదా*][ర్య్యో]వరః[ప*][రా]క్రమ[నిర]తః ప్రాదు[8][ర్బ్బ*]భూ వాత్మ జః॥[౫*]ఆసీ త్తస్మా[న్మ][హా*]రాజా [దా]

17. త్మజః[ః*] పృథువిక్రమః [।*]పృథు మాన్ధాతృసంకాశో రాజాదిత్యో ధరాధిపతి[9][॥౬*] తతో భవ త్సుత[ః*] శ్రీ

18. మాన్ శ్రీరామో రామవిక్రమః[।*]విశ్వరా డ్వినయాదిత్యో యుద్ధమల్లో నృపాంకుశః॥[౭*]

19. గురుదోర్ద్దణ్డప్రచణ్డస్ఫురదసిలతికానీత రాజన్యలక్ష్మీ[।*] కరయుగ్మోత్థా

20. పితేన్దుద్యుతిహారధవళామ్భోజలీలాతపత్రః[।*] ధరణీదిక్చక్రవాళా న్తగనిఖి

21. లగుణోద్భాసిరాజాశ్రయ స్సా[।*]గర వేలా వేష్టితోద్యత్సకలవసుమతివల్లభో

22. యుద్ధమల్లః॥[౮*] తురుష్కయవనబర్బరకాశ్మీర[10]కామ్భోజమగధమాళవకళింగగంగ(గ)

23. పల్లవపాణ్డ్యకేరళప్రభృతినరపతిసమ్భ్రమసమర్చ్చిత[11]పాదపీఠః

8. ప్రాదుం అని.

9. ధరాధిపః అని.

10. కాశ్మీరం అని.

11. ంసమర్చ్చితం అని.

మూడవ రేకు : మొదటి ప్రక్క



24. భగవన్నారాయణవరవరహాలాఞ్ఛనవశీకృత శేష[12]విశ్వమ్భరా[13]చక్రః॥
25. అభవ ద్వినయాదిత్యాన్నల[న][హుపది*][లీ]పదున్ధుమారప్రతిమాన్[14] అరికేసరితి[15]
26. నామ్నా సూనుః క్షీరోదాధే ర్యథా[16] శశి రాంశుః [॥*] రాజశ్రీయం[17] వక్షసి భారతీమ్ము
 ఖే[।*] వీర
27. శ్రీయ[18] న్దోషి గురౌ స్వదక్షిణే[।*] దిక్చక్రవాళభ్రమణోద్యతాన్దధత్ [।*] కీర్తిః
28. ప్రతాపే రిపుకృప్వ్యానానసే[19][॥*] వ్యాకర[*]ణధర్మ్మ[20]వి ద్ద్విరదవక్షత్రివక్షు [:*] సదా
 న్యాయ
29. నిపుణో ధనుర్వ్వేదశిక్షయా[21] విశ్రుతః ఆయతి ముపేత వా న్జాతి వై[స్య]శా
30. స్త్రో ధికాం[22] శ్రీమదరికేసరీ నృపగుణై స్సమావిష్కృతః[23] సమస్థ[24]భువనరజ[25]
31. [?ల*]క్ష్మీనివాసవక్ష[స్థ]లః స్వభుజబలక్రష్ట[26]శరాసనజ్యాలతా

---

12. ॰వరాహలాఞ్ఛనవశీకృతా శేషం॰ అని.
13. ॰విశ్వమ్భరా॰ అని.
14. ॰ప్రతిమః అని.
15. అరికేసరీతి అని.
16. క్షీరోదధే ర్యథా అని.
17. రాజశ్రియం అని.
18. శ్రియం అని.
19. నాశనే అని.
20. ధర్మ అని.
21. శిక్షయా అని.
22. ॰స్త్రే ఽధికాం అని.
23. ॰విష్కృతః అని.
24. సమస్తం॰ అని.
25. రాజం॰ అని.
26. బలాకృష్టం॰ అని.

మూడవరేకు : రెండవప్రక్క



32. విము[క్త]నారాచపరమ్పరాపరాజితపరావనిపాలసంస్తూయమానరణార్జ్జునః
33. శుమ్భధమ్భోధి[27]మేఖలాంకలాపావృతవసున్ధరాతలసన్ధారణస్థమ్భాయ[28]
34. మానభుజార్గ్గళః సమస్థ[29]లోకాశ్రయః త్రిభువనమల్లః రాజత్రిణేత్రః సా
35. హస[30]రామః ఇత్యేతై రభిధానై రభిష్టుతః[॥*] కలో[31]వ్యాప్తే జగ త్యస్మి న్సురేన్ద్రో
36. భాక్కర్ణసాగరాః[32][।*] దానేన తేజసా స్థిత్యా జితా యేన మహాత్మనః॥[౧౦*] అంక్కుటగు
37. రుకులేన శైవాచార్య్యై రవాప్తతపఃప్రభావాన్య[33] శ్రీకణ్ఠావాసశ్రీపర్వ్వతో
88. త్తరద్వారే పశ్చా దేలీస్వరే[34] క్రతనిలయే[35] సాదాసాకాహారిణం[36] స[ద్యో]శివాచార్య్యా[37]
39. స్య శిష్యః సిద్ధాన్తబద్ధబుద్ధి[ః*] ధ్యానప్రధ్వస్తదురితప్రబ[న్ధ]ప్రచయ[ః*]

---

27. శుమ్భదమ్భోధిం అని.

28. స్తమ్భాయం అని.

29. సమస్తం అని.

30. ఇచ్చట లేఖకుడు మొదట స వ్రాయుట మఱచిపోయి పిదప హ కెగువ 'ఇంటు మార్కు' పెట్టి హ రా లకు నడుమ క్రింద స వ్రాసెను.

31. కలౌ అని.

32. సురేన్ద్రోభార్కణ సాగరాః అని.

33. ప్రభావస్య అని.

34. (?) ఏలేశ్వరే అని.

35. కృతనిలయే అని.

36. సదాశాకాహారిణః అని.

37. శివాచార్య్యం అని.

నాలుగవ రేకు : మొదటిప్రక్క

40
44
46



40. ముగ్ధశశి శేఖర శ్రీముగ్ధశివో నామ శుద్ధచరిత్రో మహితః తస్మై మహామునయే
41. శ్రీమదరి కేసరిణా సమస్థలోకాశ్రయేన[38] రాజా[39] త్రిణేత్రేణ[॥*] పూ[ర్వో]ది తే[న*] క్షితి
42. భృత్సు తేన[।*] రాజాంకుశే నాహవవిక్రమేణ[।*] గ్రామ శ్శివారాధనతత్పరాత్త[40]-[।*] తపస్వి
43. నే ముగ్ధశివాయ దత్తః[॥౧౧*] అయం శ్రీమదరి కేస[రి*]ణో ధర్మః[॥*]విద్యాదాన మిదం
44. దత్తంమ్[॥*] స గ్రామః రామడువిషే[41] ఊరిగెనామవిఖ్యాతమహాగ్రామస్య దక్షి
45. ణదిగ్భాగస్థితో గ్రామః బెల్మొగ మితి నామ్నా విశ్రుతః తువతోలు పరివాతుల-(?)
46. పుల్చెఱువుల్ పోతువోదుపి ఇత్యేతేషాం గ్రామణాం[42] స మధ్యస్థితః[॥*]

---

38. సమస్తలోకాశ్రయేణ అని.
39. రాజం అని.
40. ౦తత్పరార్థః౦ అని.
41. (?) రామడువిషయే అని.
42. గ్రామాణాం అని.

నాలుగవ రేకు : రెండవ ప్రక్క



47. ఉ క్తంచ మన్వాదిభిః[॥*]స్వదత్తం పరద త్తాం వా[43] యోహ రేత వసున్ధరా[44] [।*]షష్టిం[45] వ
48. ర్షసహస్రాణి విష్టాయాం[46] జాయతే క్రిమిః॥[౧౨*] భూమిదానా త్పరం పుణ్యం న భూ
49. తో న భవిష్యతి[।*] తస్యైవ వహ్రా త్పరం పాపో న భూతో న భవిష్యతి[॥౧౩*] బహు
50. భి ర్వసుధాం భుక్తో[47] రాజభి స్సగరాదిభిః[।*] యస్య[యస్య*]యథా[48]భూమి స్తస్య
51. తస్య తదా ఫలమ్॥[౧౪*] త్రిణాగ్ర[49]విశ్రా న్తతుషారసఙ్ఖలం శ్రియ న్తథా జీ
52.విత మాత్మన శ్చుమాన్[।*] సమిత్య బుధ్యా[50] ద్విజదేవద త్తిషు[51] ప్రలోభయే త్కఃప్పర[52].

43. స్వదత్తాం పరదత్తాంవా అని.
44. వసున్ధరామ్ అని.
45. షష్టిర్వర్షం అని.
46. విష్ఠాయాం అని.
47. వసుధా భుక్తా అని.
48. యదా అని.
49. తృణాగ్రం అని.
50. సమీక్ష్య బుద్ధ్యా అని.
51. దత్తిషు అని.
52. శ్లోకము అసంపూర్ణము.



అరికేసరి శాసనము — రాజముద్రిక

## సెలయేఱు

విద్వాన్ గ. సోమన్నగారు, యం. ఏ., యల్. టి.

కలకలకేరుచు దడదడదూముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

మెట్టల మెట్టుచు గట్టుల తట్టుచు
చుట్టులచుట్టుచు గుట్టల మట్టుచు
కలకలకేరుచు దడదడదుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

తిప్పలుతప్పుచు తుప్పలనప్పుచు
రప్పలురుప్పుచు చిప్పలకప్పుచు
కలకలకేరుచు దడదడ దుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

మంటినిగెంటుచు గుంటలగుంటుచు
నెంటనుపంటలు దంటులునంటఁగ
కలకలకేరుచు దడదడదుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

రెల్లులమల్లెల మొల్లలజల్లుచు
పుల్లలనొల్లుచు పెల్లల గిల్లుచు
కలకలకేరుచు దడదడదుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

దిబ్బలద్రొబ్బుచు మబ్బులనుబ్బుచు
రెబ్బలరుబ్బుచు ప్రబ్బలప్రబ్బుచు

కలకల కేరుచు దడదడదుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

పచ్చికచొచ్చుచు చిచ్చులపుచ్చుచు
పెచ్చులత్రచ్చుచు కచ్చలతెచ్చుచు
కలకల కేరుచు దడదడ దుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

పిట్టలగొట్టుచు చెట్టులనెట్టుచు
తట్టులముట్టుచు మట్టలమొట్టుచు
కలకల కేరుచు దడదడ దుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

నక్కుచు నాన్చుచు నిక్కుచు నీల్గుచు
పొక్కుచుపొంగుచు చిక్కుచు చీలుచు
కలకల కేరుచు దడదడదుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

ఆగుచుసాగుచు దాగుచుమాగుచు
కాఁగుచుకలగుచు వేగిరపడుచును
కలకల కేరుచు దడదడ దుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

తరుగుచు పెరుగుచు మరుగుచు జరుగుచు
తిరుగుచు విరుగుచు నురగల చెరుగుచు
తరగల నొరుగుచు జరజర పరగుచు
కలకల కేరుచు దడదడ దుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

తంగెడుతుప్పలు రంగుల చిప్పలు
తుంగలతప్పలు బంగరుకప్పలు
కొంగలవిప్పలు చెంగటనొప్పగ
కలకల కేరుచు దడదడ దుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

తళతళ మెరయుచు పెళపెళనొరయుచు
సుడియుచు తడయుచు జడియుచు బెడియుచు
కలకల కేరుచు దడదడ దుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

గాలినిదూల్చుచు మీలను తేల్చుచు
చేలనుకూల్చుచు రాలనురాల్చుచు
కలకల కేరుచు దడదడ దుముకుచు
సెలయే అదిగో చెలరేగెడివడి.

దేవుని మహిమను తేటగతెల్పుచు
సెలయే అదిగో చేరువనరిగెడి.




## స్త్రీలు—భీమా

ఈ దేశమున స్త్రీలు దాస్యవిముక్తలగు కొలది స్వతంత్రముగ జీవింప నిచ్ఛగించువారో లేక తమ భర్తల సంపాదనకు తోడ్పడ గోరువారో అగు స్త్రీలు తమ జీవికాసంపాదన కే మార్గ మవలంబించవలయు నను ప్రశ్న బయలుదేరుచున్నది. స్త్రీల ధనార్జనోపాయముల లో నుపేక్షితమైయున్న యొకదానినిగురించి శ్రీ యస్.సి. రాయిగారు 'ది ఇన్ష్యూరెన్స్ అండ్ ఫైనాన్స్ రివ్యూ'లో నీవిధముగ వ్రాయుచున్నారు:

"పాశ్చాత్యదేశముల స్త్రీలు భీమాకంపెనీలలో గొప్ప గొప్ప పదవులలో నున్నారు. ఇంగ్లాండునందేదోయొకదానియందు తప్ప తక్కిన కంపెనీలయందన్నిటియందును స్త్రీ లుద్యోగినులుగ నున్నారు. వారిలో కొందరు గొప్పపదవులలో నున్నారు. ఎడిత్ బీస్లీకన్య (West End Manager, Southern Life Association), మేరియన్ ఫ్రెంచికన్య (Head of the Women's Section, Liverpool, London and Globe Insurance Co.), బోవిల్ సతి (Agency Manager for United Kingdom, African Life Assurance Society) అను వీరు ప్రధానోద్యోగములలో నున్నవారిలో ముగ్గురు.

అమెరికాలో భీమా కంపెనీల ఉద్యోగినులు మిక్కిలి అభివృద్ధిలో నున్నారు. ఆ దేశమందలి భీమా కంపెనీలలో పలువురు స్త్రీలు ఏజంట్లుగా నియమింపబడియున్నారు. ఒకానొకకంపెనీలో అరువదిమంది ఏజంట్లున్నారు. వారందరును స్త్రీలే. వారు 1929 వ సంవత్సరమున 10 లక్షలపౌనుల వ్యాపారమును క్రొత్తగా అభివృద్ధి చేసినారు. వారిలో నెనమండుగురు ఒక్కొక్కరు స్వయముగా ఇరువదివేలపౌనుల వ్యాపారమును సమకూర్చినారు.

మనదేశమందలి స్త్రీలు ఈ విషయమై ఆలోచింపవలసిన కాల మేతెంచినది. తమ జీవికను తామే సంపాదించుకొనవలసిన స్త్రీ లున్నారు. ఇతరులుకూడ మరింత అధికముగ ధనము సంపాదింప తగిన మార్గముల నవలంబించి కుటుంబసౌఖ్యమును పెంపొందించుకొనవచ్చును. అట్టివారికి ఎల్లవిధముల తగిన మార్గ మీ భీమా పద్ధతియే. వారు కుటుంబములయందలి స్త్రీలద్వారా పురుషులకు చెప్పింపవచ్చును. ఆవిధముననే స్త్రీలకును చెప్పవచ్చును. పురుషులకువలెనే స్త్రీలకును భీమా ఆవశ్యకమే యగుటవలన భీమాకంపెనీలు కూడ స్త్రీల జీవితములను భీమాచేయుటవిషయమై ఎక్కువ కట్టుబాట్లు లేకయే అంగీకరించుచున్న నే నిదివరకే చెప్పియున్నాను."

# వ్యాయామము

## 'జోస్లిన్ మో'గారి అభ్యాసములు



చిత్రము ౧

సూచన ౧.

కాళ్లు దూరముగా నుంచి నిలువవలెను. కుడిచేయి నెత్తి మీదుగా జాపవలెను. ఎడమచేయి ఎడమకాలికి సమాంతరముగా ఉంచవలెను. కుడిప్రక్క సాధ్యమగునంత సాగదీయుచు ఎడమప్రక్కకు వంగవలెను. తిరిగి కుడిప్రక్కకు అట్లే వంగవలెను. చేతులుమాత్రము మార్చవలెను. ఈ వ్యాయామమువలన నడుము పడలును, ప్రక్కలు సాగును.



చిత్రము ౨

సూచన ౨.

కాళ్లు దూరముగా నుంచి చేతులుప్రక్క చాచి నిలువవలెను. ఇందు చూపబడినట్లు ఎడమచేయి కుడి మడమ తాకునట్లును, కుడిచేయి వెనుకకు ప్రక్కసాగియుండుట మున్నగునవి సరిపోవునట్లును, మెలితిరుగవలయును. కడుపున కీవ్యాయామము చాలమంచిది.



చిత్రము 3

సూచన 3.

కాళ్లు దూరముగ నుంచి చేతులు ప్రక్కలకు చాచి నిలువవలెను. ఎడమచేయి కుడిపాదము లోపలిప్రక్కను తాకునట్లు మెలితిరిగి, తల కుడి మోకాటిపై మోపవలెను. క్రిందటి వ్యాయామము నకే ఇది మరింత కఠినమైనమాదిరి.

'టైమ్సు ఆఫ్ ఇండియా' సచిత్రవారపత్రిక నుండి



'స్వాలో డైవ్'

'లా ఆంజిలి' (Los Angeles) కి చెందిన ముగ్గురు ఆరితేరిన 'మజ్జకులు' (నీటిలో మునుగుట అభ్యసించినవారు) 'స్వాలో డైవ్' ('స్వాలో' అనెడి పక్షిఆకృతితో నీట దుముకుట) ప్రదర్శించుచున్నారు. ఇట్టి జలవిద్యలలో నెల్ల ఇది మిక్కిలి కీవిగల పరిణామ మనుకో వచ్చునట.

'స్ఫియరు' నుండి

## రవీంద్రుని చిత్రలేఖనము

ఒకటి రెండేండ్లనుండి రవీంద్రనాథ టాగూరు గారు చిత్రకారులుగ వెలువడినారు. వీరి బొమ్మలు కొన్ని బర్మింగ్‌హాము ‘సిటీ మ్యూజియము’ నందును, ‘ఆర్టు గ్యాలరీ’ యందును ప్రదర్శింపఁబడినవి. వానికి తొలిపలుకు వ్రాయుచు ఆయన యిట్లు వ్రాసెను:



రవీంద్రనాథ ఠాగూరుగారు

“చిత్రప్రపంచమున నేను జోక్యము కలుగఁజేసికొనుటకు క్షమాపణ చెప్పుకొనుట నావిధియై యున్నది. విబుధులు వినీతులై యుండ, విమూఢులు—తమకు తెలియదనుమాట తెలియనివారు—పటాటోపము సల్పఁబోదు రను నానుడి కిది సరిపోయినది. నేను, చిత్రకారుఁడ నని, నా సాహసమునకు మెప్పు పడయఁగోరను; ఏలన, అది కృత్రిమ మెఱుఁగని అజ్ఞాతసాహసము. నేను నా చిన్ననాఁటి నుండి అభ్యసించినదెల్ల అనుమేళము (rhythm),— భావమున అనుమేళము, స్వరమున అనుమేళము. క్రమహీనమైనదానికి, తనంత తా నుపేక్ష్యమైనదానికి అనుమేళము అస్తిత్వ మిచ్చునని నే గ్రహింపఁగలిగితిని కనుకనే, నా వ్రాఁతపుస్తకములోని పిచ్చిగీఁతలు, పాపులవలె, మోక్షమునకై మొఱవెట్టి, తమ సందర్భము లేని విరూపతతో నా కండ్లకు అఱచుచుండ, నా పని చేసికొనుటకంటె వీని నొక సదయమగు అనుమేళసమగ్రతలోనికి చేర్చి కాపాడుటకు తఱచు నా తక్కువకాలము పట్టుచుండెడిది......నే నొక సత్యమును......కనిపట్టఁగల్గితిని...... ఏమన,— రేకలకు స్వాభావికనిర్ణయమొందుట కొక సంతత ప్రవృత్తి కలదు. మఱి యోగ్యత గలదే మనఁగలదు......నా బొమ్మలు గీఁతలలో నా కవనము......ప్రతీతి అపేక్షించుట కర్హమగునెడల, అది విశిష్టమగు ఒక అనుమేళద్యోతక మగు ఆకృతి ప్రాముఖ్యమునకు తప్ప, ఒకభావము వ్యాఖ్యాత మగుచున్నదని కాని, ఒక సత్యము నిరూపిత మగుచున్నదని కాని కాదు.” (లండన్ న్యూస్‌నుండి.)

కడచిన జూను 4వ తేది లండను 'ఇండియా సొసైటీ'వారి సభలో రవీంద్రుఁడు తన చిత్రరచనఁ గూర్చి మఱికొన్ని వివరములును, భావములును వెలిఁబుచ్చి యుండెను:

ఐరోపా చేరునటకు ఆయనకు తన చిత్రముల యెడ అంత ప్రత్యయము లేకుండెను. కాని ఫ్రాన్సు దక్షిణభాగమున కలిసిన కొందఱు చిత్రకారులు వాని యెడ చూపిన కౌతుకమువలన ఆయనకు ఉత్సాహము జనించినది. కొన్నిటిని 'పారిస్' నగరమున ప్రదర్శింపవలెనని కూడ వారు బలవంతపెట్టిరి. అచ్చటి కొందఱు విమర్శకుల అభిప్రాయము మిక్కిలి అనుకూలముగా నుండెను. కాఁబట్టి తా నొక చిత్రకారుఁడ నను విశ్వాసము ఆయనకు కలిగెను. ప్రారంభాభ్యాసము ఏపాటి పొందిరని యడుగ, చిన్నతనమునుండియు తనకు మాటలలోనే కాని గీటులలో అధ్యయనము లేదని ఆయన బదులు చెప్పెను. కవిత్వము పూర్తిగ అర్థము కానప్పుడు కూడ ఆయనకు అంతర్జనితమగు ఒక 'అనుమేళ' జ్ఞానము ఉండెను. పద్యమన్న, అందును సంస్కృతపద్యమన్న, ఆయనకు పరమాహ్లాదము. నాఁడు మొదలును ఆయనకు పద్యము లల్లుటే పని; పద్యము లల్లుట ఒకపరమానందము. ఇది ప్రసిద్ధమేకదా! కవి గాని, చిత్రకుఁడు గాని నిర్మించిన నిర్మాణములలో సరియగు తూఁగు—సమవిభాగత—కలిగినవే మనఁ దగినవి; ఏలన, అంతర్మైత్రి యనునది ఒక సృష్టిసూత్రము. ఈ యీ బొమ్మలు వికారముగా నున్నవని యెవ్వరైన ననవచ్చును; కాని సృష్టిచరితలోనే ఉన్నవి వికారపుబొమ్మలు. ఒంటె చాల వికారముగానే యుండును; కాని యెడారిలో, దాని పరిసరములలో అది నిండుగనే యుండును. వాస్తవమును వ్యక్తపఱుచుటకు ఆయనకు తన బొమ్మలు ఒక సాధనముగా కన్పట్టినవి. ఈ మార్గము కనిపట్టినందులకు ఆయన కెంతయు సంతృప్తియు, గర్వము నుదయించెను: సిద్ధియందు ప్రతి కళాజీవియు పొందవలసినదే ఆ గర్వము. ముదిమితో మూఁడుగుణాలెక్కువ వచ్చెనే యని ఆయనగర్వమును గూర్చి యనుకొందురేమో కాని, ఆయన దానికొక సమాధానము

క్రొత్త; ఈ వ్యక్తీకరణవిధానమున ఆయన అరితేరలేదు, చేవయెక్కలేదు—అని. ('హిందూ' వారసంచికనుండి.)



౧. రవీంద్రుని పుస్తకముపై బొమ్మ—ఆయన సంతకమును బట్టి యేర్పడ్డ కల్పన.



౨. "అనుమేళద్యోతక మగు ఆకృతిప్రాముఖ్యము"నకు ప్రతీతి నపేక్షించును.



3. ఒక పక్షి ఆకృతి—ఇందు ఒకభావము వ్యాఖ్యాతము కాదు, ఒకసత్యము నిరూపితము కాదు.



౪. ఒక శిరస్సు-కృతి—కవి, అధ్యాపకుఁడు, వాగ్గెయకా·ుడు, ఇప్పుడు చిత్రకారుఁడు అగు రవీంద్రుని రచన.



౫. "గీతల స్వాభావికనిర్ణయము": టాగూరు గారి మనుష్యచిత్రము.



౬. "గురు శిష్యులు"—టాగూరుకవి స్వయముగ నామకరణము చేసిన కొలఁదిబొమ్మలలో ఒకటి.



౭. "కృత్రిమ మెఱుంగని అజ్ఞాతసాహసము"నకు ప్రతిఫలమాత్రముః: టాగూరుగారి జంతుచిత్రములు.



౮. "వెన్నెల'నీలము'*"—'అనుమేళము'నకొక కృషి, రవీంద్రునిది. ('లండన్ న్యూస్' నుండి).

ఈబొమ్మలు బాగున్నవా?

ఇవి టాగూరుగారు వ్రాసినారు. వారిది గొప్ప పరిణత ప్రతిభ. వారు గొప్ప భావుకులు, భావకులు. ఈ చిత్రములలో వారి భావన కవనమునవలె విలసిల్లినదట. ఇవి యెంత భావమయములో! అన్నట్లు, భావము ఇందు ప్రధానము కాదట. వస్తునిరూపణమును మనకు తప్పక గోచరింపదట. టాగూరుగారు గొప్ప గాయనుడు; మూడు వేలకు పైగా పాటలు వ్రాసి వానికి స్వరమమర్చినాడు. ఆ గానకళావిశారదుని 'అనుమేళ' జ్ఞానము,—కవితలో సహా బాహ్యాంతరలోకముల సమ్మేళనము చిత్రించు ఆయన సంగీతము,—ఈ చిత్రములలో పాడుకొనుచున్నదట. అది మనము వినుటకు యత్నింతము.

ఇది యింత విలక్షణముగా నున్నది! వీరి 'అనుమేళము'ను (Rhythm) అనుసరించి 'అనుమేళవాదులు' (Rhythmists) బయలుదేఱిరు కద,—చిత్రకళాలోకములో చిత్రవిచిత్ర పరిణామములేర్పడుచున్నవి లే! ఇది తట్టినపుడెల్ల మనము పశ్చిమాకాశమే పరికింతము. ఇట్టిది పరిణమించినదని మనకు వినవచ్చినచో, పశ్చిమమే యిది ప్రసవించియుండునని అనుకొనియే మన

* దీని కాంగ్లమున 'Moonlight Blue' అని పేరున్నది. 'Blue' నామవాచకమై సముద్రమునకును, ఆకాశమునకును కూడ చెల్లును. నీలవర్ణమునకు చెల్లనే చెల్లును. ఇచట బొమ్మను బట్టి యే అర్థమో తెలియుట దుష్కరము. కనుక గుణవాచక మగు 'నీలమే' ఆంగ్లమున వలె వాడుకొని భావము భావకులకును, రవీంద్రుని వ్యాఖ్యాతలకును వదలుట నయము. —కొం. ఇ.

ము నిజము చూడ యత్నించినను మనకండ్లు మనను వంచింపవేమో!

ఏమో! టాగూరు ప్రాచ్యుడు. ప్రాచ్యుల అంతరంగమునే ఈ క్రొత్తపాట తొలుత కదలించి విస్తరించునేమో! పశ్చిమ మెంత ప్రతిభానకము కలదైనను, ఎంత ప్రతిభ కలదైనను, హృదయబాంధవము, కళాసన్నిహితత్వము మనది.

ఎటులైనను జనయిత ప్రాచ్యుడు.

నేటికళావిహారమున, అందును ప్రాచ్యకళా వాటికను, భావముస్వయంప్రాధాన్యము వహించియే యున్నది. కేవలము బాహ్యచిత్రణము గాక భావనిరూపణము వెలుగుచున్నది. భావ పదార్థములు, ఆకూతములు సూచితము లగుచున్నవి. ఇది అనుమేళము కాదూ? టాగూరు కళ యిట్టిదే అగునా? మఱి ఈక్రొత్తపల్లవులెందులకు?—ఇట్టిది కాదా?

టాగూరుగారు వస్తు, భావములు అనుమేళమును 'పొందుట'ను చూపుట కాక, అనుమేళమునే—దాని ఆత్మను, విడదీసి—చూప యత్నింతురేమో! ఒకభావము వ్యాఖ్యాతము కానక్కఱ లేదట, ఒక సత్యము నిరూపితము కానక్కఱ లేదట—మఱి. దీనికి సునిశ్చితము లగు కళాసూత్రములు,లక్షణము,ఏర్పడగలవో! భావమునకు స్వయంప్రాధాన్యము నేటికి కొంత వఱకుఎక్కనేమెక్కినది: ఈక్రొత్త మెట్టువఱకు ఎక్కుటకు, —కాలము వికసించుచున్నదిగా, ముడుచుకొనుట లేదు జ్యోతిర్గోళములే అందుకొబడుచున్నవి!

ఇంతకును, ఈకళావ్యవస్థ యేపాటి సజీవమో, ఏమాత్రము సృష్టిశీలమో, సత్య సంపద మనకు బయలుపడువఱకు ఉత్కంఠ చిక్కబట్టుట వివేకము.—కొం. జ.

---

## 'యవన రాజ్య సంస్థాపనాచార్య'
## కృష్ణదేవరాయలు

శ్రీకృష్ణదేవరాయల బిరుదులలో "యవనరాజ్య స్థాపనాచార్య" అనునది యొకటి. రాయలకు ఈబిరుదెట్లు వచ్చెనో తెలియదు. పూర్వకాలమున మనహిందూ రాజులు వహించిన బిరుదులన్నియు రెండు తెగలవి (౧) వంశపరంపరగ వచ్చునవి. (౨) స్వయముగా ఆర్జింపబడినవి.

రాజాధిరాజ రాజపరమేశ్వర మూరురాయరగండ, అష్టదిక్కురాయ మనోభయంకర, బాషెగెతప్పువ రాయరగండ, పూర్వపశ్చిమ దక్షిణసముద్రాధీశ్వర మొదలగునవి మొదటితరగతి బిరుదులకు ఉదాహరణములు. మొదటి హరిహరరాయల కాలమునుండియు నివి విజయనగరరాజులకందఱికిని గలవు. "యవనరాజ్య స్థాపనాచార్య" అనునది రెండవతరగతికి చేరినది. ఈబిరుదు కృష్ణరాయలకు దప్ప మఱి యేవిజయనగర రాజునకును ఉన్నట్లు తెలియదు. కావున కృష్ణరాయలు ఈబిరుదును సంపాదించుకొని యుండవలయును.

"యవనరాజ్యస్థాపనము రాయలు చేసినట్లు ఈ బిరుదు తెల్పుచున్నదికదా! రాయలు స్థాపించిన యవనరాజ్యమేది? ఎప్పుడు దానిని స్థాపించెను? న్యూనిజ్ చే విరచితమైన విజయనగర చరిత్రము జదివినవారి కందఱికి పై ప్రశ్నలకు సమాధానము చెప్పుట సులభమని తోపకపోదు. ఏలన, రాయలు కలుబరిగెకోటను బట్టుకొనినప్పుడు బహమనీ సుల్తానగు నాలవ మహమ్మదు(రెండవ మామూదు) పుత్రులను ముగ్గురిని అదిల్ షా చెరయందున్నవారిని, విడిపించి, అందొకని బహమని రాజ్యమున కభిషిక్తుని జేసినట్లు న్యూనిజ్ వ్రాసియున్నాడు. మఱియు రాచూరి యుద్ధమునకు పిమ్మట కలుబరిగె రాయలచే ముట్టడింప

బడెను. రాచూరియుద్ధము క్రీ. శ. ౧౫౨౦ మే నెలలో జరిగెను. కలుబరిగె ౧౫౨౧ లోనో, తరువాతనో ముట్టడింప బడెననుట నిశ్చయము. అప్పుడే రాయలు బహమనీ రాజపుత్రుని రాజ్యాభిషిక్తుని జేసినది. అప్పుడే రాయలీబిరుదును పొందియుండవలయును. కాని దీనికి ప్రబలమైన ఆక్షేప మొకటి కలదు. రాయలకు ఈబిరుదు క్రీ. శ. ౧౫౧౪ నాటికే యున్నట్టు శాసనముల నిదర్శనము కలదు. తత్పూర్వపు శాసనములలో నీ బిరుదు కాన్పించదు.

ఇందువల్ల శోధనసూహ యేమనగా—రాయల వారి రాజ్యారంభమున అనగా ౧౫౧౦ మొదలు ౧౫౧౩ వఱకు వారికి ఈ బిరుదు లేదు. ౧౫౧౪ లోనో దానికి కొంచెము ముందో అది రాయలకు లభ్యపడినది అని. అగుచో ౧౫౧౩ లో రాయలు స్థాపించిన తురక రాజ్యమెద్ది? యూసఫ్ అదిల్ ఖానుని మరణానంతరము బిజాపుర సంస్థానములో అంతఃకలహములు రేగెను అదియే అదనని ౧౫౧౨ లో విజయనగరము రాజు బిజాపుర ముపై దండువిడలి రాయచూరుదుర్గమును ముట్టడించి కొంతకాలమైన తరువాత స్వాధీనపఱచుకొనెనని ఫెరిస్తా వ్రాసియున్నాడు అనగా ౧౫౧౨ లో విజయనగర ప్రభువగు కృష్ణరాయలు తురకరాజు నోడించి రాయచూరుదుర్గమును స్వాధీనపఱచుకొనెను ఇదేకాలమున, కృష్ణయొడ్డున ఘోరసంగ్రామమున రాయలు దగ్గఱను తురకరాజులను ముగ్గురి నోడించి తరిమినట్లు కృష్ణరాయ విజయ రాయవాచకములవల్ల తెలియుచున్నది. కాని రాయలు తురకరాజ్యములను గెల్చుకొన్నట్లుగాని, అట్లు గెల్చుకొన్న రాజ్యమును వారల నిచ్చినట్లుకాని యెచ్చటను చెప్పబడలేదు అయినను కృష్ణరాయలు తన ఆముక్తమాల్యదలో నిట్లు వ్రాసుకొనియున్నాడు.

అలుకక ఘోటకధట్టికా ఖురపుటీ
హాల్యాగ్ర గురాసాని పు
చ్ఛలు వోదున్ని చలచ్చమూగజము
దానారప్పులితోగేత్రి పు
మ్వలపస్యంబిడి యేకధాటి బళిరా
కట్టించి తొల్పిష్టికే
దులఖానోగ్రకపాలమర్ధపహరి
ద్భూజాంగల శ్రేణికిన్.

ఈపద్యమువల్ల రాయలు ఏదులఖానుడను తురక రాజును ఉత్తరదేశపు యుద్ధములో వధించినట్లు తెలియుచున్నది. ఈపద్యమునందు పేర్కొనబడిన ఏదుల ఖానుడు బిజాపురసంస్థానస్థాపకుడగు యూసఫ్ అదిల్ ఖానే గాని యన్యుడు గాడని శ్రీ కే.వి. లక్ష్మణరావు పంతులుగారు నిరూపించియున్నారు. ఫెరిస్తా మొదలగు మహమ్మదీయ చరిత్రకారులు యూసఫ్ అదిల్ షా వ్యాధివల్ల మృతినొందెనని చెప్పుచున్నారు. కాని అతనిమరణ కాలమునుగూర్చి పలుతెఱగుల వ్రాసియున్నారు. మన మిపుడెవ్వరి వ్రాత సత్యమని యంగీకరింపదగును? ఆముక్తమాల్యదలో వచింపబడిన చారిత్రకవిషయములన్నిటికిని, విశ్వసనీయములగు ఆధారములు లుండుటచేతను, హిందువులనుగూర్చి ఫెరిస్తా వ్రాతకన్న రాయలవ్రాతయే యెక్కుడు విశ్వసనీయమని గ్రహించుచున్నాము ఇదిగాక రాయలు సమకాలికుడు: స్వయముగ అదిల్ ఖానుతో యుద్ధముజేసి వానిని వధించినవాడు. ఫెరిస్తాపై యుద్ధకాలమునకు ౬౦ సంవత్సరములు తరువాతివాడు. బిజాపురనవాబుల ఆశ్రితుడు. మహమ్మదీయపక్షపాతి; హిందూద్వేషి; హిందువులవిజయములను వర్ణింపవలసినపుడు నిజమును కప్పిపుచ్చు నాచారము గలవాడు. కావున ౧౫౧౨లోనో, తత్పూర్వమో రాయలు ఏదులఖానుని జంపుట వాస్తవమని నమ్ముచున్నారము.

యూసఫ్ అదిల్ ఖాను చనిపోయినపుడు అతని కొమారుడగు ఇస్మాయిల్ పదునొకండేడ్ల చిన్నవాడని ఫెరిస్తా గ్రంథమువల్ల తెలియుచున్నది మఱియు రాజ్యమునకు పాలకుడుగ నియమింపబడిన కమాల్ ఖానను వాడు బీదర్ ప్రభువగు అమీర్ బరీదుతో సఖ్యము నెఱపి ఇస్మాయిల్ అదిల్ షాను చెరయందుంచి రాజ్యమును ఆక్రమించుకొన ప్రయత్నించెను. కాని యాతని యత్నము భగ్నమాయెను. ఇస్మాయిల్ షా గద్దెయెక్కి ప్రభుత్వము జేయసాగెను. దీనిం గాంచి అమీర్ బరీదు కోపోద్రిక్తుడై నిజాంశాహ, కుతుబ్ శాహ, ఇమాద్ శాహ

మొదలగురాజుల సేనలను గూర్చుకొని హిజరి ౯౨౧ (అనగా, క్రీ. శ. ౧౫౧౪) లో బిజాపురముపై దండెత్తి వచ్చెననియు, వారిని ఇస్మాయిల్ అదిల్ షా ఓడించి తరుము గొట్టెననియు పారసీ గ్రంథములవల్లనే తెలియుచున్నది. కావున బిజాపుర సంస్థానము ౧౫౧౦ మొదలు ౧౫౧౪ వఱకు మిక్కిలియు గలిబిలిపడినట్లు తోచుచున్నది. ఈ మధ్యకాలముననే రాయలు నిజాముశాహ కుతుప్ శాహ, అదిల్ శాహ మొదలగువారితో పెణగట్టి నయుద్ధము చేసినట్లు రాయవాచకాది గ్రంథముల మూలమున దెలియవచ్చుట వల్లను, రాయలకు యవనరాజ్య స్థాపనాచార్య యన్న బిరుదు ౧౫౧౪ నుండియే శాసనములయందు గన్పించుచుండుటవల్లను పై జెప్పబడిన తురకల యుద్ధములలో నెప్పుడో రాయలవారు ఇస్మాయిల్ అదిల్ షాకు సాయము జేయుటచే ఈబిరుదు లభించెనని తలచుచున్నాము ఇది కేవలము మాయూహ. పరిశోధకపండితులీవిషయములను జక్కగ శోధించి నిజమును బయల్పరతురుగాక యని మా ప్రార్థన.

—నే. వే.

---

## ప్రాచీనకళింగ 'నాణెము'లు

ఈనాణెములు కళింగదేశమును చాలకాల మేలియుండిన గాంగవంశజులకు రాజధానియగు ముఖలింగనగరములోను, వంశధారాసాగరసంగమతీరమున గల కళింగపట్టణమునను కొందరు స్నేహితుల సాయమువల్ల లభించినవి. వర్షకాలమున భూమిపై పొర కరిగి తొలగిపోయినప్పుడు క్రింద నివి మెరయుచు పొడగట్టుచుండును. ఇవి వర్షములో పడుననీ, క్షేత్రమాహాత్మ్య మట్టిదనీ జానపదులు చెప్పుదురు. అందువల్లనే దేవతార్చనపెట్టెలోనికివి తరచు ఎగుమతియై చరిత్రకారుని దృష్టిపథమునకు రావు.

౧. ఈనాణెము ముఖలింగములోనిది. ఏమంత అపరంజి కాదు. ఒకవైపు నోరు తెరచిన సింహ మున్నట్టుగా ముద్రింపబడియున్నది. వెనుకవైపు అడ్డుగీతలున్నవి. ఇది కదంబుల ముద్ర. వారు కొంతకాలము వనవాసి నేలి, పిమ్మట ఉత్తరమునకు వలసపోయి కళింగ గాంగులకు సామంతులుగా నుండి, సామంతరాయ, మహామండలిక బిరుదముల దాల్చి రాజిల్లినారు. వీరు గాంగులకు కుడిభుజమువంటివారు. తమ నామములకు చివర ఖేడి యను పౌరుషపదమును వీరు చేర్చుకొనుచుండిరి ఖేడి యనునది మూలమనీ, కిమిడి, ఖేడిపదములు దాని భ్రష్టరూపములనీ కొందరి యభిప్రాయము.

ఈనాణెము సెనగబద్దంత యున్నది. ఇది పెద్ద రకము. కళింగపట్నమున దొరకిన వాటిలో నీరకము గోచరింపదు.

వీటిని నంది చిన్నములని స్థానికులు వ్యవహరించుచున్నారు.

### నాణెముల పరిమాణము




చిత్రము ౧, ముందు




చిత్రము ౨, వెనుక

౨ ఇదికూడ అపరంజి కాదు. తక్కువరకము బంగారమే. దీనిపై నాగలి కానవచ్చుచున్నది. ఎద్దు మెడపై నుంచుకాడి, భూమిని పెకలించు ఇనుపకొన, దున్నేవాడు చేతితో నడుపు వంకరకఱ్ఱ స్పష్టముగా కానవచ్చుచున్నవి. నాగలి మలబారు తీరమందలి కుల చిహ్నము. ఈరకము నాణెములు వీరరాయపణములని పిలువబడుచుండెనని ఎల్లియట్ దొర ఇట్లు వ్రాయుచున్నాడు:

"బలవంతుడగు సార్వభౌముడు లేని కాలమున స్వాతంత్ర్యము వహించిన మండలికుల నాణెములివి. ఇవి కాలికట్టులో ముద్రించబడినవి. ఆకాలమున వీటిని దూరదేశమునకు గొనిపోయి మార్చువల్ల (మారకపు రేటు వ్యత్యాసమువల్ల) వర్తకులకు 11 మొదలు 12 వరకు నూటికి లాభము వచ్చుచుండెను. అందువల్ల దక్షిణదేశపు మారుమూల ప్రదేశస్థానములందు ఇవి లభించుచున్నవి."

ఇవి గాంగపణములకంటె కొంచెము పెద్దవి. అవి మిరెపగింజవలె నుండును. ఇవి కందిబద్దవలె నుండును.

దీని రెండవవైపు దీర్ఘచతురస్రమువంటి చిహ్నమును, తెలుగులో ౧౫ విజయరాజ్య వత్సరములును ఉన్నవి. విజయరాజ్యవత్సరము లనగా ఒకరాజు రాజ్యమునకు వచ్చిన తరువాత గడిచిపోయిన సంవత్సరములు. ఈ నాణె మొకరాజు పరిపాలనకాలములో పదిహేనవ యేట ముద్రించబడినది.

పై రెండు నాణెములు ముఖలింగములో నే కొమారం కామేశంగారివద్ద లభించినవి.

3. అంకుశము, దానిపైన శివలింగము, పైన చంద్రవంక యొక్కవైపున నున్నవి. పానవట్టపురేఖను లంబముగానున్న రేఖకును, చుక్కలకును అర్థము తెలియలేదు. ఇవి పెక్కునాణెములపై నున్నవి. కళింగమును సుమారెనిమిది శతాబ్దములేలిన గంగవంశీయులకు మహేంద్రగిరి గోకర్ణేశ్వరు డిష్టదైవము. కాబట్టి వారిపణములపై శివలింగ ముండుట టక్కజము కాదు. ఇక నంకుశమో? కళింగులు గజబలమునకు ప్రసిద్ధులు. కాబట్టి స్వీయకులపొడుపచిహ్నమగు నంకుశమునుకూడ చేర్చియుందురనుట కేవల మూహయే కానేరదు. రెండవవైపున పైన చెప్పిన దీర్ఘ చతురస్రము, విజయరాజ్యవత్సరములు నున్నవి.

౪. (ఏ) ఇది పై నాణెమువంటిదే. చంద్రవంక అరిగిపోయి లింగముతో గలిసిపోయినట్లున్నది. వీటికి పైన మఱొక్కగీత యున్నది. దాని యర్థమేమో. నాణెము వాలకము చూస్తే సుట్టు అరిగిపోయినట్లు లేదు. రెండవవైపు చతురస్రమునకు కుడివైపున గీత యున్నది. విజయరాజ్యవత్సరములు ౧౩.

(బి) ఇది అట్టిదే. విజయరాజ్యవత్సరములు ౧౧.

ఇవి రెండూ గాంగరాజులవే.

౫. దీనిమీద కూడా శివలింగము, అంకుశము, విజయరాజ్యవత్సరాలు ఉన్నవి. ఇవేకాక చిహ్నములు చాలాకలవు. తక్కిన నాణెముల మీద చుక్కల కర్థము వాటివల్ల తేలవచ్చును. ఇవి లిపులని కొందరనుచున్నారు. కడచినవేసవిలో కళింగపట్టణమున పరిశోధనచేసిన కాశీవిశ్వవిద్యాలయ చారిత్రకాధ్యాపకులు భట్టాచార్యగారు ఈ లిపులు క్రీ. పూ. రెండవశతాబ్దమునాటివని నిర్ణయించినారట. క్రీ. పూర్వము కళింగమును బౌద్ధ రాజు లేలినారు. దేశమంతా బౌద్ధమే వ్యాపించియుండెను. శివపూజ అప్పుడు లేదు. అట్టియెడ లింగము నాణెములపై నుండుట కవకాశ మేది? అప్పటివారు తమ నాణెములపై విజయరాజ్యవత్సరములు ముద్రించినట్లు తెలియరాదు. కాబట్టి పై యంశము విచారణీయము.

౬. ఇది అపరంజి నాణెమే. ఇవి చిన్నవై వంగగింజంత లుండుటచే స్థానికులు వంగపరకలని పిల్చుచున్నారు. దీని కొకవైపు చతురస్రము, విజయరాజ్యవత్సరములు 3౮ ఉన్నవి. కళింగగాంగులలో హెచ్చువత్సరము లేలినది అనంతవర్మ చోడగంగదేవుడు (శా. శ. ౯౯౯-౧౦౭౧). దీనిపై నున్న పెద్దయంకెనుబట్టి ఇది యతని నాణెమేయని చెప్పవచ్చునా? రెండవవైపున తక్కిన నాణెములవలె గాక యంకుశము ఎడమవైపున తిరిగినది. లంబరేఖకు కుడివైపున గాక యెడమవైపున లింగము, నెలవంక కానవచ్చుచున్నవి. కళింగదేశచరిత్ర

లో (ముద్రితమై వెలువడనున్నది) ముద్రించిన నాణెము లలో కొన్ని, Kalinga Coins Plate I, No. 3 Plate II, Nos. 2, 3, 14 etc.) ఇట్లే యున్నవి. వాటిపైని విజయరాజ్యవత్సరములు 33, 37 మొదలుగా ముప్పదిపైననే యున్నవి. ఇవి అనంతవర్మచోడ గంగుని నాణెములేయైనచో నివి ౯౯౯+33=౧౦౩౨ శా. శ. నాటికి ముద్రితములై యుండవలెను. అనగా ౧౧౧౦ క్రీ. శ. నాటి కన్నమాట. ఇప్పటికింకను ఈతడు కాలచుర్యరాజగు రత్నదేవునివలన నోడింపబడి యుండలేదు.

8. (a) ఇది అపరంజి కాదు. ఇది మలబారు నాణెమే. ఒకవైపు నాగలి, రెండవవైపు పణముల చిహ్నము చతురస్రము గలవు విజయరాజ్య సంవత్సరాలు ౧౩.

(b) దీనిలో కొంతముక్క పోయినది. ఇది అపరంజి కాదు. చోడగంగుని నాణెపు చిహ్నములని నేనూహించిన చతురస్రము పక్కల చుక్కలు, ఎడమవైపు తిరిగియున్న యంకుశము, ముప్పదికి మించిన విజయరాజ్య వత్సరములు ఇందున్నవి.

ఈనాణెములను బట్టి మనకు పెక్కు చారిత్ర కాంశములు తెలియవచ్చుచున్నవి.

గాంగవంశమును ప్రతిష్ఠించిన అనంతవర్మ చోడ గంగదేవు డొకరీతిగను, వానివంశీయులు మఱియొకవిధముగను నాణెములను వేయించినారు. గాంగ సార్వభౌములను కిమిడి కదంబులూ, నడ్డాది కాత్సన్యులూ సామంతులైనను స్వీయ పౌరుష ముద్రను తమనాణెములపై చెక్కించుచు స్వాతంత్ర్యము కనిగియుండిరి. మధుకేశ్వరుడు వెలసిన ముఖలింగము, వంశధారా సాగరసంగమ ప్రదేశమగు కళింగపట్టణము అప్పుడు తీర్థయాత్రకు ముఖ్యములు. సువర్ణదానమునకు అగ్రస్థానమొసంగి జానపదులకు కూడ నీసౌకర్యమును చిన్న బంగారు నాణెములైన పణములమూలమున సమకూర్చిరి. కళింగదేశభాష తెనుగుసంస్కృతము లై యుండెను. కళింగులు రత్నాకరమును అవలీలగా దాటగలిగిన ఓడలు (చూ. కళింగదేశ చరిత్ర. Kalinga Coins. Plate I. No 5) కట్టగలిగి యుండిరి. మలబారు తీరము మొదలు కళింగమువరకు ఓడలు విచ్చలవిడిగా తిరుగుచుండెను. మనవారు సంతలలో వాడుకచేసే తునకాలు అప్పుడు విరివిగా వాడబడుచుండెను.

శైవమతము అప్పుడు విజృంభించియుండెను.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

---

## శంభుదాసుడు వైష్ణవుడా?

ఆంధ్రవిశ్వకళాపరిషత్పక్షమున గతసంవత్సరము మాలో నొకరము గ్రంథపరిశోధనము జరుపుతతి నంది గామ తాలూక వాస్తవ్యులును, సుప్రసిద్ధకవివ శజులునగు దిట్టకవివారియింట ఎఱ్ఱాప్రగడ కృతమగు హరివంశము రెండు లిఖితప్రతులు లభించినవి. అ దొకటి పూర్వభాగము, వేఱొకటి యుత్తరభాగము. ఈ ప్రతులు చాలవఱకు శీర్ణించియుండుటచే విశేషించి పరిశోధింప నవకాశము కలుగలేదు. కాని కృత్యాదియందు ఈ క్రింది పద్యము 'కామవిలోభకస్పృహాల' యను పదియవ పద్యమునకుఁ దరువాతదిగ నున్నది:

'సీ. తమ కటాక్షము బలిచక్రుఁ గుంచె కోలమో
వైకుంఠనగరీ కవాటములకు
తమ పాదతీర్థ ముత్కూట నీలమేఘము మో
సకలచేతన చిత్తసస్యములకు
తమ సుప్రసాదంబు విమలాంజనము పరం
ధామస్వరూప నిధానములకు
తమ ప్రభావము ఘోరతర పంచవదన మో
చండపాషండ వేదండములకు
తే. అనఁగఁ గందాళవరదేశికాప్పకణ్ణ
శివ్య పెద్దింటి తిరుమలసింగరాత్మ
జాతతిరుమలతిరుమలాచార్యవర్యు
సన్నుతి యొనర్తు మద్గురుస్వామి నెపుడు.'

మేము చూచిన యితర లిఖితప్రతులలో నీపద్యము లేకుండుటచే మాచేఁ బరిష్కృతమైన హరివంశమున నీ పద్యము చేర్పఁబడలేదు. అంతియగాక, హరివంశమును

మేము పరిష్కరించి ముద్రించినపిదప నీపద్యమును జూచుట తటస్థించినది. శైలినిబట్టి చూడఁ బద్యము ప్రక్షిప్తమనుటకు వీలు లేదు. శంభుదాసుఁడు ఆనాఁటి నియోగులవలె శివకేశవులందు సమానభక్తి తాత్పర్యములు గలవాఁడై శంకరాచార్య పీఠమునకు, రామానుజ పీఠమునకు శిష్యత్వము గలవాఁడై యుండెనేమో యని తోఁచుచున్నది. ఈ పద్యమునందుఁ దిరుమలాచార్యుఁడు శంభుదాసునకు వంశపరంపరాగతాచార్యుఁడేమో యని తోఁచుచున్నది. ఈ పద్యముగల హరివంశ ప్రతి ఆంధ్రవిశ్వవిద్యాలయమునందుఁ గలదు. అందలి పాఠము లనేకములు నిర్దుష్టములుగ నున్నవి. ఆంధ్రలోక మీపద్యమునకు శంభుదాసునకుఁ గల సంబంధమును గూర్చి తెలిసికొనుట యవసరము.

శ్రీ శేషాద్రి రమణకవులు

---



భాస్కరాభ్యుదయము.

(త్రివర్ణచిత్రమునుండి)

చిత్రకారుడు: చామకూర సత్యనారాయణగారు, రాజమండ్రి.

---



“నక్షత్రదర్శనము”ను గూర్చి వ్రాయుమనగా మాచిత్రకారుడీచిత్రమును బాపెను.



ఆదూరి సత్యనారాయణగారు

శ్రీ కుసుమ హరనాథ బాబాగారి భక్తులచే శ్రీ బాబాగారిపేర శ్రీద్వారకా తిరుమలలో స్థాపింపబడిన ఆశ్రమమునందు నివసించుచు ఆంధ్రదేశమున భక్తిని వ్యాపింపజేయుటకై నిరంతరమును కృషిచేయుచున్నారు. ఇది వీరు భక్త్యావేశమున తన్మయులై యున్నప్పుడు తీసిన ఆకస్మికఛాయాచిత్రము.

## అమెరికాలో నిరక్షరాస్యతపై దాడి

డా. సుధీంద్రబోసుగారు 'ది సిటిజెన్ ఆఫ్ ఇండియా' అను పత్రికయందు అమెరికాలో నిరక్షరాస్యత యెట్లు తొలగించుచున్నారో ఒకవ్యాసమున వివరించిరి:

౧౯౩౦ సం. జనాభాలెక్కలు అమెరికా సంయుక్తరాష్ట్రములందు ఏప్రిలులో వచ్చును. అందు నిరక్షరాస్యులుగ తేలినవారి పేరులును, విలాసములును, వారి నిరక్షరాస్యత తొలగించుటకుగాను అధికారులకు పంపెదరు. సంయుక్తరాష్ట్రములందు నిరక్షరాస్యత తొలగించుటలో జనాభాలెక్కలవారు తోడ్పడుటకు ఇదియే మొదటిసారి.

ఏ భాషలోను వ్రాయలేనివాడు నిరక్షరాస్యుడు. ౧౦ ఏండ్లక్రిందట జనాభాలెక్కల ప్రకారము ఈదేశమున నూటికి ఆరుగురు నిరక్షరాస్యులని తేలినది. నిరక్షరాస్యత అయోవా ప్రాంతమున మిక్కిలి తక్కువ: నూటికి ౯౯ వంతున అక్షరాస్యులే; లూషియానా ప్రాంతమున మిక్కిలి ఎక్కువ: చదువను వ్రాయను తెలిసినవారు నూటికి ౭౯ మందికంటె తక్కువమందియే. డెన్మార్కు, స్వీడెన్, స్విట్జర్లాండ్, జెర్మనీ, తుదకు ఇంగ్లండు-వేల్సు, అన్నిటను సంయుక్తరాష్ట్రములకంటె నిరక్షరాస్యత తక్కువయే.

నిరక్షరాస్యతకై యేర్పడిన జాతీయ ఆదేశ సంఘము (National Advisory Committee) నాయకత్వమున ఈవత్సరారంభమునుండి నిరక్షరాస్యత తొలగించుటకు జాతియంతయు పాటుపడుచున్నది. ఈ సంఘమును అధ్యక్షు హూవరుగారి అనుజ్ఞతో సమష్టిప్రభుత్వము (Federal Government) నియమించినది. ఏతత్సంఘము సభ్యుల తోడ్పాటుతో వివిధరాష్ట్రజాతీయోపసంఘములు ఈ జనాభాలెక్కలు ప్రారంభ మగుటకు ముందే నిరక్షరులకు చదువను వ్రాయను ప్రాథమికసూత్రము లైనను నేర్ప పాటుపడుచున్నవి.

రాష్ట్రములలోనికి, ప్రతిగృహములోనికిని విద్యాభిలాష చొప్పించుటకుగాను జాతీయఆదేశసంఘము సమగ్రములు, సాంగోపాంగములు నగు విధానములను సిద్ధము చేసినది. నిరక్షరత మిక్కిలి హెచ్చుగా నున్న దక్షిణ రాష్ట్రము లైదును—లూషియానా, జార్జియా, దక్షిణ కారోలినా, మిసిసిపీ, అలబామా—అనునవి తమ నిరక్షరతా కళంకమును తుడిచివేసికొనుటకుగాను సంభ్రమముతో ప్రయత్నములు సాగించుచున్నవి. దక్షిణ కారోలినాలో నిరక్షరులసంఖ్య తగ్గించుటకు రాష్ట్రవ్యాప్తమగు సంచలనము విజృంభించుచున్నదని ఆరాష్ట్రపు విద్యోపద్రష్ట (the state Superintendent of Education) నాతో చెప్పినాడు. అమెరికాచరిత్రమున నెల్ల ఇట్టి రాష్ట్రవ్యాప్త మగు ప్రయత్నము జరుగుట కిదియే మొదలట. తక్కినరాష్ట్రములును వెనుక బడుటలేదు.

పెద్దవారికి బోధించుపద్ధతి సులభముగా నున్నది. మొన గల ఒక గట్టి సాధనముతో ఒక మెత్తని పదార్థమున విద్యార్థిపేరు గాడిగా వ్రాయగా, విద్యార్థి దానివెంబడియే దిద్దుచు తనపేరు వ్రాసికొనుటకు సమర్థుడు కావలెను. తరువాత మఱికొంత వ్రాత నేర్పుదురు కాబోలు; పిదప చదివించుటకు ప్రయత్నింతురు. మిక్కిలి కష్టమైన పనియెల్ల విద్యావిహీనులను చదువుకొనుట కొప్పించుటే.

వచ్చెడి జనాభా లెక్కలలో మంచి లెక్క యెక్కుటకై ఈ కొలదివారములలోను దేశమున గల విద్యావిహీనత నంతను తొలగించివేయవలెనని కాదు ఉద్యమనాయకుల ఉద్దేశము; మనసులలో పుట్టిన ఈ కదలిక అజ్ఞానమును తొలగించుట కొక అవకాశముగా తీసికొనుచున్నారు. జనాభాలెక్కలలో తమ్ము నిరక్షరులుగా వేయుటకు అమెరికాలో ఎవరో కాని ఇష్టపడరు. ఇప్పుడిక సమయము వచ్చినది గనుక, జనాభాలెక్కలు తీసికొనువారు వచ్చుసరికి ఇంతవఱకు నిర్లక్ష్యముగా నుండినవారు మందమాంద్యముల విలాసములు వదలిపెట్టి చదువను వ్రాయను ప్రత్యేకకృషి సల్పుదురని ఆశ కలదు. వారట్లు నిశ్చితోత్సాహముతో పాటుపడుచునే యున్నారు.

భారతదేశమునందో నూటికి తొంబది ముగ్గురు చదువురానివారే! అయినను చదువునేర్పుటకై భారతీయులకు సమకూర్పబడిన వసతులు చాల తక్కువ. అన్యాక్రాంతమయి, స్వాతంత్ర్యమును కోలుపోయి క్రుంగుచున్న దేశమునందలి ప్రజలు ఇట్లు నిరక్షరకుక్షులై యుండుట వింతకాదు!

---

## అమెరికాయందు భారతీయ భావకతా (Thought) ప్రోద్బలము

౧౯, ౨౦ శతాబ్దులందలి కొందఱు అమెరికాఖండపు విఖ్యాతరచయితలకు భారతీయ భావకత యెట్లు ప్రోద్బల మిడెనో 'ప్రబుద్ధ భారత' పత్రిక సంపాదకీయములందు వివరింపబడినది:

౧౯-వ శతాబ్దమున అమెరికాఖండపు ఉత్తమ భావకులు (thinkers) భారతీయ భావకత ప్రోద్బలమునకు సమృద్ధిగ పాల్పడిరని మనలో చాలమందికి చూచాయగ తెలియును. ఈసందర్భమున ఎమర్సన్ పేరు మనకు ప్రధానముగ కానవచ్చును... మిక్కిలిగ ప్రోద్బలమునకు పాల్పడ్డ భావకులు థోరో, ఎమర్సన్ అనువార లిరువురును. కాని యింకను వాల్టు విట్మన్, ఎడ్గార్ ఆలన్ పో, మేరీ బేకర్ ఎడ్డీసతి మఱి యితరులును గూడ కలరు.

థోరో తనకు భారతీయప్రోద్బలము వేనివలన కలిగెనో తెలిపినాడు: 'గీతకు' ఫ్రెంచి తర్జుమా; ఆతడు చెప్పలేదు కాని, ఇది బోర్నఫ్ వ్రాసినదయి యుండును; ౧౮౪౦ లో ప్రకటితము. ఇంతకంటెను ముఖ్యమైనది చార్ల్సు విల్కిన్సు అను ఆయన వ్రాసిన ఇంగ్లీషు తర్జుమా; ఇది వారెన్ హేస్టింగ్సు గారి ఉపోద్ఘాతముతో ౧౭౮౫లో ప్రకటితమైనది.

థామస్ చోల్మాండెలీ అను ఒక ఆంగ్లేయుడు ౧౮౫౪ లో కాన్కార్డ్ ప్రాంతము సందర్శించి అప్పటి పండితులతో మైత్రి సల్పెను. ఆయన ఇంగ్లండు నుండి వచ్చినవెనుక థోరోకు ౪౪ సంపుటములుగా ప్రాచ్యఉద్గ్రంథసంచయము పంపెను. ఇందే గ్రంథమును అమెరికాలో దొరకనే దొరకదని థోరో చెప్పెను.

వాల్టువిట్మన్ భారతీయభావకతవలన ఏపాటి ప్రోద్బలము బడసెను? ఆతని భావకతకును, భారతీయ భావకతకును కొన్ని పోలికలు కానవచ్చినను వానికి సరియగు సంపర్కము ఇంకను గోచరింప లేదు.

పో గారికికూడ భారతీయాంతరంగముతో చాల బాంధవమున్నది. ౧౮౪౮ లో ప్రకటితమైన ఆయన 'యూరెకా' అనుగ్రంథమున భావవైఖరి ఉపనిషద్భావవైఖరిని మిక్కిలి పోలియున్నది. కొంతమంది, వాల్డో ఫ్రాంక్ మున్నగువారు, ఆయనకు తన ప్యాటనమున భారతీయ తత్త్వరసికత (mysticism) కంటబడి యుండునని నమ్ముచున్నారు.

క్రైస్తవవిజ్ఞాన (Christian Science) సంస్థాపకురాలగు ఎడ్డీసతి విషయ మింకను బాగుగ నిరూపింపవచ్చును. ఆమె మూలభావములు కొన్ని మన వేదాంతమూలభావములను పోలియున్నవని గ్రహించుటకు ఆమె తన 'విజ్ఞానము-ఆరోగ్యము' (Science and Health) అను వేదతుల్యమగు గ్రంథమున తుదిని జేర్చిన మత, దర్శన (వేదాంత) పరిభాషానిఘంటువు చూచిన చాలును.

తుదకు, హొరేషియో డబ్ల్యు. డ్రెస్సర్, హెన్రీ వుడ్, ఆర్. డబ్ల్యు. ట్రైన్ అనువారు రచించిన మనశ్చికిత్స (Mind-cure) నుగూర్చిన ముఖ్యతమములగు నిబంధన గ్రంథములలో భారతీయభావకతకు సాదృశ్యములు మఱింత విస్పష్టముగ గోచరించును. అయిన, అవి శతాబ్ది చివర వచ్చుటచే, అనగా వివేకానందస్వామి నిర్యాణమునకు తరువాతి వచ్చుటచే, ఆయనబోధల ప్రభావము వానిపై చాల ఉండవచ్చును. అవి యోగాభ్యాసము, ఏకాగ్రత, తత్ప్రయోజనము మున్నగు విషయము

లన్నిటిని స్వీకరించును. మనశ్చికిత్స (Mind-cure)కును, నవ్యభావకత (New Thought)కును జెందిన కంకణబద్ధులు 'వేదాంత' పాఠములు చదువుకొనిరని నమ్మటకు మన కాధారము లున్నవి. మనశ్చికిత్సను గూర్చి విలియమ్ జేమ్సు ఇట్లు చెప్పెను: "అది యీ వక్ష్యమాణముల సమాహారము: బెర్క్లీ, ఎమర్సనుగార్ల ఆదర్శవాదము; భూతవాదము (spritism), దానికి చెందిన జన్మపరంపరా జీవాత్మ సంస్కార పరిణామ సిద్ధాంతము; నిత్యోల్లాసపరమైన గ్రామ్యపరిణామవాదము; భారతదేశపు మతములు—ఈనాలుగును."

## మహిషాసురమర్దని

ఇది బర్హాంపురమున ౧౭౫౧ ప్రాంతముల తయారయిన దంతపుపని చిత్రము. ఇది హైందవ సంప్రదాయములను నాలుగవజార్జి కాలము నాటి ఆంగ్లేయ సంప్రదాయములను మేళవించి తయారుచేసిన చిత్రమని చెప్పుదురు. మహిషాసురమర్దనమునకు సంబంధించిన కథ ఇందుచిత్రితమైనది. మహిషరూపమునవున్న రాక్షసుని 'మహిష శిరము' ఖండితము కాగా అసలు రాక్షసుడు ప్రత్యక్షమగుచున్నాడు. రాక్షసుని కుడిచేతిని దుర్గవాహనమైన సింహము పట్టుకొనుచున్నది. రెండవ వైపున రాక్షసుని సర్ప మొకటి చుట్టుకొనుచున్నది. చిత్రము దిగువభాగమున కుడి, ఎడమవైపుల మయూరవాహనుడైన కుమారస్వామియు, మూషికవాహనుడైన వినాయకుడును గలరు. తోరణముపై ఉబ్బెత్తు విగ్రహములు కలవు. వీటిలో గొన్ని విష్ణ్వవతారములు. తోరణము నడిమిభాగమున వృషభవాహనారూఢులైన పార్వతీపరమేశ్వరుల విగ్రహము కలదు.

## సాంచీస్తూపపు ఉత్తరతోరణము
## (లోపలి వైపు)

సాంచీస్తూపమున ప్రాక్పశ్చిమదిశలను, దక్షిణోత్తరదిశలను ఉన్నతోరణములు (ద్వారములు) శిల్పచిత్రబహుళములై కళాసంపదకు పేరుగాంచినవి. ఈనాలుగు తోరణములలో మొదట నిర్మితమైనది దక్షిణతోరణము. తరువాత క్రమముగా ఉత్తర, ప్రాక్పశ్చిమతోరణములు నిర్మింపబడినవి. నాలుగు తోరణముల నమూనా కొంచెమించుమించుగ నొక్కటే. జాతిపని కనుకూలపడని సూత్రములమీద ఇవి నిర్మింపబడినప్పటికి రెండువేల సంవత్సరములవఱకు ఇవి చెక్కుచెదరక నిలిచియుండుట ఆశ్చర్యములలో నికెల్ల ఆశ్చర్యము. నిలిచియున్నతోరణములన్నిటిలో సుస్థితిలో నున్నది ఉత్తర తోరణమే.

ప్రతితోరణమున ఇరుగడల రెండు స్తంభము లుండును. స్తంభములపై మాళికలుండును. (స్తంభశిరోభాగమునకు మాళికయని, స్తూపియని పేర్లు కలవు). ఈ మాళికలపై మూడు ఉత్తరవాసము (అడ్డకంబము) లుండును. వీటి చివరలు వట్రువతిరిగి యుండును. ఒకవాసమునకు మఱియొకవాసమునకు నడుమ ఇరువైపుల రెండు చదరపు శిలాఫలకము లుండును. ఇవి మాళికలపై నిలిచియుండును. ఈ శిలాఫలకపు జతలకు నడుమ నిలువుగ మూడు జాతిదిమ్మె లుండును. ఈ దిమ్మెలకు నడుమ వేఱువేఱురకముల శిలాచిత్రము లుండును. సాంచీస్తూప తోరణాకార మిది. వాసములపైనను, తోరణస్తంభముల పైనను జాతకకథలు, బుద్ధకథలు చిత్రితములగును.

మనచిత్రమున క్రింది ఉత్తరవాసముపై వెస్సంతర జాతకకథ చిత్రితమైనది. ఏతత్కథాప్రారంభము ఈ వాసము వెలుపలివైపున గలదు. కుడివైపున వెస్సంతరుడును అతనిభార్య మద్దియు గానవచ్చుచున్నారు. వారు వంకగిరి కరుగుచున్నారు. వంకగిరిమీద శక్రనిర్మితమును, రంభాతరు విభూషితమునైన కుటీరమున వెస్సంతరుడు నివాస మేర్పఱుచుకొనును. (వాసము మధ్యభాగమున) ఆతడు జూజకుడను బ్రాహ్మణునికి తన బిడ్డలను ధార పోయుచున్నాడు. ఈసమయమున మద్ది తన కుటీరమునకు రాకుండ దేవతలు సింహరూపమునను, వ్యాఘ్రరూపమునను ఆమె నడ్డగించుచున్నారు. మద్ది కెడమప్రక్క నొకవిలుకాడు విల్లెక్కిడి బాణమును వదలెదనని దాన ప్రతిగ్రహీతయైన బ్రాహ్మణుని జడిపించుచున్నాడు. ఈ

చిత్రములకు దిగువ, జూజకుడు పిల్లలను కఱ్ఱతో నదలించుచు మఱలించుకొనిపోవుచున్నాడు. (ఎడమప్రక్క) వెస్సంతరుడు తన భార్యనుగూడ దాన మొసంగుచున్నాడు. ఇంద్రునియనుగ్రహమున వెస్సంతరుడు తన యాలుబిడ్డలను గలసికొనును. ఈసమావేశము ఎడమచేతివైపు ఎగువ మూలభాగచిత్రమున జూపబడినది. ఎడమప్రక్క వాసము చివరిభాగమున గనబడునది వెస్సంతరుని భార్యాపుత్రాదులు అతని తండ్రిప్రాసాదమున సుఖస్థితినున్న చిత్రము.

మధ్యవాసముమీద బుద్ధచరితమునందలి మారకథ చిత్రితమైనది. ఈకథయన్న బౌద్ధులకు చాల ప్రీతి. ఈ వాసము ఎడమచేతివైపు భాగమున బుద్ధగయయందలి పిప్పలవృక్షము కలదు. తపస్సమాధినీ వృక్షరాజముక్రింద గూరుచుండియే గౌతముడు బుద్ధుడగుటచే నిది బోధివృక్షము నాబరగుచున్నది. ఈవృక్షముపై ఛత్రమును, ముందు బుద్ధుని వజ్రసింహాసనమును గలవు. వృక్షమునకిరువ ఇరుకెలంకుల పతాకధారులు కలరు. వజ్రసింహాసనముపై గూర్చుండి గౌతముడు మారుని ప్రలోభనములకు లోబడక, జడిపింపులకు జడియక ధైర్యస్థైర్యములతో నిలిచి తుదకు బుద్ధత్వము నొందెను. ఇందు వజ్రసింహాసనము శూన్యముగా నున్నది. ఈచిత్రము విగ్రహారాధనమునకు బీజములునాటిన మహాయాన మావిర్భవించుటకు పూర్వము చిత్రింపబడిన దగుటచే ఆశూన్యతయే సింహాసనమున బుద్ధదేవునిస్థితిని తెలియజేయును. ఎడమప్రక్క నిలుచున్నది సుజాతయై యుండును. బుద్ధత్వము నొందుటకు కడపటిమాఱు ధ్యానముద్రాంకితుడు కాకపూర్వ మీమె భోజనము పెట్టినది. ఈవాసము మధ్యభాగమున పరిజనపరివేష్టితుడై మారుడు సింహాసనాసీనుడై యున్నాడు. తమ హావభావ విలాసములచే గౌతముని సమ్మోహపఱిచి వశముచేసికొనుటకై మారుని కూతుళ్లు వెళ్లుచున్నారు అతని కుడిప్రక్క గాంచనగును. మారునిఎడమప్రక్క అతని కనువర్తులై యుండు భూతములు కలవు. బౌద్ధమతము ప్రకారమివి మానవజాతిని పీడించు పాపములు, అరిషడ్వర్గములు, భీతులు మొదలైనవి.

పైవాసముమీద ఛద్దంతజాతకము చిత్రితమైనది. హిమవత్పర్వముల నుండు ఆఱుదంతములుకల ఛద్దంతుడను గజరాజునకు క్షుల్లసుభద్ర మహాసుభద్ర లను నిరువురు భార్యలుండిరి. మహాసుభద్రను తనభర్త తన్నుకన్న ఎక్కువగ ప్రేమించునని ఆమెను జూచిన క్షుల్లసుభద్ర కసూయ. అందువలన ఆమె జన్మాంతరమున కాశీరాజుగారాబు భార్యయై పుట్టి తనభర్తపై పగ దీర్చుకొనవలెనని బోధిసత్త్వుల నారాధించును. తుద కామెకోర్కె సఫలమై ఆమె కాశీరాజు భార్య యగును. ఒకప్పుడామె పూర్వజన్మవాసన గలిగి వ్యాధి నటించి తద్వ్యాధినివారణార్థము షడ్దంతగజమును బట్టుకొని దాని దంతములను గొనిరావలసినదని సోనుత్తరుడను వ్యాధుని బంపును. ఆతడు కతిపయ ప్రయాణముల ఛద్దంతావాసమగు అరణ్యమునకు బోయి, యాగజమార్గమున గోయి త్రవ్వి తుదకు దానిని బట్టుకొనును. ఛద్దంతుడు వ్యాధుని సమాచారమంతయు దెలిసికొని తన దంతములను గోయుటలో తానుకూడ ఆతనికి తోడ్పడి, తుదకు ప్రాణములం గోలుపోవును.

ఈజాతకకథ యిచ్చటచాల అస్పష్టముగ చిత్రితమైనది. కథాంగములు సంకుచితములైనవి. సోనుత్తరుడుకాని, కాశీరాజు భార్యకాని యిందు చిత్రింపబడినట్లు కన్పట్టదు.

ని వుమూలములకు కట్టకడపట ఎగువ గనబడు త్రిశూలములు బౌద్ధధర్మచిహ్నములు. త్రిశూలము వలన బౌద్ధుల త్రిరత్నములు సూచితములు త్రిశూలము క్రిందిది బౌద్ధుల ధర్మచక్రము.

---

## దామర్ల వేంకటాద్రినాయకుడు:
## ఫ్రాన్సిస్ డే దొర

దామర్ల వేంకటాద్రినాయకుడు చంద్రగిరి విజయనగరరాజ వంశజులకు సామంతుడు. ఇతడు క్రీ. శ. ౧౬౩౯ ప్రాంతముల వందవాసి రాజధానిగ సముద్రతీరప్రదేశమును పరిపాలించుచుండెను. ప్రళయకావేరి (Pulicat)కూడ ఇతనిరాజ్యములోనిదే. ఇతని సోదరుడు దామర్ల అయ్యప్పనాయకుడు. క్రీ. శ. ౧౬౩౯ ప్రాంతమున ప్రళయకావేరియొద్ద వలందుల వలసయు, 'మైలాపూరు'లోని "సాన్‌థోమ్" నొద్ద బుడతకీచుల (Portugese) వలసయు నుండెను. హిందూదేశముతో వర్తక వ్యాపారము నడపుటకై ఉభయజాతులవారు

ఇచ్చటి కేతెంచి వలస లేర్పఱుచుకొనిరి. 'కుంపిణీ'వారు (ఆంగ్లేయులు)కూడ ఇదేకాలమున ఇచ్చట వర్తకము సాగించుచుండిరి. ప్రాక్సముద్రతీరమున 'కుంపిణీ'వారి ప్రధానస్థాన మప్పుడు మచిలీపట్టణము. వీరు బుడతకీచులు, వలందులతో పాటు తాముకూడ దక్షిణమున—సముద్రతీరముననే—ఒక వలస ఏర్పాటుచేసికొనుటకై స్థలమునకు నెమకుచు దేశీయప్రభువులను సందర్శించుచుండిరి. అప్పుడు ఈ ప్రాగ్దేశముల వర్తకములు నడుపువారిలో బుడతకీచులు,వలందులు ముఖ్యులు. వీరిలో వీరికి పోటీ ఎక్కువగ నుండెను. ఈ కారణమున ప్రళయకావేరిలోని వలందులు 'సాంథోమ్'లోని బుడతకీచులు నిరంతరము పోరాడుచుండిరి. వీరి ఈ నిరంతర కలహముల మూలమున దేశక్షేమమునకు, అభివృద్ధికి భంగము కలుగుచుండెను. ఈ కారణమున పూనమల్లి ప్రాంతమున కధిపతియైన అయ్యప నాయకుడు తన సోదరుడైన వెంకటాద్రినాయకుని ఈ యుభయజాతుల వారి పోరాటములు అడగునట్లు 'కుంపిణీ'వారిని ప్రళయకావేరి, సాంథోములనడుమ నిలిపిన యుక్తముగ నుండు ననియు, వారివలసకు తమ తండ్రి చెన్ననాయకుని పేరు పెట్టించుట బాగుండుననియు సలహా నొసంగెను.

ఈకాలముననే మచిలీపట్టణము కుంపిణీవారి వర్తకులలో నొకడైన ఫ్రాన్సిస్ డేవొర 'కుంపిణీ'వారిపక్షమున వర్తకానుకూలస్థలసంపాదనము నిమిత్తము దామర్ల వేంకటాద్రినాయని క్రీ. శ. ౧౬౩౯ లో సందర్శించెను. ఈసందర్శనము ఫలప్రదమయ్యెను. వెంకటాద్రినాయకుడు మెద్రాస్‌పటము (Medraspatam) నొద్ద గాని, దానిచుట్టుపట్టుల గాని 'కుంపిణీ'వారు వలస నేర్పాటు చేసికొని కోట కట్టుకొనుట కనుమతించుచు డేవొరకు శాసనము వ్రాసి యిచ్చెను. ఇది బంగారు రేకులపై వ్రాయబడినది. సముద్రతీరముననే ఉత్తరదక్షిణములుగ ఆఱు మైళ్లపొడవు, నాటున పశ్చిమముగ మైలువెడల్పు—ఇది వేంకటాద్రినాయకుడు 'కుంపిణీ'వారి కిచ్చిన స్థలమువైశాల్యము. ఈ స్థలము నిచ్చినందులకై 'కుంపిణీ'వారు వేంకటాద్రినాయనికి ప్రతివత్సరము '౧౨,౦౦౦ ల వరహాలు' '(౬౦౦ ల పౌనులు)' ఇయ్య నిర్ణయము. "బ్రిటీషుజాతితో స్నేహానురాగములు వృద్ధినొందుటకై "స్వతంత్రముగ నాణెములను ముద్రించుకొను అధికారమును, వారి వలస ప్రదేశమున తగవులు తీర్చుటకున్నగు న్యాయాద్యితరాధికారములును వెంకటాద్రి నాయకుడు 'కుంపిణీ'వారికే యొసంగెను. అంతియ గాక శాశ్వతముగ వారిసరకులపై సుంకములనుగూడ మన్నించెను. 'కుంపిణీ'వారివట గట్టు పట్టణమునకు దన తండ్రిపేరట చెన్నపట్టణమని నామకరణము చేయ వేంకటాద్రినాయకుడు కట్టడి చేసెను.

ఈప్రదేశమున 'కుంపిణీ'వారొకగిడ్డంగి (సరకులు నిలవచేయుటకై) కట్టి,తద్రక్షణమునకై ఫిరంగు లుంచిరి. దీనినే యిప్పుడు సెంటు జార్జికోట (Fort St.George) యనుచున్నారు. పరాసువారీచెన్నపట్టణమును క్రీ. శ. ౧౭౪౬-౧౭౪౯ లో ముట్టడించి నప్పుడు వేంకటాద్రి నాయడు 'కుంపిణీ'వారి కిచ్చిన బంగారుశాసనము పోయినదని చెప్పుదురు.

మనచిత్రమున వేంకటాద్రినాయకుడు డేవొరకు శాసనము (కౌలు) నిచ్చుచున్నట్లు చూపబడినది. వేంకటాద్రినాయకుడు కూర్చుండు సభాభవన నిర్మాణపద్ధతి చంద్రగిరిరాజసౌధ రాజసభాభవన పద్ధతి ననుకరించుచున్నది.

చెన్నపట్టణ నిర్మాణమున కయ్యపనాయకుడే కారకుడగుటచే ఈతడు దామర్ల అంకభూపాల విరచితమైన ఉషాపరిణయమున నిట్లభివర్ణింపబడియున్నాడు:

ప్రళయకావేరి మైలాపురంబుఁ గల్మి
తీరమునఁ బోర నదిమట్టు పెట్టఁ దండ్రి
పేరఁ దన్మధ్యభూమిని పృథువిభూతి
నలవరిచెఁ జెన్నపట్టణ మయ్యనృపతి.

---

## 'విజయనగరద రాయరు'

కడచిన మార్చి నెల 'జయకర్ణాటక'యను మాసపత్రికలో ధారవాడ శ్రీ నరగుంద రామరాయరు, (యల్. యల్. బి.) అనువారు

"చాళుక్యరాష్ట్రకూటాదిగళు కన్నడిగరే!" (చాళుక్యరాష్ట్రకూటాదులు కన్నడులే) అను నొక వ్యాసమును వ్రాసియున్నారు. అందు 'విజయనగరద రాయరు' అను ఉపశీర్షికను విజయనగరరాజులనుగుఱించి యిట్లు వ్రాసియున్నారు:

## విజయనగరము రాజులు

"ఇక, పూర్వదిక్కున తెలుగు బాంధవుల సంబంధమును గూర్చి యిచ్చట సంక్షిప్తముగా జెప్పెదను. విజయనగర సామ్రాజ్యమునందు వీరికి అభిలాష మెండు. పెక్కురు ఆంధ్రగ్రంథకర్తలు ఆ సామ్రాజ్యము తెలుగు సామ్రాజ్యమని చెప్పియున్నారు. వీరిని నిరాకరింపుచు హొసపేటలో (జరిగిన) ఒక సాహిత్య సమ్మేళనమునందు సవిస్తరమైన వ్యాసమును నేను జదివియున్నాను. అది సాహిత్యపత్రికలో అచ్చయియుండుటవల్ల ఇచ్చట హెచ్చుగ చెప్పలేదు. దానిని చదువుడని 'జయకర్ణాటక'పు పాఠకులకు విజ్ఞాపన. ఆంధ్రులు కృష్ణదేవరాయలను ఆంధ్రభోజుడని పిలుచుచున్నారు. మఱియు, ఆంధ్రకవు లనేకులు అతనిని పొగడియున్నారు. అయినప్పటికిని, కృష్ణదేవరాయడే రచించిన తెలుగు గ్రంథమగు ఆముక్తమాల్యద గ్రంథపు మొదటి పద్యమునసే తాను కన్నడరాజ్యరమారమణుడననియు, తనను తెలుగు సీమయొక్క దేవత కలయందునచ్చి (ఆసీమలో పాళ్యము దిగియుండగా) 'తెలుగున నీవొక గ్రంథమును రచింపుము' అని చెప్పెననియు, అట్లే రచియించితినని యు చెప్పియున్నాడు. ఈయుదాహరణమొకటిచాలును. ఈదేశమునుంచి యాత్రికు లనేకులు తిరుపతికి పోవుచున్నారుకదా. వారు శ్రీవెంకటేశ్వరునిగుడియందు దేవునికి ఎదుట నిలిచియుండు రెండు విగ్రహములను చూచియుండవచ్చును. అందు ఒకవిగ్రహము ఉభయభార్యాసమేతుడైన కృష్ణదేవరాయలది, మఱియొకటి వేంకటపతిరాయనిది. ఈ విగ్రహములమీద వారివారి పేర్లను చెక్కియున్నారు. శ్రీకృష్ణరాయలయొక్కయు ఆయనదేవులయొక్కయు విగ్రహములమీదిపేర్లు కేవల అచ్చకన్నడము. అనగా, శ్రీకృష్ణదేవరాయరు, తిరుమలమ్మనవరు చిన్నమ్మనవరు అనునవి. కాని, వెంకటపతిరాయల విగ్రహముమీదిపేరు "వెంకటపతిరాయలు"అనియే యున్నది. ఇందుమూలమునను "కృష్ణదేవుడు" కన్నడుడనియు వేంకటపతిరాయడు తెలుగురాజనియు స్పష్టమగుచున్నది. ఇంతేకాక, బళ్లారి అనంతపురజిల్లాలలోని శిలాశాసనములు ఈమాటను నిర్ణయముచేయుచున్నవి విజయనగరపు కడపటి (రాజ) వంశము తెలుగువంశమైనది. పాతరాజుల బిరుదావళులు, రాజశాసనములు, శిలాశాసనములు, గుళ్లు, వీధులు మొదలగువానిపేర్లు ఇవన్నియు అచ్చకన్నడము.

నవీనోద్యమములమూలమున మన యిరుగుపొరుగువారికి పేరుగన్న పురాతన కర్ణాటక సామ్రాజ్యముల విషయమయి యిట్టి యభిలాష గలదు. కన్నడుల మగు మనము ఈమహనీయులు వ్రాసినది చదివి అదే నిజమని భావించి మనలను కొంచెపఱుచుకొనుట మనకు గొప్ప కళంకము. మన యితిహాసమును మనమే రచించుకొనవలయును. (కాని మనపొరుగువారివలె అసత్య విధానములను జేయకూడదు. పైచెప్పినట్లు, శిలాశాసనములయందును, గుడిగోపురములయందును, మన పురాతనవాఙ్మయమునందును తగునంతసామగ్రి దొరకుచున్నది. ఇదిగాక, పోర్చుగీసులకాలమందు గోవాలోగాని లిస్బనునందుగాని, విజయనగరరాజవంశము లకుసంబంధించిన, విశ్వసనీయమైన సామగ్రిదొరకును.

మనపొరుగువారి గ్రంథములలోగాని, లేక ఇంగ్లీషు ముసల్మానీగ్రంథములయందుగాని – వానిలోని విధానములకు స్వతంత్రాధారములు దొరకిననేతప్ప-(మనము) పూర్ణ విశ్వాసము నుంచకూడదు.

'జయకర్ణాటకము'నుండి ఆంధ్రీకరణము.

---

## జార్జస్ రౌవాల్టు (క్రొత్తమాదిరి) చిత్రములు

జార్జస్ రౌవాల్టు ప్యారిసునగరమున పేరుగన్న వర్ణచిత్రకారుడు. ఇతనిచిత్రములు ఇరువది లండనునగర

మున ప్రదర్శింపబడి యున్నవి. లండను నగరమున నితని పేరు అంతగా తెలియదు. కిత్తానుపై నీతడు రంగులను నిర్లక్ష్యముగ పూయును; కాని యితనిచిత్రముల మోటుపాటనము గొప్పతనముగల కొన్ని విశేషలక్షణములు గలిగి యుండును. ౧౯ వ శతాబ్దమునందలి చిత్రలేఖన విధాన తత్త్వమును బాగుగ దెలిసినవారికి కూడ యీతని చిత్రలేఖన విధానము దెలిసికొనుట అసాధ్యము. "ఈ గొప్పచిత్రకారుని చిత్రలేఖనమున దానికి ప్రతీకారము చేయుగల వారికి మాత్రమే గోచరించు నొకగుణము కలదు.



చిత్రము ౨.

ఇదియొక హాస్యచిత్రము. హాస్యగసమయముగ చిత్రింపబడినది. ఎడమవైపుననున్న శిరస్సూ, చిత్రమును కొంత దూరమున నుండి చూడవలసినవి. సమీప పరిశీలనమువలన కానరాని దాని యాధార్థ్యము, గాంభీర్యము నపుడు కానవచ్చును.

రొవాల్టు నిక్కమయిన చిత్రకారుడు. ఇందుకు సందేహము లేదు" అని ఒక కళావిమర్శకుడు చెప్పెను.

'స్ఫియరునుండి'



చిత్రము ౧.

ఇదియొకతల. ఈ ప్రతికృతినిబట్టి దానిస్వరూపమునొక్క భావము నొకింత తెలియనగును. ఇందు మోటుదనము నిరుపమానమనదగును. ఈబొమ్మ నొక కళాభిజ్ఞుడు కొనెను.



గోహరుకన్య

## గోహరుకన్య

ఈ సుప్రసిద్ధనటకురాలు ౧౯౧౦ వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో పుట్టినది. ౧౯౨౫ వ సంవత్సరము 'సినిమా' రంగమున కెక్కినది. 'శ్రీకృష్ణ ఫిలిమ్ కంపెని' యందు తొలుదొల్త పాత్రధారణము చేసి తరువాత పెక్కు కంపెనీలలో పెక్కు నాటకములయందు నాయికాపాత్రలను ధరించి ప్రసిద్ధి కెక్కినది. మిగుల సౌందర్యవతియగు నీమె కన్దోయి సమ్మోహనకరములగు చూపుల బరపుచుండును. దుఃఖసంతోషములు, ఆఘాతోల్లాసములు క్షణమాత్రావకాశమున మార్పు చెందుచున్నను అంతవేగముననే తద్భావములను ప్రస్ఫుటముగ ప్రకటించుటయందీమెకు నిరుపమానసామర్థ్యము గలదు.

ఈనటీమణి ప్రస్తుతము 'శ్రీరంజిత్ ఫిలిమ్ కంపెనీ'కి చందులాల్ షా గారితోపాటు యజమానియై పెక్కు సుప్రసిద్ధభారతీయనాటకములయందు నాయికాపాత్రముల నభినయించుచున్నది. ఖలీల్ అహ్మదు, రాజాసాండో, వైద్య, దిన్ షా బిల్లి మోరియా అనువారు పురుషపాత్రముల ధరించి యీమెతో నభినయింతురు.







శ్రీ శొంఠి రామమూర్తిగారి సతీమణి

ఈమె చెన్ననగరమున గౌరవన్యాయాధికారిగ నియమింపబడెను.




శ్రీ మసీకు మెహతా కన్యగారు

ఈమె చెన్నపురి క్వీన్ మేరీ కళాశాలయందు రసాయన శాస్త్రోపాధ్యాయినిగనున్నది. ఈమె రసాయన శాస్త్రప్రవీణురాలు.



### మిస్. శకుంతలా తంపిగారు

సినిమానటిగ నిదివరకు పేర్గాంచిన యీమె ప్పుడు మదరాసులో నివాసమేర్పరచుకొని చిత్రలేఖన భ్యసించుచున్నది.



### శ్రీపాకల సౌభాగ్యవతిగారు

బరంపురము పురపాలకసంఘమున సభ్యురాలుగ నియమింపబడెను. ఈమె శ్రీపాకల నారాయణస్వామిగారి భార్య; పిఠాపురపు దివానుగారి కొమార్తె.



### శ్రీ లక్ష్మీనారాయణ నాయరుగారి సతి

తిరువనంతపురం (Trivandrum) కళాశాల యందు సంగీతోపాధ్యాయగా నున్నది. అణ్ణామలై విశ్వ విద్యాలయమున గానపరీక్షయం దుత్తీర్ణయైన ఈమె తండ్రి సుప్రసిద్ధ గాయకులు.




శ్రీ పొన్నమ్మాళుగారు.

తిరువాంకూరు హైకోర్టువకుమాస్తాగా నియమింపబడిన ప్రథమ బ్రాహ్మణ స్త్రీ.




శ్రీ యం. బాలమ్మాళ్‌గారు, యం.బి.బి యస్.

ఈమె తిరుచినాపల్లి పురపాలకసంఘమున సభ్యురాలుగ నియమింపబడెను.



శ్రీమతి పటేలు కన్యగారు,
బి. ఏ., యల్. యల్. బి.

యల్. యల్. బి పరీక్షయందు కృతార్థురాలయిన మొదటి గుజరాతి యువతి యగు ఈమె నేటికిని అంతఃపురవాసము నవలంబించియున్న 'పతిదారు' జాతికి చెందినది.



శ్రీ కే. ఆర్. కే. అయ్యంగారు సతి

ఈమె కూమారున గౌరవ న్యాయాధికారిగ నియమింపబడెను. కీ. శే. సింహప్రభువుయొక్క సోదరుని కుమార్తె యగు నీమె లండను విశ్వవిద్యాలయమున విద్యను బడసెను.

---

# అంజలి

యం. భావనాచార్యులుగారు (కవితాసమితి)

నా హృదయభృంగ మప్రయత్నముగ నీదు
పాద జలజాతముల జేరవచ్చుగాని;
తిరిగి తిరిగి వేసరి వాని నరయలేక
క్రుంగి పడును హతాశమై కువలయమున.

* * *

ప్రేమ భిక్షార్థి నై నిరుపేద నగుట
నేను నీకునై రోయుచున్నాను-గాని
నెలలు-వత్సరములు సనె! నీ హృదంత
రాళమున నింత యీ దీనురాలిమీద
గరుణ జనియింపదయ్యె; యేకత మొ నాథ!

* * *

ఐన నేమాయె? నేనాటికైన గాని
ఈవు ననుజూడగా రాకపోవు; నేను
నస్మదీయ మానస పంజరాంతరమున
నిన్ను గసిదీర బట్టి బంధించి యనుప
మాన హర్షాబ్ధి దేలకపోను లెమ్ము.

---






శ్రీ భరతపూడి శ్రీనివాస వీరరాఘవరావుగారు, యం. యస్. సి., ఏ. ఐ. ఐ. యస్. సి.,

వీరు రసాయనశాస్త్రమున ఉన్నతవిద్యనభ్యసించుటకు ఇంగ్లాండునకు పోవుచున్నారు. ఆంధ్రావిశ్వవిద్యాలయమువారు వీరికి విద్యార్థివేతనము నొసగుదురు. వీరు అయిదేండ్లు 'ఇండియన్ ఇన్స్టిట్యూటు ఆఫ్ సయన్సు'లో విద్యార్థిగా నుండిరి. రెండేండ్లనుండియు ఆంధ్రాయూనివర్సిటీ. ఫెలోగా ఉండిరి.

---

క్రీ. శ. సం. 2130లో - 3. సంఘము.

























చదువు.

తలిశెట్టి
రామారావు.




## సంగీత సుధాంబుధి

గ్రంథకర్త: కె. వి. శ్రీనివాసఅయ్యంగారు.

ప్రకాశకులు: యమ్. ఆది కంపెని వారు, ౧౧/౫౮౬, ఎస్ప్లనేడు, మదరాసు. ౧౯౩౩ సం. క్రౌను సైజు ౪౬౧ పుటలు. వెల ౩ రు.

ఇది 'సంగీతవిద్యార్థులకున్న, సంగీతవిద్యాప్రదాయకులకున్న మిగుల ఉపయోగించు' కొఱకు వ్రాయబడ్డది. సుప్రసిద్ధ వాగ్గేయకారుల గేయరచనలు పెక్కులు విస్తృతమైన స్వరకల్పనలతో ఇందు కూర్పబడ్డవి. ఈ కూర్పే ఈ గ్రంథగుణములలో ప్రాధాన్యము వహించును. లాక్షణికముగా ఇది చాల సంస్కారాపేక్షము. విద్వాంసుల నంతగా మెప్పించు స్వతంత్రపాండిత్య ప్రయోగము ఇందు కానరాదు. లక్షణవివరణ మంత సమగ్రముగను, ఉన్నంతవఱకైన అంత స్పష్టముగను లేదు. పరిభాష తగినంత వాడుకపడలేదు.

ఇందు తొలుత లక్షణసంగ్రహ మున్నది. తాళవివరణమున 'సూళాది తాళములు ౩౫కి శ్రీకరాది ౩౫ పేళ్లు పై పతకములో వ్రాయబడి యున్నవి' అని యున్నది. ఇందలి 'సూళాది' యేమో తెలపలేదు. తాళక్రమ వివరణ మసమగ్రము. అనుద్రుత, ద్రుత, లఘువులు మూడును ౩౫ తాళములకు ప్రసక్తించు ననియు, గురు, ప్లుత, కాకపాదములు 'చచ్చత్పుటాది ౧౦౮ తాళములయందు వచ్చు' ననియు తెలిపి, 'చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణము' లను నైదు జాతులును చూపి, ఈ జాతులు లఘువునకు మాత్రమే యని పిదప తెలిపి, ఇచట 'దివ్యసంకీర్ణమునకు ౬ అక్షరములని యెఱుంగునది' అన్నారు. ఆ దివ్యసంకీర్ణమునకు తాళప్రస్తారముతో నెట్టిసంబంధము కలదియు వివరింపలేదు. ౩౫ తాళములే కాని ౧౦౮ తాళములు తెలుపలేదు, ఇది విద్వాంసులకు నలదా?

మఱి రాగ నిర్వచనమువాక్యమే తప్పు. ఇది అజ్ఞతయని కాదు: రచయిత సంగీతశాస్త్ర నిష్ణాతలే కాని (తెలుగు)సాహిత్యము అంతగ తెలిసినవారు కాకుండుటచే ఈ లోపము వాటిల్లినది. ఇక 'సంపూర్ణరాగ మనగా సప్తస్వరములున్న గల రాగము' అని వివరణము. కాని వర్జరాగములకు సహా సప్తస్వరము లుండును. మఱి 'సంపూర్ణరాగములు మొత్తం ౭౨. ఇవి జనకరాగములు, లేక మేళకర్తరాగము లనం బరగును' అన్న సముదయములోని కివి చేరవు. ఆరోహణావరోహణముల రెంటను సప్తస్వరములును క్రమము దప్పక యుండునవి సంపూర్ణరాగములని చెప్పవలసినది.

౭౨ మేళకర్తలను జూపుపథక మిందు రెండు పుటలలో ముద్రించిరి: ఒకపుటలో సగము, తరువాత పుటలో మఱిసగము. మొత్తము ౭౨ మేళకర్తలును ౧౨ చక్రములలో, ఒక్కొక చక్రమునకు ఆఱేసి వంతున, నుండును. పథకము నిలువుగ మూడుకంబములుగ చేసికొనగా, నడుమకంబమున రి గ ధ ని స్వరముల ప్రకృతి వికృతిభేదములు పొడుగున నడచుచుండ, ఒకప్రక్క శుద్ధమధ్యమరాగములు ౩౬ ను ౬ చక్రములలోను, రెండవ ప్రక్క ప్రతిమధ్యమరాగములు ౩౬ ను మఱి ౬ చక్రములలోను సర్దుకొనును. అన్నిటికిని రి గ ధ ని వివరణము పొడవున సామాన్యము. కాబట్టి పథకము ౬ చక్రముల పొడ వుండవలెను. కాని ఇందు పుట చిన్న దగుటచే

3 చక్రములపాడవున పథకము రెండుగా విరిచి చెటియొక పుటపై వేసిరి. దానివలన తొలిపుటలో మొదటి ఆఱు చక్రములలోని మొదటి మూడు (౧, ౨, 3, చక్రములు) ఒకప్రక్కను, రెండవ ఆఱుచక్రములలోని మొదటిమూడు (౭, ౮, ౯, చక్రములు) రెండవప్రక్కను వచ్చినవి; అట్లే రెండవపుటలో ౪, ౫, ౬, చక్రములు ఒకప్రక్కను, ౧౦, ౧౧, ౧౨, చక్రములు రెండవప్రక్కను వచ్చినవి: ఇది అందమును లేక, అసౌకర్యముగ నున్నది. ఒక పెద్ద కాగితము మడతపెట్టిన బాగుండెడిది.

గ్రంథముతుదిని 3౭ రాగములపట్టిక రాగస్వరూపములతోను, సంబంధించు మేళకర్తల అంకెల సూచనతోను ఉన్నది. ఆది ఉపయోగకరము. అలంకారములలో కొన్ని విషమగతులు తగ్గిన విద్యార్థికి ఇంకను సుగమము గనుండును. మఠ్య, జంపె అలంకారములు అప్రధానము లనుకొని విడుచుట లోటు. పిదప, ఒకగీతమున (౪౦ పు.) మఠ్యతాళము రాను వచ్చినది. తొలుత ఆతాళము అలంకారములో విద్యార్థికి నలుగవలెనుగదా! తాళమున కొక్క అలంకారమైనను ఉండుట లగును.

వర్ణములలో స్వర(ధాతు)వ్యత్యాసములు చాలగ వాడుకలో కన్పట్టుటకు కారణము ఆయా పుస్తకములలో వెనుకటివాడుక మార్చి సంపాదకులు స్వకల్పనలు చొప్పించుటయే కావచ్చును. ఇట్టిచర్య ఇందును జరిగినట్టు అనుమానము కలిగెడిని. ఇందు గ్రంథకర్తగారి తానవర్ణములు రెండు గలవు: ఒకటి కల్యాణిలో (135 పు.); రెండవది ఉదయరవిచంద్రికలో (139పు.).

త్యాగరాజు, సుబ్రహ్మణ్యయ్య మన్నగు సుప్రసిద్ధులనేకుల కృతులు సంగతుల వివరముతో స్వరయుక్తముగ నిందు పొందుపఱిచి యున్నారు. కీర్తనలవెనుక కొన్ని తరంగములు, అష్టపదులు స్వరయుక్తములుగ చేర్చిరి. 'జావళ్లు, హిందూస్థాని, పారసీపాటలు, ఇంగ్లీషు నోట్లు మొదలగు లలితమిశ్రములను స్వరపఱిచి' యిందు చేర్చినారు. ఆయాపాటలకు 'శంకరాభరణస్వరములు', 'ఖరహరప్రియస్వరములు', 'తోడిస్వరములు' అని కొన్ని ప్రసిద్ధరాగముల స్వరావళి సూచించిరి. కాని హిందూస్థానిరాగములు పెక్కులు ప్రసిద్ధమై యుండ, మనరాగములతో వాని సమ్మేళన విపర్యాసములు మనకు గమనింపదగినవై యుండ, అవి, ఒక్క 'కాపి' తప్ప, నేవియు హిందూస్థానిపాటలయందు చూపకుండుటకు కారణము తెలియరాదు.

భాషలో తప్పులు తెలుగు సంగీత గ్రంథములలో పరిపాటి యైపోయినవి. 'సాంబశివా' యనుటకు 'శాంబశివా', 'శ్రిత' అనుటకు 'శృత', 'ఆధారము' అనుటకు 'ఆదారము', 'ధురీణుడు' అనుటకు 'దురీణుడు', 'అగ్రేసరుడు' అనుటకు 'అగ్రేశుడు' ఇత్యాదులు ఇందును పెక్కు లున్నవి.

తుదకు, ఇది శాస్త్రాభ్యసనమునకు గాక కళాభ్యసనమున కెక్కువ ఉపయోగపడు నన్నమాట. అందులకే యిది ఉద్దిష్టమైనచో చాలవఱకు సాఫల్యము పొందినదని చెప్పవచ్చును. కాని ఇందును పల్లవి మున్నగు పెద్దపోకడలకు ఇందు తావు లేకుంటచే ఈప్రయోజనమును పరిమిత మాత్రమే.

అభ్యాసకుల కీగ్రంథము తోడ్పడు ననుటకు సందియము లేదు.

కొం. జ.

---

పల్లెటూరి పాఠశాల

గ్రంథకర్త: హరివెంకటేశ్వరులు,

ఇది యెనిమిది రంగముల ప్రహసనము. పల్లెటూరి పాఠశాలను కేంద్రముగా గొని, గ్రంథకర్త గారు గ్రామజీవనమందలి లోపములను కొంతవఱకు పరిహసించినారు. ఆంగ్లవిద్య నభ్యసించి, ఉద్యోగములకై తారాడు యీకాలపు యువకులపై కట్టెపుచ్చుకొని నారు. కాని వీరి రచనయందలి దోషములు కొన్ని ప్రహసనముయొక్క విలువను చెడగొట్టినవి.

వీరు చిత్రించిన పాఠశాల పల్లెటూరి పాఠశాల కాదు. సామాన్యముగా పట్టణములయందే నెలకొని యున్న హైస్కూలు. దీనికి విచారణకర్తలు సుబ్బిశెట్టి,

విస్సన్న, కరణం నరసిహం ఇత్యాదులుకారు. పల్లెటూళ్లలో హైస్కూళ్లు నెలకొల్పుకాలము వచ్చునప్పటికి, ప్రజలలో విజ్ఞానముకూడ యెన్నియోమడుంగు లధికమై యుండగలదు. అపుడు విద్యను ప్రజాయత్తముచేయుట వలన వీరు తలంచు అనిష్టములును సంక్రమింపబోవు.

మఱి, బి. ఏ. లు, యం. ఏ. లు వీరి కంటికి నీచులుగానే గాక, మూఢులుగాకూడ కన్పించుచున్నారు. ప్రహసనములందు అత్యుక్తి దోషము కాదు; గుణము సైతమగును. కాని, ప్రహసనకర్తలు కథావస్తువును అతథ్యాపవాదమునుండి కాపాడుకొనదగును.

అయ్యవార్ల నియామకపు పట్టున, ప్రపంచజ్ఞానమును గూర్చిన ప్రశ్నాపత్రమొకటి చమత్కృతమై యున్నది. దీనిని తయారుచేసినదెవరు? ప్రహసనపాత్రములగు కమిటీసభ్యుల కిందుకువలసిన తెలివితేటలు లేవు. ఆసమయమునకు గ్రంథకర్తగారే కమిటీలోనికి దిగబడినటు లున్నది.

భాషనుగూర్చి ఒకమాట. ప్రహసనములనువాడుకభాషలో వ్రాయుట యుచితమే. వాడుకభాషయన్నంతమాత్రాన ముక్కికిముక్కిగా మాట్లాడునట్లే వ్రాయవలెననికాదు. అట్లు వ్రాయగల్గుటకూడ దుస్సాధ్యము. కావున వీరు ఆంగ్ల పదముల నంత విరివిగా ప్రయోగించుటకు తగినకారణ మగుపడదు. ఆంగ్ల పదప్రయోగము కొన్ని సందర్భములయం దసంగతమై యున్నదికూడను ఆంగ్ల పదముల నుపయోగించుతావుల సయితము, వాటిని తెలుగున నే వ్రాయనగును.

తొలిపలుకుగా విద్యనుగూర్చి గ్రంథకర్తగారు వ్రాసినవ్యాసము ఆంగ్లమున నుండుటకూడ అసంగతము. అందు, జాతీయవిద్యను గూర్చిన వీరివ్రాతలు నిరాధారములు. (గు. వెం. సు.)

---

## పతితనళిని (రెండవభాగము)

గ్రంథకర్త: పోడూరి రామచంద్రరావు గారు, బి. ఏ., బి. యల్.

ఇది యొక్క అపరాధ పరిశోధకనవల. గ్రంథము ప్రారంభమైనంత చతురతతో సమాప్తినొందలేదు. ఇట్టి నవలలలో ప్రకరణములు దాటవేయుకొలది పరిస్థితులు నిగాఢమగుచు చివరకు, కారణాంతరములచే రహస్యములు వీడిపోవునటుల సంవిధానము కల్పితము కావలెను.

కథానాయిక కమలాబాయి రహస్యము బయటపడుటకు, పరిస్థితు లడ్డముతిరిగిన చిహ్నమేమియు కన్పించుటలేదు. కావున గ్రంథకర్త త్వరపడి చిక్కునుండి తప్పించుకొనుటకై కమలాబాయి పూర్వచరిత్రను ప్రారంభించినాడని తోచును.

పత్తేదారు పాత్రములలో నేర్పరితనము తక్కువ. గౌరీశంకరుని పాత్రమొకటియే యీ నవలయందు ఇంచుక మెలకువతో రచియింపబడినది.

అపరాధ పరిశోధకనవలలనుగూర్చి యొకమాట. వీనియందు నైతికప్రమాణమను ఒఱపురాతిపై పాత్రముల శీలమును పరీక్షించుటలేదు. అపరాధి శిక్షితుడగుట పత్తేదారుని బుద్ధివైభవముచేతనేగాని, అపరాధి అపరాధియగుటవలనగాదు. కావున మనస్తత్త్వ నిరూపణ మీనవలలకు యెడమగుచున్నది. 'సినిమాటోగ్రాఫు'నందుంబోలె, వీనియందును పాఠకులు చిత్తమును లగ్నముచేసి, లోకమును మఱువజాలుదురు. ఐనను, వీనిలో ఉత్తమమైనవానికితప్ప, యితరమునకు కావ్యప్రపంచమునం దెట్టి స్థానమును లేదు. 'పతితనళిని'యే కాదు—తెలుగులోని అపరాధ పరిశోధక నవలలో నేదియు నట్టి ఉత్తమతరగతి నింకను చేరకుండుట విచారకరము.

(గు. వెం. సు.)

---

## దినగోచారమంజరి

శ్రీ ప్రమోదనామసంవత్సరము (౧౯౩౦-౧౯౩౧)

ప్రకాశకులు: ప్రొప్రయిటరు, శ్రీ విద్యాముద్రాక్షరశాల, ప్రింటర్సు అండ్ పబ్లిషర్సు, విజయనగరము. వెల ౧-౦-౦.

ఇది 'డయిరీ. ఇందు దినమున కొక పుట గలదు. ప్రతిపుటయందును ఆయానాటి తిథివారాదులును, గ్రహచారమును తెలుపు (రాశి, అంశ) చక్రములును గలవు. నిత్యకృత్యములందు సామాన్యముగా నందరకు వలసిన జ్యోతిషవిషయములు కొన్ని తొలిపుటలందు సుగమముగ వివరింపబడినవి.' "ఇందలి తిథినక్షత్రములు, గ్రహప్రవేశములు మొదలగునవి శ్రీ పిడపర్తి చినపూర్ణయ్య 2ద్ధాంతిగారి కుమాళ్ళు, 1. కల్యాణవీరభద్రశర్మగారు, సి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, 3. కృష్ణమూర్తిశాస్త్రిగారు, 4. శేషాచలశాస్త్రిగారు, 5. కామేశ్వరశాస్త్రిగారు-ఈ సోదర పంచకముచే చేయబడిన దృక్సిద్ధపంచాంగమునుండి గ్రహింపబడినవి." అన్న యిందలి వాక్యమునుబట్టి యీ 'దినగోచార మంజరి' విలువను పాఠకులు తెలిసికొనగలుగుదురు. ఇందలి యెల్లవిషయములు తెలుగుననే కలవు కాన నొక తెలుగువారే దీని నుపయోగించుకొనవలసి యున్నారు.

---

## రాయలసీమ_ఉగాది కానుక

(సం. ౧. ప్రమోదూత సం. ౧౯౩౦-౩౧.)

క్రౌను నాల్గుపుటల సైజున ౭౦ పుటలు. వెల రు ౦-౮-౦.

ప్రకాశకులు: దేశబంధు ముద్రణాలయమువారు, తాడిపత్రి. కొన్ని శతాబ్దములకు పూర్వము దక్షిణహిందూదేశమున నెల్లవిధముల ప్రసిద్ధిని గాంచినదయ్యు "ఈనాడు 'వెనుక బడిన' సీమయై అలసతయు, నుద్యోగాభావము, నుత్సాహలోపము తాండవించు"చున్న రాయలసీమయందలి యేకమండలమునకు జెందినవారియొక్క కృషిఫలముగ వెలువడినది వార్షికమగు నీ క్రొత్తపత్రిక. వీరి కృషి యెంతయు నభినందింపదగినది. దినపత్రిక మొదలు త్రైమాసికపత్రికవఱకు గలవారిలో దేనిని గాని ప్రకటింపసౌకర్యములు సమకూరనివారికిది యొక్క క్రొత్తత్రోవ. ఈమార్గమున నన్నిమండలములవారును బహుభంగుల నడచినచో బహువిధముల దేశప్రబోధమును గావింపగలుగుదురు.

ఈసంచికయందు గద్యవ్యాసములలో 'తాడిపత్రిచరిత్ర'యను పీఠికతో ప్రకటితమయిన 'తాడిపత్రి కైఫియ్యతు' సగము మేర నాక్రమించి యున్నది. కర్నల్ మెకంజీదొరగారు సంపాదించి సంపుటములుగ తయారు చేయించి చెన్నపురప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము (Govt. Oriental Manuscripts Library) న నుంచిన కైఫీయతులలో నీ 'తాడిపత్రి కైఫీయతు' ఒకటి. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇందలి చరిత్రవిషయములను విమర్శించి పూర్వోత్తర చరిత్రాంశములను సమన్వయించి దీని కీవిపులమయిన పీఠికను వ్రాసినారు. తన్మండలచరిత్ర నిర్మాణమున కెక్కుడుగ నిది యుపకరించును. 'ధ్వనిమతము - ధ్వనికావ్య విభేదములు' అను వ్యాసమున వ్యాసకర్త ప్రాచీనాలంకారికుల మతానుసారముగ కావ్యములు ధ్వని ప్రధానము లనియు, ధ్వనిప్రధానములగు కావ్యములే ఉత్తమములనియు నిరూపించినారు.

పద్యవ్యాసములలో 'ప్రస్తుత సారస్వతస్థితి' కవిత్వము బాగగ నున్నదికాని విమృష్టవిషయమునకు పద్యము లేల? వ్యాసకర్త 'కవిసింహ, శతావధాని' బిరుదాంచితులగుటచే 'మంచినీళ్ల మర్యాద'గా చక్కని కవిత్వము చెప్పగలరనుట తెల్లము కాగలదు కదా! ఇట్టి విమర్శనములు వచనరూపమున నుండుట ఎక్కువ ప్రయోజనకరము లగును. 'అన్నయా' అన్న గేయము సరసమయిన చక్కని నడకతో నొకటి దేశౌన్నత్యమును వర్ణించుచున్నది. సంచిక ప్రారంభమున 'రాయలసీమ భోగట్టా' అను శీర్షిక క్రింద అప్పటి మండలములయందు వివిధప్రభుత్వశాఖలలో ప్రకృతము అధికార్లుగ నున్నవారి పేరులును, ప్రధానస్థలముల సంగ్రహచరిత్రయు, ఇతరవిషయములును వివరింపబడినవి. 'Directory' వలె ఇది యుపయోగించును.

ప్రకాశకులు అనువత్సరమును ఇట్టి ఉగాదికానుకలను దేశీయుల కొసగుచుందురు గాక!

---

# గ్రంథస్వీకారము

## బ్రహ్మమార్గప్రదీపిక

క్రౌను ౮ పుటల సైజున ౧౦౦ పుటలు. వెల తెలియరాదు. ౧౯౩౦ సం.

గ్రంథకర్త: నిమిషకవి వెంకయ్యపంతులుగారు
విలాసము: పేరూరు వేంకటసుబ్బారావుగారు, గాంధీనగరం, కాకినాడ.

---

## కంకణము

క్రౌనుసైజున ౨౭ పుటలు. వె॥ తెలియరాదు. ౧౯౩౦ సం.

గ్రంథకర్త: భోగరాజు నారాయణమూర్తిగారు, విజయనగర సంస్థానాస్థాన కవి, విజయనగరము.

---

## సంఘసంస్కారసమస్య

క్రౌనుసైజున ౩౮ పుటలు. వెల నాల్గు అణాలు. (ఇది శ్రీ ప్రఫుల్లచంద్రరాయల బంగాళీ గ్రంథమున కనువాదము.)

గ్రంథకర్త: తిపిర్నేని సుబ్రహ్మణ్యముగారు, గుడివాడ.

---

## (౧) జ్యోతి

(ఏకాంక ఆరోగ్యనాటకము.)

క్రౌనుసైజున ౨౮ పుటలు. వెల నాల్గు అణాలు. ౧౯౨౯ సం.

## (౨) బాలనీతి కథావళి

క్రౌనుసైజున ౮౮ పుటలు. వెల ఆరణాలు. ౧౯౩౦ సం.

గ్రంథకర్త: శ్రీ కనుపర్తి వరలక్ష్మమ్మగారు,
విలాసము: పాలపర్తి భావనారాయణగారు, టీచరు, బాపట్ల, గుంటూరుజిల్లా.

---

## శ్రీ వివేకానందస్వామి జీవితము: భా. ౧.

డిమ్మిసైజున ౨౫ పుటలు. వెల రు. ౧-౮-౦. ౧౯౩౦ సం.

గ్రంథకర్త: బులుసు వేంకటేశ్వరులుగారు, కాకినాడ.

---

## చిత్రలేఖనము

(బోధనాపద్ధతులు: భా. ౧.)

డిమ్మిసైజున ౯౪ పుటలు. వెల ౧౨-అణాలు. ౧౯౩౦ సం.

గ్రంథకర్త: టి. బుచ్చయ్యగారు, డ్రాయింగుమాస్టరు మిషను ట్రెయినింగుస్కూలు తర్లుపాడు, నెల్లూరుజిల్లా.

---

## భక్తగౌరాంగ్ (అనుచైతన్యలీల)

(నాటకము.) డిమ్మిసైజున ౮౨ పుటలు. వెల ఒకరూపాయ. ౧౯౩౦ సం.

గ్రంథకర్త: చిన్నకోట వేంకటరత్న శర్మగారు, కాకినాడ.

---

## ఉత్తరరాఘవము

(ఎనిమిది అంకముల నాటకము.)

డిమ్మిసైజున ౧౧౬ పుటలు. వెల రు. ౧-౪-౦. మూడవ ముద్రణము. ౧౯౩౦ సం.

గ్రంథకర్త: బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారు గుంటూరు.

---

HIGHWAYS IN ASTROLOGY
జ్యోతిష శాస్త్రమునందలి ప్రధానసూత్రములు.

(ఆంగ్లము) క్రౌను సైజున ౬౦ పుటలు. వెల రు. ౧-౮-౦. ౧౯౩౭ సం.

"కుంభ"

గ్రంథకర్త:

విలాసము: శ్వేతారణ్యాశ్రమము మైలాపూరు, మదరాసు.

---

விபரீதமான முடிவு
విపరీతమానముడివు-(నాటకము)
(విపరీతాంతము. అరవము)

డిమ్మీసైజున ౫౩ పుటలు. వెల యెనిమిదణాలు. సం. ౧౯౩౦,

గ్రంథకర్త: రా. బ. పి. సంబంధముగారు. బి.ఏ. బి. యల్., పమ్మాళ్ లాడ్జి, జార్జిటవున్ మదరాసు.

---

## పాఠశాలలు: వాఙ్మయము

నేడు తెలుగుదేశమున ప్రారంభ, మాధ్యమికపాఠశాలల విద్యార్థుల కొఱకు తెలుగు వాచకములు మొదలయినపుస్తకములను ప్రకటించువారు పెక్కు రున్నారు. వారికొఱకు ఏవో గ్రంథములను సృష్టించువారు నూర్లకొలదిగ బయలుదేరుచున్నారు. ఇట్లు సృష్టింపబడిన గ్రంథములు తండోపతండములు. గ్రంథకర్తలు, ప్రకాశకులు తమ పలుకుబడి మొదలయిన వానిని ప్రయోగించి తమ గ్రంథములపై పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారి ఆమోదముద్రను బడయుదురు. ఈముద్ర గ్రంథముయొక్క సర్వలక్షణసంపన్నతకు సూచకము.

పై మూడు తెరగులవారికి గ్రంథముల మంచిసెబ్బరలతో పనిలేదు. మొదటి యిరు తెరగులవారికి కావలసినది ధనము; మూడవ తెగవారికి ప్రతిష్ఠ. ఈ పుస్తకముల కట్టలను నిరంతరము బడికిని యింటికిని 'తమ కర్మమా' యని మోయవలసినవారు విద్యార్థులు. ఒకొక పుడు స్వరూపమునుబట్టికాని, విషయాదులను బట్టికాని యించుక విలువయైన లేకపోయినను ఈ పుస్తకములకు అత్యధిక మగు క్రయమును తా మమ్ముడుపోయి అయినను వేంకటేశ్వరుల ముడుపువలె చెల్లించుకొనవలసినవారు విద్యార్థుల పోషణకర్తలు. ఇట్లు క్రియాబహుళములయిన యీగ్రంథములలో నూటికి తొంబది నిష్ప్రయోజకములు; ఇంతియే కాదు- హానికరములు కూడ. ఇందు కాగ్రంథములే ప్రమాణము. ప్రకృత మట్టి గ్రంథములలో నొకటియగు 'బాలరామాయణము'ను పరిశీలింతము:*

ఈ బాలరామాయణమును నెల్లూరు, యం. పి. శర్మకంపెనివారు 'Sarma's Children's Classics Series No. 2.' గా ప్రకటించినారు. 'Children's Series' అని ఉండుటచే వీరు పైన పేర్కొన్న ప్రకాశకుల తెగలో చేరినవారని వేరుగ చెప్పనక్కర లేదు. గ్రంథకర్త: వాసుదేవరావు, హసబ్నీసు గారు. క్రౌను ౮ పుటల

* క్రమముగ నీశీర్షిక క్రింద ఇట్టి పుస్తకములపై విమర్శనలు వెలువడుచుండును.

సైజున ౮౮ పుటలు. ఒకవైపు అచ్చు రెండు వైపుల కనబడుటకు అనుకూలముగ నుండు కాగితములు. పలుచని కాగితపుబైండు. వెల రు ౦-౮-౦. ఇది బాహ్యస్వరూపము. ఇక అంత స్స్వరూపమున విషయము: సుప్రసిద్ధ మగు రామాయణ కథ ఇందు వచనమున నున్నది. ఒకమారు ఆమూలాగ్రము రామాయణమును విన్న ముసలమ్మయైన క్రమభంగము లేక కథను చెప్పగలదు. ఇందు బాలకాండమున విశ్వామిత్రయాగరక్షణమునకుపూర్వమే అహల్యాశాపవిమోచనము కలదు. ఇట్లు ఏ రామాయణమున గలదో! యాగసంరక్షణమునకు పూర్వము రామునకు అస్త్రశస్త్రాదుల నిచ్చినట్లుండ ఇందు తరువాత ఇచ్చినట్లున్నది. సీతా స్వయంవరము, కైకా మంథరల సంవాదము మున్నగునవి అనావశ్యకముగా అధికముగ పెంచి ప్రసంగింపబడినవి.

'రాముడు తానుబోయిన దిక్కునుగుర్తించి వెంట వచ్చి తన్ను రక్షించునను నపేక్షతో సీత తనయొంటిమీది సొమ్ములుతీసి చీరకొంగుచెము చింపి వాని వందులోఁ గట్టి క్రిందపడవేసి యుండెను. ఆగుఱుతుల ననుసరించి యామార్గమున నామెను వెదకుచు రామలక్ష్మణు లరుగుచుండిరి.' పుట ౫౬.

నగలమూటను సుగ్రీవుడు చూపినాడు కాని రామలక్ష్మణు లంతకుమునుపు చూడ లేదు.

పరశురాముడు

'ఇదిగో నే నిరువదియొక్కమారులు క్షత్రియులను నాశము చేసిన దీధనుస్సుచేతనే.' పు. ౨౪.

అన్నాడు. గొడ్డలిచేత కాని ధనుస్సుచేత కాదు ఇట్టి అసందర్భములను ఎన్నిటినైన చూపవచ్చును.

రచనావిధానము

'అట్టియానందసమయమున నొక వృద్ధుఁ డిరువురు బాలురతోవచ్చి నగరులోనకుఁ బోవకయే ద్వారపాలకులయొద్దకరిగి, యాముదుసలి యొక కావలివానితో నేమియోజెప్పెను.' పు. ౧౮. 'పిదప నీ శుభవార్తను దశరథునకుఁ దెలుపవలెననియు శుభముహూర్తమున వీరికిఁ బెండ్లిచేయవలెననియు నందుకు సమ్మతించి బంధుజన పరివారసమేతుడై ముహూర్తమునకు రావలసినదనియు జనకమహారాజు దశరథునకు శుభలేఖ నంపెను. పుట ౨౩.

'అను జక్కని బట్టణంబు కలదు.'-౧.
'అవలంభించి'-పుట ౭.
'ఏదో నొకటి'-పుట. ౮.
'ముగ్గుటకిని', 'నలువుఱును'-పుట ౮.
'యజ్ఞయాగము సంరక్షణసేయుట'-పుట ౧౦.
'దుష్టరక్కసు లేడు', 'సంకోజించెను'-పుట ౧౨.
'బాణాసనమున విల్లెక్కుపెట్టి'-పు. ౧౪.
'బాణము'-పు. ౨౪. (విల్లు అనునర్థమున.)
'యువరాజ్యాభిషేకము'-పు. ౨౬.
'జ్యేష్ఠపుత్రునకు', 'భ్రష్ఠుని'-పు. ౩౫.
'అసత్యవాదుని'-పు. ౩౮.
'ఘోరభీకరమృగములు'-పు. ౪౦.
'కౌసల్యాగర్భమున నుద్భవించిన ముత్తెంబవై'-పు. ౪౨.
'మోఁపి'-పు. ౪౩.
'అధిష్టించుట'-పు. ౪౭.
'లేఁడి'-పు. ౫౧.
'బ్రతిమాలు'-పు. ౫౧.
'ఏదోనొకయుక్తి'-పు. ౫౭.
'తిరిగిదిరిగి'-పు. ౫౮.
'మేఁడయు'-పు. ౬౨.
'తోడికాండ్రు'-పు. ౬౩.

'నిక్షిప్తితుల'-పు. ౬౯.
'మేఘనాధుడు'-పు. ౨౩.
'అలివికాకుండెను'- పు. ౨౪.
'గూఢాచారులు'-పు. ౨౫.

రోమకంబళన్యాయమున ఇంకను ఇట్టివి కుప్పలుగ గలవు. ఇవి గ్రంథకర్తకు గ్రంథ రచనమునగల యధికారమును తెలుపగలవు. దీనికితోడుగ అచ్చుతప్పులు లెక్కకు మిక్కిలిగ నున్నవి.

'ఒకానొకప్పుడు మీరు నుద్యోగము చేయుదురు. యుద్యోగకార్యమున మనసుంచిచేసి యజమానునిసంతోస పరిచిన మీకే లాభమగును'.

ఇది హనుమత్పాత్రమువలన తెలిసికొన వలసిననీతిగ పేర్కొనబడినది. దాస్యమును బోధించుటయా నీతి?—

ఏవంవిధలక్షణ సంపన్న మగు నీ గ్రంథ మొక్క హైస్కూలున I ఫారము విద్యార్థు లకు Non-detailed పాఠ్య గ్రంథముగా నియ మింపబడినది. విద్యార్థు లిందలికథను తెలిసికొని స్వయముగ వ్యాసములను వ్రాయవలసి యుందురు. కావున భాష, భావము రెండును వారి యారచనలయందు ప్రధాన ములు. ఇట్టి గ్రంథములను జదువువా రెట్టి వ్రాతను వ్రాయగల్గుదురో! వారికి భాషయం దెంతప్రవేశము గలుగునో!! దైవమునకే యెరుక!!!

ఈ పుస్తకమున ప్రకాశకులు కావించిన ప్రకటన మొకటి యిట్లున్నది:

"దొంగ లున్నారు—జాగ్రత!

మా గ్రంథములకు ఆంధ్రలోకంబున యుండు వ్యాప్తి కనుగొని మానాభిమానశూన్యులగు కొందరు పుస్తకవ్యాపారులు మా పుస్తకముల పేర్ల వంటివే పేర్లు పెట్టి ముద్రించి అమ్ముచున్నారనిన్ని మాపుస్తకములకై వ్రాయునప్పుడు తమ పుస్తకములపంపి మోసగించుచు న్నారనిన్ని వినుచున్నాము. ఈ విషయమునుబట్టియే మాగ్రంథముల ప్రసిద్ధి విశదమగుచున్నది. మా పుస్తక ములకై వ్రాయువారు,

"ఎం. పి. శర్మకంపెనీ వారిచే ప్రకటింపఁ బడినవని" కూడ వ్రాసి ఆంధ్రసారస్వత చోరశిఖామణుల మోసమునుండి తప్పించుకొందురు గాకయని తెలియ జేయుడమైనది."

ఈ ప్రకటనమునుబట్టి ప్రకాశకులకు మాత్రమే నష్టము కలుగుచున్న దని తెలియ వచ్చుచున్నది. పనికిమాలిన పుస్తకమును ప్రకటించుటచే ప్రకాశకులు బహుసంఖ్యాకు లగు విద్యార్థులపోషణకర్తల ధననష్టమునకే కాక విద్యార్థుల విద్యావృక్షమూలచ్ఛేదము నకును కారణభూతులగుట స్పష్టము. ఈ యుభ యులలో నుత్తములెవ్వరో పాఠకులు నిర్ణ యించుకొందురుగాక! వాఙ్మయలతాంకురము ల గొరికివేయు నిట్టి పొల్లు పుస్తకముల కవకా శముకలుగకుండ బాలకుల విద్యాభివృద్ధి నా కాంక్షించు సహృదయులు చూచుకొందురు గాక! —'రామబాణము.

---

Printed and Published by G. Subbaramayya, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras